జీవితం అంటే ఏమిటి?
ఈ ప్రశ్న చాలామందికి తెలుసు.
జవాబు కూడా చాలామందికి తెలుసు.



జీవితం ఒక జీవనది
జీవితం ఒక ఆటలా జీవించాలి
ఒక పాటలా జీవించాలి. భాషలా జీవించాలి.

జీవితం ఒక అడవి.
నీ జీవితానికి నువ్వే దారి వేసుకోవాలి.
నీ దారి నువ్వే చూసుకోవాలి.

ఈ లోకంలోకి నీవు ఒంటరిగానే వచ్చావు.
ఈ లోకంలోంచి ఒంటరిగానే వెళ్ళిపోతావు.
నీ రాకకు ఆనందించారు. నీ పోకకు ఏడుస్తారు.
ఎవరూ వెంట రారు. ఏదీ నీ వెంట రాదు.
నీ జ్ఞాపకాలే ఇక్కడ మిగిలిపోతాయి.
నీవు జ్ఞాపకాలలోనే కొనసాగుతావు.
అనుబంధాలు, జ్ఞాపకాలే నీ చరిత్ర.
చావు పుట్టుకల మధ్య నున్నదే జీవితం.

జీవితం ఒక చరిత్ర.
జీవితం ఒక నోటుబుక్కు.
నీ చరిత్ర నువ్వే రాసుకోవాలి.
నోటుబుక్కు నీదే. పెన్ను నీదే.
రాసే చెయ్యీ నీదే. రాసేదీ నువ్వే. రాసే దృక్పథమూ నీదే.

నీ జీవితానికి నీవే దిక్సూచి. దిక్సూచిలా బతకాలి.
దిక్కుల్లా బతకాలి. దిగంతాల్లా బతకాలి.

నేను ఎన్ని అగాధాలు చూసినా, ఎన్ని పర్వతాలు అధిగమించినా,
మేఘంలా పరుగెత్తినా వానై కురిసినా నేను నేనే.
నా పేరు జీవితం. నేను ఒక ప్రవాహాన్ని. నేను ఒక అడవిని.
నేను ఒక ప్రకృతి జీవన వైవిధ్యాన్ని.
నేను నదిని. నేను సమాజాన్ని. నేను జీవితాన్ని.

ఇది ఒక అన్వేషణ. ఇది ఒక జీవితాన్వేషణ. జీవితం అంటే ఏమిటో తెలుసుకొనే, తెలిపే ప్రయత్నమే 'జీవితం అంటే ఏమిటి' అనే ఈ పుస్తకం. నా జీవితంలో లేనిది ఏది ఇందులో చేర్చలేదు, చర్చించలేదు. ఇది నా జీవితానుభవాల రాశి.

జీవితం అంటే ఏమిటి? వ్యక్తి, కుటుంబం, సమాజం, దృక్పథాలు
బి.ఎస్.రాములు

# జీవితం అంటే ఏమిటి

వ్యక్తి , కుటుంబం, సమాజం, దృక్పథాలు



బి.ఎస్.రాములు

# జీవితం అంటే ఏమిటి?

## ఈ జీవితం ఎందుకు?

జీవితమంటే ఏమిటి? ఈ ప్రశ్న చాలామందికి తెలుసు. జవాబు కూడా చాలామందికి తెలుసు. మనిషి కలవగానే బాగున్నావా? మంచిగున్నవా? అని అడుగుతారు. ఆ అంతా బాగానే వున్న, గిట్ల ఉన్న. మంచిగున్న. మీరందరు మంచిగున్నరా అని జవాబిస్తూ పలకరిస్తారు. మంచిగుండటం అంటే ఆరోగ్యం ఆనందం బతుకు బాగోగులన్నీ సమాజంలో సాధించుకోవాల్సిన మేరకు, అందినమేరకు అన్నీ సజావుగా సాగుతున్నాయని మంచిగనే బతుకుతున్నామని అర్థం.

**మంచిగున్నవా?**

ఆల్లిప్పుడు మంచిగనే బతుకుతున్నరు అని అంటారు. అంటే కష్టాలు, సమస్యలు తీరిపోయి చక్కగా బతుకుతున్నారని అర్థం. వాళ్లు బతికి చెడినవాళ్లు అని అంటారు. అంటే ఒకప్పుడు బాగా బతికి ఇప్పుడు ఆ స్థాయి నుంచి పూర్తిగా మారిపోయి చిన్న బతుకు బతుకుతున్నారని అర్థం. వాళ్లకేందే మస్తు మంచిగ బతుకుతున్నరు అని అంటారు. అంటే ఆ చెప్పేవాళ్ల అంచనా కన్నా చాలా బాగా బతుకుతున్నారని అర్థం.

**అబ్బో, ఇప్పుడు మనను ఎక్కడ దేకుతరు?**

అబ్బో, ఇప్పుడు వాళ్లు మనను ఎక్కడ దేకుతరే! ఇప్పుడు వాళ్లు బ్గాగా పెద్దోళ్లు అయిపోయిన్రు. మనసంటోళ్లతోటి మాట్లాడరు. మనసొంటోళ్లను ఫంక్షన్లకు పిలువరు అని అంటారు. అంటే ఒక స్నేహబృందంలోంచి ఒకరిద్దరు ఆ బృందం కన్నా అత్యున్నతంగా ఎదిగి పాత స్నేహ బంధుమిత్రులను వదులుకుంటూ ఎదిగిన సామాజిక వర్గాల స్నేహాలకు, బంధుమిత్రులకు ప్రాధాన్యత ఇస్తున్నారని పాతవాళ్లను గౌరవించడంలేదని అర్థం.

**అది కూడా ఒక బతుకేనా?**

అది కూడా ఒక బతుకేనా? ఆ బతుకు బతికేకన్నా చావడం నయం అని అంటారు. అంటే ఆ బతుకు అందరి బతుకుల్లా లేదని బాగా రాజీ పడిపోయి బానిసగానో, హీనంగానో, దీనంగానో బతుకుతున్నారని అది సరైన బతుకు కాదని అర్థం. నేనైతే ఛస్తే అసొంటి కాడ నౌకరి చేయను. స్వేచ్ఛ, ఆత్మగౌరవం చంపుకొని గంత హీనంగా ఎందుకు

బతకాలె అని అంటారు.

**బతికుంటే బలుసాకు తినచ్చు**

బతికుంటే బలుసాకు తిని బతకొచ్చు అని అంటారు. శరీరమాద్యం ఖలుధర్మసాధనం అంటాడు మహాకవి కాళిదాసు. శరీరం ద్వారానే ధర్మకార్యాలు సాధ్యం. కనుక శరీరం లేకుండా బతుకలేం అని అర్థం. దాన్నే ప్రజలు బతికుంటే బలుసాకు కూర తిని బతుకొచ్చు అని అంటారు.

**రాజ్యాలు ఏలిన అప్పులు కట్టెలు కొడ్తే తీర్తయా?**

రాజ్యాలు ఏలిన అప్పులు కట్టెలు కొడ్తే తీర్తయా అని అంటారు. అంటే అతను అంతకుముందు ఒక రాజులాగా బాగా బతికాడు. బాగా సంపాదించాడు. బాగా అప్పులు చేసాడు. చివరకు రాజ్యం పోయింది. రాజరికం పోయింది. అప్పులు మాత్రం మిగిలిపోయాయి. రాజ్యాలేలినప్పుడు చేసిన అప్పులు ఒక కూలీ లాగా కట్టెలు కొడితే తీరవు అని అర్థం. అనగా బాగా బతికి చెడిపోయి పాత అప్పులు తీర్చే కృషి చేయడంలో సామర్థ్యం చాలదు అని అర్థం. సత్యహరిశ్చంద్రుని కథ నుంచి ప్రజలు దీన్ని సామెతగా మార్చారో లేక వేరే ప్రత్యేక సామెతనో!

**అన్నీ బంద్ చేస్తే ఇగ బతుకుడెందుకే?**

ఒకాయన ఆదర్శవాది. ఆయనకు ఒక చక్కని కవి ఎదురయ్యాడు. తర్వాత పరిచయం అయింది. అన్ని బాగానే వున్నాయి గాని ఆ కవికి కొన్ని అలవాట్లు ఉన్నాయి. అవి ఆ ఆదర్శవాదికి నచ్చలేదు. తాగుడు, సిగరెట్లు, పాన్ మానేయాలని ఇలా ఏవేవో సూచనలు చేశాడు. అవన్నీ విన్న ఆ కవి ఇక బతుకుడెందుకు సార్! అని అన్నాడు. అన్నీ వదిలేసుకున్నంక 80 ఏండ్లు బతికితేంది? 100 ఏండ్లు బతికితేంది? ఇప్పుడు ఛస్తేంది? బతుకంటే అన్నీ అనుభవించాలె సార్! నేను మీకు చెప్పెటోన్ని కాదు గని మీరు పాత కాలంలో బతుకుతున్నరు. యువతరం మీరు చెప్పింది ఎవరు వినరు. మీరు ఇంకో కాడ కూడ గిట్ల చెప్తే మిమ్మల్ని చూసి పారిపోతరు సార్! బతుకంటే బతికినంత కాలం హాయిగా మంచిగా బతకాలె. అంతేగాని ఆరోగ్యం మంచిగుండాలని, అన్ని బంద్ జేస్తే ఇగ బతుకుడెందుకు సార్! అన్నాడు ఆయన. ఆ ఆదర్శవాదికి ఏం చెప్పాలో తెలియలేదు.

**ఇంతకు 80 ఏండ్లు నేను దేనికి బతికినట్టు?**

ఒకాయన ఆరోగ్యం బాగుండాలంటే యోగ, మెడిటేషన్ చేయాలని, బ్రహ్మచర్యం పాటించాలని గురువులు చెప్పింది తూ.చ. తప్పకుండా పాటించాడు. 82 ఏళ్లకు నాకు ఎం.శివరాం అనే జిడ్డు కృష్ణమూర్తి అభిమాని ద్వారా పరిచయమయ్యాడు. చాలా విషయాలు చర్చించుకున్నాం. చివరకు ఆ బ్రహ్మచారి ఒక మాటన్నాడు. ఈ ఆరోగ్యం ఎందుకు సార్! ఈ బతుకు దేనికి? నేను 80 ఏళ్లు బతికి ఏం లాభం? ఎవరికి ఏం మేలు చేసిన? నేను ఈ సమాజానికి ఏం జేసిన? నేను ఎంత పొరపాటు చేసిన్నో ఇప్పుడు తెలిసింది. ఇప్పుడు తెలిసిన తర్వాత మాత్రం ఏం చేయగలను అని వాపోయాడు.

**ఏ వయసులో ఆ వయసు బతుకు తీరుతెన్నులు**

చిన్నారులకు అడిగినవన్నీ అమ్మానాన్నలు సంపాదించి పెడితే అది గొప్ప బతుకు



అనుకుంటారు. హాయిగా వుంటారు. విద్యార్థి జీవితంలో కోరుకున్నవన్నీ జరిగితే చాలా హాయిగా, ఆనందంగా విద్యార్థి దశ గడిపేస్తారు. నిరుద్యోగ దశలో ఒక ఉద్యోగం దొరికితే చాలు. బతుకు ఒక ఒడ్డున పడుతుంది అనుకుంటారు. ఆ తర్వాత పెళ్లి, పిల్లలు, కుటుంబం ఆ తర్వాత తల్లిదండ్రుల పోషణ, పిల్లల చదువులు, పెళ్లిళ్లు, స్నేహితులు, బంధుమిత్రులు, ఇరుగుపొరుగులతో మంచి సంబంధాలు అందరిలో కలిసి జీవిస్తూ అందరిలో ఒకరుగా బతుకుతూ రిటైరై చనిపోతారు. పల్లెల్లో రైతులు, పేదలు చాతనైనంత కాలం పనిచేస్తూ బతికి బతుకును చాలిస్తారు. దొరికింది తింటారు. తిండిని సంపాదించుకుంటారు. జీవిత అవసరాల కోసం జీవితమంతా శ్రమిస్తుంటారు.

**కోటి విద్యలు కూటికొరకే**

సరే, కొందరు బతకడం కోసం కూలి పని చేస్తారు. వ్యవసాయం చేస్తారు. రకరకాల వృత్తులు చేస్తారు. ఉద్యోగాలు చేస్తారు. వ్యాపారాలు చేస్తారు. పరిశ్రమలు పెడతారు. రాజకీయాల్లోకి దిగుతారు. అనేక నైపుణ్యాలను అలవరుచుకుంటారు. ఎన్నో విద్యలు నేరుస్తారు. అందుకే కోటి విద్యలు కూటి కొరకే అన్నారు.

**ఎవరికీ అక్కరకురాని జీవితాలు ఎలా వుంటాయి?**

ఎవరికీ అక్కరకురాని జీవితాలు కూడా కొన్ని వుంటాయి. వాళ్లు బతికినా, చచ్చిపోయినా లోకానికి గానీ, కుటుంబానికి గానీ ఏమీ ఫరక్ పడదు. అలాంటివారి జీవితాలు ఎవరికీ అక్కరకురాని జీవితాలు. కొబ్బరిపుల్ల, తాటిమట్ట, బర్రె పెండ కూడా దేనికో ఒకదానికి పనికివస్తాయి. ఎవరికీ పనికిరాని, ఎవరికీ అక్కరకురాని జీవితాలు బర్రెపెండ కన్నా హీనం. అందుకే కొందరు పెండలో పురుగులా ఎన్నేండ్లు బతికితె ఏం ఫాయిద అంటారు. నందిలా పదేళ్లు బతికినా చాలు. పందిలా మంది పియ్యి తినుకుంటూ నూరేండ్లు బతికితే అది పంది బతుకే తప్ప నంది బతుకు కాదు అని అంటారు.

నాకు తెలిసిన ఒకాయన 20 షాపులు కట్టించాడు. నెల నెలా కిరాయలు వస్తయి. ఏం పని చేయనవసరం లేదు. ఆయనకు పొద్దంతా ఏం చేయాలో తోచలేదు. చివరకు అతనికి ఎవరితో పనివడక అతనితో ఎవరికీ వనివడక 20 ఏళ్లల్లో ఒంటరివాడైపోయాడు. అతడు బతికున్నాడని కూడా చాలామంది మర్చిపోయారు. ఇది ఏం బతుకే, ఇది కూడా ఒక బతుకేనా? బతుకంటే ఛాలెంజింగ్‌గా వుండాలె. ఉత్సాహంగా వుండాలె. సమస్యలను పరిష్కరించుకుంటూ ముందుకు పోవాలె. కష్టాలు లేని బతుకు కూడా ఒక బతుకేనా అని ఒక మిత్రుడు అతన్ని చూసి అన్నాడు.

**మూడు తరాలు కూసుండితిన్నా తరగని సంపద ఉంటేనా?**

కొందరికి మూడు తరాలు కూసుండి తిన్నా తరగని సంపద, వ్యవసాయం, పరిశ్రమలు ఉంటాయి. వాళ్లు ఏం పనిచేయకపోయినా హాయిగా బతుకవచ్చు. బాగా సంపద ఉన్న కుటుంబాలు తొందరగా చెడిపోతుంటాయి. ఎంత గొప్ప కుటుంబమో అంత క్రమశిక్షణతో జీవితాన్ని మలుచుకుంటేనే వాళ్లు ఉన్న స్థితిలో వుంటారు. మరెంతో ఉన్నత స్థితికి ఎదుగుతారు. గత యాభై ఏళ్లలో వేలాది కుటుంబాలు

చితికిపోయాయి. శిథిలమైపోయాయి. కరీంనగర్‌లో ఒకరికి ఎన్నో ఎకరాల పొలం వుండేది. అది ఇళ్ల ప్లాట్లయింది. పైసలే పైసలు. మూడు తరాలు గడిచేసరికి మనవళ్లు భిక్షం ఎత్తుకుని బతుకుతున్నారు. తాగుబోతులయ్యారు. వారిలో ఎవరూ పేరుకు రాలేదు.

ఒక ఉమ్మడి కుటుంబంలో పెద్దకొడుకు బాగా చదువుకున్నాడు. గొప్ప ఉద్యోగం సంపాదించాడు. తమ్ముళ్లకు ధారాళంగా పైసలు పంపాడు. వాళ్లు మొదలే మంచిగ బతికే కుటుంబం. అదనంగా కొడుకు పంపించే పైసలు. దాంతో తమ్ముళ్లు బాగా స్నేహాలు చేశారు. తాగి పైసలు వృథా చేశారు. ఆరోగ్యం చెడగొట్టుకున్నారు. పదేళ్ల తర్వాత వెనక్కి తిరిగి చూసుకుంటే నడివయసు దాటిపోయింది. తూలిపడబోయి తిరిగి నిలదొక్కుకున్నాడు. చివరకు మంచి బతుకు బతుకుతున్నాడు. ఇతరుల మీద ఆధారపడొద్దని తన ఉద్యోగం తాను చేసుకోవాలని అనుకున్నాడు. అలా తన బతుకును తిరిగి తన చేతుల్లోకి తెచ్చుకున్నాడు.

## ఇంతకు బతుకంటే ఏమిటి?

ఇలా బతుకంటే ఏమిటి అనే ప్రశ్నకు ఎన్నో రకాల జీవితాలు మనముందు కనబడుతుంటాయి. అయితే బతుకంటే ఏమిటి? అనే ప్రశ్నకు సూటిగా ఒక్క ముక్కలో జవాబు చెప్పడం అంత సులభం కాదు. బతుకు బతికించు అని అంటారు. బతుకు, బతుకును ఇవ్వు అంటారు. బతుకు బతకనివ్వు అంటారు. మందలో గోవిందా అంటూ బతకాలంటారు. పదిమందికి మేలు చేసి బతుకు అంటారు. నీ కుటుంబాన్ని ముందు బాగు పరచుకో! అందరూ ఎవరి కుటుంబాన్ని వాళ్లు బాగు పరుచుకుంటే సమాజమంతా బాగు పడినట్టే అంటారు.

## సమాజం కోసం, కుటుంబం కోసం బతుకుదు

మరికొందరు సమాజం కోసం జీవితాన్ని అంకితం చేయాలంటారు. కుటుంబం కోసం బతికితే నీ పిల్లలే బాగు పడతారు. సమాజం కోసం పనిచేస్తే మొత్తం సమాజం బాగు పడుతుంది అంటారు. అందువల్ల నీ కుటుంబానికి కష్టమైనా నీవు సమాజం కోసం పనిచేస్తూ అంకితం కావాలి అంటారు. నీ కుటుంబాన్ని వదిలేసి జీవితాన్ని సమాజం కోసం త్యాగం చేయాలి అంటారు. ఇలా రకరకాల నిర్వచనాలు, దృష్టికోణాలు కొనసాగుతున్నాయి. కొందరు ఆశయాలు సాధించడం కోసం బతకాలి అంటారు. కొందరు సమాజం కోసం బతకాలి అంటారు.

## కుటుంబ జీవితమే పరిపూర్ణ జీవితం అంటారు కొందరు

కొందరు తల్లిదండ్రులు, పిల్లలు, భార్యాభర్తలు కుటుంబంగా చక్కగా కలిసి బతకడమే పరిపూర్ణ జీవితం అంటారు. బ్రహ్మచర్యం, బౌద్ధభిక్షువు, సన్యాసి జీవితం పరిపూర్ణ జీవితం కాదని అంటారు. భార్యాభర్తలుగా జీవిస్తూ సంతానాన్ని పెంచి పోషిస్తేనే సమాజం ముందుకు సాగుతుంది. అందరూ సన్యాసులైతే సమాజం జనాభా నశించి వారితోనే అంతరిస్తుంది అని అంటారు. అందువల్ల పరిపూర్ణ జీవితం అంటే కుటుంబ వ్యవస్థలో బతికే జీవితమే పరిపూర్ణ జీవితం అంటారు.



## వెనకటి పెద్దలు చెప్పిన జీవితంలోని నాలుగు దశలు

వెనకటి పెద్దలు కుటుంబ జీవితంలో నాలుగు దశలుంటాయి అని చెప్పారు. ఒకటి - బాల్యదశ. రెండు - విద్యార్థి, కౌమార దశ. మూడు - యవ్వన, వృత్తి, ఉద్యోగ దశ. నాలుగు - రిటైర్మెంట్ దశ, వృద్ధాప్యం, వానప్రస్తం. వానప్రస్తమంటే కుటుంబాన్ని వదిలేసి ముసలోళ్లు అడవుల్లో జీవించడం. ఇది తర్వాత కాలంలో పూర్తిగా ఆగిపోయింది. కుటుంబ వ్యవస్థలోనే చనిపోయే దాకా ముసలివాళ్లు బతకడం అనే అవగాహన పెరిగి వేల ఏళ్లయింది. అందువల్ల వానప్రస్తం లేకుండాపోయింది. ఇప్పుడు వానప్రస్తం కొత్తరూపాల్లో కొనసాగుతున్నది. రిటైర్ అయ్యాక ఆధ్యాత్మిక కార్యక్రమాలను, సామాజిక కార్యక్రమాలను, పెళ్లిళ్ల పేరయ్య కార్యక్రమాలను నిర్వహిస్తుంటారు. ఇవన్నీ ఒక రకమైన వానప్రస్త దశకు సంబంధించినవి.

## వేల ఏళ్ల అనుభవంతో రూపుదిద్దుకున్న కుటుంబ వ్యవస్థ

వేల ఏళ్ల కోట్లాది ప్రజల అనుభవంతో కుటుంబ వ్యవస్థ రూపుదిద్దుకుంటూ వచ్చింది. మారుతూ వస్తున్నది. ఇప్పటికీ ప్రపంచమంతటా కుటుంబ వ్యవస్థ అనేది బతుకు బతకడానికి ఒక యూనిట్‌గా పనిచేస్తున్నది. కులం, తెగ, జాతి, వాడ, ఊరు, సమాజం, వృత్తి, వృత్తి సంఘాలు, ఉద్యోగ సంఘాలు మొదలైనవి కుటుంబ వ్యవస్థ తర్వాత ప్రాధాన్యత వహిస్తున్న మిగతా యూనిట్లు. అయితే ప్రజాస్వామిక వ్యవస్థ కుటుంబాన్ని కాకుండా ప్రతి వ్యక్తిని ప్రాథమిక యూనిట్‌గా గుర్తించింది. ప్రతి వ్యక్తికి ఓటుహక్కుతో పాటు అన్ని హక్కులు అందరికీ సమానంగా వుండే వ్యవస్థను ప్రజాస్వామ్యం తెచ్చింది.

## ప్రజాస్వామ్య వ్యవస్థ కుటుంబాన్ని స్వేచ్ఛాయుతం చేసింది

వేల ఏళ్ల గణతెగల, రాజరికాల, రాజ్యాల పరిణామాల నుండి మానవ సమాజం ప్రజాస్వామ్య వ్యవస్థను నిర్మించుకుంది. ప్రజాస్వామ్యం వచ్చాక కుటుంబ వ్యవస్థలో కూడా ప్రజాస్వామిక సంస్కృతి పెరిగింది. పూర్వం పెద్దమనుషులదే ఇంట్లో చలామణీ అయ్యేది. తాతలు చెప్పిందే నడిచేది. కొంతకాలం తల్లిదండ్రులు చెప్పిందే నడిచింది. ఇప్పుడు పిల్లలు చెప్పిందే నడిచేదిగా కుటుంబ వ్యవస్థ పరిణామం చెందుతున్నది. పిల్లలే తల్లిదండ్రులను నిర్దేశిస్తున్నారు. వెనకట ఏ డ్రెస్సు వేసుకోవాలో, కటింగ్ ఎలా వుండాలో పెద్దలే పిల్లలకు నిర్ణయించేవారు. ఇప్పుడు పిల్లలే తల్లిదండ్రులు ఏ ఫంక్షన్‌కు ఏ డ్రెస్సు వేసుకోవాలో నిర్ణయిస్తున్నారు. ఇలా కుటుంబ వ్యవస్థలో అనేక మార్పులు చోటుచేసుకుంటున్నాయి. అయినా దాన్ని కుటుంబ వ్యవస్థ అనే పిలుస్తున్నాము.

## బతుకంతా కుటుంబం కోసమేనా?

బతకడానికి కుటుంబం ఒక యూనిట్. మరి బతుకంతా కుటుంబం కోసమేనా? అని ఒక సందేహం. ఇలాంటి సందర్భాల్లోనే జీవితమంటే ఏమిటి? అనే ప్రశ్న ప్రాధాన్యత సంతరించుకుంటుంది.

కుటుంబానికి వెలుపల ఎంతో జీవితం ఉంటుంది. పల్లెల్లో పేదల ఇళ్లు ఒకటి రెండు గదులతోనే ఉంటాయి. ఆ గుడిసె, ఇల్లు వంటసామాను, పక్కబట్టలు పెట్టుకోడానికి వంట చేసుకోవడానికి పనికొస్తుంది. మిగతా ఆటపాటలు, పనిపాటలు

అన్నీ ఇంటి వెలుపల పందిట్లో, వాకిట్లో చెట్లకింద కొనసాగుతాయి. కొందరికి పడుకోవడం కూడా బయటే. ఇలాంటి జీవితంలో ఇంటి లోపలి జీవితం చాలా తక్కువ. బైటి జీవితం చాలా ఎక్కువ. పొలం పనులు, ఇతర వృత్తులు మొదలైనచోట్ల ఎక్కువకాలం గడుపుతారు. పట్టణాల్లో సైతం ఉదయం ఎనిమిదింటికి డ్యూటీలకు పోయి రాత్రి ఏడెనిమిదింటికి ఇంటికి చేరతారు. ప్రయాణంలోనే పోనూ రానూ రెండు మూడు గంటలు పోతాయి. ఇలా పల్లెల్లో, పట్టణాల్లో ఇళ్లు అనేది రాత్రికి తప్పనిసరి చేరాల్సిన చోటు. మిగతా జీవితమంతా బయటే గడుస్తుంది. అందువల్ల జీవితమంటే బయట జీవించే సామాజిక జీవితమే ప్రధానం అని చెప్పవచ్చు. అయితే కుటుంబం సామాజిక జీవితానికి ఒక కుదురుగా, విత్తనంగా కొనసాగుతుంటుంది.

**జీవితమంటే తనలో తాను, తన కొరకు తాను,**

**ఇతరుల కొరకు తాను జీవించడం**

ఇలా అన్ని రకాలుగా అన్ని కోణాల్లో పరిశీలించిన తర్వాత జీవితమంటే ఇలా చెప్పవచ్చు.

1. జీవితమంటే తనలో తాను జీవించడం
2. జీవితమంటే తన కొరకు తాను జీవించడం
3. ఇతరుల కొరకు తాను జీవించడం

వీటినే మరింత సులభంగా ఇలా చెప్పవచ్చు. వ్యక్తిగా తనలో తాను, తనకొరకు తాను జీవించడం. కుటుంబంలో భాగంగా, కుటుంబం కోసం జీవించడం. ఇతరుల కోసం, సమాజం కోసం జీవించడం. అతని వల్ల ఇతరులకు పని పడాలి. ఇతరులకు పనిపడని జీవితం తనలో తాను తన కొరకు తాను జీవించే జీవితం.

**ఇతరుల కోసం జీవించడం అంటే ఏమిటి?**

ఇతరుల కోసం జీవించడం అంటే కేవలం సమాజం కోసం జీవించడం ఒకటే కాదు. కుటుంబంలో జీవించేవారు కూడా ఇతరుల కోసం జీవిస్తుంటారు. కుటుంబంలో కూడా కుటుంబ పెద్ద కుటుంబంలోని ఇతరులకోసం వారి బాగోగుల కోసం జీవిస్తాడు. అంకితమౌతాడు. తల్లి తన జీవితాన్ని మొత్తాన్ని భర్తకు, పిల్లలకు, అత్తమామలకు అంకితం చేస్తుంది. తల్లి తన స్వంత జీవితం అంటూ లేకుండా తనలో తాను కాకుండా, తన కొరకు తాను కాకుండా ఇతరుల కోసం తాను జీవిస్తుంది. చాలామంది స్త్రీలు తనలో తాను, తన కొరకు తాను కాకుండా, ఇతరుల కోసం తానుగా జీవిస్తుంటారు.

**తన కొరకు జీవించడానికి ఇతరుల కోసం జీవితాన్ని కిరాయికి ఇవ్వడం**

పొట్టకూటికోసం అనగా తనలో తాను, తన కొరకు తాను జీవించడం కోసం, ఇతరుల కోసం పనిచేసే ఉద్యోగిగా, వృత్తిదారుగా, కూలీగా జీవిస్తుంటారు. ఇందులో ఏకకాలంలో రెండు క్రమాలు కొనసాగుతున్నాయి. జీవితం అతనిదైనా, ఇతరుల కోసం పనిచేయడం ద్వారా తన బతుకు కోసం సంపాదించుకుంటున్నాడు. ఇది పరస్పర ఆధార వ్యక్తిగత, సామాజిక జీవితం. ప్రపంచంలో కోట్లాదిమంది ఇలా జీవిస్తుంటారు.

కొందరు తమకోసం, తమ కొరకే జీవిస్తుంటారు. పైన చెప్పిన యోగ వృద్ధుడు



ఆరోగ్యం బాగుండాలని తన కొరకే జీవించాడు. కొందరు అనారోగ్యకరమైన అలవాట్లతో, వ్యసనాలతో తనకొరకే జీవిస్తుంటారు. కొందరు ఇతరుల కోసం జీవిస్తుంటారు. ఇతరులకు ఎంతమేరకు సేవ చేస్తారో అదంతా ఇతరుల కోసం జీవించడం.

బ్రహ్మచారులు, సన్యాసులు, బౌద్ధభిక్షువులు ఇతరుల కోసం జీవించాలనుకుంటే వారికి జీవితావసరాలు చాలా తక్కువ. వాటిని ప్రజలే సమకూరుస్తారు. తద్వారా వారి మొత్తం జీవితం ఇతరులకే అంకితం చేసి జీవించడం జరుగుతుంది.

**ఆరునెల్లకోసారి జీవితమంటే ఏమిటి? ఈ జీవితం ఎందుకు అని ప్రశ్నించుకోండి**

ఇలా జీవితమంటే ఏమిటి? ఈ జీవితం ఎందుకు? అనే ప్రశ్నలకు ఎవరి జవాబులు వారికున్నాయి. ప్రతి ఒక్కరు ఈ ప్రశ్నలను వేసుకుని జవాబులు ఇచ్చుకోవాలి. ఆరునెల్లకోసారి ఈ ప్రశ్నలకు జవాబులను ఒక డైరీలో రాసుకుంటూ ఉండాలి. ప్రతి ఆరునెల్లకోసారి రాయడం ఎందుకు? ఎందుకంటే ఆరునెలల్లో కొత్త కొత్త అనుభవాలు, ఆలోచనలు, కోరికలు, ఆశయాలు, అవకాశాలు, అవసరాలు పెరుగుతుంటాయి. అందువల్ల తిరిగి కొత్త ఉదాత్తమైన జీవితం, మరింత ఉన్నతమైన జీవితం జీవించడానికి ప్రశ్నలకు జవాబులు రాసుకుంటూ పోతూ వుండాలి. వాటిని అప్పుడప్పుడు చూసుకుంటూ వుండాలి.

**ఈ జీవితం ఎందుకు?**

ఒక మేధావి ఈ జీవితమంటే ఏమిటి? ఈ జీవితం ఎందుకు అనే ప్రశ్న ఈ జీవితం బాగున్నంతకాలం ఎప్పుడూ గుర్తురాదంటారు. అనారోగ్యం పాలైనప్పుడే శరీరం పట్ల దృష్టి పెడతాము. ఒక సైకిల్, ఒక స్కూటర్, ఒక కారు చెడిపోయినప్పుడే బాగుపరచడానికి దాన్ని విప్పుతాము. చెక్ చేస్తాము. సరిచేస్తాము. అలాగే జీవితం కూడా అని అంటాడు. అయితే జీవితం చెడిపోయాక చేసేదేముంది? జీవితం మరింత ఉన్నతంగా ఎదగడానికి మంచిగున్నప్పుడే ఈ ప్రశ్నలు వేసుకోరాదా? అని సందేహం కలుగుతుంది.

పాశ్చాత్య గ్రంథకర్తలు చాలామంది మంచి జీవితం నుంచి మరింత మంచి జీవితం జీవించడం, గెల్చుకోవడం ఎలానో తెలుపుతూ సమాజంలోని వివిధ అనుభవాలను మనముందుంచుతున్నారు. అందువల్ల జీవితం అంటే ఏమిటో బాల్యం నుంచే తెలుసుకోవడం అవసరం.

**ఏ వయసులో ఆ ముచ్చటే జీవితం**

జీవితమంటే ఏ వయసు దశలో ఆ పనులను చేయడం. తన కోసం తాను బతుకుతూ ఇతరుల కోసం సేవ చేయడం. ఇతరుల కోసం తన జీవితాన్ని అంకితం చేయడం. ఇతరులకు ఏమాత్రం అక్కరకు రాకుండా తనకోసమే బతికే జీవితం జీవితమే కాదు. దాన్ని సామాజిక జీవితం అనలేము.

**ఈ జీవితం ఎందుకంటే...**

ఈ జీవితం ఎందుకంటే ఆశయాలు సాధించడానికి. సమాజాన్ని ప్రేమించడానికి. కుటుంబాన్ని పెంచి పోషించడానికి. సమాజానికి జీవితాన్ని అంకితం

చేయడానికి. సమాజానికి నాయకత్వం వహించి ముందుకు నడపడానికి. సమాజానికి తన సృజనను, కళలను అందించడానికి. సమాజానికి తన ఆవిష్కరణలను అందించి ప్రజల జీవితాన్ని మరింత ఆనందదాయకం చేయడానికి. ఆటపాటల ద్వారా సమాజాన్ని వినోదింప చేయడానికి. మానసిక వికాసం కలిగించడానికి. ప్రజల చైతన్యం పెంచడానికి. సామాజిక సంపదను, ఉత్పత్తిని పెంచడానికి. సామాజిక సంపదను, ఉత్పత్తిని అందరికీ సమానంగా పంచడానికి. జ్ఞానాన్ని అందరికీ అందించడానికి. పరోపకారం కోసం జీవించడానికి.

**ఊరికి చేసిన ఉపకారం పీనుగుకు చేసిన సింగారమెందుకైంది?**

ప్రజల్లో ఒక సామెత ఉంది. ఊరికి చేసిన ఉపకారం పీనుగుకు చేసిన సింగారం వంటిది అని అంటారు. బహుశా ఇది ఊరికి ఉపకారం చేసినవారిని మర్చిపోవడం వారి అవసరాలను తీర్చకపోవడం నుండి ఏర్పడిన నైరాశ్యం, వైరాగ్యం నుండి ఏర్పడిన సామెత అయి వుంటుంది. అంతేకాకుండా ఈ సామెత వ్యక్తిగత సహాయాన్ని, ఉపకారాన్ని గుర్తుంచుకుంటారు గాని మొత్తం సమాజం కోసం అందరికీ సమానంగా ఉపయోగపడే మేలు చేసినప్పుడు వ్యక్తిగతంగా కృతజ్ఞత కలిగి వుండరు అనే స్వభావాన్ని తెలుపుతుంది.

**సామాజిక ఉపకారం, వ్యక్తులకు ఉపకారం రెండు దశలు**

అందుకే కొందరు నాయకులు వ్యక్తిగతంగా ఉపయోగపడే సహాయాలు చేస్తుంటారు. మొత్తం ఊరికి, సమాజానికి ఉపయోగపడే పనుల్లో తమ స్వార్థాన్ని చూసుకుంటారు. అనగా తనకనుకూలంగా, అవినీతి, బంధుప్రీతి, సంపద కూడబెట్టుకోడానికి అనువుగా ఊరికి, లోకానికి ఉపకారం చేస్తుంటారు. ఇలాంటి స్వభావంవల్లనే రాజకీయ నాయకులను చాలామంది ఈసడిస్తుంటారు.

కొందరు సమాజానికి మాత్రమే ఒక మొత్తంగా ఉపయోగపడే పనులే చేస్తుంటారు. వ్యక్తిగత సహాయాలు చేయరు. దీంతో ఓట్లు వేసేటప్పుడు నాకేం చేశాడు? అందరికీ చేసిందే నాకు అందింది. మరి ఇంకొకాయన నా కొడుక్కు ఉద్యోగం ఇప్పించాడు. అందువల్ల అతనికే ఓటు వేస్తాననంటాడు.

ఇలా సామాజిక సేవ కోసం అంకితమైనప్పుడు కూడా ప్రజలు రెండు దశల్లో ఉపకారాన్ని ఆశిస్తుంటారు. ఒకటి - వ్యక్తిగత ఉపకారం. రెండు - అందరికీ ఉపయోగపడే ఉపకారం. ఈ రెండూ ఏకకాలంలో పొందినప్పుడే ఊరికి ఉపకారం పీనుగుకు సింగారం అనే సామెత బారి నుండి బయటపడతారు అని అంటారు.

**లోకోభిన్నరుచి**

జిహ్వకో రుచి, లోకోభిన్నరుచి అని సామెత. అందువల్ల వ్యక్తిగత జీవితం తన కోసం, తన కుటుంబం కోసం జీవించినా, సమాజం కోసం జీవించినా దానికి భిన్నమైన కోణంలో ఆలోచించేవాళ్లు వాటిని విమర్శిస్తూనే వుంటారు. కుటుంబానికే పరిమితమై బతికితే ఎలా అని కొందరు ప్రశ్నిస్తారు. కొందరు బ్రహ్మచర్యాన్ని గొప్ప అంటారు. సంసారులు నీ తల్లిదండ్రులు కూడా బ్రహ్మచర్యం పాటిస్తే నువ్వు పుట్టేవాడివే కాదు. నీ



బ్రహ్మచర్యానికి నీ తల్లిదండ్రులు కని పెంచి పెద్ద చేయడమే మూలం. కనుక కుటుంబ జీవితమే సర్వోత్కృష్టమైనది అని అంటారు.

జీవితం అనేక మానవ సంబంధాల గుండా సాగుతుంది. మానవ సంబంధాల స్వభావాన్ని అనుసరించి వాటికి అనేక నిర్వచనాలు, పేర్లు పెట్టారు.

1. అమ్మా నాన్న కుటుంబ సంబంధాలు, వావివరసలు
2. ఊరు వాడ ప్రాంత సంబంధాలు
3. క్లాస్‌మేట్ అనుబంధాలు, ఉద్యోగ సంబంధాలు
4. భాష సంస్కృతి సంబంధాలు
5. పని సంబంధాలు, ధనిక, పేద, వర్గ సంబంధాలు, ఉత్పత్తి సంబంధాలు
6. కుల సంబంధాలు
7. స్త్రీ పురుష సంబంధాలు
8. సాంస్కృతిక సంబంధాలు, మత సంబంధాలు
9. రాజకీయ సంబంధాలు, ప్రభుత్వ పరిపాలనా వ్యవస్థలతో సంబంధాలు
10. మానవ సంబంధాలు, మానవతా సంబంధాలు
11. ప్రేమ కరుణ స్నేహ సంబంధాలు
12. ఆసక్తి, అభిరుచి సంబంధాలు
13. భావజాల సంబంధాలు
14. సంస్థాగత సంబంధాలు, వ్యవస్థాగత సంబంధాలు
15. ప్రభుత్వానికి, సమాజానికి, వ్యక్తిజీవితానికి, రాజకీయానికి, భావజాలానికి మధ్య గల అంతస్సంబంధాలు
16. జీవన ప్రమాణాలకు, సామాజిక పరిణామాలకు, దృక్పథాలకు, లక్ష్యాలకు ఉద్యమాలకు మధ్య గల అంతస్సంబంధాలు
17. జ్ఞానానికి, జ్ఞానక్రమాలకు, జీవితానికి గల అంతస్సంబంధాలు

అందువల్ల వీటన్నిటినీ ఈ గ్రంథంలో పరిచయం చేసే ప్రయత్నం చేశాను.

ఇలా జీవితం అంటే ఎన్నో కోణాలున్నాయి. ఈ జీవితం ఎందుకు? అనే ప్రశ్నకు ఇచ్చే జవాబే ఈ జీవితం అంటే ఏమిటి? అనే ప్రశ్నకు కూడా జవాబుగా ఉంటుంది. అయితే ఈ జీవితమంటే ఏమిటి? అనే ప్రశ్నకు జవాబు సులభమనిపిస్తుంది. ఈ జీవితం ఎందుకు? అనే ప్రశ్నకు జవాబు చాలా కష్టమనిపిస్తుంది.

ఈ ప్రశ్నలకు జవాబులు వెతికే ప్రయత్నంలో వ్యక్తిగత జీవితానికి, సామాజిక జీవితానికి మధ్య ఉండే సంబంధాలు, పరిణామాలు, వాటి చలనసూత్రాల పాత్ర, అందులో దృక్పథాల పాత్ర, ప్రాధాన్యతను రాజకీయాల పాత్రను జ్ఞాన క్రమాలను ఈ గ్రంథంలో పరిచయం చేయడం జరిగింది.

## ప్రశ్నలు

1. జీవితం అంటే ఏమిటో మీ భావాలను నోటుబుక్కులో రాయండి.
2. మీ స్నేహితులు, కుటుంబ సభ్యులు ఈ ప్రశ్నకు ఏమని జవాబు చెప్తారో నోటుబుక్కులో రాయండి.
3. పరిపూర్ణ జీవితం అంటే ఏమిటి?
4. వడ్డించిన విస్తరిలా అన్నీ అమరినప్పుడు జీవిత లక్ష్యాలు ఎలా వుండాలి?
5. పరోపకారం గురించి మీరేమనుకుంటున్నారు?
6. ఆర్నెల్లకోసారి జీవితం అంటే ఏమిటో మీరు ప్రశ్నించుకుంటారా?
7. జీవితంలో వుండే మానవ సంబంధాల వైరుధ్యాన్ని, విస్తృతిని తెలపండి.



# ఎలా జీవించాలి?

## ఎందుకు జీవించాలి?

ఎందుకు జీవించాలి అనేది జీవిత లక్ష్యాలకు సంబంధించిన ప్రశ్న. జీవితమంటే ఏమిటి అనేది ఒక తాత్విక ప్రశ్న. అలాగే అది నిత్యజీవిత సమస్య కూడా. జీవితం ఎలా వుండాలి అనే ప్రశ్నకు అనేకమంది అనేక రకాల సూచనలు చేశారు. వీరిలో తల్లిదండ్రులున్నారు, పెద్దలున్నారు, మత పెద్దలున్నారు. తత్వవేత్తలున్నారు. సైకాలజిస్టులు ఉన్నారు. రాజకీయ నాయకులు ఉన్నారు. సామాజిక శాస్త్రవేత్తలు ఉన్నారు. పౌరనీతి శాస్త్రజ్ఞులు వున్నారు.

ఈ ప్రశ్నకు నైతిక విలువల కోణంలో చెప్పారు. కుటుంబ కోణంలో చెప్పారు. కులం కోణంలో చెప్పారు. వర్గం కోణంలో చెప్పారు. సమాజ కోణంలో చెప్పారు. సుఖదుఖ్ఖాల కోణంలో చెప్పారు. అరిషడ్వర్గాల కోణంలో చెప్పారు. అష్టేంద్రియాల కోణంలో చెప్పారు. జీవిత ప్రమాణాల కోణంలో చెప్పారు. సైన్సు కోణంలో చెప్పారు. కళల కోణంలో చెప్పారు. సంస్కృతి కోణంలో చెప్పారు. తాత్విక కోణంలో చెప్పారు. సైకాలజీ కోణంలో చెప్పారు.

జీవితం అంటే ఏమిటి? జీవితం ఎందుకు? ఎలా జీవించాలి? ఎందుకు జీవించాలి? అనే ప్రశ్నలు ఎంత తాత్వికమైనవో అంతగా నిత్యజీవితంలో అవసరమైనవి. ఈ జవాబులు ఎంత తేలికో అంత లోతైనవి. ఎంత లోతైనవో అంత సులభమైనవి. చెంబు అంత జీవితం వుంటే చెంబెడంత అర్థాన్ని ఇచ్చుకోవచ్చు. బిందెడంత జీవితం వుంటే బిందెడంత అర్థాన్ని ఇచ్చుకోవచ్చు. చెరువంత జీవితం వుంటే చెరువంత అర్థాన్ని ఇచ్చుకోవచ్చు. ఎవరి జీవితాన్ని ఎవరి శక్తిసామర్థ్యాల ననుసరించి, లక్ష్యాల ననుసరించి వారి తమదైన అర్థాలను ఇచ్చుకోవచ్చు.

జీవితాన్ని ఎలా జీవించాలి? అనే ప్రశ్నకు అనేక జవాబులిచ్చారు. ఆనందంగా జీవించాలి. కష్టపడి జీవించాలి. పరోపకారం చేస్తూ జీవించాలి. అమ్మా నాన్నలను గౌరవిస్తూ జీవించాలి. పెళ్లి చేసుకుని జీవించాలి. పిల్లల్ని పెంచి పోషిస్తూ జీవించాలి. కుటుంబంగా జీవించాలి. సామాజికంగా జీవించాలి. ఎందుకు జీవించాలంటే పుట్టాం కనుక జీవించాలి. జీవించడం ప్రాణి లక్షణం కనక జీవించాలి. ప్రజల కోసం జీవించాలి. నీ కోసం జీవించాలి.

రాజకీయంగా జీవించాలి. భావజాలంగా జీవించాలి. బాధ్యతగా జీవించాలి. కర్తవ్యంగా జీవించాలి.

అందరి తలలో నాలుకలా జీవించాలి. సమాజంలో భాగంగా జీవించాలి. సమాజాన్ని మార్చుతూ జీవించాలి. సమాజానికి ముందు నడుస్తూ జీవించాలి. స్వేచ్ఛాసమానత్వంతో జీవించాలి.

సస్నేహంగా జీవించాలి. ఆదర్శవంతంగా జీవించాలి. బస్సులా జీవించాలి. రైలులా జీవించాలి. విమానంలా జీవించాలి. వానలా జీవించాలి. గాలిలా జీవించాలి. రుతువులా జీవించాలి. ప్రకృతికి పచ్చని రంగేసే ఎండలా జీవించాలి.

ఎగిరే పక్షిలా జీవించాలి. వేళ్లూనుకున్న చెట్టులా జీవించాలి. పండిన చెట్టులా జీవించాలి. చెట్టులా పాత ఆకులు రాల్చుకుంటూ జీవించాలి. కొత్తచిగుర్లు వేసుకుంటూ జీవించాలి. చెట్టులా నిత్యనూతనంగా జీవించాలి. పువ్వులా జీవించాలి. పూలతీగలా జీవించాలి.

నదిలా జీవించాలి. నదీజలపాతంలా జీవించాలి. సముద్రంలా జీవించాలి. నీళ్లలా జీవించాలి. నీళ్లలోని చాపలా జీవించాలి.

జీవితం చెట్టులా నీడనివ్వాలి. జీవితం చెట్టులా పండ్లనివ్వాలి. మార్గదర్శిలా జీవించాలి. క్రాంతదర్శిగా జీవించాలి. నాయకుడుగా జీవించాలి.

నెచ్చెలిలా జీవించాలి. చెలికాడులా జీవించాలి. అన్నలా జీవించాలి. తమ్ముడులా జీవించాలి. చెల్లెలిలా జీవించాలి. అక్కలా జీవించాలి.

ఆదర్శవంతమైన కొడుకులా జీవించాలి. మంచి కూతురుగా జీవించాలి. మంచి తండ్రిగా జీవించాలి. మంచి తల్లిగా, గృహస్థుగా, భర్తగా, ఇల్లాలిగా జీవించాలి. ఆదర్శవంతమైన పౌరుడుగా జీవించాలి. ఆదర్శవంతమైన విద్యావంతుడిగా జీవించాలి. ఆదర్శవంతమైన కళాకారుడిగా జీవించాలి.

జీవితం ఒక ప్రవహించే పాట. జీవితం ఒక జీవనది. జీవితాన్ని ఒక ఆటలా జీవించాలి. ఒక పాటలా జీవించాలి. భాషలా జీవించాలి. అన్వేషణలా జీవించాలి. లక్ష్యాలుగా జీవించాలి. కర్తవ్యాలుగా జీవించాలి. కంప్యూటర్‌లా జీవించాలి. బ్యాటరీ రీచార్జర్‌లా జీవించాలి. మంచి పుస్తకంగా జీవించాలి. అవసరమైనప్పుడే తెరిచే గొడుగులా జీవించాలి.

సాగిపోయే దారిగా జీవించాలి. దారిచూపే వారుగా జీవించాలి. దారివేసే వాళ్లుగా జీవించాలి. మైలురాళ్లుగా జీవించాలి.

ఒక మహాసభలా జీవించాలి. ఒక జాతరలా జీవించాలి. ఒక ఊరేగింపులా జీవించాలి. తాతలా జీవించాలి. నానమ్మలా వాత్సల్యంగా జీవించాలి. బతుకుబండికి చక్రాల్లా జీవించాలి.

బస్సు డ్రైవరులా బతకాలి. బస్సు నువ్వే. బస్సు డ్రైవరువూ నువ్వే. బాట నీదే. గమ్యం నీదే. గమనం నీదే. బాటసారివి నీవే. మైలు నీవే, మైలురాయివి నీవే.

తనను తాను తెలుసుకోవడమే జీవితం. తనను తాను గెలుచుకోవడమే జీవితం. తన జీవితానికి తానే కర్త కర్మ క్రియ అని తెలుసుకొని ఆచరించడమే జీవితం.



స్వయంసంపూర్ణంగా వుండడమే జీవితం. తనను తాను మలుచుకోవడమే జీవితం. తనను తాను ప్రేమించుకోవడమే జీవితం. తనను తాను గౌరవించుకోవడమే జీవితం. తనను తాను సమాజంలో అస్థిత్వాన్ని పెంచుకోవడమే జీవితం. తనను తాను ఎదిగించుకోవడమే జీవితం. తన లక్ష్యాలు, గమ్యాలు సాధించుకోవడమే జీవితం. తన గమ్యం, గమనం ఒక్కటి కావడమే జీవితం.

జీవితం ఒక అడవి. నీ జీవితానికి నువ్వే దారి వేసుకోవాలి. నీ దారి నువ్వే చూసుకోవాలి.

ఈ లోకంలోకి నీవు ఒంటరిగానే వచ్చావు. ఈ లోకంలోంచి ఒంటరిగానే వెళ్ళిపోతావు. నీ రాకకు ఆనందించారు. నీ పోకకు ఏడుస్తారు. ఎవరూ వెంట రారు. ఏదీ నీ వెంట రాదు. నీ జ్ఞాపకాలే ఇక్కడ మిగిలిపోతాయి. నీవు జ్ఞాపకాలలోనే కొనసాగుతావు. అనుబంధాలు, జ్ఞాపకాలే నీ చరిత్ర. చావు పుట్టుకల మధ్య నున్నదే జీవితం.

జీవితం ఒక చరిత్ర. జీవితం ఒక నోటుబుక్కు. నీ చరిత్ర నువ్వే రాసుకోవాలి. నోటుబుక్కు నీదే. పెన్ను నీదే. రాసే చెయ్యీ నీదే. రాసేదీ నువ్వే. రాసే దృక్పథమూ నీదే.

నీ జీవితానికి నీవే దిక్సూచి. దిక్సూచిలా బతకాలి. దిక్కుల్లా బతకాలి. దిగంతాల్లా బతకాలి. దిక్కున్న చోటల్లా బతకాలి. దిక్కులేని చోట కూడా బతకాలి. అద్దంలో కొండలా బతకాలి. బట్టలా బతకాలి. బట్టలోని పోగుల కలనేతలా బతకాలి. కుండలా బతకాలి. మట్టిని మలచిన కుండలా బతకాలి.

నువ్వే బుద్ధుడివి. నువ్వే దైవానివి. నీకు నువ్వే బద్ధుడివి. నువ్వే లీడరువి, కేడర్‌వి. సాఫ్ట్‌వేర్ ఇంజినీర్‌లా బతకాలి. లెక్చరరులా బతకాలి. సృష్టికర్తలా బతకాలి. రాజులా బతకాలి. నీ కిరీటం నువ్వే తయారుచేసుకోవాలి. నీ సైన్యం నువ్వే. నీ రాజ్యం నువ్వే. నీ అంతఃపురం నువ్వే. నీ రక్షణకోట నువ్వే.

విత్తు నువ్వే. మొలకెత్తే మొక్క నువ్వే. పంట నువ్వే. మట్టిలోని పసిడి నువ్వే. పసిడిలోని వన్నె నువ్వే.

నువ్వు వార్తలా బతకాలి. జ్ఞానంలా బతకాలి. సమాచారంలా బతకాలి. నువ్వు నడుస్తున్న గ్రంథాలయంలా బతకాలి. భూమిని తలకిందులు చేసి బువ్వపంచిపెట్టే రైతులా బతకాలి. సూర్యుని వెలుగులా ప్రసరించాలి. వెన్నెల్లా వెలగాలి.

ఈ జీవితం శాఖోపశాఖలుగా విస్తరించడానికే. జీవితచక్రమే జీవితం. జీవిత పరిణామాలే జీవితం. బతకడమే జీవితం. బతుకు గెలుచుకోవడమే జీవితం. ఓడిపోయిన బతుకు కూడా జీవితమే. తిరిగి గెలుచుకోవడమే జీవితం.

జీవితంలో మనిషి శరీరానికి కొన్ని, మనసుకు కొన్ని అవసరాలు ఏర్పడుతున్నాయి. సృష్టి స్థితి లయలు నిత్యం కొనసాగుతూనే వున్నాయి.

ప్రేమ కరుణ తోటి మనిషికి ఆధారం. స్వేచ్ఛ సమానత్వం తనకు తానే ఆధారం. స్వేచ్ఛతో, సమానత్వంతో జీవించాలి. కళలు సాహిత్యం వినోదం ఆటపాటలు వినోదయాత్రలు కొత్తప్రదేశాల పర్యటనలు అన్నీ మనిషి జీవితానికి అవసరం. సంగీతం

లయ నాట్యం నటన అనుకరణ అన్నీ మనిషి జీవితావసరాలే.

జీవితానికి అనేక పార్శ్వాలున్నాయి. వ్యక్తిగత జీవితంలో బాల్యం-యవ్వనం-వృద్ధాప్యం. చదువు-ఉద్యోగం-వృత్తి. పెళ్లి-భార్య-భర్త-పిల్లలు. సామాజిక జీవితంలో మనిషి ఒక సభ్యుడు. పౌరసమాజంలో మనిషి ఒక పౌరుడు. కుటుంబంలో ఒక తల్లి. ఒక తండ్రి. ఒక కొడుకు. ఒక కూతురు.

జీవితాన్ని రెండు దశలుగా లేదా రెండు భాగాలుగా చెప్పారు. ఒకటి - వ్యక్తిగత జీవితం. రెండు - సామాజిక జీవితం.

ప్రైవేట్ లైఫ్‌లో ప్రైవసీ ఉంటుంది. మనిషి ఇష్టాయిష్టాలు మొదలుకొని కాలకృత్యాల దాకా కుటుంబజీవితం, గృహస్థ జీవితం ప్రైవేట్ లైఫ్‌గా భాగించారు. కడపదాటిన తర్వాతి జీవితమంతా పబ్లిక్ లైఫ్ అని భాగించారు. ప్రైవేట్ లైఫ్ కూడా పబ్లిక్ లైఫ్‌లో భాగమే. పబ్లిక్ లైఫ్ కూడా ప్రైవేట్ లైఫ్ కోసమే. ఏదీ విడిగా వుండదు.

బెడ్రూమ్‌లోకి రాకూడదు అనేది ప్రైవసీ. డ్రాయింగ్ రూమ్ ప్రైవేట్ లైఫ్‌లో చిన్న పబ్లిక్ లైఫ్. మిగతా ఇల్లంతా ప్రైవేట్ లైఫ్. వ్యక్తిగత జీవితంలో రహస్యాలుంటాయి. భార్యభర్తల పోట్లాటలు రహస్యం. కుటుంబ కలహాలు రహస్యం. బ్యాంకు బ్యాలెన్సులు రహస్యం. అందులోకి ఇతరులు చొరబడకూడదు. లోగుట్లు అన్నీ అందరికీ తెలియాల్సిన అవసరంలేదు. గృహస్థు జీవితం, కుటుంబం ప్రైవేట్ లైఫ్‌లో ఒక దేశం.

జీవితానికి ప్రాణం ఆధారం. ప్రాణానికి శ్వాస ఆధారం. శ్వాసకు గాలి ఆధారం. గాలికి ప్రకృతి ఆధారం. ఆకలి మనిషికి జీవిత ఆధారం. ప్రకృతికి భూమి ఆధారం. ప్రకృతిలోని పచ్చదనానికి సూర్యుడు ఆధారం. మనిషికి ప్రకృతి ఆధారం. సూర్యుడు మనిషికి ఒక ఆధారం. భూమి ఒక ఆధారం. ప్రకృతి వనరులు ఒక ఆధారం.

మనిషికి సమాజం ఆధారం. మనిషికి కుటుంబం ఒక ఆధారం. స్నేహం ఒక ఆధారం. ప్రేమ కరుణ స్వేచ్ఛ ఒక ఆధారం. జ్ఞానం ఒక ఆధారం. సంస్కృతి ఒక ఆధారం. భాష ఒక ఆధారం. విశ్వాన్ని ప్రేమిస్తూ జీవించాలి. ఆనందమయ ప్రకృతిలో లీనమవుతూ జీవించాలి. మానవాళిని ప్రేమిస్తూ మైత్రీపూర్వకంగా జీవించాలి. కరుణార్ద్రంగా జీవించాలి.

1. జీవితం అంటే ఏమిటి? ఎలా జీవించాలి? అనే ప్రశ్నలకు ఎన్ని కోణాల్లో జవాబులు చెప్పవచ్చో రాయండి.
2. ఎలా జీవించాలో, మీరు ఎలా జీవించాలనుకుంటున్నారో తెలపండి.
3. మీ జీవితం అడవిలా వుందా? రహదారిలా వుందా? మీ జీవితానికి ఆధారాలు ఏమిటి? అవకాశాలేమిటి?



# మనిషి ప్రకృతిలో భాగంగా జీవించాలి

## చర్య ప్రతిచర్యలకు అతీతంగా జీవించాలి

మనిషి ప్రకృతి ఒడిలో జీవిస్తాడు. ప్రకృతిని తనకనుకూలంగా మలుచుకుంటాడు. అందుకు ప్రకృతిలోని పశుపక్ష్యాదులను మచ్చిక చేసుకున్నాడు. మానవులు మొట్టమొదటగా కుక్కను మచ్చిక చేసుకున్నారు. కుక్క సహాయంతో అడవి మీద, అడవి జంతువుల మీద పోరాటం చేశారు. కొన్ని జంతువులను మచ్చిక చేసుకున్నారు. ఏనుగును, గుర్రాలను, ఆవులను, బర్రెలను, కోళ్లను, మేకలను, గొర్రెలను మచ్చిక చేసుకున్నారు.

భూమిని చదును చేశారు. నీటిని నిలువ చేశారు. తేనెతుట్టె నుండి తేనెను తీశారు. చెట్ల నుండి కాయలు తీసుకున్నారు. వేటను జీవనవిధానంగా మలుచుకున్నారు. వ్యవసాయాన్ని నేర్చుకున్నారు. గుంపుగా, తెగగా, జనపదంగా జీవించడం అలవరచుకున్నారు. అడవిని ఆసరా చేసుకున్నారు. మాంసాన్ని ఆహారంగా మార్చుకున్నారు. తోలును బట్టగా మార్చుకున్నారు. ఆకు అలములను తిండిగా మార్చుకున్నారు.

మచ్చిక చేసుకునేదాకా మనిషి వాటికన్నా శక్తిసంపన్నుడు, బలశాలి, ఉపాయశాలి. వాటికన్నా క్రూరుడుగా అవతారాలెత్తి వాటిని లొంగదీసుకున్నాడు. అలా వివిధ దశలు అనుభవించారు. అవి మచ్చిక అయ్యాక మానవులు ఈ శక్తులు కోల్పోయారు. ఈ యుక్తులు కోల్పోయారు. అవి అందరి నుండి కొందరికే పరిమితమయ్యాయి. మానవులు మృదువుగా మారారు. మచ్చికైన వాటిని ప్రేమించడం ప్రారంభించారు. అనుబంధాలు పెనవేసు కున్నారు. వాటిని లొంగదీసుకున్న నాటి శక్తిని కోల్పోయారు. ఆ అవససరాలు కాలం తీరిపోయాయి.

తిరిగి అవి తిరగబడితే మానవులు ఓడిపోయారు. ఇప్పటికీ ఆంబోతులను చూసి, కుక్కలను చూసి మానవులు భయపడుతూనే వున్నారు. భయపెట్టడానికే కుక్కలను పెంచుతున్నారు.

కుక్కను కొట్టారు. ఏనుగును అంకుశంతో పొడిచారు. గుర్రాన్ని కట్టిపడేశారు. అవి తిరగబడితే మనుషులు ఓడిపోయారు. కొందరే వాటిని తిరిగి లొంగదీసుకునే శక్తులను, ఉపాయాలను సాధించుకున్నారు. అలా తిరిగి క్రూరులుగా మారారు.

ఆటవిక సమాజం నుండి మానవులు పౌరసమాజంగా ఎదిగాక మృదువుగా

మారతారు. ఏనుగును లొంగదీసుకున్న మనిషి తేళ్లను, చీమలను చూసి భయపడిపోవడం జరుగుతున్నది. పాములను చూసి భయపడుతారు. ఎడ్లను చూసి భయపడతారు. కుక్కలను చూసి భయపడతారు. చివరకు ఇంట్లోని పిల్లులను చూసి భయపెడతారు.

నాగరిక సమాజంగా పౌరసమాజంగా మానవులు ఎదిగాక పౌరసమాజంలో తిరుగుబాట్లు జరిగితే తిరిగి ఇరుపక్షాలు వెనకటి క్రూర లక్షణాలను తిరిగి అలవరచుకుంటారు. నాగరికత వెనక్కి మళ్లుతుంది. ఆటవికత మళ్లీ మొదలౌతుంది. మనిషిని మనిషి లొంగదీసుకుంటారు. ఎవరి శక్తిసామర్థ్యాలు, ఉపాయాలు ఎక్కువో వారు విజయం సాధిస్తుంటారు. గెలిచిన వారు విజేతలుగా వీరులుగా తమ చరిత్రను తామే రాసుకుంటారు. ఓడినవారు మాత్రమే క్రూరులుగా వాళ్లు రాస్తుంటారు.

జిడ్డు కృష్ణమూర్తి ఒక సందర్భంలో ఇలా అంటారు. "స్వీయరక్షణ కోసం జరిగే ప్రతిస్పందన భయపడటం కాదని నిస్సందేహంగా తెలుస్తున్నది కదా. ఆహారం, దుస్తులు, నివాసం మనకి అవసరం. మనందరికీ ఒక్క సంపన్నులకే కాదు, ఒక్క గొప్పవారికే కాదు. ప్రతి ఒక్కరికీ అవసరమే, దీనికి రాజకీయవేత్తలు పరిష్కారం చూపలేరు. రాజకీయవేత్తలు ప్రపంచాన్ని ఇండియా మొదలైన దేశాలుగా విభజించారు. ఒక్కొక్క దేశాన్ని ప్రత్యేకంగా ఒక స్వతంత్ర ప్రభుత్వం నడిపిస్తుంది. ఒక ప్రత్యేకమైన సైన్యం వుంటుంది. పైగా జాతీయత గురించిన విషపూరితమైన కట్టుకథలుంటాయి.

అసలు రాజకీయ సమస్య ఒకే ఒక్కటి వుంది. అదేమిటంటే మానవజాతినంతా ఐక్యం చేయడం. మీరు కనుక మీ జాతీయతా భావాలను, దక్షిణాది, వుత్తరాది, తెలుగువారు, తమిళులు, గుజరాతీలు ఇంకా అవీ యివీ అనే అల్పమైన విభేదాలను పట్టుకొని వేలాడుతుంటే మాత్రం అది జరిగే అవకాశం లేదు. జాతీయవాదం వట్టి మూర్ఖత్వం. సర్! ఇల్లు మంటల్లో కాలిపోతుంటే, ఆర్పడానికి నీళ్లు తెస్తున్న మనిషిని గురించి మీరు చర్చించరు. యింటికి నిప్పు పెట్టిన మనిషి జుట్టు రంగు ఏమిటి అని ఆలోచించరు. నీళ్లు మోసుకొని వస్తారు, అంతే. మతాలు మనుష్యుల్ని విభజించినట్లుగానే జాతీయతా భావాలు మనిషి నుండి మనిషిని విడదీశాయి. ఈ జాతీయ తత్వం, మతసంబంధమైన విశ్వాసాలు మానవజాతిని విడదీశాయి. ఒక మనిషికి ప్రతికూలంగా మరో మనిషిని నిలబెట్టాయి. ఇదంతా ఎందుకు జరిగిందో మనం గ్రహించవచ్చు. ఎందుకంటే మన స్వంతదైన ఒక చిన్న మురికిగుంటలో నివసించడమే మనందరికీ ఇష్టం కనుక."

ఇలా చర్యకు ప్రతిచర్య జరగవలసినదేనా? ప్రతిచర్య అతీతంగా జీవించడం సాధ్యం కాదా? ఇంటి నుండి దారితప్పిన కోళ్లు, మేకలు, పశువులు తిరిగి ఇంటికి చేరవా? అడవిలోకన్నా ఇంటిలోనే రక్షణ ఎక్కువ అని తనకు తాను తెలుసుకుంటే తిరిగి ఇంటికి చేరతాయి. అడవిలోనే హాయిగా ఉందనుకుంటే అక్కడే ఉండిపోతాయి. రెండూ మంచివే. రెండూ స్వేచ్ఛను, ఇష్టాలనే తెలుపుతాయి. మధ్యలో ఈ చర్యలకు ప్రతిచర్యలు దేనికి?

ప్రతిచర్యకు అతీతంగా సమాజం మానవీయ విలువలను సంతరించుకుంటున్నది. ఉరిశిక్షను రద్దు చేయాలని ఆధునిక సమాజం కోరుకుంటున్నది. ఆవేశంలో కసితో



ఒకరు హత్యచేస్తే అనేక సాక్ష్యాలు, చట్టబద్ధ నిర్ణయాలు రోజులతరబడి చర్చల తర్వాత ఉరిశిక్ష వేయడం ఆవేశంలో కసితో చేసిన హత్య కన్నా ఎన్నో రెట్లు క్రూరమైన ప్రతిచర్య. ఆవేశం చల్లారిపోతుంది. పశ్చాత్తాపం చెందుతుంది. కాని చట్టబద్ధ ప్రతిచర్యలకు పశ్చాత్తాపం లేదు. అవి ఆవేశం కన్నా ఎన్నో రెట్లు క్రూరంగా కొనసాగుతూనే వుంటాయి.

జీవితంలో క్రూరత్వం నాజూకుతనం నేర్చుకుంటుంది. ఆవేశపూరితమైన హత్యకు నాగరికమైన హత్య జవాబు అంటుంది. తనది నాజూకు నాగరిక నిర్ణయం అంటుంది. ఆధునిక సమాజం, పౌరనీతి, విలువలు ఇలాంటి అనేక క్రూరత్వాలను నాజూకుగా నాగరికతగా ప్రదర్శిస్తుంటాయి. సమాజం చేత అంగీకరింపజేస్తుంటాయి.

చర్యకు ప్రతిచర్య దేన్ని తెలుపుతుంది? అది చర్య యొక్క ఆధిపత్యాన్ని తెలుపుతుంది. చర్య పర్యవసానంగా ప్రతిచర్య ఉంటే చర్యలే ప్రతిచర్యలను నిర్ధేశిస్తుంటాయి. అప్పుడు రెండూ పరస్పర సంబంధంలోనే ఉత్పన్నమైన చర్య ప్రతిచర్యలౌతాయి. క్రూర చర్యలు ప్రతిచర్యలు, క్రూరప్రతిచర్యలని ఉత్పన్నం చేస్తుంటాయి. దీనికి పరిష్కారం మానవులు కనుక్కుంటూనే వున్నారు. ఆ పరిష్కారాలు క్రూరత్వాల ముందు ఓడిపోతూనే వున్నాయి. మృదువుగా మారిన మానవ సమాజం క్రూరంగా మారడానికి క్రూరచర్యలతో పాటు చట్టాలు కూడా చేయూతనిస్తూనే వున్నాయి. చట్టాలు క్రూరంగా మారుతూనే వున్నాయి.

ఆధునిక సమాజం మానవుల జీవితాలను ఆటవిక దశలనుండి దాటించి ముందుకు సాగింది. వెనకటి దశల పని పద్ధతులను, పోరాటాలను అనుసరిస్తే ఆధునిక సమాజం తిరిగి ఆటవికంగా ప్రవర్తించడం ఏం న్యాయం?

అక్బర్ బీర్‌బల్‌ను ఒక ప్రశ్న అడిగాడు. దేవుడు చేయలేని పని రాజు చేయగలిగిన పని ఏదైనా వుందా అని. బీర్‌బల్ ఆలోచించి ఉందని చెప్పాడు. రాజు దేశ బహిష్కారం శిక్ష వేయగలడు. దేవుడు ఈ శిక్ష వేయలేడు. ఎందుకంటే అంతా అతని రాజ్యమే కనుక. దేశ బహిష్కార శిక్ష వేయడం దేవుడు చేయలేని పని. ప్రజాస్వామ్యం దైవం వంటిది. అది దేన్నీ బహిష్కరించలేదు.

రాజుకన్నా మొండివాడు బలవంతుడు. నిజమే. ఆఫ్ఘనిస్తాన్‌లో తాలిబన్లు క్రూరంగానే ప్రవర్తించారు. ఇరాక్‌లో సద్దాం హుస్సేన్ క్రూరంగానే ప్రవర్తించారు. అమెరికా ఆ నెపంతో అంతకన్నా ఎన్నో రెట్లు క్రూరంగా ప్రవర్తించడం సబబేనా? క్రూరత్వం జరుగుతున్నదని అంతకన్నా బలమైన శక్తులతో, ఆయుధాలతో, మరింత క్రూరత్వంతో విరుచుకుపడి అణిచివేయడమే పరిష్కారమా?

ఒక ఉద్యమంలో, ఒక ఊరేగింపులో రాళ్లు విసిరితే లాఠీచార్జీ చేసి కాల్పులు జరపడమే పరిష్కారమా? కొందరు సాయుధ రూపంలో పోరాటం చేస్తే రాజ్యం అంత కన్నా ఎన్నో రెట్లు సాయుధ బలగాలను ఉపయోగించి అణచివేయడమే పరిష్కారమా? తద్వారా ప్రతిచర్య చేసేవారు స్వేచ్ఛ కోల్పోవడం లేదా? ఇదంతా మధ్యయుగాల నాటి పంటికి పన్ను కంటికి కన్ను కాలుకు కాలు చేయికి చేయి తీసేసే క్రూర విధానం కాదా?

అది క్రూరమని తెలిశాక చర్యకు ప్రతిచర్య ఎలా వుండాలి? చర్యకు ప్రతిచర్య అనేది చర్య ప్రతిచర్యలకు అతీతంగా ఉండగలిగే పరిష్కారాలు లేవా? అవి ఎలాంటి

పరిష్కారాలు? క్షమించడం, మన్నించడం, నిరసించడం, సంస్కరించడం. ఆ పరిస్థితులనే మార్చడం మొదలైనవి చర్యకు ప్రతిచర్యగా కాకుండా చర్య ప్రతిచర్యలకు అతీతమైన చర్యలు అవుతాయి. అందువల్ల మానవీయ సమాజం చర్యకు ప్రతిచర్యను తీసుకుని శిక్షలు విధించే న్యాయసూత్రాలను మార్చుకోవాల్సిన అవసరం వుంది.

అయితే క్రూరత్వం ముందు నాగరికత, సంస్కారం ఎప్పుడూ ఓడిపోతూనే వుంటుంది. దాన్ని అరికట్టి నాగరికత గెలువడానికి తిరిగి శిక్షలను ఆశ్రయిస్తూనే వున్నారు. ఈ చక్రబంధం నుండి మనిషికి మానవ సమాజానికి స్వేచ్ఛ లేదా? విముక్తి లేదా?

చర్య ప్రతిచర్యను సృష్టిస్తే ప్రతిచర్య చేసేవారి స్వేచ్ఛ హరించబడినట్టు అవుతున్నది. చర్యే ప్రతిచర్య యొక్క స్వేచ్ఛను కబళించివేస్తున్నది. నీవు ఎలా స్పందించాలో చర్య నిర్ణయించాక నీకిక స్వేచ్ఛ ఎక్కడిది? వాళ్లు నిర్ణయించిన దారిలోనే నీవు ప్రతిచర్యకు ఉపక్రమిస్తావు. వ్యక్తి యైనా, వ్యక్తికి సమాజానికైనా, ఉద్యమాలకు సామాజిక వ్యవస్థలకైనా, దేశాలకు దేశాలకు మధ్యనైనా ఈ చర్య ప్రతిచర్యలు చర్య మొదలుపెట్టినవారే అవతలి పక్షం యొక్క స్వేచ్ఛను నిర్ణాయకశక్తిని హరించే ఈ దుస్థితి నుండి మానవ సమాజానికి విముక్తి ఎప్పుడు?

శ్రీలంక తమిళులు, శ్రీలంక ప్రభుత్వం చర్య ప్రతిచర్యలతో మానవహత్యాకాండ కొనసాగుతూనే వున్నది. ఎవరి లక్ష్యాలు వారివి. ఇజ్రాయిల్, పాలస్తీనాల మధ్య చర్యకు ప్రతిచర్యలు కొనసాగుతూనే వున్నాయి.

బుద్ధుడు చర్యకు ప్రతిచర్య కాకుండా చర్య ప్రతిచర్యలకు అతీతంగా ఆలోచించడం, జీవించడం, ఆచరించడం చూపాడు. అయితే అదే బౌద్ధమత పతనానికి కారణమైంది. ప్రతిచర్య లేకపోవడంవల్ల శత్రువుల దాడుల్లో నశించిపోయింది. మతం మార్చుకున్నారు.

గాంధీజీ వంటి వారి సత్యాగ్రహం, అహింస, శాంతియుత ఉద్యమాలు సామాజిక ఆధిపత్యంలో ఉన్నవారిలో మార్పు తీసుకురాకపోతే ఏం చేయాలి? ప్రభుత్వాలు శాంతియుత ఉద్యమాలకు స్పందించి పరిష్కారాలు చేపట్టకపోతే తిరిగి ఇతర రూపాల్లో ఉద్యమాలు సాగుతాయి. అందువల్ల ఆధునిక సమాజం వాటి ప్రభుత్వ వ్యవస్థలు నున్నితంగా మృదువుగా మారినపుడే చర్య ప్రతిచర్యలు, క్రూర చర్యలు అదృశ్యమవుతాయి. ఇందుకు మానవతావాదులు సామాజిక వ్యవస్థల్లో వాటి పని తీరుల్లో మానవీయ కోణాలను మరెన్నో రెట్లు అభివృద్ధి పరచడం అవసరం. ఈ కోణంలో అధ్యయనం చేసేందుకే ఈ పుస్తకం.

1. చర్య అంటే ఏమిటి? ప్రతి చర్య అంటే ఏమిటి?
2. ప్రతి చర్య వల్ల స్వేచ్ఛ ఎలా నశిస్తుంది?
3. జిడ్డు కృష్ణమూర్తి అభిప్రాయాలేమిటి? అవి సరైనవేనా?
4. చర్య ప్రతిచర్యలకు అతీతంగా జీవించడం సాధ్యమా? చర్చించండి?



# ఇప్పుడు జీవిస్తున్న మీ జీవితం ఎలా వుంది?

ఇప్పుడు జీవిస్తున్న మీ జీవితం ఎలా వుంది? ఈ విషయంపై ఎన్ని రోజులకొకసారి ఆలోచిస్తుంటారు? మీ జీవితం బాగుంటే, ఎలా బాగుంది? బాగు లేకపోతే, ఎందుకు బాగులేదు? ఏం చేస్తే బాగవుతుంది? మీ జీవితం తృప్తిగా, ఆనందంగా, గొప్పగా వుంటే అందులోని రహస్యం ఏమిటి? నాక్కాస్త చెప్పండి. నేను అది మానవాళికి వాళ్లు కూడా మీలాగా ఆనందంగా, తృప్తిగా, గొప్పగా జీవించడం ఎలాగో తెలిపి సహకరిస్తాను. మీకు మీ జీవితం తృప్తిగా, ఆనందంగా లేకపోతే కూడా తెలపండి. దాన్ని శాస్త్రీయంగా పరిశీలిద్దాం. పరిష్కరిద్దాం.

**తృప్తి, ఆనందం ఎలా వస్తుంది?**

తృప్తి, ఆనందం ఎలా వస్తుంది? కనీస జీవిత అవసరాలు ఎలా తీరుతున్నాయి? తక్కువ జీతంతో కొందరు ఆనందంగా బతుకుతుంటారు. కొందరు ఎంత ఆదాయం వున్నా ఏడుపుముఖం పెడుతుంటారు. కొందరికి ముఖంమీదే కోపం, అసహనం, అసంతృప్తి జిడ్డులా కారుతూనే వుంటుంది. మరికొందరు ప్రసన్నంగా, ఆనందంగా, తృప్తిగా పూలను చూసినంత హాయిగా హాయినిస్తుంటారు. ఇలా ఎందుకు జరుగుతుంది? ఈ ప్రశ్న ఎప్పుడైనా వేసుకున్నారా?

**మీ జీవితం మీ చేతుల్లో ఎంత శాతం వుంది?**

కొందరు కర్మ, అదృష్టం, దురదృష్టం, జాతకం చేతుల్లో తమ జీవితం వుందని భావిస్తారు. కొందరు దేవుని చేతుల్లో వుందని అంతా పైవాడే ఆడిస్తాడని మనం ఈ ప్రపంచ నాటకరంగంలో పాత్రధారులమే తప్ప, సూత్రధారులం కాము అంటారు. అయినా వాళ్లు తృప్తిగానే బతుకుతుంటారు. పిల్లలు కూడా చాలా ఆనందంగా, తృప్తిగా బతుకుతుంటారు. వాళ్ల అవసరాలన్నీ అమ్మా, నాన్న మొదలైనవాళ్లు తీరుస్తుంటారు. అందువల్ల వాళ్లు అన్నీ మరిచి హాయిగా వుంటారు. దేవుళ్ల మీద భారం వేసి బతికేవాళ్లు కూడా పసిపిల్లలంత హాయిగా అన్నీ దేవుడే చూసుకుంటాడని బతుకేస్తుంటారు. వాళ్లంత ఆనందం మరొకరికి వుంటుందా అని అసూయ కలిగేంత హాయిగా వుంటారు. అయితే వాళ్ల జీవితం నూటికి నూరు శాతం ఇతరుల చేతుల్లోనే పెట్టి బతుకుతుంటారు.

## 'బొమ్మరిల్లు' సినిమా హీరో జీవితం ఎవరి చేతుల్లో వుంది?

కొందరి అమ్మా నాన్నలు పిల్లల ఇష్టాయిష్టాలకు భిన్నంగా ప్రవర్తిస్తుంటారు. ఏది చదవాలో, ఏ డ్రస్సు వేసుకోవాలో, ఏ వుద్యోగం చేయాలో, ఎవరిని పెళ్లి చేసుకోవాలో, ఏ కులం పిల్లను చేసుకోవాలో నిర్దేశిస్తుంటారు. ఇలాంటి సందర్భాల్లో మీ జీవితం ఎవరి చేతుల్లో వున్నట్టు? క్రీ.శ.2006 ఆగస్టులో తెలుగులో 'బొమ్మరిల్లు' అనే సినిమా వచ్చింది. ఆ సినిమాలోని హీరోకు అన్ని వసతులను తల్లిదండ్రులే ఏర్పాటుచేస్తారు. అయినా హీరో అసంతృప్తితో మండిపోతుంటాడు. తల్లిదండ్రులంటే కోపం, ద్వేషం పెరిగిపోతుంది.

## మీ జీవితం జైలు జీవితం అని ఎప్పుడనిపిస్తుంది?

బొమ్మరిల్లు సినిమాలో ఏ వుద్యోగం చేయాలో తండ్రే తన కంపెనీలో ఎం.డి. పోస్ట్ ఇచ్చి నిర్ణయిస్తాడు. ఎలాంటి డ్రెస్ వేసుకోవాలో నిర్దేశిస్తాడు. కటింగ్ ఎలా వుండాలో చెప్తాడు. క్యారమ్స్‌లో స్ట్రింగర్ ఎక్కడ పెట్టాలో కూడా ప్రతీక్షణం సవరిస్తుంటాడు. అన్నం ఎలా తినాలో చెప్తుంటాడు. ఎవరితో స్నేహం చేయాలో, ఎవరిని పెళ్లి చేసుకోవాలో బోధిస్తుంటాడు. ఇన్ని సౌకర్యాలు ఏర్పాటుచేస్తే ఆ హీరో ఆ ఇల్లును ఒక జైలుగా, ఆ తల్లిదండ్రులను జైలర్లుగా భావిస్తుంటాడు. ఎందువల్ల? అతనికి జరిగిన లోపం ఏమిటి? అతని ఇష్టప్రకారంగా ఏదీ జరగలేదు. మీ ఇష్టాయిష్టాలకు వ్యతిరేకంగా జీవించాల్సివస్తే అంతకన్నా జైలు జీవితం వేరే ఏముంటుంది? అది కుటుంబమైనా, అది స్నేహమైనా, అది స్కూలైనా మీ ఇష్టాయిష్టాలకు, స్వేచ్ఛకు అవకాశంలేని ఏదైనా జైలే. అప్పుడు మీ జీవితం మీకు జైలు జీవితంలా కనపడుతుంది. స్వంత అభిప్రాయాలు, స్వంత భావాలు, స్వేచ్ఛాభిలాష లేకపోతే జీవితం బ్రాయిలర్ కోళ్లలాగా హాయిగా బతికేయవచ్చు.

కోళ్లఫారాల్లో కోళ్లు, డెయిరీ ఫారాల్లో పశువులు కూడా వేళకు అన్నీ పొందుతూనే వుంటాయి. వారికి 'బొమ్మరిల్లు' సినిమాలోని హీరోకి తేడా ఏమీ లేదు. అయితే హీరో తిరగబడ్డాడు. తాను ఒక పెంపుడు పశువుగా పెంచబడుతున్నానని హీరో అసంతృప్తితో రేగిపోతుంటాడు. ఆ అసంతృప్తిని చెప్పుకునే అవకాశం కూడా తల్లిదండ్రులు ఇవ్వరు. చెప్పుకున్నా మళ్లీ వాదించి వాళ్లదే కరెక్టు, నాదే తప్పు అని ఒప్పుకునేదాకా సుత్తి కొడుతూనే వుంటారు. అందుకని చెప్పడం కూడా మానేస్తాడు. మీలో చాలామంది తల్లిదండ్రులతో, స్నేహితులతో, టీచర్లతో, పెద్దలతో, అధికారులతో, నాయకులతో ఈ సమస్యని ఎదుర్కొనే వుంటారు. మీరు ఎదురుతిరుగకుండా వినయంగా కనపడుతుంటే వాళ్లు సంతోషిస్తుంటారు. కాని వారిపై మీలో అగ్నిపర్వతాలు మసులుతున్నాయని వారికి తెలియదు.

## మీ జీవితం 40 శాతం మీ చేతుల్లోనే వుంటే మీరు ఎంతో గొప్పవాళ్లు

మీరు అభిమానించే వారి అభిప్రాయాలు, దృక్పథాలు కూడా మీ స్నేహితులకన్నా, తల్లిదండ్రులకన్నా, బంధు మిత్రుల కన్నా ఎక్కువ ప్రభావితం చేస్తుంటాయి. అందువల్ల మీ జీవితం మీ చేతుల్లో వుందా? ఇతరుల చేతుల్లో వుందా? మీ చేతుల్లో మీ జీవితం ఎంత శాతం వుంది? మీ జీవితం 40 శాతం మేరకు మీ చేతుల్లోనే వుంటే మీరు చాలా స్వతంత్రంగా స్వేచ్ఛగా బతుకుతున్నట్టే లెక్క. అయితే సాధారణంగా 20 శాతం కూడా మీ జీవితం మీ చేతుల్లో ఉండదు. మీ జీవితం మిగతా 80 శాతం సమాజం చేతుల్లో మీ కుటుంబం, బంధుమిత్రుల చేతుల్లో, మీరున్న స్థల కాలాల చేతుల్లో, సామాజిక



చలన సూత్రాల చేతుల్లో సామాజిక పరిణామాల చేతుల్లో ఉంటుంది.

## మిమ్మల్ని నడిపిస్తున్న శక్తులు – మీకున్న స్వేచ్ఛ ఎంత?

మీ అభిప్రాయాలు, మీ ఇష్టాలు, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అనుకునేవన్నీ మీవేనా? టీవీ చూడకముందు అందులో వచ్చిన యాడ్స్, సరుకులు కొనాలని ఆలోచన మీకు తట్టనేలేదు. ఆ యాడే మీలో ఒక అభిప్రాయాన్ని, ఇష్టాన్ని కలిగింపజేసింది. సినిమా పోస్టరు, సినిమా గురించిన వార్తలు చూడ్డంతో, వినడంతో వాటి పట్ల ఇష్టాయిష్టాలు ఏర్పరచుకుంటున్నారు. ఇవన్నీ మీ స్వంతంగా, స్వేచ్ఛగా ఏర్పాటు చేసుకున్నామని మీరనుకుంటున్నారు. మీకీ అభిప్రాయాలు ఏర్పడాలని వాళ్లు ప్రచారం చేస్తున్నారు. వాళ్ల ప్రచారం వల్ల మీకు అభిప్రాయాలు, ఇష్టాయిష్టాలు ఏర్పడుతున్నాయి. అనగా మిమ్మల్ని, మీ ఆదాయాన్ని ఎలా ఖర్చు చేయాలో నిర్ణయిస్తున్నది వారే. ఇందులో మీకున్న స్వేచ్ఛ దాన్ని కొనుక్కోవడమే. కారు, బైకు, ఫ్రిజ్, కూలర్ లేని బతుకు కూడా ఒక బతుకేనా అనే అసంతృప్తికి కారణం వాళ్లే. వాటిని ఉత్పత్తి చేస్తున్నవాళ్లే. మీలో ఈ కోరికలను, తద్వారా అవి కొనలేని అసంతృప్తిని కలిగిస్తున్నది కూడా వాళ్లే. అందువల్ల మీ జీవితం మీ చేతుల్లో వున్నట్టేనా? మీ ఆదాయం మీ చేతుల్లో ఎలా వున్నట్టు?

## మీరు కొందరి కుట్రలకు బలైపోతున్నారా?

రోజూ పత్రికల్లో, టీవీల్లో వచ్చే వార్తలు, చర్చలు, సీరియల్స్, సంఘటనల ద్వారా మీరు మీ అభిప్రాయాలను ఏర్పాటు చేసుకుంటారు. స్నేహితులు వాదించుకుంటారు. కొట్లాడుకుంటారు. స్నేహాలు దూరమౌతాయి. సీరియల్‌లో లాగా సినిమాలో లాగా బంధుమిత్రులు, కుటుంబ సభ్యులు కుట్రలతో బతక్కపోతే ఎలా అని, అలాంటి కుట్రలు చేస్తున్నారేమోనని, నా భార్య కూడా, నా భర్త కూడా అలాంటి పనులు చేస్తున్నారేమోనని అనుమానాలు రేకెత్తించి అభిప్రాయభేదాలను సృష్టించి అనుబంధాలను విచ్ఛిన్నం చేస్తుంటాయి. దానికి మీరు బలైపోతారు. ఇవన్నీ మీ చేతుల్లో మీ జీవితం లేదని తెలుపుతాయి. పల్లెటూరి ప్రజలు ఏ సినిమా చూడకుండా, ఏ టీవీ చూడకుండా, పత్రికలు చూడకుండా బతుకుతున్నపుడు తన గురించి తాను స్పష్టంగా ఆలోచించుకుంటున్నారు. అలాంటి స్వేచ్ఛ ఈ మీడియా ద్వారా మీరు పోగొట్టుకున్నారా ఆలోచించండి.

మీరు సుఖంగా, ఆనందంగా, తృప్తిగా జీవిస్తున్నారో లేదో తెలుసుకోవడానికి ఈ క్రింది ప్రశ్నలకు జవాబులు చెప్పండి.

1. మీ కుటుంబ సంబంధాలు బాగున్నాయా? తల్లిదండ్రులు, కుటుంబసభ్యుల సంబంధాలు ఎలా వున్నాయి?
2. మీ భార్యతో, భర్తతో బంధాలు ఎలా వున్నాయి?
3. మీ స్నేహాలు బాగున్నాయా?
4. మీ బంధుమిత్ర సంబంధాలు బాగున్నాయా?
5. మీ స్కూలు, కాలేజీ జీవితం ఎలా వుంది?
6. మీ ఉద్యోగం – సహ ఉద్యోగుల్తో సంబంధాలు బాగున్నాయా?
7. మీ పిల్లలతో, తల్లిదండ్రులతో సంబంధాలు బాగున్నాయా?
8. మీ జీవితం, బాగుండడానికి, బాగులేకపోవడానికి కలిసివచ్చిన సిచ్యువేషన్స్

ఏమిటి? - సహకారం ఏమిటి?

9. మీ జీవితం యింకా ఎలా ఉంటే బావుంటుందనుకుంటున్నారు?
10. మీరు ఆనందంగా ఎప్పుడు ఉండగలుగుతున్నారు?
11. 'పనిగంటల' పట్టింపు లేదు- అలసట లేకుండా మీకు ఇష్టమైన పనులు కష్టమైనా చేయగలుగుతున్నారా?
12. మీకు ఆనందం కలిగించే అంశాలు ఏవి?
13. మంచి సినిమా చూసినప్పుడు ఆనందం కలుగుతుందా?
14. మీరు చేసిన వంట - భోంచేసినవారికి నచ్చినప్పుడు ఆనందం కలుగుతుందా?
15. మంచి డ్రెస్సు వేసుకున్నప్పుడు ఆనందం కలుగుతుందా?
16. మీకు బైక్, కారు, ఫర్నిచర్ (ఫ్రిజ్, కూలర్, టీవీ ఆనందాన్నిస్తాయా, అవసరాల్ని తీరుస్తాయా?
17. మీరు ప్రకృతిని ప్రేమిస్తారా? తద్వారా ఆనందం కలుగుతుందా?
18. ఫాలోయర్‌గా ఉండడంలో నామోషీ ఫీలవుతారా? ఆనందంగా వుంటారా?
19. లీడర్‌గా మీరు ఆనందంగా వుంటారా?

ఇప్పుడు ఆనందంగా వుండడానికి ఎన్నో కావాలి. తృప్తిగా, సుఖంగా, ఆనందంగా జీవించడానికి పూర్వం ఇన్ని అవసరాలు, ఇంత హంగామా లేకుండేది. అయినా వాళ్లు తృప్తిగా, ఆనందంగా ఎలా జీవించారు? ఉదా॥కు ఈనాటి పారిశ్రామిక, సాంకేతిక అభివృద్ధి సౌకర్యాలు మానవాళికి అంది 200 ఏళ్లయినా కాలేదు. కాని వేల ఏళ్లుగా వాళ్లు మనలాగే కష్టసుఖాలను, ఆనందాలను అనుభవించారు. అందువల్ల మన పూర్వీకులు పూర్వం ఆనందంగా ఎలా జీవించారో తెలుసుకోవడం అవసరం. అప్పుడు ఆనందం అంటే ఏమిటో, జీవించడం అంటే ఏమిటో కూడా కొంత తెలుస్తుంది.

### మన పూర్వీకులు ఎలా జీవించేవారు?

మన పూర్వీకులు ఎలా జీవించేవారు? వాళ్లు ఈ కింది పనులు చేసుకుంటూ జీవించారు. 1.వేట. 2.వ్యవసాయం. 3.చేపలవేట. 4.కులవృత్తి. 5.పశువుల పెంపకం. 6. వీటిపై యాజమాన్యం - లేదా వీటితో వ్యాపారం. వ్యవసాయంలో ఆనందం పొందేవారు. వేటలో ఆనందం పొందేవారు. వేటను మృగయావినోదం అని పిలిచేవారు.

### గుర్రం, ఎడ్ల కచ్రం సోషల్ స్టేటస్ సింబల్

మన పూర్వీకులు విద్యుత్తు రాకముందు, రైలు, బస్సు లేక ముందు ఎలా జీవించేవారు? ఆనాడు ఎడ్లబండి - ఒక సోషల్ స్టేటస్‌గా వుండేది. సవారి కచ్రం - ఇంకా సోషల్ స్టేటస్ సింబల్‌గా వుండేది. గుర్రం వుంటే చాలా గొప్ప విషయం. మంచి చేనేత బట్టలు, మంచి మాదిగ చెప్పులు, మంచి కత్తి, మంచి తోలుతిత్తి, మంచి నులకమంచం, మంచి సొరకాయబుర్రలో నీళ్లు, మంచి నగలు మొదలైనవి ఆనాటి హోదాకు చిహ్నంగా వుండేవి. గుర్రాల రథం వుంటే ఒక రాజులెక్క

ఇప్పుడు 'కారు', సోషల్ స్టేటస్. బైకు సోషల్ స్టేటస్. అలాగే ఫ్రిజ్, స్వంత



అపార్ట్‌మెంట్ లేదా డీలక్స్ మాడల్ ఇళ్లు, సెల్‌ఫోన్, టెలిఫోన్, కలర్ టి.వి., సోఫాలు, డబుల్‌కాట్ మంచాలు, ఊగే కుర్చీలు మొదలైనవి ఈనాడు హోదా చిహ్నంగా మారిపోయాయి. ఈ మార్పులు ఎవరు తెచ్చారు? ఇప్పుడు ఎడ్లబండి మీద పోతుంటే పరువుతక్కువ అయిపోయింది. ఒకప్పుడు ఒక సైకిల్‌ను రాజులు, ప్రధానమంత్రులు కూడా నడిపారు. ఇప్పుడు సైకిల్ పేదవారి వాహనం అయిపోయింది.

### ముందుకు పోయినవాళ్లు ఎవరు?

పారిశ్రామిక ఉత్పత్తుల వల్ల ఇవాళ సామాజిక అంతస్తు, హోదా చిహ్నాలు మారిపోయాయి. పల్లెల్లో ఉన్నవాళ్లు, వందేళ్ల కింద బతికినట్టే బతుకుతున్నప్పటికీ వాళ్లను వెనకబడిపోయినవాళ్లు అని అంటున్నారు. ఇంట్లో కరెంటు లేకపోతే పేదలు అంటున్నారు. గుడిసెలో వుంటే పేదలు అంటున్నారు. పెంకుటింట్లో వుంటే కూడా పాపం అంటున్నారు. డాబా ఇల్లుంటే ఫర్లేదు, మంచిగా బతుకుతున్నారు అంటున్నారు. సవారి కచ్రం ఎక్కి పోతే ఇప్పుడు నవ్విపోతారు. కత్తి పట్టుకుని గుర్రం ఎక్కి తిరిగితే పిచ్చివాడు అని ఎగాదిగా చూస్తుంటారు. షర్టు లేకుండా పంచె ఒకటే కట్టుకుంటే పూర్తిగా లేనివాడని ఈసడిస్తుంటారు. పాపం వాళ్లు వేల ఏళ్లుగా ఇలాగే బతుకుతున్నారు.

ముందుకు పోయింది పారిశ్రామిక విప్లవం. కాని పల్లెల్లో ఉండేవాళ్లు ఎప్పట్లాగే బతుకుతున్నారు. ఆనందంగానే వుంటున్నారు. కాని వాళ్లు వేల ఏళ్లు వెనుకబడిపోయి జీవిస్తున్నారని ఈ సోకాల్డ్ అభివృద్ధిని అనుభవించేవాళ్లు అంటున్నారు. వాళ్లేమీ వెనకబడలేదు. వీళ్లలాగా కొత్త సరకులను, సౌకర్యాలను సమకూర్చుకోలేదు. సమకూర్చుకున్నవాళ్లు ముందుకు పోయారు. అది వాళ్ల అవసరాలను తీర్చుకోవడమే. వాళ్ల అవసరాలను వాళ్లు తీర్చుకుంటూ అవి లేనివారిని వెనకబడిపోయినవారని అనే హక్కు వారికెవరిచ్చారు? వాళ్లు వెనుకబడిపోయారు అని చెప్పడమే వారిమీద ఆధిక్యతను రుద్ది వారిని అణిచివేయడం.

### ముందుకు పోకముందు అందరూ ఒకేరకంగా

ముందుకు పోయినవాళ్లు లేకముందు అందరూ ఒకేరకంగా బతికారు. ఇన్ని కార్లు వుండేవి కాదు. రాజులు కూడా జొన్న అన్నం, మక్క గట్క, జొన్నరొట్టె, గోధుమరొట్టె, గడ్డి రొట్టె మొదలైనవి తిని బతికారు. అప్పుడు వాళ్లను ఎవరూ వెనుకబడిపోయారని అవమానించలేదు. తక్కువ చూడలేదు. అందువల్ల వారు అణిచివేతకు గురికాలేదు. ఇప్పుడు ఆధునిక అభివృద్ధిని అందుకుంటూ వారిని వెనుకబడిపోయారు, మాలాగా ముందుకు రావాలి అని చెప్పకనే చెప్తున్నారు. అంటే ఏమిటి? ఇప్పుడు ఈ సౌకర్యాలను అందుకుంటున్నవాళ్లే సుఖంగా, సంతోషంగా, ఆనందంగా జీవిస్తున్నారని, అవన్నీ ఉన్నప్పుడే ఆనందంగా ఉండడం సాధ్యమని చెప్పకనే చెప్తున్నారు.

### ఆనందాన్ని హరిస్తున్నది ఎవరు?

పల్లెల్లోని ప్రజల ఆనందాన్ని హరిస్తున్నది ఎవరు? ఈ కొత్త సుఖాలను పొందుతున్నవాళ్లే! మీరు ఆనందంగా లేరని తమ జీవితాన్ని చూపించుకుంటూ వారిలో అశాంతిని, అసంతృప్తిని, కోరికలను రెచ్చగొట్టి వారి ఆనందాలను అణిచివేస్తున్నారు. ఇటు చూస్తే ఈ ఆధునిక సౌకర్యాలతో సుఖం కన్నా ఎక్కువగా టెన్షన్‌కు గురౌతున్నారు.

పట్టణాల్లోని, ప్రజలు సౌకర్యాలు తెచ్చిన కష్టాలవల్ల అనేక రోగాలపాలౌతున్నారు. శారీరక శ్రమ తగ్గిపోయిందని వాకింగ్‌లు, రన్నింగ్‌లు, ఎక్సర్‌సైజులు, యోగాలు, ధ్యానాలు అవసరమని డాక్టర్లు చెప్తున్నారు. మానసిక రోగాలు పెరిగిపోతున్నాయి. మానసిక రోగాలద్వారా అనేక శారీరక రోగాలు పెరుగుతున్నాయి. అయినప్పుడు ఈ అభివృద్ధి నిజమైన ఆనందాన్ని, సంతోషాన్ని ఇచ్చిందా అని పల్లెటూరి ప్రజలు అడుగుతున్నారు.

ఇలా ఆధునిక అభివృద్ధి పల్లెల్లో సుఖంగా, ఆనందంగా బతికేవాళ్లను బతక నీయలేదు. ఇటు పట్టణాల, నగరాలలోని ప్రజలు అవి అందుకొని సుఖాన్ని, ఆనందాన్ని కొనుక్కున్నామనుకున్నారు. కాని దానివెంటే అందుకు తగిన రోగాలు కూడా పెరుగుతూనే వున్నాయి. అయినప్పుడు ఆనందం ఆధునిక అభివృద్ధిలో ఉన్నట్టా? పల్లె జీవితంలో, ప్రకృతిలో వున్నట్టా?

**ఆధునిక ఆనందానికి, సుఖాలకు చెల్లిస్తున్న మూల్యం ఎంత?**

ఇవాళ ఆధునిక అభివృద్ధితో ఆనందంగా వుంటున్నామనుకోవడానికి ఇండియా చెల్లిస్తున్న మూల్యం ఏమిటి? మీ కారు, స్కూటర్ పెట్రోలుకు చెల్లించే డబ్బుతో అరబ్బుదేశాలకు చెల్లిస్తున్నదెంతో మీకు తెలుసా? ఇతర దేశాల నుండి సరుకులు, దిగుమతి కావడానికి వెచ్చిస్తున్న ఖర్చులు దేశ ఆర్థిక వ్యవస్థను కుదిపేస్తున్నది. పూర్వం ఈ దేశం నుండే ప్రపంచంలోని అనేక దేశాలు సంపదను, వృత్తి నిపుణులను దండ యాత్రల ద్వారా తరలించుకుపోయాయి. అంటే ఎప్పుడు మనమే ఇచ్చేవాళ్లుగా ఉన్నాం. ఇప్పుడు తీసుకునేవాళ్లుగా మారిపోయాం. దాంట్లోనే ఆనందం ఉందని భావిస్తున్నాం.

ఆధునిక ఆనందం కోసం దేశంలోని ముడిసరుకులు అమ్ముకోవాల్సి వస్తున్నది. దేశం అప్పులపాలు కావడం వల్ల, అప్పు ఇస్తున్నవాళ్లు పెట్టే షరతులకు తలవంచాల్సి వస్తున్నది. అప్పు ఇచ్చే షావుకారికి ఇష్టమైన పని చేయాల్సివస్తున్నది. ఆధునిక అభివృద్ధి మనను స్వేచ్ఛ, స్వావలంబన నుండి పరాధీనతకు నెట్టివేసింది. పైపెచ్చు ఆనందంగా జీవించే గ్రామీణ జీవితం కూడా హరించుకుపోతున్నది.

**ఆనందం సరుకుల్లో ఉందా?**

ఆనందంగా జీవించడం అంటే కేవలం ఆధునిక అభివృద్ధి అందుకోవడం ఒకటే కాదని, అది మాత్రమే చాలదని స్పష్టమౌతున్నది. ఆధునిక అభివృద్ధి అందుకోలేకపోయిన పల్లె జనం కూడా వీరిని చూసి ఉన్న ఆనందాన్ని కూడా అనుభవించలేకపోతున్నారు. ఇలా ఒకరి సుఖం, ఆనందం ఇద్దరికీ కష్టాన్ని, నష్టాన్ని తెచ్చిపెడుతున్నది. దీన్ని పరిష్కరించు కోవడం ఎలా? పొరుగింట్లో వంటలు ఘుమఘుమలాడితే మనింట్లో ముక్కులు అసంతృప్తితో, అసూయతో రగిలిపోతాయి. ఇలా ఒకరి ఆనందం వల్ల మరొకరికి కష్టం కలుగుతున్నది. కష్టం కలిగినవాళ్లు ఆనందంగా ఉండేవారిని చూసి ఎందుకు మౌనంగా వుంటారు. కనుక వారిని కూడా ఆనందంగా వుండేట్టు చేయాలి.

దీనివల్ల తేలుతున్నదేమిటి? ఆనందం, సుఖం, సౌకర్యాలు, వెనుకబడడం, ముందుబడడం, అభివృద్ధి చెందడం మొదలైనవన్నీ సాపేక్షికాలే. అంటే ఒకదానితో మరొకటి పోల్చుకోవడం ద్వారా ఇవి కలుగుతున్నాయి. ఆనందం, సుఖం ఇలా తనకోసం కాకుండా ఇతరులతో పోల్చుకునేదిగా మారిపోవడంలోనే ఆనందం ఇంకిపోయింది.



**కోరిక ఆసక్తిని రేపుతుంది**

కోరిక ఆసక్తిని రేపుతుంది. ఆసక్తి కోరికని కలిగిస్తుంది. కోరిక ఇష్టాన్ని కలిగిస్తుంది. ఇష్టం కోరికను, ఆసక్తిని కలిగిస్తుంది. వ్యాపార ప్రకటనలు మనిషిలో కోరికను, ఆసక్తిని, ఇష్టాన్ని కలిగిస్తాయి. సిద్ధాంతాలు, సాహిత్యం, కళలు మనిషిలో కోరికను, ఆసక్తిని, ఇష్టాఇష్టాలను, స్పందనలను సృష్టిస్తాయి, పెంచుతాయి. మార్చుతాయి. జీవితాలను మలుపు తిప్పుతాయి.

జాతీయోద్యమంలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల ఆకాంక్ష, సుఖాలను వదులుకొని జీవితాలను త్యాగం చేసేదిగా మలుపు తిప్పింది. స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల కోసం సౌఖ్యవంతమైన జీవితాల కోసం జీవిస్తున్న జీవితాలను వదులుకొని ఉరికంబాలకెక్కారు. తుపాకీలకు బలి అయ్యారు.

కోరుకున్నది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలే. కాని గడిపింది జైలులో. స్వేచ్ఛ కోసం, స్వాతంత్ర్యం కోసం పుట్టిన కోరిక, ఆసక్తి, పట్టుదల, దృక్పథం, జైలును, నిర్బంధాలను సైతం భరించే శక్తిని పెంపొందించుకున్నది.

ఇలా కోరిక, ఆసక్తి, దృక్పథం, పట్టుదల తన లక్ష్యాలను నిర్ణయించుకుంటాయి. లక్ష్యాలకనువుగా కష్టాలను ఎదుర్కొంటాయి. గమ్యంలో గమనంలో ముందుకు సాగుతుంటాయి. ఇలా కోరిక, ఆసక్తి, పట్టుదల, దృక్పథం అవసరాన్ని, అనివార్యతను సృష్టించుకుంటాయి. అది సాధించి తీరాలనే పట్టుదల లక్ష్యాన్ని అనివార్యంగా సాధించేవిగా మార్చుకుంటాయి.

కోరికలను జయిస్తే అనివార్యతలు, అలవాట్లు, వ్యసనాలు అంతమవుతాయి. అదృశ్యమవుతాయి. ఏదైనా కోరుకున్న స్వేచ్ఛ పొందితీరాలనే అనివార్యతకు, అలవాట్లకు దారితీస్తే స్వేచ్ఛ స్థానంలో వ్యసనం చక్రభ్రమణం చేస్తాయి. కోరికలను తన అదుపులో వుంచుకోవడం ఆగిపోతుంది. తనలో పుట్టిన కోరికకు తనలోని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు బలి అవుతాయి. పరాయీకరించబడతాయి.

సాధించబడవలసినవే నీ స్వేచ్ఛను తీసేసుకుంటుంది. నీవు పొందేవాడిగా పొందాల్సినదే ఆధిపత్యంలోకి వస్తుంది. నీ ఏకపక్ష ప్రేయసి ప్రేమ నిన్ను అప్రదానం చేస్తుంది. ప్రేయసిని ప్రదానం చేస్తుంది. ఆమె ప్రదానమవుతుంది. ఆమెను కీర్తిస్తూనో, ఏడుస్తూనో, ఆరాధిస్తూనో ప్రేమగీతాలు, విషాద గీతాలు పాడతాడు. రొమాంటిక్ భావకవిత్వంలో పురుషలు కోల్పోయింది స్వేచ్ఛనే. సినిమాల్లోనూ ఏకపక్ష ప్రేమలో హీరో కోల్పోయేది తన స్వేచ్ఛనే.

తద్వారా సాధించవలసింది, పొందవలసింది అంతిమ లక్ష్యమవుతుంది. దాన్ని సాధించే సాధకుడిగా నీవు మారాల్సివస్తుంది. అప్పుడు స్వేచ్ఛ నీ చేతిలో వుండదు. నీ స్వేచ్ఛను లక్ష్యం, గమ్యం నిర్దేశిస్తుంది, శాసిస్తుంది, నియంత్రిస్తుంది. నీవు కోరుకున్న వస్తువులు, సరుకులు, సౌకర్యాలు, అనుబంధాలు నిన్ను, నీ స్వేచ్ఛను నిర్దేశిస్తాయి, శాసిస్తాయి, నియంత్రిస్తాయి.

లక్ష్యాలు మార్చుకోవచ్చు. గమ్యం మార్చుకోవచ్చు. అలవాట్లు మార్చుకోవచ్చు. వ్యసనాలు మార్చుకోవచ్చు. ఇష్టాఇష్టాల్ని మార్చుకోవచ్చు. నిన్ను నీవు మలచుకోవచ్చు.

రోడ్డు మీద మిఠాయి దుకాణం పిల్లల్లో కోరికలను సృష్టిస్తుంది. బజారులో

వస్తువుల్ని చూస్తే నోరూరుతుంది. షాపుల్లో, ఫంక్షన్స్‌లో రకరకాల చీరలను చూసి మోజు పెరుగుతుంది. కల్లు మిరుమిట్లు గొల్పుతాయి.

ప్రకృతిని,పువ్వులను చూస్తే ఆహ్లాదం వేస్తుంది. అవన్నీ తన సొంతం అయితే బాగుండుననిపిస్తుంది. వాటిని కళ్ళతో, హృదయంతో ఇంద్రియానుభూతితో, ఆస్వాదించే అవకాశం వుంటే చాలు, సొంతం కాకపోయినా ఆనందిస్తారు.

దీని గురించి జిడ్డు కృష్ణమూర్తి ఇలా అంటాడు. "సౌందర్యం అనేది వేరు. అది సుఖం కాదు. సౌందర్యానుభూతి ఒక భవనంలో కాని, ఒక వర్ణ చిత్రంలో కాని, ఒక కవితలో కాని, ఒకరి చేతిలో ఒకరు చేయివేసి వుండటంలో కాని, ఒక పర్వతాన్నో నదినో పరికించి చూడటంలో కాని వుండదు. ఇవి ఎంత సుఖాన్నిచ్చేవయినా కేవలం యింద్రియానుభూతులు మాత్రమే. సౌందర్యం అంటే యిందుకు పూర్తిగా విభిన్నమైనవి."

పండ్లు, తినుబండారాలు తింటే బాగుండనిపిస్తుంది. బట్టలు, జోళ్ళు వేసుకుంటే మంచిగుండనిపిస్తుంది. సైకిళ్ళు, సైకిల్ మోటార్లు, కార్లు, ఫ్రిజ్‌లు, ఫోన్లు సొంతం చేసుకుంటే మంచిగుండనిపిస్తుంది. వాటిని కొనడం కోసం పొదుపు చేస్తావు. చిట్టీలు వేస్తావు. లోన్లు తీస్తావు. వాయిదా పద్ధతులు అడుగుతావు. ఎలాగైతేనేం అవి నీ సొంతమవుతాయి. అవి నీ ఇంట్లోకి వస్తాయి. వాటిని వాడుకుంటావు. ఇలా రకరకాల వస్తువులను తినే, వాడుకొనే తీరు నీ జీవనశైలిని, సంస్కృతిని, స్వేచ్ఛను ప్రభావితం చేస్తుంది, శాసిస్తుంది. దీంతో పాటు ఆధునిక సమాజంలో సౌఖ్యాలకు, ఆనందాలకు నీవు చెల్లిస్తున్న మూల్యం ఎంతో మరింత వివరంగా తర్వాత అధ్యాయంలో చూద్దాం.

### ప్రశ్నలు

1. ఇప్పుడు జీవిస్తున్న మీ జీవితం ఎలా వుంది?
2. మీకు తృప్తి, ఆనందం ఎలా కలుగుతుంది?
3. ఆనందంగా, తృప్తిగా జీవిస్తున్నారో లేదో తెలుసుకోవడానికి ఏమేమి ప్రశ్నించుకోవాలి?
4. అన్ని సౌకర్యాలతో కోళ్లఫారాల్లోని కోళ్ల వంటి జీవితాల్లో కోల్పోతున్నవేమిటి?
5. మన పూర్వీకులు ఎలా జీవించేవారు?
6. కొందరు ముందుకు పోవడాన్ని మిగతావారు వెనుకబడిపోవడంగా చెప్పడం సరైనదేనా?
7. కోరికలు మీ స్వేచ్ఛను ఎలా హరిస్తుందో వివరించండి?
7. ఆధునిక ఆనందానికి సౌఖ్యాలకు మీరు చెల్లిస్తున్న మూల్యం ఎంత? వివరించండి.



# జీవనశైలి, సంస్కృతి ఎలా రూపొందుతుంది?

## కన్స్యూమరిజం అంటే ఏమిటి?

**జీవనశైలిలో కోరికలు నిర్వహించే పాత్ర**

జీవనశైలిని, సంస్కృతిని కోరికలు నిర్ణయిస్తాయి. కోరికలు నీలో పుట్టించ బడతాయి. కొన్ని కోరికలు నీలో కలుగుతాయి. కొన్ని కోరికలు నీవు ఏర్పాటు చేసుకుంటావు. తల్లిదండ్రులు, కుటుంబం, స్నేహితులు సమాజం ద్వారా నీలో కోరికలు పుట్టించబడతాయి. నీవు చక్కని పని నైపుణ్యం పొందాలని విద్య అందుకోవాలని, ఎదగాలని, ఉద్యోగం చేయాలని, ఇంజినీరో, డాక్టరో, కాంట్రాక్టరో, పారిశ్రామికవేత్తో, నాయకులో కావాలని చిన్నప్పట్నించి భాష నేర్పడంతో పాటే నీలో కోరికలు పుట్టించబడతాయి.

**కోరికలు ఎలా పుట్టించబడతాయి?**

సినిమా దర్శకులు, నటులు కలిసి నీలో ఆ సినిమాను చూడాలనే కోరికను పుట్టిస్తారు. మిఠాయి అమ్మేవాళ్ళు దాన్ని తినాలనే కోరికను నీలో పుట్టిస్తారు. గారడి వాళ్ళు డక్కీ, డప్పు వాయించి తోవ వెంట వెళ్ళే నిన్ను ఆపి గారడి చూడాలనే కోరికను పుట్టిస్తారు.

పారిశ్రామికవేత్తలు రకరకాల సరుకులను ఉత్పత్తి చేసి అవి కొనాలనే కోరికను నీలో పుట్టిస్తారు. రకరకాల సబ్బులు, రకరకాల వంటపాత్రలు, రకరకాల బట్టలు, రకరకాల కార్లు, ఫ్రిజ్‌లు, రకరకాల చక్కెర పిట్టలు, రకరకాల డిజైన్లు అనేకం సృష్టిస్తారు. సృష్టించి నీలో అవి కొనాలనే కోరికను పుట్టిస్తారు.

**జీవితంలో ప్రవేశించాక వదులుకోలేని సంస్కృతి**

సైన్స్ నీ జీవనశైలిలో ప్రవేశించాక దాన్ని వదులుకోవడం కష్టం. విద్యుత్తు నీ జీవనశైలిలో భాగమయ్యాక దాన్ని వదులుకోవడం కష్టం. సబ్బు పుట్టి వందేళ్ళు కాలేదు. వాడబట్టి 60 ఏండ్లు కాలేదు. ఇప్పుడు సబ్బును వదులుకోవడం కష్టం. నూనె లేకుండా వంటలు చేసుకొని కాల్చుకొని తిన్న మానవ దశ వుంది. ఇప్పుడు నూనె లేకుండా

కూరలు వండుకోవడం కష్టం. ఇప్పుడు చాలా మందికి ఫోన్లు, సైకిల్ మోటార్లు లేకపోతే చాలా కష్టం. టీవీలు లేకపోయినా చాలా మందికి కష్టం. ఇదే అనివార్యత.

### సైన్సుకు, ఆసక్తికి గల సంబంధం

సైన్సు, సైంటిస్టుల ప్రయోగాలు ఆసక్తి, పట్టుదల నుంచి పుడుతుంది. అది సమాజ పరం అయ్యే విధంగా విస్తరిస్తుంది. రేడియో తరంగాలను మార్కోని కనుగొన్నాక అది ప్రజలకు అందే విధంగా విస్తరించబడింది. టెలిగ్రాఫ్, టెలిఫోన్ తరంగాలు టెన్నిసన్ కనుకొన్నాక అవి అందరికీ అందే విధంగా విస్తరించబడ్డాయి. రైట్స్ సోదరులు కనుక్కొన్న విమానాలు ప్రపంచానికంతటికీ విస్తరించబడ్డాయి. విద్యుత్తు అందరికీ అందడం కోసం దానికి కొలత సిద్ధాంతం తయారు చేశారు. కరెంటు మీటర్లను పుట్టించారు.

### ప్రభుత్వం, సమాజం, పారిశ్రామికవేత్తలు సైన్సు రెగ్యులేట్ చేసే తీరు

ఇలా సమాజం, ప్రభుత్వం, పారిశ్రామికవేత్తలు సైన్సును రెగ్యులేట్ చేస్తారు. విద్యుత్తును వాడుకొనే మీటర్లతో పాటు విద్యుత్తు శాఖను, విద్యుత్తు మంత్రిని ఏర్పర్చుకుంటారు. విద్యుత్తు చట్టాలు ఏర్పడతాయి. ఎవరి పొలం నుంచైనా విద్యుత్తు తీగలు, స్తంభాలు తీసుకుపోయే హక్కు ప్రభుత్వానికి, విద్యుత్తు శాఖకు దఖలు పరుస్తుంది. విద్యుత్తును ఉత్పత్తి చేసే ఇంజినీర్లు, పంపిణీ చేసే ఇంజినీర్లు, బిల్లులు వసూలు చేసే యంత్రాంగం మొదలైన వ్యవస్థలు ఏర్పడతాయి. కోట్లాది వృత్తి ఉద్యోగాలు సృష్టించబడతాయి.

### సైన్సు సృష్టించిన కోట్లాది ఉపాధి అవకాశాలు

బస్సు, రైలు, జీపు, ఆటో, విమానం మొదలైనవి కోట్లాది ఇంజినీర్లను, వృత్తి ఉద్యోగులను సృష్టించాయి. ప్రింటింగ్ ప్రెస్, కంప్యూటర్‌రంగాలు, యంత్ర ఉత్పత్తి రంగాలు, వస్తు ఉత్పత్తి పరిశ్రమలు, కోట్లాది ఇంజినీర్లను, వృత్తి నిపుణులను, ఉద్యోగాలను సృష్టించాయి.

వీటన్నిటిద్వారా మానవుల జీవనశైలి మారింది. సంస్కృతి మారింది. అలవాట్లు మారాయి. ఒకరోజు విద్యుత్తు లేకపోతే ప్రపంచం తలక్రిందులైనంత బాధపడుతుంటారు. ఒకరోజు ఫోన్ల వ్యవస్థ, వార్తా ప్రసారాల వ్యవస్థ, కంప్యూటర్ల వ్యవస్థ ఆగిపోతే ప్రపంచం అతలాకుతలమవుతుంది.

### సైన్సును వ్యాపారంగా మార్చుకునే తీరు

ఇలా ఆసక్తిని నుంచి పుట్టిన సైన్స్ ఆవిష్కరణలు మనిషి జీవితంలో జీవనశైలిలో, సంస్కృతిలో భాగమయ్యాయి. సైన్స్ ఫలితాలు ప్రజలకు అందాయి. సైంటిస్టులు ఎవరో ప్రజలకు తెలియకుండాపోయారు. కానీ వాటిని నియంత్రించే, అందించే రాజకీయ నాయకులు పారిశ్రామికవేత్తలు, ప్రభుత్వ శాఖ ఉద్యోగులు, వ్యాపారులు ప్రాచుర్యంలోకి వచ్చారు. సైన్స్ స్థానంలో బ్రాండ్ నేమ్‌లు ప్రాచుర్యంలోకి వచ్చాయి. బ్రాండ్‌నేముల్లో సైన్స్‌ను, ప్రమాణాలను చూసుకొనే వ్యవస్థను ఏర్పరిచారు.

ట్రేడ్‌మార్క్ బ్రాండ్‌నేమ్‌ల ద్వారా సైన్స్ ఉత్పత్తులు ప్రచారంలోకి వస్తాయి. ప్రచారం నిన్ను ఆకర్షిస్తుంది. నీలో ఆసక్తిని రేపుతుంది. అవసరాన్ని పుట్టిస్తుంది. కొనాల్సిన



అనివార్యతను నీ కోరికగా మారుస్తుంది. అది కొన్నవారికే జీవనశైలి సంస్కృతి అని ప్రచారం చేస్తుంది. గుర్రం ఎక్కిన వాడే దిట్ట. మా సైకిల్ మోటర్ కొన్న వాడే రాజు అని ఊరిస్తుంది. నీలో ఆసక్తి రేగుతుంది.

### నీ కోరికల్ని నెరవేర్చే తీరు, అణచివేసే తీరు

నీవు పిల్లవాడివైతే అమ్మా, నాన్నల్ని కొనిమ్మని హటం చేస్తావు. ఏడుస్తావు. అలుగుతావు. ఉపవాసం వుంటావు. తలుపులు బాదుతావు. ఆటవస్తువులు విసిరికొడతావు. నిన్ను రెండు వేస్తారు. కొనిచ్చేదైతే కొనిస్తారు. పైసలు లేకపోతే మనం లేనివాళ్ళం బిడ్డ నా తాన లేవు అని సముదాయిస్తారు. వినకుంటే కొడతారు. పిల్లలు ఏడిస్తే తల్లులు కూడా ఏడుస్తారు. తరువాత కూడా ఏడిస్తే కొట్టి, తిట్టి కోరికల్ని చిదిమి వేస్తారు.

ఇక తనకు తన తల్లిదండ్రుల పరిమితి తెలుస్తుంది. ఏవి కోరుకోవాలో, ఏవి కోరుకోకూడదో, ఏవి కొనివ్వగలరో, ఏవి దొరుకుతాయో ఏవి దొరకవో వివేచన పెరుగుతుంది. అందని వాటిపట్ల కోరికలు పుట్టకుండానే ఆగిపోతాయి. అటు తర్వాత వాటిని చూసినా ఆసక్తి కలిగినా నోట్లో నీళ్ళు వూరినా రాళ్ళను చూసినంత నిరాసక్తంగా, నిర్వేదంగా మారతారు.

అలా కోరికలు నిలిచిపోతాయి. పైసలు సంపాదించగానే అవి తిరిగి మొలకెత్తుతాయి. పైసలు లేక కొనకపోవడానికి పైసలున్నా కొనకపోవడానికి మధ్య దృష్టి భేదం వుంది. పైసలు లేక కొనకపోవడం ఆర్థిక పరిస్థితి నిర్ణయించిన ఫలితం. పైసలు వున్నాక కొనకపోవడం నీ కోరికలు, ఇష్టాలు నీ అదుపులో వున్న స్థితి.

### కోరికల్ని అదుపు చేయలేకపోతే నిషేధం విధిస్తారు

సారా, మద్యం దుకాణాలని నిషేధించాలని ఆంధ్రప్రదేశ్‌లో స్త్రీలు ఉద్యమించారు. వాటివల్ల తమ సంసారాలు సర్వనాశనం అవుతున్నాయని బాధపడ్డారు. తమ భర్తలు తమను తంతున్నారని తమ పెయినిండా దెబ్బలేనని ఏడ్చారు. నినదించారు. ఉద్యమించారు. కొంతకాలం సారా మద్యాన్ని ప్రభుత్వాలు నిషేధించాయి. వీటిని నిషేధించడం రాజ్యాంగ లక్ష్యం కూడా.

మద్యం సారా దుకాణాలు తాగే ఆసక్తిని, అవసరాన్ని సృష్టిస్తాయి. తాగడాన్ని అలవాటు చేస్తాయి. అనివార్యం చేస్తాయి.

సరుకు లేనప్పుడు దాన్ని కొనలేం వాడలేం. సబ్బులు, టూత్‌పేస్టులు పుట్టనప్పుడు ఇతరత్రా స్నానానికి, ముఖం కడుక్కోవడానికి ఉపయోగించుకున్నాం. సరుకులు లేనప్పుడు కోరుకున్నా అందుకోలేం. సరుకులు వున్నప్పుడే కోరికలు కలుగుతాయి. ఆసక్తి పెరుగుతుంది. అవసరంగా మారుతుంది.

విస్తార్లు వున్నంత కాలం విస్తార్లే వాడాం. ఇప్పుడు కాగితపు విస్తార్లు వచ్చాయి. తాగిపారేసే గ్లాసులు వచ్చాయి. మట్టి పాత్రలు పోయాయి. ప్లాస్టిక్ లేకముందు లేకుండానే గడిపేశాం. విద్యుత్తు లేకముందు అది లేకుండానే గడిపేశాం. లేనివాళ్ళు అవి లేకుండానే గడిపేస్తారు. అవకాశం వున్నవారు వాటిని అవసరంగా భావిస్తారు.

కొంటారు. జీవనశైలిని, సంస్కృతిని మార్చుకుంటారు.

అది మంచికి దారితీయవచ్చు. చెడ్డకు దారితీయవచ్చు. పట్టణ జీవనశైలి, సంస్కృతి చాలా మందికి ఆసక్తిని కలిగించి అవసరం సృష్టించింది. పట్టణాలు పెరిగాయి. పారిశ్రామిక ఉత్పత్తులు, పరిపాలన వికేంద్రీకరణ జరిపితే నగరాల విస్తరణ అంత అవసరమే లేదు. కేంద్రీకరణ పెరిగింది. పట్టణాలు పెరిగాయి. ఇండ్లు, ఇళ్ళ స్థలాల ధరలు పెరిగాయి. రోడ్లు పెరిగాయి. రోడ్ల వెడల్పు కార్యక్రమంలో ఇళ్ళను కూలగొట్టడం కూడా పెరిగింది. విద్యుత్తు వాడకం పెరిగింది. చెత్త పెరిగింది. కాలుష్యం పెరిగింది. నీటి వాడకం పెరిగింది.

## పట్టణాలకు నదులను తరలించిన తీరు

నీళ్ళ కోసం నదులను పట్టణాలకు తరలించారు. విద్యుత్తు కోసం ఇతర ప్రాంతాల నుండి విద్యుత్తును లేదా బొగ్గును తరలించుకుపోయారు. ఆహారం కోసం పంటలు, కూరగాయలు, పాలు, పండ్లు పట్టణాలకు తరలించుకుపోయారు. అందుకు లారీలు, బస్సులు, వ్యాన్లు, రైళ్ళు, ఆటోలు అవసరమయ్యాయి. రాకపోకలు పెరిగాయి. యాక్సిడెంట్లు పెరిగాయి.

## చెత్త ఆహారం-ఖర్చు ఎక్కువ వల్ల పెరిగిన ఆరోగ్య సమస్యలు

స్వచ్ఛమైన ఆహారం స్థానంలో ఫాస్ట్ ఫుడ్స్ వచ్చాయి. ఆహార పదార్థాల్లో కల్తీ పెరిగింది. నీళ్ళతో రోగాలు వచ్చాయి. పోషక విలువల స్థానే ఆహారంలో ఆకర్షణ, రుచి ప్రధానమయ్యాయి. ధర పెరిగిపోయింది. చాక్లెట్లు, బిస్కెట్లతో పిల్లలకు పిప్పిపళ్ళు పెరిగాయి. పళ్ళ డాక్టర్లు పెరిగారు.

పట్టణాల మనిషి ప్రకృతికి దూరం కావడంతో బస్సులు, రైళ్ళు, సైకిల్ మోటార్లతో ప్రయాణం చేయడంతో ఎంత తింటున్నారో అంత నడక, శారీరక కష్టం చేయకపోవడంతో ఒళ్లు పెరిగింది. రోగాలు పెరిగాయి. ఒళ్ళు తగ్గించే ఒబిసిటీ కంట్రోల్ కేంద్రాలు వచ్చాయి. రకరకాల రోగాలు, సూపర్ స్పెషాలిటీ హాస్పటల్లు పెరిగాయి. వాటికోసం ఖర్చు పెరిగింది. ఇలా పట్టణ జీవనశైలి, సంస్కృతి చక్రభ్రమణంలా సాగుతూ వుంది. చివరికి విసిగిపోయి వారికి ప్రకృతిపై ప్రేమ పెరుగుతుంది. కాని ప్రకృతితో పల్లెల్లో ఎన్నో రోజులు ఉండలేకపోతుంటారు. తిరిగి పట్టణం చేరుతుంటారు. ఇలా ఒక ఆసక్తి, అవసరం జీవనశైలిని, సంస్కృతిని ఆలోచనా విధానాన్ని మార్చుతుంది. అది అలవాటుగా, వ్యసనంగా చక్రభ్రమణం సాగుతుంది.

## సైన్స్ పట్టణ జీవితాన్ని అనివార్యం చేస్తుందా?

సైన్స్ పట్టణ జీవితాన్ని ఒక అవసరంగా మార్చుతుంది. సైన్సు ప్రకృతి అంత సత్యం. ప్రకృతి అంతటా వున్నసత్యమే సైన్సు అంటారు. అందువల్ల ప్రకృతి అంతటా, విశ్వమంతటా సైన్సు విస్తరిస్తుంది. ఇలా సైన్సు కేంద్రీకరణను పెంచుతూ విస్తరిస్తుంది.

కేంద్రీకరణ నియంత్రణకు అనువైనది. అందుకని నియంత్రణ కోసం కేంద్రీకరణ పెరుగుతుంది. పట్టణాలు పెరుగుతాయి. చట్టాలు పెరుగుతాయి. ప్రభుత్వ శాఖలు పెరుగుతాయి.



ఎంతగా ఈ కోరికలకు గురి అవుతావో అంతగా చట్టాలకు సైన్సుకు బలిఅవుతుంటావు. లేదా లోబడిపోతావు. ఇలా నీ కోరికలే నీపై నియంత్రణకు దారితీస్తాయి. నీ కోరికలు అదుపు తప్పినప్పుడు నిన్ను చట్టాలు అదుపు చేస్తాయి. పరస్త్రీలను కన్నెత్తి చూడకూడదని చెప్పినా వినకుండా వారి పట్ల ఆసక్తి పెంచుకుంటే ఇష్టం లేని సంభాషణ, సంపర్కం బలత్కారంగా జైలు పాలవుతారు.

మద్యం వల్ల జీవితాలు అదుపు తప్పుతున్నాయని మద్యాన్ని నిషేధిస్తారు.

## కోరికలు మలుపు తిరిగే తీరు

తల్లిదండ్రులు ఆడపిల్లల్ని ఎక్కువ ప్రేమిస్తారు. మగపిల్లలు రోడ్డున పడతారు. ఆడపిల్లలు కూడా తల్లిదండ్రుల్ని ఎక్కువగా ప్రేమిస్తారు. కాని సమాజంలో కట్నాల వ్యవస్థ ఆడపిల్లల పట్ల వుండే చిన్న చూపు ఈ సత్యాన్ని కాదని మగపిల్లలు కావాలని కోరేదిగా కోర్కెను మార్చింది. ఇలా కోరిక మలుపు తిరిగింది.

## ఇండియా వ్యవసాయానికి, అమెరికా వ్యవసాయానికి మధ్య వ్యత్యాసం

ఆక్రమించుకున్న అమెరికాలో రెడ్ ఇండియన్లను చంపి యూరపు దేశస్తులు కోట్లాది ఎకరాల్ని సాగులోకి తెచ్చారు. సైన్సు, యంత్రాలు వాళ్ళు మనుషుల్ని చంపటం వల్ల నీగ్రో బానిస వ్యవస్థ నిషేధించడం వల్ల వారికి మనుషుల కన్నా ఎక్కువ యంత్రాలు అవసరమయ్యాయి. ఇప్పుడు అమెరికాలో వేల ఎకరాలకు ఒకే రైతు యజమాని ఇండియాలో వంద ఎకరాలు వుంటే భూస్వామి అంటారు. అక్కడ వేల ఎకరాలు వుంటాయి. అతని వద్ద యంత్రాలు, యంత్రాలు నడిపే వుద్యోగులు వుంటారు. అక్కడ వ్యవసాయం పరిశ్రమగా మారింది.

ఇండియాలో వ్యవసాయం పరిశ్రమ కాదు. అది మనిషికి బ్రతికేందుకు ఆధారం. అది జీవనశైలికి, సంస్కృతికి ప్రతీక.

## పారిశ్రామిక విప్లవం యూరప్ కోసం ఇండియాను ధ్వంసం చేసిన తీరు

పారిశ్రామిక విప్లవం యూరపు నుండి సరుకుల్ని దింపి అమ్మి ఇండియాలోని కుటీర పరిశ్రమల్ని, చేతివృత్తుల్ని దెబ్బతీసింది, ధ్వంసం చేసింది. బ్రిటిషు వాళ్ళు ఇండియాలోని సరుకులపై పన్నులు పెంచారు. వారు ఉత్పత్తి చేసిన సరుకులపై రాయితీలు, సబ్సిడీలు ఇచ్చారు. దాంతో 1760 నుంచి ఇండియాలోని చేతివృత్తి నిపుణులకు వృత్తులు గిట్టుబాటు కాని దశ మొదలైంది. వాళ్ళు వ్యవసాయం మీదికి, భూమిమీదికి మళ్ళారు. అలా పారిశ్రామిక విప్లవం యూరపు దేశాలకు యంత్రోత్పత్తి విధానాన్ని పెంచి, సుఖాలను, సరుకులను పెంచింది. జీవనశైలిని, సంస్కృతిని మార్చింది. అది ఇండియాలోని ప్రజల జీవనశైలిని, సంస్కృతిని విచ్ఛిన్నం చేసింది. నిరుద్యోగులను చేసింది. వ్యవసాయ కూలీలుగా మార్చింది. వ్యవసాయ భూములపై వత్తిడి పెరిగింది. దాంతో కూలీలు వడిపోయాయి. జీవన ప్రమాణాలు దిగజారిపోయాయి.

పారిశ్రామిక విప్లవం సైన్సు, టెక్నాలజీ యూరపు దేశాల సామ్రాజ్య విస్తరణకు దోహదపడింది. ఎక్కడ సైన్సు టెక్నాలజీ పుట్టిందో అక్కడి వాళ్ళే దానిపై ఆధిపత్యం

సాధిస్తారు. అక్కడ పుట్టిన భావజాలం యొక్క విస్తరణలో కూడా వారి ఆధిపత్యమే కొనసాగుతుంది. వారి జీవనశైలి, సంస్కృతియే, వారి భావజాలమే సైన్సు, టెక్నాలజీలను విస్తరించే క్రమంలో అందరికీ అలవాటు చేయబడతాయి. అందుకనుపుగా అవసరాలు కోరికలు సృష్టించబడతాయి.

**యూరప్ సమాజం ఇండియాలో ప్రజాస్వామిక భావాలను సృష్టించిన తీరు**

రాక్షసులు, దేవతలు కలిసి చేసిన సముద్ర మదనంలో మొదట విషమే వచ్చిందట! ఆ తరువాత అమృతం వచ్చిందట. సైన్సు అభివృద్ధిలో పారిశ్రామిక విప్లవంలో పుట్టిన విషం ఆసియా దేశాలు, పారిశ్రామిక కార్మికులు తాగి శివునిలా గరళ కంఠులయ్యారు. లక్షలాది మంది ఆ విషంతో చచ్చిపోయారు. కాని వాళ్ళే ప్రజాస్వామ్య అమృతాన్ని కూడా పోరాడి సాధించుకున్నారు. యూరపు దేశాల్లోని ప్రజాస్వామ్యంతో పాటు కార్మికులే సామ్యవాద ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోవాలని ఆసక్తిని, ఆలోచనను కలిగించింది.

యూరపు పారిశ్రామిక విప్లవం ఆసియా దేశాలను బానిసత్వంలోకి నెట్టడానికి ఉపయోగపడింది. ప్రజాస్వామ్య విధానాలు మీకు వున్నట్లు మాకు ఎందుకు వుండకూడదు అనే కోరికను కూడా కలిగించింది. ఆర్థిక, రాజకీయ పెత్తనం, బానిసత్వం ప్రశ్నించబడింది. అక్కడి రాజకీయ ప్రజాస్వామ్యం తమకూ కావాలని కోరుకున్నారు. సాధించుకున్నారు. వ్యాపార విస్తరణలో పారిశ్రామిక విప్లవం సాధించిన దానిలో అత్యంత విలువైనది ప్రజాస్వామ్య వ్యవస్థ.

**ఇండియాలో ఉత్పత్తి గురించి రెండు కోణాలు గుర్తుంచుకోవాలి**

ఈ పరిణామాల వల్ల ఇండియాలో ప్రజల జీవనశైలి, సంస్కృతి అభివృద్ధి చెందడానికి రెండు కోణాలను, కర్తవ్యాలను ఏకకాలంలో ముందుకు సాగించే అవసరం ఏర్పడింది. ఒకటి యూరప్ వలసవాదం, పారిశ్రామికోత్పత్తుల వలన ఇండియాలో భూమి మీద పెరిగిన ఒత్తిడిని తగ్గించడం. అందులోంచి వీలైనంత మేరకు ప్రజలను పారిశ్రామిక కార్మికులుగా ప్రభుత్వ ఉద్యోగులుగా నిపుణులుగా ఇతర రంగాలలోకి తిరిగి మళ్ళించడం. రెండు సైన్స్‌ను పారిశ్రామిక విప్లవాన్ని ప్రజలకు ఉపాధి అవకాశాలు పెంచుకోడానికి అనువుగా మలచుకోడం.

**ఆధునిక విద్య అవసరం ఎలా పెరిగింది?**

ప్రజల ఉపాధి అవకాశాలు పెరగడానికి ఆధునిక విద్య అవసరమవుతుంది. ఆధునిక విద్య – ఆధునిక జీవనశైలికి, సంస్కృతికి, ఉపాధి అవకాశాలకు 'గేట్‌వే ఆఫ్ ఇండియా' వంటిది. విద్య అనే గేటు ద్వారానే ఆధునిక అభివృద్ధి మార్గంలో పయనించడం సాధ్యం. ప్రాథమిక విద్య, అక్షరాస్యత లేకుండా ఆధునిక సమాజంలో స్థానం అట్టడుగున వుంటుంది. అయినా డ్రైవరు, క్లీనరు, మెకానిక్, మిల్లు కార్మికులు వంటి నైపుణ్యం గల లక్షలాది ఉద్యోగాల్ని విద్య లేకుండానే సమర్థవంతంగా నిర్వహించారు. నిర్వహిస్తున్నారు. అయినప్పటికీ విద్య అవసరం పెరిగింది.

అందువల్ల ఆధునిక జీవనశైలికి విద్య ఒక అవసరంనుండి అనివార్యం అనేదిగా మారింది. దాంతో స్కూళ్ళ ప్రాధాన్యత పెరిగింది. ఉపాధ్యాయ ఉద్యోగాలు పెరిగాయి.



ప్రభుత్వ విద్యాశాఖలు, జిల్లా పరిషత్తులు, మున్సిపాలిటీలు విద్య అందించడంలో పథకాలు ప్రవేశ పెట్టాయి. పాఠ్య ప్రణాళికలు రూపొందాయి. విద్య ఎలా అందించాలో విద్యార్థుల్లో సృజనను ఎలా పెంపొందించాలో వారి సైకాలజీని అధ్యయనం చేసి వారి మూర్తిమత్వాన్ని ఎలా అభివృద్ధి పరచాలో తెలిపే ఉపాధ్యాయ శిక్షణా కళాశాలలు వెలిశాయి.

**కొన్ని విషయాల్లో శిక్షణ ఎందుకు లేదు?**

అయితే మిశ్రమ ఆర్థిక వ్యవస్థలో కాంట్రాక్టర్‌లుగా, పారిశ్రామికవేత్తలుగా, రాజకీయ నాయకులుగా ఎలా ఎదగాలో శిక్షణ కోర్సులు పెట్టబడలేదు. తద్వారా అవి అందరికీ అందుబాటులో లేకుండా పోయాయి. మేనేజర్లుగా, పరిపాలనా అధికార్లుగా శిక్షణనిచ్చే కోర్సులు, సంస్థలు వెలిశాయి. దాంతో జీవనశైలిలో ఇస్తున్న శిక్షణలన్నీ స్వయం పోషకంగా కాకుండా ఇతరులపై ఆధారపడేవిగా మారాయి.

స్వయం ఉపాధి కల్పన కోసం ఉన్న వృత్తుల్లో చిన్న కోర్సులను ఐ.టి.ఐ., పాలిటెక్నిక్ వంటి వాటి ద్వారా ప్రవేశ పెట్టారు. అవి కూడా స్వయం ఉపాధి కన్నా ఇతరులపై ఆధారపడే స్వభావాన్ని పెంచాయి. పెట్టుబడి అవసరాలను తీర్చే యంత్రాంగం వారికి సహకరించకుండా అవినీతి బంధుప్రీతి, రాజకీయ ప్రీతికి అనుకూలంగా ప్రవర్తించి ప్రజలకు దూరమయ్యాయి.

**భారతీయ కుటీర పరిశ్రమల విశిష్టత ఏమిటి?**

వెనకట కుటీర పరిశ్రమలు, కులవృత్తులు ఇతరుల మీద ఆధారపడకుండా స్వయం పోషకంగా కొనసాగాయి. వాళ్ళే సైంటిస్టులుగా, వృత్తి నిపుణులుగా, కార్మికులుగా, వ్యాపారులుగా, పారిశ్రామిక వేత్తలుగా ఏకకాలంలో అనేక నైపుణ్యాలను సాధించుకున్నారు. అందువల్లే వేల ఏళ్ళుగా భారతదేశంపైకి ఎంత మంది దండయాత్ర చేసినా, ఎంతమంది దోచుకుపోయినా ప్రపంచంలో అన్ని దేశాల కన్నా ఇండియా సంపన్న దేశంగా కొనసాగింది. క్రీ.శ. 1810 వరకు కూడా ఇండియా నుండే ప్రపంచ దేశాలకు సరుకుల ఎగుమతి జరిగేది. దిగుమతులు తక్కువగా వుండేవి. బ్రిటీషు వాళ్ళు వారి సరుకుల అమ్మకాల కోసం ఈ కులవృత్తులన్నిటిని ధ్వంసం చేయడం ద్వారా వారిని పేదరికంలోకి నెట్టివేశారు. లక్షలాది మంది ఆకలితో, కరువులతో చనిపోయారు. వారిని జీవనశైలి అత్యున్నత స్థాయి నుండి రెండు మూడు తరాల్లోనే దిగజారి దీనంగా మారిపోయింది. చివరకు వారి అత్యున్నత జీవనశైలి, సంస్కృతి ప్రపంచానికే సైన్సును, ఉత్పత్తులను అందించిన చరిత్ర తమదని కూడా మరిచిపోయేంతగా దీనస్థితికి మార్చబడ్డారు.

ఇలా ప్రజల జీవనశైలి, సంస్కృతి, రాజకీయ, సామాజిక వ్యవస్థలు, సిద్ధాంతాలు, నిర్ణయాలు మారుతున్నాయి. నేటి సమాజంలోని ఈ క్రమాలను, పరిణామాలను, నిర్ణయాలను తెలుసుకోకుండా జీవించడం గుడ్డెద్దు చేనులో పడ్డట్టుగా వుంటుంది. వెనుకటి ఆలోచనలతో ఆధునిక జీవనశైలిలోకి ప్రవేశించినట్లుగా వుంటుంది. అది జీవితంలో అనేక వైరుధ్యాలను సృష్టిస్తుంది. తిరిగి వెనుకటికి నడిపిస్తుంది.

### సంపద పెరిగినా మారని ఆలోచనల వల్ల నష్టం ఏమిటి?

ఉదాహరణకు అరబ్బు దేశాలకు వేలాది మంది పని వెతుక్కుంటూ వలస వెళుతున్నారు. వారి జీవనశైలి, సంస్కృతి మారుతున్నది. భార్య పిల్లలు ఒకచోట, సంపాదించే మనిషి మరొక చోట. నిత్య జీవిత అనుబంధాలు, అవసరాల్లో పరస్పరం సహకరించుకొనే అవకాశాలు కోల్పోయారు. వెనుకటి ఆలోచనా విధానంలో వుండడం వల్ల చాలా మంది వచ్చిన సంపాదనతో పొలాలు, భూములు కొన్నారు. ఇల్లు కట్టుకొన్నారు. దీంతో తిరిగి వ్యవసాయం వైపు మళ్ళినట్లయింది. పిల్లలేమో చదువుకొని ఉద్యోగాలు చేయాలనుకుంటారు. కాని కొన్నది భూమి. దాంతో పల్లెల్లో భూముల ధరలు పెంచారు.

చైతన్యం పెరిగితే ఆలోచనల్లో, జీవనవిధానంలో, సంస్కృతిలో మార్పు వస్తుంది. పొలాలు కొనే బదులుగా ఒక జనరల్ స్టోరు, ఒక సిటికేబుల్ నెట్‌వర్కు, ఒక సెల్‌ఫోన్ల షాపు, ఒక బస్సు, ఒక లారీ, ఒక వీడియోగ్రాఫ్, ఎస్టీడి బూతు, జిరాక్స్ సెంటర్, మెడికల్ స్టోరు నడుపుతుంటే తద్వారా కలిగే సంబందాలు, చైతన్యం ఆధునిక జీవనశైలికి అనుకూలంగా పిల్లల అభివృద్ధికి అందివచ్చేదిగా వుంటుంది. కార్లు కొని కిరాయికి ఇవ్వవచ్చు. ఇలాంటి వ్యవహారాలను పిల్లలు మరింత అభివృద్ధి పరచుకొని స్వయం ఉపాధి సాధించుకుంటారు.

ఇలా పెట్టుబడిగా మారాల్సిన సంపాదన వ్యవసాయంలో భూమి కొనడానికి మార్చడం వల్ల జరిగిందేమిటి? అతడు విమానాల్లో ఆకాశంలో విహరిస్తాడు. విదేశీ సంస్కృతి తెలుసుకుంటాడు, నేర్చుకుంటాడు. కుటుంబమేమో భూమికి అంటుకుపోతారు. చివరకు కుటుంబం భూమికి, వ్యవసాయానికి పరిమితమయ్యేదిగా జీవనశైలి మారుతుంది. ఒక షాపు పెట్టుకుంటే విదేశం నుంచి వచ్చాక తాను కూడా అందులోనే స్థిరపడవచ్చు. ఇలాంటి ఆలోచనలు చైతన్యం లేకపోవడం వల్ల అరబ్బు దేశాలకు వెళ్లిన వాళ్ళు ఎంతో నష్టపోతున్నారు.

అందువల్ల ఎలా జీవించాలి అనే జీవనశైలి, సంస్కృతిని చైతన్యం, ఆలోచన సామాజిక, రాజకీయ వ్యవస్థలు, సిద్ధాంతాలు నిర్దేశిస్తుంటాయి. నియంత్రిస్తుంటాయి. వాటిని తెలుసుకోవడం అవసరం.

### నీలో కలిగే కోరికలు, ఆశలు ఎవరు పుట్టించినవో తెలుసుకో...

అప్పుడే నీ కోరికలు నీవేనా, నీ ఆశలు నీవేనా, నీ చైతన్యం ఆధునికంగా వుందా? ఎవరి అవసరాలో నీ కోరికలుగా మలచబడుతున్నాయా? ఎవరి ఆలోచనలో నీ ఆలోచనలుగా పుట్టించబడుతున్నాయా? తెలుస్తుంది.

నేడు "కన్సూమరిజం" వినియోగదారీ సంస్కృతి జీవనశైలిగా మారిందని చాలా మంది భావిస్తున్నారు. వినియోగదారీ సంస్కృతి అంటే ఏమిటి?

సరుకును సృష్టించి, అవసరాలను సృష్టించి వాటిపట్ల కోరిక కలిగించి అవి కొనేట్టు వాటిని తీర్చుకొనేట్టు చేయడం కన్సూమరిజం. అలా అనేక వస్తువుల వినియోగం ఒక అలవాటుగా ఒక వ్యసనంగా జీవనశైలిగా, సంస్కృతిగా మారడం, మలచడం కన్సూమరిజం.



### కన్సూమరిజం అంటే ఏమిటి? అది కోరికల్ని ఎలా పుట్టిస్తుంది?

సరుకు తన మార్కెట్‌ను తానే సృష్టించుకుంటుంది. ఇది పారిశ్రామిక, వ్యాపార రంగంలో మొదటి సూత్రం. అంటే అర్థం ఏమిటి? సరుకు మనుషుల్లో కోరికలను రగిలించి కొనుక్కొనేట్టు చేస్తుంది. ఈ శక్తిలేని సరుకు ఉత్పత్తి ఆగిపోయి మార్కెట్ నుంచి అంతర్ధానమవుతుంది. కనుక మార్కెట్‌లో కనిపించే సరుకులన్నీ కోరికల్ని, అవసరాల్ని సృష్టించేవే.

చూసిన తరువాత మనసు ఆగదు. సినిమా, టీవీలోని వినోదం, కాలక్షేపం కూడా అలాంటిదే. మళ్ళీ మళ్ళీ చూడడం అలవాటుగా, వ్యసనంగా మారిపోతుంది. దినపత్రిక రావడం లేటయితే అసహనం పెరుగుతుంది. చూసిన తరువాత మనసు ఆగదు కనుక చూడనీయకూడదని తల్లిదండ్రులు మిఠాయి షాపులకు, ఆటవస్తువుల షాపులకు దూరంగా తమ పిల్లల్ని తీసుకెళుతుంటారు. మద్యపానాన్ని నిషేధించడం కూడా ప్రజలకు అందకుండా దూరం చేయడానికే.

అదుపు చేసుకోలేని స్థాయికి కోరికల్ని సృష్టిస్తే - ఆ వస్తువుల్ని నిషేధించడమే మద్యనిషేధం. సిగరెట్లు బహిరంగ ప్రదేశాల్లో తాగకూడదని, ఆరోగ్యానికి ప్రమాదకరమని హెచ్చరికలు, చట్టాలు చేయడం కూడా కోరికల్ని అదుపు చేయడానికే.

జీవనశైలి, సంస్కృతి ఎలా వుండాలని నిర్ణయించుకుంటారో దాని ప్రకారం వస్తువుల్ని కొనుక్కోవడం ఒక పద్ధతి. ఇది అనుసరణీయమైనది. ఇందుకు జీవితం పట్ల అవసరాల పట్ల ఒక లక్ష్యం, దృక్పథం, ప్రాధాన్యతల లిస్టు అవసరమవుతాయి.

### నీ స్వేచ్ఛను సంపాదనను లాక్కొనే వేశ్య కన్సూమరిజం

కన్సూమరిజంలో కూరుకుపోతే జీవితం నీ చేతిలో వుండదు. నీ సంపాదన నీ చేతిలో వుండదు. ఎన్నో మాయోపాయాలతో, ఆకర్షణలతో నీ చేతిలోని డబ్బు వాళ్ళ చేతిలో పడేదాకా కన్సూమరిజం పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు వెనుకటి వేశ్యాగృహం లాగా ఊడుస్తూనే వుంటారు. వుంచుకున్న వేశ్య నిత్యం అదితే, ఇదితే అని సతాయించినట్లు కన్సూమరిజం ఇది కొను, అదికొను ఆకర్షిస్తుంది. సతాయిస్తుంది.

గోడకు వేసిన సున్నం వేశ్యకు ఇచ్చిన డబ్బు తిరిగి రాదంటారు. కన్సూమరిజం కూడా ఇంతే. కన్సూమరిజంలో కూరుకుపోయి చేసే ఖర్చు డబ్బు తిరిగి రాదు. అది పెట్టుబడిగా మారదు. అది సంపదను సృష్టించదు. అది ఆపదల్లో ఆదుకోదు. రిపేరుకొస్తే కొత్తది కొనమంటుంది.

కన్సూమరిజంలో సృష్టించే వస్తువైవిధ్యం నీ జీవితంలో, నీ ఇంట్లో సంఘర్షణను సృష్టిస్తుంది. కొనాలనే వత్తిడిని సృష్టిస్తుంది. అదనపు సంపాదన, అక్రమ సంపాదన మార్గాలు వెతుకుతావు. ఆ సరుకులు వున్నవారిని చూసి ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌తో బాధపడుతుంటావు. అవి లేనందుకు అవమానం ఫీలవుతుంటావు. అవి అవసరం లేదని ఖచ్చితంగా భావిస్తే ఈ టెన్షన్స్, అవమానం ఫీలింగ్ వుండవు.

### ఇంట్లోనే యుద్ధాలు సృష్టించే కన్సూమరిజం

సరుకుల్లోని వస్తు వైవిధ్యం నీ ఇంట్లో సంఘర్షణను ఎలా సృష్టిస్తుందంటే ఒకరు

లక్స్ సబ్బే కావాలంటారు. మరొకరు లైఫ్‌బాయ్ కావాలంటారు. ఇంకొకరు మోతి సబ్బు కావాలంటారు. పోట్లాడతారు. చివరికి ఎవరి సబ్బులు వాళ్లు తెచ్చుకుంటారు. ఏ టీవీ ఛానల్ పెట్టుకోవాలి, ఏ సినిమాకి వెళ్ళాలి అని ఇంట్లో యుద్ధాలవుతాయి. చివరికి అందరూ కలిసి వెళ్లే జీవనశైలి నశించి ఎవరికి వారుగా సినిమాలకు విడిగా వెళ్ళిపోతారు. ఎవరి టివి వాళ్ళు కొనుక్కొని ఎవరి బెడ్ రూమ్‌లో వాళ్ళు చూస్తుంటారు.

ఇలా ఒక ఇంట్లో అందరూ కలిసి జీవించడం కోసం ఏర్పడిన కుటుంబంలో ఐక్యత విచ్ఛిన్నమవుతుంది. ఒకే ఇంట్లో వుంటూనే ఎవరి ప్రపంచాలు వారివిగా మారతాయి. ఎవరికి వాళ్ళు ఒంటరిగా మారతారు. కంపెనీల సరుకుల కనువుగా మారి ఒకటిగా వుండాల్సిన కుటుంబం ఒకే ఇంట్లో వేరు వేరు మానసిక గదుల్లో జీవిస్తుంటారు. తద్వారా ఒకే ఇంట్లో జీవనశైలి, సంస్కృతి విభిన్నంగా వుంటుంది. చివరకు ఏ కూరలు చేయాలి అనే దానిపై కూడా యుద్ధాలు అవుతుంటాయి.

## రైజింగ్ ఎక్స్‌పెక్టేషన్స్ అంటే ఏమిటి?

సరుకులు సృష్టించే కోరికలను, ప్రభావాన్ని మీడియా ఎఫెక్ట్‌లో వ్యాపార సూత్రాల్లో రైజింగ్ ఎక్స్‌పెక్టేషన్స్ అని పిలుస్తారు.

సినిమా వాళ్ళు, రాజకీయ నాయకులు టీవీల ద్వారా ఇంట్లోకి వచ్చి చెప్పి వెళ్ళిపోతుంటారు. చూసేవాళ్ళు నోరుమూసుకుని చూస్తుంటారు, వింటుంటారు. కానీ ఇంట్లో వాళ్ళు నోరు తెరిస్తే కసురుకుంటారు. ఎవరైనా బంధుమిత్రులు వస్తే విసుక్కుంటారు. దీన్ని కన్సూమరిజం అంటారు.

నీ జీవితానికి ఉపయోగపడే మేరకు వస్తువులు అవసరమే. అదొక కోరికగా, అలవాటుగా, వ్యసనంగా, దృక్పథంగా, జీవనశైలిగా, సంస్కృతిగా మార్చబడి కుటుంబ సంబంధాలను, సామాజిక సంబంధాలను మార్చేవి, విచ్ఛిన్నం చేసేవి కన్సూమరిజం. సంపదను తిరిగి ఉత్పత్తిలోకి కాకుండా కేవలం ఖర్చు చేసే యంత్రంగా మనిషి మారిపోవడం కన్సూమరిజం.

టీవీ చూస్తూ బంధుమిత్రులు వస్తే మాట్లాడ్డానికి ఇష్టపడకపోవడం, విసుక్కోవడం కన్సూమరిజం. ఇదంతా వినోదం పేరిట, ఆనందం పేరిట స్వార్థంగా కనబడుతుంది. పాపం ఈ స్వార్థం వారు పెంచుకొన్నది కాదు. సరుకులు సృష్టించిన ఈ స్వార్థాన్ని వదిలించుకొని ఎదగడం అవసరం.

## డబ్బుతోనే అన్ని సమకూరవు

డబ్బు రాగానే సంస్కృతి మారదు. సంస్కృతి మారడానికి సమయం తీసుకుంటుంది. లాటరీలో కోటి రూపాయలు రాగానే అతను కోటీశ్వరుడు కావచ్చు. కాని అతని జీవనశైలి, సంస్కృతి మారడానికి సమయం తీసుకుంటుంది. ఒకాయన సారా కాంట్రాక్టరుగా ఎదిగి కోట్లు సంపాదించాడు. ఆయన పెద్దగా చదువుకోలేదు. కల్లుగీత కార్మికుడు కోటీశ్వరుడుగా ఎదిగాడు. అతని కుటుంబం సంపదతో తులతూగింది. అయితే అలవాట్లు, సంస్కృతి వెంటనే మారలేదు. మూడంతస్తుల బిల్డింగ్ కట్టుకున్నా పొయ్యిల కట్టెల మీదనే వంట చేశారు. పాత పద్ధతిలోనే వంటలు కొనసాగాయి. చీర కట్టడం, నగలు అన్నీ పాత సంస్కృతినే తెలుపుతాయి. ఆ కుటుంబం



కోటీశ్వరుల కుటుంబంగా సంస్కృతి, జీవనశైలి, మాటతీరు మారడానికి ఒక తరం పట్టింది. అనగా ఒక తరం గడిచిపోయింది. అలవాట్లు, ఆలోచన విధానం మారడానికి సమయం తీసుకుంటుంది. ఇంగ్లాండు ప్రధాని చర్చిల్ సెకండ్ క్లాస్ రైలు భోగీలో ప్రయాణించేవారట. ఆయన్ని అడిగితే నేను రైతు బిడ్డను అన్నాడట. మరి మీ కొడుకు ఫస్ట్‌క్లాసులో ప్రయాణం చేస్తున్నాడు అని అడిగితే వాడు ప్రధానమంత్రి కొడుకు కదా అని అన్నాడట.

ఇలా సంస్కృతి క్రమంగా మారుతుంది. ఇంట్లో పెద్దకొడుకు సంస్కృతికి, చిన్న కొడుకు సంస్కృతికి కూడా వ్యత్యాసం వస్తుంది. పెద్దకొడుకు పేదరికంలో పుట్టి పెరిగితే, చిన్నకొడుకు అన్న సంపాదించిన సంపాదనతో పేదరికం తెలియకుండా పెరిగితే ఇద్దరి సంస్కృతి, జీవనశైలిలో వ్యత్యాసం వుంటుంది.

## నగర సంస్కృతి, పల్లె సంస్కృతి మధ్య వ్యత్యాసం

నగర సంస్కృతిని హిపోక్రసీ అని మనసు విప్పి మాట్లాడరని, నాగరికం పోతున్నాడని పల్లె వాసులు ఈసడిస్తుంటారు. పల్లె వాసులను నగర వాసులు పల్లెటూరి సంస్కృతి అని ఈసడిస్తుంటారు. పల్లె సంస్కృతిలో ఎవరైనా బంధువులు రాగానే మంచినీళ్ళు ఇస్తారు. వెనకట కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళు ఇచ్చే వారు. కాలినడక, దుమ్ము వల్ల కాళ్ళకు నీళ్లు ఇచ్చే వారు. అటు తరువాత భోంచేయమని అడిగేవారు. తిన్నానని చెప్పినా ఎప్పుడు తిన్నావో ఏమో తిందువు దా అని ఒత్తిడి చేసి భోజనం పెడతారు.

పట్టణాల్లో ఎప్పుడు వచ్చావని అడుగుతారు. అన్నం తిన్నావా అని అడగరు. అడిగితే పెట్టాల్సి వస్తుందని వాటి విషయమే ఎత్తుకోరు. ఏం పని మీద వచ్చావని అడిగి తెలుసుకుంటారు. పట్టణ జీవితం ఇరుకుగా వుంటుంది. పట్టణ ప్రజల మనసులు కూడా ఇరుకుగా వుంటాయి అని పల్లెటూరి వాళ్ళు విమర్శిస్తుంటారు. పట్టణం వాళ్ళకు చుట్టాలు రావడంతో అన్ని పనులు ఆగిపోతాయి. చాలా ఇబ్బంది అయిపోతుంది. లీవులు దొరకవు. పట్టణాలలో వుండే వారికి చుట్టాల తాకిడి కూడా ఎక్కువగా వుంటుంది. ఖర్చు పెరుగుతుంది. అందువల్ల అందరినీ తృప్తి పరచడం అసాధ్యమవుతుంది.

## పల్లెల్లోని ఆహ్లాదం, ఆనందం

పల్లెల్లో ప్రకృతితో సహజీవనం చేస్తుంటారు. చల్లని గాలి, చక్కని వాతావరణం పచ్చని పొలాలు, ఆత్మీయ వాతావరణం, చిన్న జనాభా, అందరి బాగోగులు తెలుసుకొనే చొరవ, తీరుబాటయిన జీవితం వారికి ఎంతో ఆనందాన్ని ఇస్తుంది. ప్రకృతి వనరులు వారికి ఉచితంగా దొరుకుతాయి. అందువల్ల వారికి డబ్బురూపంలో ఖర్చు చాలా తక్కువ. ఉదాహరణకు పట్టణంలో ఫ్యాన్లు, రూముల్లో పగలు కూడా లైట్లు కావాలి. టూత్‌పేస్టులు కావాలి. పల్లెల్లో చల్లని చెట్ల కింద ఉంటారు. ఇంటిముందు, ఇంటివెనుక చెట్లుంటాయి. ఫ్యాన్ల అవసరం పడదు. పగలు లైట్ల అవసరం పడదు. వేపపుల్లలు, ఉత్తరేణి వేళ్ళు పండ్ల పుల్లలుగా వేసుకుంటారు.

నీళ్ళు బావిలో చేదుకుంటారు. నల్లా బిల్లు అవసరం పడదు. కరంటు బిల్లు తగ్గుతుంది. పాచిపోయినవి దాచుకొని తినే ఫ్రిజ్ అవసరం పడదు. కలి అనే నీళ్ళతో పాచిపోకుండా వండుకొనే పద్ధతులు వారికి వచ్చు. ఏడాది కాలం ఆగే తొక్కులు పెట్టుకొనే

పద్ధతులను కనుక్కొన్నారు. అనేక రకాల తొక్కులను వాడతారు. పచ్చి ఆహారాన్ని ఆయా సీజన్లలో తీసుకుంటారు. పచ్చిపెసలు, పచ్చి మక్కంకులు, పచ్చి పల్లికాయ, పచ్చి అనపకాయ, పచ్చి జొన్నలు, పచ్చి కాయలు మొదలైనవి తింటుంటారు. తద్వారా ఎంతో విలువైన పోషకాహారం అందుతుంది. ఆరోగ్యానిక్కూడా పచ్చి ఆహారం చాలా మంచిది. పట్టణంలో ఐదువేల రూపాయలకు ఒక నెల గడిపితే అదే స్థాయి జీవితానికి పల్లెల్లో రెండు వేల రూపాయలు సరిపోతాయి. మిగతా సౌకర్యాలు ప్రకృతి నుంచి, పరస్పర సహకారం నుంచి పొందుతారు. మరికొన్ని అవసరం లేకుండా పోతాయి. ఉదాహరణకు సిటీబస్సు, ఇల్లు కిరాయి ఖర్చులు పల్లెల్లో పెద్దగా అవసరం వుండవు.

## సంస్కృతిలో వున్న దృక్పథాలు

చెప్పులు, బూట్లతో ఇంట్లోకి రావద్దనేది సంస్కృతిలో భాగం. బయట తిరిగి వచ్చిన బాక్టీరియా వైరస్, దుమ్ము, ధూళి ఇంట్లోకి రావద్దనే దృక్పథంలో భాగంగా ఈ సంస్కృతి ఏర్పడింది. విడిచిన బట్టలు వేరేచోట పెట్టాలి అనే సంస్కృతి విడిచిన బట్టలతో వుండే బాక్టీరియాను దూరంగా వుంచడం కోసమే అనే దృక్పథంతో ఏర్పడింది. ఉతికిన బట్టలను చక్కగా మడతపెట్టి దాచాలి అనే సంస్కృతి దుమ్ము పట్టకుండా, పొగ పట్టకుండా వుండే అవసరంలో భాగంగా ఏర్పడింది.

అలాగే సింక్‌లను, టాయిలెట్లను, బాత్‌రూమ్‌లను, బెడ్‌రూమ్‌లను వాడుకోవడంలో కూడా సంస్కృతి వుంటుంది. దొడ్డికి పోయాక చెయ్యిని సబ్బుతో కడుక్కోవాలి. స్నానం చేసేటప్పుడు చాలా మంది చంకలను, గజ్జలను సరిగ్గా కడుక్కోరు. సబ్బు అలాగే వుండిపోతుంది. వాటన్నిటినీ పరిశుభ్రంగా కడుక్కోవాలి. హెయిర్ కటింగ్ ఎప్పటికప్పుడు చక్కగా తీర్చిదిద్దుకోవాలి.

అన్నం తినే పద్ధతిలో అన్నం కలుపుకునే పద్ధతిలో కూడా జీవనశైలి, సంస్కృతి వుంటుంది. వీటిని యూరప్‌లో, అమెరికాలో టేబుల్ మ్యానర్స్ అని అంటారు. టేబుల్ మ్యానర్స్ గురించి పుస్తకాలు వెలువడుతుంటాయి. ఎప్పటి గిన్నెలు అప్పుడే తోమి కడుక్కోవడంలో అంట్ల గిన్నెలకు బాక్టీరియా పట్టకుండా చూసుకోవడం వుంది. ఇది సంస్కృతి రూపంలో కొనసాగుతుంది.

అన్నం తినేటప్పుడు అరచేతికి అంటకుండా తినాలని వేళ్ళ సందుల్లోంచి కారకుండా తినాలని, తినేటప్పుడు నోటి నుండి శబ్దం రాకూడదని అంటుంటారు. అన్నం తినేటప్పుడు మాట్లాడకూడదని, మాట్లాడితే తుంపిరులు, అన్నం ఇతరుల కంచాల్లో పడుతుందని చెపుతుంటారు.

## మర్యాద సంస్కృతి ఎలా వుండాలి?

బంధుమిత్రులు కలిసినప్పుడు, ఇంటికి వచ్చినప్పుడు ఆదరంగా, సాదరంగా, ఆత్మీయంగా పలకరించాలి. కుశల ప్రశ్నలు అడగాలి. ఫోన్లో కూడా కుశల ప్రశ్నలు అడగాలి. కలిసినప్పుడు, ఇంటికి వచ్చినప్పుడు మంచినీళ్ళు, టీ, టిఫిన్, చల్ల వంటి మర్యాదలు చేయాలి. వారి రాక మనకు సంతోషం అని వ్యక్తం చేయాలి. ఇది సామాజిక జీవన శైలిలో ప్రధానమైన సంస్కృతి. అందరినీ సమానంగా గౌరవించాలి. తనకన్నా చిన్నవారితో, తనకన్నా క్రింది వారితో ప్రవర్తించే తీరు వారి సంస్కృతిని తెలుపుతుంది.



ఉదాహరణకు పనిమనుషుల పట్ల ఇంటి యజమానురాలు ప్రవర్తించే తీరు వారి అసలు స్వభావాన్ని తెలుపుతుంది.

ఒకే జీతం వచ్చినా, ఒకే సంస్కృతి అలవడాలని ఏమీ లేదు. కొందరు ఆ జీతం చాలదని, తమ జీవనశైలికి, సంస్కృతికి అనువుగా హెచ్చులకు పోతూ రెండేళ్ళకో ఎకరం అమ్మకుంటూ పదేళ్ళకి మొత్తం కరగదిన్నారు. కొందరు అంతేజీతం వచ్చినా అదంతా ఏం చేసుకోవాలో తెలియక జీవన ప్రమాణాలను, సంస్కృతిని పెంచుకొనే తీరు తెలియక తాగడానికి, పేకాటకు ఖర్చు చేశారు.

## జీవనశైలిలో, సంస్కృతిలో వ్యత్యాసాలు ఎందుకు వస్తాయి?

ఒకే జీతం వచ్చే ఒక ఉపాధ్యాయుడు రోజుకు రెండు లీటర్ల పాలు, ఆరు కిలోల నూనె, అరకిలో నెయ్యి, రోజుకు కిలో రకరకాల కూరగాయలు, పండ్లు మొదలైనవి ఖర్చు చేస్తాడు. అదే జీతం వచ్చే మరొక ఉపాధ్యాయుడు రోజుకు అరలీటరు పాలు నాలుగు కిలోల నూనె రోజుకు పప్పు, కూరగాయలు వాడతాడు. అనగా అతని జీతం పెరిగినట్టుగా జీవనశైలి, సంస్కృతి అభివృద్ధి చెందలేదు. వంట తీరు కూడా మారలేదు. పేదరికంలో వుండే వంట పద్ధతే ఏళ్ళతరబడి కొనసాగింది.

వంట ఎప్పుడు మారే అవకాశం వుంటుంది? ఇతరులు వంట చేస్తున్నప్పుడు చూసే అవకాశం వుంటే, వాళ్ళు వంట చేసే తీరు చెబితే వంట పద్ధతి మారే అవకాశం వుంటుంది. బంధువులంతా అలాగే వుంటే మారే అవకాశం తక్కువ. వంట తీరు తెన్నుల పట్ల శిక్షణ లేకపోవడం వల్ల, స్త్రీలు ఇంటిపట్టునే వుండడం వల్ల ఆయా కులాల వంట తీరులే జీవనశైలి సంస్కృతిలో కొనసాగుతున్నాయి.

కలెక్టరు దగ్గర వుండే అటెండరుకు స్కూల్లో పని చేసే అటెండరుకు జీతం ఒకటే కావచ్చు. కాని కలెక్టరు దగ్గర వుండే అటెండరుకు కలెక్టరుకు వున్నంత జీవనశైలి, సంస్కృతి అలపడుతుంది. అనేక మంది కలెక్టర్లను చూడ్డం వల్ల ఇంకా ఎక్కువ తెలుస్తుంది. పల్లెటూరి స్కూలు అటెండరు అందరికీ నమస్కరించే వినయం, అమాయకత్వం కొనసాగుతూ వుంటుంది. అలాగే పట్టణాల్లో పనిచేసే పని మనిషి సంస్కృతి, జీవనశైలి ఆధునికంగా వుంటుంది. పల్లెల్లోని ధనిక రైతుల స్త్రీలు కూడా దాన్ని అందుకోలేరు. ఇలా వాళ్లు వుండే స్థానాలను అనుసరించి, గడిచి వచ్చిన జీవితాలను అనుసరించి జీవనశైలి, సంస్కృతి కొనసాగుతూ వుంటుంది.

## భారతీయ జీవన విధానం, సంస్కృతి ఎంత గొప్పగా వుండేది?

వెనకట భారతీయ సమాజంలో జీవన విధానం, సంస్కృతి గొప్పగా వుండేదని చరిత్ర చెబుతున్నది. బ్రిటీషు వాళ్ళ రాకతో అది జీవన ప్రమాణాలను తగ్గించిందే గాని, జీవనశైలి, సంస్కృతి ప్రాణప్రదంగా, ఆత్మీయంగా కొనసాగింది. కాని స్వాతంత్ర్యం వచ్చాక రాజకీయ వాదులు ఐ.ఏ.ఎస్ అధికారులు అన్నిట్లో వేలు పెట్టి తలదూర్చి వాటిని తెలిసో తెలియకుండానో నాశనం చేశారు. గ్రామీణ జీవన సంస్కృతిని ప్రత్యామ్నాయం చూపకుండా ఛిద్రం చేశారు. కొందరి మిడిమిడి జ్ఞానం ఈ ధ్వంసానికి ప్రధాన కారణం.

## స్త్రీలకు ఆర్థిక అధికారం ఇస్తే జరిగే మేలేమిటి?

ఆడవాళ్ళ చేతుల్లోకి సంపాదన ఇస్తే పొదుపుగా వాడతారు. వాళ్ళకు ఖర్చులు తెలిసి వస్తాయి. అవగాహన పెరుగుతుంది. కుటుంబాన్ని నడుపుతున్న అత్మవిశ్వాసం పెరుగుతుంది. భర్త అలవాట్లు కంట్రోల్ అవుతాయి. భర్తపై పిల్లల వత్తిడి కరంటు బిల్లుల ఒత్తిడి తగ్గుతాయి. పూర్వం ఆడవాళ్లకే డబ్బును ఇచ్చేవారు. ఆ సంస్కృతి బాగా తగ్గిపోతున్నది.

## సంస్కృతిని చూసి నేర్చుకోవాల్సిందే...

సంస్కృతిని నేర్చుకోవడానికి పుస్తకాలు వుండవు. ఎవరో కూర్చోబెట్టుకొని శిక్షణ ఇవ్వరు. సంస్కృతిని చూసి నేర్చుకోవాలి. ఎంత సంపాదించినా వంట పాతపద్ధతిలోనే సాగడం వల్ల సంస్కృతి వెనకబడిపోతుంది. మంచోడో, కొంచెపోడో మాంసం తినేకాడ తెలుస్తుంది అంటారు. అలాగే పెట్టినతనిది భారీ గుణమో, కొంచెపు గుణమో మాంసం ముక్క సైజును బట్టి, వండిన తీరును బట్టి వారి సంస్కృతి తెలుస్తుందంటారు.

మంచాలు, బట్టలు సర్దే తీరులో కూడా జీవనశైలి, సంస్కృతి వుంటుంది. ఇళ్ళు అందంగా సర్దడంలో కూడా జీవనశైలి వుంటుంది. అలుకు చల్లి ముగ్గులేయడంలో సంస్కృతి, జీవనశైలి వుంటుంది. అందుకే ఇంటి సంస్కారం వాకిలి చెబుతుంటారు. ఇంటిని చూసి ఇల్లాలిని చూడు అంటారు.

జీవనశైలిని బట్టి సంస్కృతి వుంటుంది. సంస్కృతిలో కులం కూడా వుంటుంది. అందువల్ల వారి వృత్తి, హోదా, కులం కొద్ది సేపట్లోనే తెలిసిపోతుంటాయి.

మగవాళ్ళ సంస్కృతి, స్త్రీల సంస్కృతి వేరువేరుగా వుంటుంది. పిల్లల సంస్కృతి వేరుగా వుంటుంది. విద్యార్థుల సంస్కృతి వేరుగా వుంటుంది. యువకుల సంస్కృతి వేరుగా వుంటుంది.

## స్త్రీల ఉదాత్త హృదయం

స్త్రీల జీవనశైలిని అనుసరించి స్త్రీల సంస్కృతి కొనసాగుతుంది. చీరెల సంస్కృతి కొనసాగుతుంది. ప్యాంట్లు తక్కువ. తల్లి తరపు బంధువులు, అత్తగారి బంధువులు రెంటిని గురించి స్త్రీలు ఆలోచిస్తారు. మగవాళ్ళు తమ కుటుంబం గురించే ఆలోచిస్తారు. స్త్రీలు తల్లిగారిల్లు, అత్తగారిల్లు రెండు సంస్కృతుల మధ్య, సంబంధాల మధ్య సమన్వయం సాధిస్తుంటారు.

## సంపాదన సరిపోయాక ఏం చేయాలి?

సంపాదన సరిపోయాక ఏం చేయాలి? సమాజం కోసం పని చేసే అవకాశం ఇప్పుడే ఎక్కువ వుంటుంది. బంధుమిత్రులకు ఎంతైనా సేవ చేయవచ్చు. తనలోని సాహిత్య కళాభిరుచులను, ఆటల అభినివేశాన్ని అభివృద్ధి పర్చుకోవచ్చు. రకరకాల వంట ప్రయోగాలు చేయవచ్చు. అనేక సదస్సులకు హాజరు కావచ్చు. ప్రపంచాన్ని, దర్శనీయ స్థలాలను చుట్టి రావచ్చు. తల్లిదండ్రులకు, స్నేహితులకు అన్ని విధాల ఆర్థిక, హార్థిక చేదోడు వాదోడు అందించవచ్చు. జీవితాన్ని ఇతర రంగాల్లో, తానున్న రంగంలో రెండు రకాలుగా అత్యున్నతంగా ఎదిగించుకోవచ్చు. ఇలా జీవితంలో సగటు మనిషి జీవితం



కన్నా ఎక్కువ సంపాదన ఉన్నప్పుడు అన్ని అవసరాలు తీరినప్పుడు తీరిక సమయాన్ని ఉపయోగించడంలో కూడా జీవనశైలి, సంస్కృతి వుంటుంది. ఎదిగే వారికి ఇది చాలా ప్రధానమైన అంశం.

అలాగే సమయాన్ని మంచి హాబీలకు వెచ్చించాలి. చక్కని అభిరుచులను పెంచుకోవాలి. ఒకసారి రైల్లో ఐదుగురు యువకులు ఎదురయ్యారు. వాళ్ళు ఎదురవుతున్న ప్రతిరైల్ ఇంజన్‌ను, డబ్బాలను గురించి కామెంట్ చేస్తున్నారు. ఆసక్తిగా అడిగాను. వాళ్ళు వయస్సులో విద్యార్థుల్లాగే వున్నారు. సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లుగా పని చేస్తున్నారు. 30 వేల జీతం పైబడిన వారే. అందరూ పెళ్లి కాని వారే. రైలు ఇంజన్లు, రైలు డబ్బాలు ఏ మోడల్ ఎప్పుడు తయారయ్యాయో పరిశీలించడమే వారి హాబీ. శనివారం ఆదివారం రెండు రోజుల సెలవుల్లో రైలు ప్రయాణాల ద్వారా ఒక సర్కిల్ పూర్తి చేసి తిరిగి హైదరాబాద్ చేరతారు. ఈ హాబీ వారికి కలగడం నాకు చాలా ఆసక్తి కలిగించింది. ఆనందం కలిగించింది. ఇలా భిన్న భిన్నమైన హాబీలను, ఆసక్తులను ఏర్పర్చుకోవాలి.

సంపాదనలో పొదుపు ముఖ్యమైనది. పొదుపును పెట్టుబడిగా మార్చాలి. డబ్బు తిరిగి డబ్బును సృష్టించే విధంగా ప్లాన్ చేసుకోవాలి. డబ్బు కేవలం ఆర్థిక విషయం కాదు. కల్లూరి భాస్కరం అన్నట్లు డబ్బు స్వేచ్ఛకు మరో రూపం కూడా. డబ్బు లేని నిర్ధనులకు స్వేచ్ఛ కూడా కరువే.

## జీనవశైలి, సంస్కృతి అంటే ఏమిటి? నేటి జీవితం ఎలా వుంది?

పొట్ట బట్టనీడ జీవనశైలికి కనీస అవసరాలు. అవి తీరే క్రమం, తీర్చుకొనే క్రమమే జీవనశైలి, సంస్కృతి.

కోరికలే గుర్రాలైతే మనిషే గుర్రమై పరుగెడుతుంటాడు. ఎందుకు పరుగెడుతున్నారో తెలియకుండా పరుగెడుతునే వుంటారు. ఎందుకు జీవిస్తున్నారో తెలియకుండా జీవిస్తూనే వుంటారు. వేగంగా వెళుతునే వుంటారు. ఇదే కన్స్యూమరిజం.

కోరికల్ని అదుపులో వుంచుకోవడం అవసరం. జీవితం పట్ల సామాజిక వ్యవస్థల పట్ల, దృక్పథాల పట్ల, భావాల పట్ల అవగాహన పెంచుకోవడం అవసరం. ఇది చేయకపోతే ఏ శక్తులు నిన్ను ఆడిస్తున్నాయో ఆ దారాలు నీకు కనపడవు. తోలుబొమ్మలాటలో తోలుబొమ్మలా ఆడడమే నీ వంతు అవుతుంది. సామాజిక అధ్యయనం వల్ల నిన్ను నీవు తెలుసుకుంటావు నిన్ను ఆడించే శక్తులను కూడా తెలుసుకుంటావు. వాటి నుంచి విముక్తి కావడం గురించి స్వేచ్ఛ పొందడం గురించి నీ శక్తులను కూడగట్టుకుంటావు.

## ఈ గ్రంథం అధ్యయనం ఎందుకు అవసరం?

తద్వారా జీవనశైలిలో, సంస్కృతిలో జీవిత లక్ష్యాల్లో మార్పు వస్తుంది. అది నీకు, సమాజానికి కూడా ఉపయోగపడాలి. ఈ రెండు ప్రయోజనాలు ఏకకాలంలో సాధించడం ఈనాటి అవసరం. అదే జీవనశైలి, సంస్కృతిని ఎదిగిస్తుంది. అందుకని "జీవితమంటే ఏమిటి" అనే ప్రశ్న విస్తారమైనదని సామాజిక దృక్పథాలు, జీవనశైలి, సంస్కృతి మార్గదర్శనం కోసం ఏర్పడ్డాయని ఈ గ్రంథంలో తర్వాతి అధ్యాయాల్లో పరిచయం

చేయడం జరిగింది.

అవి జీవితంలోని అనేక అంశాలను, కోణాలని పరిచయం చేస్తాయి. పరిశీలిస్తాయి. ప్రశ్నిస్తాయి. స్పష్టత కల్గిస్తాయి. ఇందులోని విషయాల్లో అనేక కోణాలు, వ్యాఖ్యానాలు వున్నాయి. నచ్చని వాటిని వదిలి నచ్చిన వాటిని స్వీకరించడం అవసరం. అవసరం లేని వాటిని గురించి బేరం చేయడం సమయం వృధా. అందుకని వదిలెయండి. అవసరమైన వాటిలో కొన్నిటినే చర్చించడం అవసరమనిపించింది.

### ప్రశ్నలు

1. జీవనశైలి సంస్కృతిలో పారిశ్రామిక విప్లవం నిర్వహించిన పాత్ర ఏమిటి?
2. ఆధునిక సమాజంలో కోరికలు ఎలా పుట్టించబడతాయి?
3. కన్స్యూమరిజం అంటే ఏమిటి?
4. జీవనశైలి, సంస్కృతి అంటే ఏమిటి?
5. గ్రామీణ, పట్టణ జీవనశైలి, సంస్కృతికి మధ్య వ్యత్యాసాలేమిటి?
6. అలవాట్లు ఎలా రూపొందుతాయి?
7. నిత్యజీవితంలో సంస్కృతి మర్యాదలు, మాటతీరు ఎలా వుండాలో మీకు తెలిసినవి వివరంగా రాయండి.
8. సరుకుల మాయలో పడిపోతే ఏం జరుగుతుంది?
9. సంపాదన సరిపోయాక జీవనశైలి, సంస్కృతి ఎలా వుండాలి? మీరు ఎలా వుండాలనుకుంటున్నారో వివరించండి.



# స్నేహం అంటే ఏమిటి?

స్నేహం అంటే ఏమిటి? మీ స్నేహాలు బాగున్నాయా? స్నేహితుల్లో మీరు గమనించిన ఆత్మీయత, అనుబంధం, ప్రేమ, ఇష్టం ఎలాంటిదో గమనించి మీ హృదయంలో పదిలపరుచుకున్నారా? మీ తప్పుల్ని, మీ చెడుల్ని క్షమించే స్వభావం మీ స్నేహితుల్లో, మీ స్నేహాన్ని కొనసాగించడంలో ఉపయోగపడుతున్నదో పరిశీలించుకున్నారా? మీ కోసం తన విలువైన సమయాన్ని, కాలాన్ని అన్ని పనులు వదిలేసి మీకు కేటాయించడం ఎలా జరుగుతున్నదో గమనించారా? ఇవేవీ గమనించకపోతే మీ స్నేహితులు మీతో స్నేహం పట్ల ఎంత మూల్యం చెల్లిస్తున్నారో మీకు ఎలా తెలుస్తుంది? మీ స్నేహం ఎంత గొప్పదో, ఎంత విలువైనదో ఎలా తెలుస్తుంది?

**స్నేహాలు ఎన్ని రకాలు?**

ప్రతి మనిషికి స్నేహితులుంటారు. మంచి స్నేహితులు, చెడ్డ స్నేహితులు, పరిచయ స్నేహితులు, గొప్ప స్నేహితులు, ప్రాణ స్నేహితులు, బజారు స్నేహాలు మొదలైన స్థాయిల్లో స్నేహాలు కొనసాగుతుంటాయి. ఇన్ని రకాల స్నేహాలు అవసరమే. బుద్ధుడు ప్రజ్ఞా, కరుణ, స్వేచ్ఛ, సమానత్వంతో పాటు మైత్రిని ప్రధానంగా చెప్పాడు. ఈ నాలుగు జీవితానికి ముఖ్యమన్నాడు.

స్నేహం అంటే ఏమిటో మీకు తెలుసు. తెలియకపోతే చెప్పినా అర్థం అవుతుందా? హృదయమున్న మనిషి స్నేహాన్ని, స్నేహితులను కోరుకుంటారు. మనిషి సంఘజీవి అనడంలోనే సమూహికంగా కలిసి జీవించడంలో కట్టిపడేసే బంధనాల్లో స్నేహం ఒకటి. ప్రేమను నిర్వచించడం ఎంత కష్టమో స్నేహం నిర్వచించడం అంతే కష్టం. అమ్మను మాత్రం నిర్వచించడం సాధ్యమా? నిర్వచనాలకు లొంగని దిగంతాల ఎల్లలు లేని ఆకాశం అమ్మ, స్నేహం, ప్రేమ, కరుణ మొదలైనవి. ఇవన్నీ ఒక రకంగా పర్యాయపదాలు.

**స్నేహం, అమ్మప్రేమ, కరుణ, ప్రేమ పర్యాయపదాలు**

కరుణ, దయ, అమ్మప్రేమ ఏకపక్షమైనవి. ఎదుటివారిని ఏమీ ఆశించకుండా కరుణ, దయ, తల్లిప్రేమ కొనసాగుతాయి. స్నేహంలో ఇరుపక్షాలు సమానంగా స్పందించడం కలిసిపోవడం ఉంటాయి.

## స్నేహాలు ఎప్పుడు మొదలవుతాయి?

స్నేహాలు రెండేళ్ల పసివయసు నుండి మొదలవుతాయి. స్కూళ్ళో చేరేసరికి కొన్ని స్నేహాలవుతాయి. స్కూళ్ళో చేరినతర్వాత స్నేహాలు పెరుగుతాయి.

చిన్ననాటి స్నేహాలు జీవిత దశలను, వ్యక్తిత్వాలను, లక్ష్యాలను నిర్దేశిస్తాయి. చెడ్డీ లేని స్నేహాలు, చెడ్డీ స్నేహాలు, స్కూళ్ళో నిక్కరు స్థాయి స్నేహాలు, గౌనుస్థాయి స్నేహాలు, జీవితంలో మొదటిదశ స్నేహాలు. ఇవి అన్ని ఒడిదుడుకుల్లో జీవితాంతం కొనసాగే స్నేహాలు. ఎన్ని ఆర్థిక, సాంఘిక హోదాలు మారినా చిన్ననాటి స్నేహాల మధ్య ఒక ఆత్మీయత ఉంటుంది, ఉండాలి. కొనసాగించాలి. హోదాలను అనుసరించి చిన్ననాటి స్నేహాలను వదులుకునేవాళ్ళు కూడా కొందరు ఉంటారు. ఇలాంటివారికి నిజమైన స్నేహితులు జీవితాంతం దొరకడం, కొనసాగడం కష్టం.

## బంధుత్వాల్లో ఉండే స్నేహం, బాంధవ్యం ఏమిటి?

బంధుత్వాలు స్నేహంకోసమే మొదలై బాధ్యతలకింద మారి కొనసాగుతుంటాయి. కులం కూడా స్నేహం బంధుత్వ బాధ్యతల కోసమే మొదలై స్థిరపడింది.

## స్నేహాలు ఎలా ఏర్పడుతాయి?

స్నేహాలు మొదట పరిచయంతో ప్రారంభమవుతాయి. పరిచయం లేకుండా స్నేహాలు ఏర్పడ్డం కూడా జరగవచ్చు. వాటిని కలం స్నేహాలు, చాటింగ్ స్నేహాలు అని పిలువవచ్చు. ఒకరి గురించి పరిచయం లేకుండానే అభిమానం పెంచుకోవచ్చు. రచయితల పట్ల, కళాకారుల పట్ల, నటుల పట్ల, నాయకుల పట్ల, క్రీడాకారుల పట్ల, పెద్దవాళ్ల పట్ల వారి పరిచయం లేకుండానే ఎంతో అభిమానం, ప్రేమ, స్నేహం కలుగుతుంది. వారిని కలిసాక అది సజీవమవుతుంది. కలువకపోయినా అది అభిమానంగా కొనసాగుతూనే వుంటుంది. వారి జీవితాలు వారు అభిమానించే వారి మాటల వల్ల, చేతల వల్ల, స్ఫూర్తి వల్ల ప్రభావితమౌతూనే వుంటాయి.

## ఒక మంచి పుస్తకం, ఒక మంచి స్నేహితుడు

ఒకేరకంగా ఆలోచించేవాళ్లు, ఒకేరకం పనిచేసేవాళ్లు ఒకే వయసువాళ్లు స్నేహంలో దగ్గరౌతూ ఉంటారు. అటుతర్వాత అభిప్రాయాలు మారినా, చేసే పనులు మారినా, ఊళ్లు దూరమైనా ఎవరి పెళ్లిళ్లు వారు చేసుకున్నా, ఎవరి సంపద వారిదైనా వారి స్నేహం నిరంతరంగా రోజూ పచ్చగా వికసించే వృక్షంలా ఎదుగుతూనే ఉంటుంది. శ్యాగ పారుతూనే ఉంటుంది. గట్టిపడుతూనే ఉంటుంది. స్నేహం, ప్రేమ నిరంతరం కొత్తగా చివురిస్తూనే ఉంటుంది. మంచి పుస్తకం ఒక మంచి స్నేహితుడు. ఉత్తమ గ్రంథాలు, ఉత్తమ స్నేహితులు. మంచి పుస్తకాల స్నేహం చేయాలి.

## సమాజాల మధ్య, సభ్యుల మధ్య స్నేహాలు

ఐక్యరాజ్య సమితి ప్రపంచ దేశాల మధ్య స్నేహవారధికి చరిత్రలో ఒక గొప్ప కేంద్రంగా ఎదిగింది. పూర్వం చరిత్రలో స్నేహం కులం, మతం, ప్రాంతం, తెగ, రాజ్యం, భాష మొ॥ రూపాల్లో కొనసాగేవి. బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం, బహాయీతత్వం, ధ్యానం, యోగం చరిత్రలో మనిషిని మనిషి స్నేహపూరితంగా కరుణార్ద్రంగా



ప్రేమించడాన్ని ప్రతిపాదించాయి. అవి తమతో విభేదించే మతాలకు, కులాలకు కూడా ఆ ప్రేమను, స్నేహాన్ని, కరుణను అందించినప్పుడు అపోహాలు, ద్వేషాలు తొలగిపోతాయి.

## స్నేహం ఒక మాధుర్యం

స్నేహం ఒక మాధుర్యం. స్నేహం ఒక మానవత్వం. స్నేహం ఒక ప్రపంచ నిర్మాత.

స్నేహం విశ్వాన్ని ఒక కుటుంబంగా మార్చి సన్నిహితం చేస్తుంది. స్నేహాలు ఎన్నో రకాలు. వాటన్నిటి అంతస్సారం ఒకటే. స్థలకాల పనిసంబంధాల ననుసరించి వాటికి గుర్తుకోసం ఈ పేర్లు ఉంచబడ్డాయి.

## స్నేహాల్లో వైవిధ్యం

ఇంటిదగ్గరి స్నేహాలు, ఊరు వాడ స్నేహాలు, క్లాస్‌మేట్ స్నేహాలు, ఆటపాటల స్నేహాలు, పనికాడి స్నేహాలు, అభిరుచి స్నేహాలు, సినిమా టి.వి. స్నేహాలు, కలం స్నేహాలు, ఉద్యోగాలవల్ల స్నేహాలు, స్టాఫ్ స్నేహాలు, వ్యాపార స్నేహాలు, డాక్టర్ల స్నేహాలు, రాజకీయాల స్నేహాలు, విద్యార్థి యువజన సంఘాల స్నేహాలు, ఉపాధ్యాయ సంఘాల స్నేహాలు, కార్మిక సంఘాల్లో స్నేహాలు, బాటసాగే బాటసారుల స్నేహాలు, బస్సుల్లో రైళ్ళో విమానాల్లో కలిసే స్నేహాలు,

## మళ్లీ కలువకపోయినా మిగిలే జ్ఞాపకాల స్నేహాలు

మళ్లీ కలవకపోయినా కొన్ని జ్ఞాపకాలు జీవితాంతం వెంటాడుతునే ఉంటాయి. బాటసారి స్నేహాలు ఇలాంటివే. కాలినడక బాటలో, రైలు, బస్సు, విమాన ప్రయాణంలో సభల్లో, సమావేశాల్లో కలిసిన స్నేహాలు మళ్లీ కలువకపోయినా వారి జ్ఞాపకాలు జీవితాంతం కొనసాగుతూనే వుంటాయి. మళ్లీ కలిస్తే కొత్త చిగురు వేస్తాయి. ఆ యా సంస్థల్లో కలిసి పనిచేసిన వీడిపోయినా వాళ్ళ స్నేహాల జ్ఞాపకాలు కొనసాగుతునే ఉంటాయి. కలిసున్న స్నేహాలు దూరమై పోయిన తరువాత విడదీయలేము. అవి వారి వ్యక్తిత్వంలో భాగమైఉంటాయి.

## స్నేహాన్ని వ్యక్తం చేయాలి

స్నేహాన్ని వ్యక్తం చేయాలి. [illegible]ం కేవలం భావాలకు, హావభావాలకు, మాటలకు సంబంధించినది కాదు. అది హృద[illegible]కి, ఆచరణకు, వ్యక్తీకరణకు, ప్రవర్తనకు, స్వభానికి సంబంధించినది. స్నేహం చేయ[illegible]ంతోపాటు గాఢంగా స్నేహం చేస్తున్న విషయం విభిన్న సందర్భాలను అనుసరించి స్పష్టం కావాలి. ఉదా॥కు ఎన్నో అర్జెంటు పనులు ఉన్నా వాటిని వదిలి స్నేహితునికోసం సహకరించడం స్నేహాన్ని వ్యక్తం చేస్తుంది. అర్జంటు పనులు వదులుకున్న విషయం కూడా సున్నితంగా ఎదుటి వారికి తెలియాలి. అప్పుడు తనకు సాయంకన్నా ఆ అర్జంటు పనే ముఖ్యమైనదైతే స్నేహంగా తిరిగి ఆ పనే చేయమని చెప్పవచ్చు.

## స్నేహితుల ఎంపిక

స్నేహం చేయడంలో ఎంపిక ముఖ్యమైనది. ఎలాంటి స్నేహితులను ఎన్నుకోవాలో అది మీ చేతుల్లోనే ఉంటుంది. ఇష్టాయిష్టాలు, అభిరుచులు, జీవితలక్ష్యాలు, క్రమశిక్షణ,

కులం మతం పట్ల మీ అభిప్రాయాలు స్నేహితుల ఎంపికలో ప్రధానపాత్ర వహిస్తాయి. కేవలం సినిమాలు చూడ్డం కోసం, షికార్లు కొట్టడం కోసం, ఇతరులను బనాయించడం కోసం చేసే స్నేహాలు నిజంగా స్నేహాలు కావు. అవి కాలక్షేపం కోసం చేసే స్నేహాలే.

నీ స్నేహితులను చూసి నువ్వెవరో అంచనా వేయొచ్చు. స్నేహితులు ఒక వాతావరణంగా, ఒక ప్రకృతిగా మన జీవిత పయనానికి బాటసారులుగా నిరంతరం తోడు నీడగా ఉండే మహోన్నత లక్ష్యం కలిగినవాళ్లు కావాలి. వారిని అలా మార్చుకోవాలి. తాను కూడా అలా మారాలి. అందరూ అలా ఎదగాలి.

పెద్దవారితో స్నేహం చేస్తున్నాను, అనుకోవడం అది నిజంగా స్నేహమేనా? అది గుర్తింపు, తవనలో భాగమవుతుందా? అని ఎప్పటికప్పుడు తనను తాను పరిశీలించుకుంటూ వుండాలి.

**ఆధునిక అభివృద్ధిలో విస్తరిస్తున్న ఇన్‌స్టెంట్ స్నేహాలు**

ఇన్‌స్టెంటు ప్రేమలు, స్నేహాలు ఆధునిక అభివృద్ధి విస్తరిస్తున్నది. స్కూళ్లు, బస్సులు, రైళ్లు, కాలేజీలు, రోడ్లు, హోటళ్లు, సినిమాహాళ్లు, ఉద్యోగ జీవితం ఇన్‌స్టెంట్ స్నేహాలు చేయడానికి గొప్ప భూమికను ఏర్పరిచాయి. పలు సంస్థలు, సంఘాలు, నిర్మాణాలు, కాలేజీలు వెలుస్తున్నాయి. రకరకాల సంఘాలవల్ల, కాలేజీల వల్ల, సినిమాల వల్ల, అలవాట్ల వల్ల, ఆటల వల్ల, పరిచయాలను స్నేహాలుగా అపోహపడే ఇన్‌స్టెంటు స్నేహాలు, ప్రేమలు, ఇన్‌స్టెంట్ జీవిత విధానాలు పెరుగుతున్నాయి. అయితే వీటిలో స్నేహం కన్నా కలిసి జీవించే సహజీవన సంస్కృతి ఎక్కువ. వాటిని వ్యక్తిగత స్నేహాలుగా భ్రమపడకూడదు. కలిసి పనిచేసే క్రమంలో, కలిసి జీవించే క్రమంలో సహజీవన సంస్కృతికి అదనంగా మరింత వ్యక్తిగతంగా కలిసిపోయినప్పుడే వాటిని స్నేహాలుగా అర్థం చేసుకోవడం అవసరం.

**వెనుకటి కన్నా ఇప్పుడు స్నేహం చేసే అవకాశాలు పెరిగాయి**

పూర్వం సొంతంగా ఇల్లు కట్టుకునేవారు. సొంత ఇల్లు కట్టుకోవడంలో ఊరువాడలో ఎన్నో సంబంధాలు, అనుబంధాలు పెరిగేవి. మట్టిపనివాళ్ళు, సుతార్లు, వడ్రంగి, ఇటుకలు తయారుచేసేవాళ్ళు ఇలా ఎందరో ... ఎన్నో అవస్థలు, కష్టాలుండేవి. ఎన్నో సంబంధాలు ఏర్పడేవి. అలా స్నేహాలు, పరిచయాలు అయ్యేవి.

ఇప్పుడు ఇన్‌స్టెంటుగా ఒక అపార్టుమెంటు కొనుక్కోవచ్చు. అలాగే తనకు నచ్చిన సంస్థలో సభ్యుడై ఆ సంస్థ తాలూకు సభ్యులను ఇన్‌స్టెంట్ సభ్యులుగా పొందుతున్నారు. తద్వారా స్నేహం చేయడానికి మునుపెన్నడూ లేనంతగా గొప్ప అవకాశాలు పెరిగాయి. సహజీవనంలో ఉండే సంస్కృతి కన్నా అదనంగా కొనసాగించినప్పుడే అది స్నేహంగా పుష్పిస్తుంది.

రవాణా సాధనాలు మునుపు ఎడ్లబండి గుర్రం మాత్రమే ఉండేవి. ఇప్పుడు స్కూటరు, కార్లు, రైలు, బస్సు మొ॥నవి పెరిగాయి. భావాలను తెలుపుకోవడానికి పూర్వం వేరే సాధనాలు పెద్దగా లేకుండేవి. ఇప్పుడు ఫోన్లు, పత్రికలు మొ॥నవి పెరిగాయి. సైన్సు టెక్నాలజీ అభివృద్ధితో మానవసంబంధాల విస్తృతి వైవిధ్యం పెరిగింది. జనాభా



కూడా పెరిగింది. ప్రజాస్వామ్య వ్యవస్థ స్నేహాన్ని సహజీవనాన్ని జీవనవిధానంగా ప్రవేశపెట్టింది.

**స్నేహంలో ఉండే సేవ, కర్తవ్యాలు, కార్యక్రమాలు ఆనందాన్నిస్తాయి**

ఒక పనిని ఉత్సాహంగా ప్రేమతో కమిట్‌మెంట్‌తో, స్నేహంతో చేసినప్పుడు అది బరువనిపించదు. అది ఇష్టం లేనప్పుడు బరువనిపిస్తుంది. అందువల్ల స్నేహాలు, ప్రేమలు, పరోపకారం జీవితాన్ని, కర్తవ్యాలను ఆనందంగా ఎదిగించు కోవడానికి సహకరిస్తాయి. ఇది గమనించకపోతే ఇన్‌స్టెంటు స్నేహాలు ఇన్‌స్టెంటులాగే నట్లు బోల్టులు విడదీసినట్టు విడిపోవచ్చు. తొలగిపోతాయి. హృదయపూర్వకంగా స్నేహం చేసే స్వభావమే స్నేహాలను నిలుపుతుంది.

**కులాతీతంగా మతాతీతంగా స్నేహాలు**

నిజమైన స్నేహానికి కుల మత ప్రాంత స్త్రీ పురుష భేదాలు, వ్యత్యాసాలు అడ్డు కావు, కాకూడదు. స్నేహాలు బాల బాలికల మధ్య, స్త్రీ పురుషుల మధ్య కూడా కొనసాగు తుంటాయి. నిజానికి వీరి మధ్యే స్నేహాలు ఎక్కువ వుండే అవకాశాలు ఉంటాయి. అయితే, సమాజం కట్టుబాట్లు విధించడంవల్ల వీళ్ల క్రమక్రమంగా దూరం జరుగుతుంటారు. స్త్రీ పురుషుల చిన్ననాటి స్నేహాన్ని పెద్ద పెరిగిన తర్వాత కూడా అపురూపంగా గొప్పగా కొనసాగించాలి.

**స్త్రీ పురుషుల మధ్య స్నేహాలు**

ఇతరులతో పెళ్లి అయినప్పుడు స్త్రీ పురుష స్నేహితులు, సంసారాలు వేరు అయినప్పుడు వారి స్నేహం అపార్థాలకు దారితీయకుండా సున్నితంగా, స్నేహితంగా కొనసాగించాలి. వాళ్లు వాళ్ల కుటుంబాల్ని పరస్పరం ప్రేమించాలి. స్నేహితుడి భార్యతో, స్నేహితురాలి భర్తతో స్నేహాన్ని సమానస్థాయిలో గౌరవించాలి. తద్వారా అపార్థాలు అదృశ్యమవుతాయి.

అబ్బాయి, అమ్మాయి స్నేహాలు ప్రేమకు దారితీయవచ్చు. స్నేహం, ప్రేమ, కరుణ పరస్పర పూరకాలు. మనిషి పట్ల అభిమానం, ఇష్టం ప్రేమ లేకుండా స్నేహం చేయలేము. అలాగే ప్రేమ కూడా.

అబ్బాయి, అమ్మాయి స్నేహాలను ప్రేమగా అపోహపడే అవకాశం ఉంటుంది. ముఖ్యంగా మగపిల్లలు, ఆడపిల్లలు స్నేహంగా మాట్లాడగానే ప్రేమిస్తున్నదనే అపోహకు లోను కావచ్చు. ఆమె ఒక అన్నలా, ఒక స్నేహితునిగా, తనకొక సెక్యూరిటి గార్డులా గౌరవించవచ్చు. ఒక తమ్ముడిలా స్నేహం చేయవచ్చు.

అబ్బాయి, అమ్మాయి స్నేహాలు ఎంతో ఆహ్వానించదగినవి. ఇతరులకు అపోహలు కలుగకుండా ఆ స్నేహాలను కొనసాగించాలి. ఆ స్నేహాలు వారు పెళ్లి అయిన తర్వాత కలిసి జీవించే సంసారానికి సభ్యతకు ఉపకరిస్తాయి.

శరీర ప్రేమ సమస్యలను సృష్టిస్తుంది. హృదయాల ప్రేమ సమస్యలను పరిష్కరిస్తుంది. స్త్రీ పురుషుల స్నేహం పరస్పరం ఆత్మవిశ్వాసాలకు, ధైర్యానికి ఎంతో సహకరిస్తాయి. పరస్పర ప్రోత్సాహం వారిని అద్భుతాలు సాధించేవారిగా ఎదిగిస్తుంది.

### స్నేహాల్లో ఆస్తులు, అంతస్తులు, హోదా, మతం, కులం

స్నేహంలో ఆస్తి, అంతస్తు, కులం, హోదా, మతం కూడా కొనసాగుతుంటాయి. అయితే, పాత స్నేహాలకు ఇవి ఆటంకంగా మారకుండా పాత స్నేహితుల్ని స్నేహితులుగా కాపాడుకోవడంలో గొప్ప స్నేహం ఉంటుంది.

స్నేహాల్లో కొన్ని తారతమ్యాలు ఉంటాయి. ఉపాధ్యాయులు, గురువులు, పెద్దలు గౌరవం కృతజ్ఞత, వాత్సల్యం వీటిల్లో కూడా స్నేహం ప్రేమ వ్యత్యాసాలతో కొనసాగు తుంటాయి.

### అపరిచితులు పరిచితులు అవుతారు, పరిచితులు స్నేహితులు అవుతారు

అపరిచితులు రకరకాల సందర్భాల్లో, సన్నివేశాల్లో పరిచితులౌతారు. పరిచితులు స్నేహితులౌతారు. స్నేహం గాఢ స్నేహంగా మారుతుంది. బంధుత్వంగా కూడా రూపుదిద్దుకుంటుంది.

అలాగే గాఢ స్నేహితులు, ప్రాణ స్నేహితులు స్నేహితులుగా మారుతారు. స్నేహితులు పరిచితులుగా మారుతారు. పరిచితులు అపరిచితులుగా మారుతారు. ఇలా స్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. అపరిచితులు స్నేహితులుగా మారుతుంటారు. స్నేహం మొగ్గలా పుట్టి పువ్వులా వికసిస్తుంది. కాయ అయి, పండై పండిస్తుంది.

అలాగే ప్రతి మొక్క పుట్టి పెరిగి విరిగినట్టుగానే స్నేహం కూడా పుట్టి పెరిగి నశిస్తుంది. శిథిలమౌతుంది. వాటి జ్ఞాపకాలు కూడా శిథిలమౌతాయి. అవి ఆ యా సన్నివేశాలను, సందర్భాలను బట్టి ఉంటాయి. అందువల్ల ప్రాణస్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. స్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. కొందరు స్నేహితులు శత్రువులుగా కూడా మారుతుంటారు. నీ లోగుట్లు బయట పెట్టి నష్టం కలుగజేస్తుంటారు. ఇలాంటి సమయాల్లో నిరాశపడకూడదు. డిప్రెషన్‌కు గురికాకూడదు. మిగతా స్నేహితులతో మరింత ఎక్కువ కలిసి ఉండాలి. కొత్త స్నేహితులను వెతుక్కోవాలి.

### పెద్దలు పిల్లలతో కూడా స్నేహం చేయాలి

పిల్లలతో పెద్దలు. స్నేహం చేయడం పిల్లలకు ఒక గొప్ప ఆత్మవిశ్వాసాన్ని ఇస్తుంది. అందుకే తాతలు, అమ్మమ్మలు, నానమ్మలు మనవలు మనవరాళ్ళతో మమ్మీ డాడీల కన్నా ఎక్కువ స్నేహంగా ఉంటారు.

చాలామంది ఉపాధ్యాయులు, లెక్చరర్లు విద్యార్థుల పట్ల ఎంతో స్నేహంగా ఉంటారు. స్నేహపూరిత సలహాలు ఇస్తుంటారు. వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకుంటారు. అలాంటివారే నిజమైన ఉపాధ్యాయులు.

అయితే విద్యార్థులు పెద్దల స్నేహాన్ని, ప్రేమను గౌరవంగా చూస్తారు. చొరవగా సమానస్థాయిలో స్నేహం చేయడానికి వాళ్ల వయసు ఆత్మవిశ్వాసం చాలదు. ఆ రెంటిమధ్య నుండే అంతరాన్ని పూరించడమే ఉపాధ్యాయులు, పెద్దలు చేసే పని, చేయాల్సిన పని.



### తల్లిదండ్రులు తమ పిల్లలకు స్నేహితులుగా మారాలి

తల్లిదండ్రులు తమ పిల్లలకు ఒక వయసు వచ్చాక స్నేహితులుగా మారాలి: తమ పిల్లలతో స్నేహం చేయాలి. స్నేహం చేయడం ఎలాగో సూచనలు చేయాలి. పిల్లలు ఎవరితో స్నేహాలు చేస్తున్నారో గమనిస్తూ ఉండాలి. అలా అని తమకు నచ్చినవారిని స్నేహం చేయాలని నిర్దేశించకూడదు. కుటుంబం కుటుంబ సంబంధాలు స్నేహపూరితంగా ఉంటే ఆ ఇల్లు ఆదర్శవంతమైన అసమాజానికి పునాది అవుతుంది.

### బదిలీ అయినా స్నేహాలు కొనసాగుతుంటాయి

ఒక ఉపాధ్యాయుడు, ఉద్యోగి ఆ స్కూలు నుండి ఆ ఊళ్ళోంచి బదిలీ అయ్యాక కూడా కొనసాగేది స్నేహాలు. భౌతిక పనిసంబంధాలు, మానవసంబంధాలు, సామాజిక ఆర్థిక సంబంధాలు అవి ఇలా బదిలీ అయిపోయినా, మారిపోయినా ఆ తర్వాత కూడా కొనసాగేవి స్నేహాలు సంస్కృతి అంటారు. కాలక్రమంలో ఇవి కొన్ని ఆగిపోతాయి. కొన్ని కొనసాగుతుంటాయి. మనిషి జీవితం స్నేహాలమయం. స్నేహంలేని జీవితం ఊహించలేనిది. ఏకాంత జీవితం ఆత్మానందానికి పనికొస్తుంది. ఆత్మానందాన్ని కలిసిపంచుకోడానికి కూడా స్నేహాలు అవసరం. కష్టాల్లో, సుఖాల్లో కలిసి నడిచేవారే నిజమైన స్నేహితులు. కష్టాల్లో కలిసి నడిచి సుఖాల్లో వారిని వదిలివేస్తే ఆ స్నేహం అధికారికి, ఉద్యోగికి ఉండే సంబంధం లాంటిదిగా కుదించుకుపోతుంది. ఉదాహరణకు పెళ్లి సంబంధాల వెతుకులాటలో ఎందర్నో సంప్రదిస్తారు. సహకారం తీసుకుంటారు. కాని పెళ్లి కుదిరాక పెళ్లి పత్రికలు పంపి వారిని రమ్మని పిలవడం మరిచిపోతుంటారు. వీళ్లు ఇంకా సంబంధం కుదరలేదేమో అనుకుని సంబంధాల జాడ తీస్తూనే ఉంటారు.

### స్నేహం స్నేహితుల మంచిని, ఉన్నతిని కోరుతుంది

నిజమైన స్నేహం స్నేహితుల మంచిని కోరుతుంది. నిరంతరం వారి ఉన్నతిని కోరుతుంది. వారి ఆత్మీయతను కోరుతుంది. నిజమైన స్నేహం స్నేహితుల బలహీనతల్ని క్షమిస్తుంది. కష్ట సుఖాలు కలిసి పంచుకుంటారు. ఊరట పొందుతారు. కష్టాల్లో, బాధల్లో హృదయం విప్పి చెప్పుకునే స్నేహితులు కనీసం పదిమందైనా ఉంటే ఆ జీవితం తప్పకుండా గట్టున పడుతుంది. తిరిగి ఆనందమయం అవుతుంది.

స్నేహం పదిలమైనది. సున్నితమైనది. కష్టాల్లో బాధల్లో హృదయం విప్పి చెప్పుకునే స్నేహితులను ఎప్పుడూ కాపాడుకుంటూ ఉండాలి. కష్టాలను బాధలను కలిసి పంచుకునే స్నేహితులు లేని బతుకు దుర్భరం. కష్టాల్లో బాధల్లో కలిసి పంచుకునే నిజమైన స్నేహితులు నలుగురైదుగురు ఉంటే చేనేత కార్మికులు, పవర్‌లూం కార్మికులు, పత్తి రైతులు, అప్పులపాలు అయినవాళ్లు, ఆత్మహత్యలు చేసుకునే మూడ్ అదృశ్యం అవుతుంది. బతుకుపై తిరిగి విశ్వాసం పెరుగుతుంది. జీవితంలో తిరిగి కోలుకుంటారు. ఆత్మహత్యలు ఒక రకంగా వారి జీవితంలోని స్నేహాలు లేకపోవడాన్ని మరీ సున్నిత మనస్తత్వాన్ని తెలుపుతాయి. నిస్సహాయస్థితి ఆత్మహత్యకు పురికొల్పుతుంది. ఆత్మీయత, ఓదార్పు వారిని కాపాడుతుంది.

చిన్ననాటి అరెయ్, తొరెయ్, ఏమే, ఒసే అని పిలుచుకున్న స్నేహాలు జీవితాంతం ఒక ఆహ్లాదాన్నిస్తాయి. వాళ్ళు స్నేహితులకు సూచన చేస్తారు. ఆ పని నీతో కాదు అని

## స్నేహాల్లో ఆస్తులు, అంతస్తులు, హోదా, మతం, కులం

స్నేహంలో ఆస్తి, అంతస్తు, కులం, హోదా, మతం కూడా కొనసాగుతుంటాయి. అయితే, పాత స్నేహాలకు ఇవి ఆటంకంగా మారకుండా పాత స్నేహితుల్ని స్నేహితులుగా కాపాడుకోవడంలో గొప్ప స్నేహం ఉంటుంది.

స్నేహాల్లో కొన్ని తారతమ్యాలు ఉంటాయి. ఉపాధ్యాయులు, గురువులు, పెద్దలు గౌరవం కృతజ్ఞత, వాత్సల్యం వీటిల్లో కూడా స్నేహం ప్రేమ వ్యత్యాసాలతో కొనసాగు తుంటాయి.

## అపరిచితులు పరిచితులు అవుతారు, పరిచితులు స్నేహితులు అవుతారు

అపరిచితులు రకరకాల సందర్భాల్లో, సన్నివేశాల్లో పరిచితులౌతారు. పరిచితులు స్నేహితులౌతారు. స్నేహం గాఢస్నేహంగా మారుతుంది. బంధుత్వంగా కూడా రూపుదిద్దుకుంటుంది.

అలాగే గాఢ స్నేహితులు, ప్రాణ స్నేహితులు స్నేహితులుగా మారుతారు. స్నేహితులు పరిచితులుగా మారుతారు. పరిచితులు అపరిచితులుగా మారుతారు. ఇలా స్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. అపరిచితులు స్నేహితులుగా మారుతుంటారు. స్నేహం మొగ్గలా పుట్టి పువ్వులా వికసిస్తుంది. కాయ అయి, పండై పండిస్తుంది.

అలాగే ప్రతి మొక్క పుట్టి పెరిగి విరిగినట్టుగానే స్నేహం కూడా పుట్టి పెరిగి నశిస్తుంది. శిథిలమౌతుంది. వాటి జ్ఞాపకాలు కూడా శిథిలమౌతాయి. అవి ఆ యా సన్నివేశాలను, సందర్భాలను బట్టి ఉంటాయి. అందువల్ల ప్రాణస్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. స్నేహితులు కూడా అపరిచితులుగా మారుతుంటారు. కొందరు స్నేహితులు శత్రువులుగా కూడా మారుతుంటారు. నీ లోగుట్లు బయట పెట్టి నష్టం కలుగజేస్తుంటారు. ఇలాంటి సమయాల్లో నిరాశపడకూడదు. డిప్రెషన్‌కు గురికాకూడదు. మిగతా స్నేహితులతో మరింత ఎక్కువ కలిసి ఉండాలి. కొత్త స్నేహితులను వెతుక్కోవాలి.

## పెద్దలు పిల్లలతో కూడా స్నేహం చేయాలి

పిల్లలతో పెద్దలు స్నేహం చేయడం పిల్లలకు ఒక గొప్ప ఆత్మవిశ్వాసాన్ని ఇస్తుంది. అందుకే తాతలు, అమ్మమ్మలు, నానమ్మలు మనవలు మనవరాళ్ళతో మమ్మీ డాడీల కన్నా ఎక్కువ స్నేహంగా ఉంటారు.

చాలామంది ఉపాధ్యాయులు, లెక్చరర్లు విద్యార్థుల పట్ల ఎంతో స్నేహంగా ఉంటారు. స్నేహపూరిత సలహాలు ఇస్తుంటారు. వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దుకుంటారు. అలాంటివారే నిజమైన ఉపాధ్యాయులు.

అయితే విద్యార్థులు పెద్దల స్నేహాన్ని, ప్రేమను గౌరవంగా చూస్తారు. చొరవగా సమానస్థాయిలో స్నేహం చేయడానికి వాళ్ల వయసు ఆత్మవిశ్వాసం చాలదు. ఆ రెంటిమధ్య నుండే అంతరాన్ని పూరించడమే ఉపాధ్యాయులు, పెద్దలు చేసే పని, చేయాల్సిన పని.



## తల్లిదండ్రులు తమ పిల్లలకు స్నేహితులుగా మారాలి

తల్లిదండ్రులు తమ పిల్లలకు ఒక వయసు వచ్చాక స్నేహితులుగా మారాలి. తమ పిల్లలతో స్నేహం చేయాలి. స్నేహం చేయడం ఎలాగో సూచనలు చేయాలి. పిల్లలు ఎవరితో స్నేహాలు చేస్తున్నారో గమనిస్తూ ఉండాలి. అలా అని తమకు నచ్చినవారిని స్నేహం చేయాలని నిర్దేశించకూడదు. కుటుంబం కుటుంబ సంబంధాలు స్నేహపూరితంగా ఉంటే ఆ ఇల్లు ఆదర్శవంతమైన అసమాజానికి పునాది అవుతుంది.

## బదిలీ అయినా స్నేహాలు కొనసాగుతుంటాయి

ఒక ఉపాధ్యాయుడు, ఉద్యోగి ఆ స్కూలు నుండి ఆ ఊళ్ళోంచి బదిలీ అయ్యాక కూడా కొనసాగేది స్నేహాలు. భౌతిక పనిసంబంధాలు, మానవసంబంధాలు, సామాజిక ఆర్థిక సంబంధాలు అవి ఇలా బదిలీ అయిపోయినా, మారిపోయినా ఆ తర్వాత కూడా కొనసాగేవి స్నేహాలు సంస్కృతి అంటారు. కాలక్రమంలో ఇవి కొన్ని ఆగిపోతాయి. కొన్ని కొనసాగుతుంటాయి. మనిషి జీవితం స్నేహాలమయం. స్నేహంలేని జీవితం ఊహించలేనిది. ఏకాంత జీవితం ఆత్మానందానికి పనికొస్తుంది. ఆత్మానందాన్ని కలిసిపంచుకోడానికి కూడా స్నేహాలు అవసరం. కష్టాల్లో, సుఖాల్లో కలిసి నడిచేవారే నిజమైన స్నేహితులు. కష్టాల్లో కలిసి నడిచి సుఖాల్లో వారిని వదిలివేస్తే ఆ స్నేహం అధికారికి, ఉద్యోగికి ఉండే సంబంధం లాంటిదిగా కుదించుకుపోతుంది. ఉదాహరణకు పెళ్లి సంబంధాల వెతుకులాటలో ఎందర్నో సంప్రదిస్తారు. సహకారం తీసుకుంటారు. కాని పెళ్లి కుదిరాక పెళ్లి పత్రికలు పంపి వారిని రమ్మని పిలవడం మరిచిపోతుంటారు. వీళ్లు ఇంకా సంబంధం కుదరలేదేమో అనుకుని సంబంధాల జాడ తీస్తూనే ఉంటారు.

## స్నేహం స్నేహితుల మంచిని, ఉన్నతిని కోరుతుంది

నిజమైన స్నేహం స్నేహితుల మంచిని కోరుతుంది. నిరంతరం వారి ఉన్నతిని కోరుతుంది. వారి ఆత్మీయతను కోరుతుంది. నిజమైన స్నేహం స్నేహితుల బలహీనతల్ని క్షమిస్తుంది. కష్ట సుఖాలు కలిసి పంచుకుంటారు. ఊరట పొందుతారు. కష్టాల్లో, బాధల్లో హృదయం విప్పి చెప్పుకునే స్నేహితులు కనీసం పదిమందైనా ఉంటే ఆ జీవితం తప్పకుండా గట్టున పడుతుంది. తిరిగి ఆనందమయం అవుతుంది.

స్నేహం పదిలమైనది. సున్నితమైనది. కష్టాల్లో బాధల్లో హృదయం విప్పి చెప్పుకునే స్నేహితులను ఎప్పుడూ కాపాడుకుంటూ ఉండాలి. కష్టాలను బాధలను కలిసి పంచుకునే స్నేహితులు లేని బతుకు దుర్భరం. కష్టాల్లో బాధల్లో కలిసి పంచుకునే నిజమైన స్నేహితులు నలుగురైదుగురు ఉంటే చేనేత కార్మికులు, పవర్‌లూం కార్మికులు, పత్తి రైతులు, అప్పులపాలు అయినవాళ్లు, ఆత్మహత్యలు చేసుకునే మూడ్ అదృశ్యం అవుతుంది. బతుకుపై తిరిగి విశ్వాసం పెరుగుతుంది. జీవితంలో తిరిగి కోలుకుంటారు. ఆత్మహత్యలు ఒక రకంగా వారి జీవితంలోని స్నేహాలు లేకపోవడాన్ని మరీ సున్నిత మనస్తత్వాన్ని తెలుపుతాయి. నిస్సహాయస్థితి ఆత్మహత్యకు పురికొల్పుతుంది. ఆత్మీయత, ఓదార్పు వారిని కాపాడుతుంది.

చిన్ననాటి అరెయ్, తొరెయ్, ఏమే, ఒసే అని పిలుచుకున్న స్నేహాలు జీవితాంతం ఒక ఆహ్లాదాన్నిస్తాయి. వాళ్ళు స్నేహితులకు సూచన చేస్తారు. ఆ పని నీతో కాదు అని

చెప్పినప్పటికీ అందులో దిగి నష్టపోయిన తరువాత తిట్టుకొంటూ కూర్చోకుండా తిరిగి కష్టాల్లో ఆదుకుంటారు. ఇదే నిజమైన స్నేహం. ఇదే గాఢమైన స్నేహం. కొందరు అభిప్రాయాలు మారగానే స్నేహాన్ని మానేస్తారు. వారి పట్ల దుష్ప్రచారం చేస్తారు. సంస్థల్లో, ఉద్యమాల్లో పని చేసినప్పుడు ఇలాంటి సంఘటనలు ఎదురవుతుంటాయి. అవి నిజమైన స్నేహాలు కావు. అందువల్ల నిజమైన స్నేహితులను కనుక్కోవడం, ఏర్పర్చుకోవడం ఎంతో బాధ్యతాయుతమైన పని.

### భిన్నాభిప్రాయాల్లోనూ వ్యత్యాసాల్లోనూ స్నేహం కొనసాగుతుంది

ఇద్దరు స్నేహితులు కాలక్రమంలో వ్యత్యాసాలతో జీవితంలో ఎదగవచ్చు. ఒకరు అటెండరు టీచరు అయి, మరొకరు ఉన్నతాధికారి, కోటీశ్వరుడైన స్నేహంలో తేడా రాకుండా చూసుకోవడంలో మానవతా విలువలు ఉన్నాయి. ఎదగనివారు ఎదిగినవారి పట్ల ఇన్‌ఫీరియారిటీతో, అసూయతో బెలతనంతో ఉండవచ్చు. ఎదిగినవారే తన పాత స్నేహితుల పట్ల ఎక్కువ చొరవ చూపాలి. లేనియెడల తక్కువ స్థాయిల్లో బతుకుతున్నవారు ముడుచుకుపోతారు. ఒక తిట్టుతో ఆగిపోయే స్నేహం స్నేహం కాదు. భిన్నాభిప్రాయాలు ఉన్నప్పటికీ పరస్పరం గౌరవించుకోవడమే నిజమైన స్నేహం. పరస్పరం అభిప్రాయాలను స్నేహపూరిత హక్కుతో ఒకరిమీద ఒకరి రుద్దాలని చూసినా ఏకీభవించకపోయినా యథావిధిగా స్నేహాన్ని కొనసాగించడమే నిజమైన స్నేహం.

### జీవితంలో ప్రతి దశలో స్నేహితులుండాలి

విద్యార్థి దశలో, యువజన దశలో, టీనేజి దశలో మంచి స్నేహాలు ఉండాలి. చెడు స్నేహాలు వదిలెయ్యాలి. చెడు స్నేహాల వల్ల జీవితలక్ష్యాలు చెదిరిపోతాయి. కొందరు స్నేహాలను వ్యాపారాలకు వాడుకుంటారు. ఫైనాన్స్ కంపెనీని ఇన్సూరెన్స్ ఏజెంట్లు వస్తువుల్ని అంటగట్టుడు, ష్యూరిటీ పేరిట అప్పుల్లో ఇరికించుడు మొదలైనవి స్నేహాన్ని డబ్బుగా మార్చుకోవడానికి ప్రయత్నించేవే.

### స్నేహితుల మధ్య ఆర్థిక లావాదేవీలు ఉండవచ్చా?

స్నేహితుల మధ్య డబ్బు ఇచ్చిపుచ్చుకోవచ్చు. చాలా సందర్భాల్లో విద్యార్థుల మధ్య, పౌరుల మధ్య డబ్బు లేకపోవడం ఉండడం రెండు సందర్భాల్లోనూ స్నేహాలు ఎక్కువవుతాయి. కాని, డబ్బు మాత్రమే స్నేహంలో ప్రధానపాత్ర వహిస్తే అప్పులు, వడ్డీలు, ఎగవేతలు మొదలైనవాటి చర్చలతో స్నేహం విరిగిపోతుంది, కలహాలకు కారణమౌతుంది.

స్నేహం ఒక పవిత్రమైన బంధం. దాన్ని సున్నితంగా, పవిత్రంగా కాపాడుకోవాలి. ఒకసారి పరిచయమైనవాళ్లు స్నేహితులుగా మారుతుంటారు. స్నేహితులుగా మారినతర్వాత ఎవరూ స్నేహాన్ని వదులుకోకూడదు. 'బతుకంటే స్నేహమేనోయీ' అంటాడు – ఒక తత్వవేత్త.

స్నేహితులు నిరంతరం మారుతూ ఉంటే పాత స్నేహితులు భిన్నాభిప్రాయాల్లోనూ ఆర్థిక వ్యత్యాసాల్లోను ఎప్పట్లా స్నేహం కొనసాగకపోతే మనలో ఏదో లోపం ఉన్నట్టే. ఎదుటి వారికన్నా మనల్ని మనం మరింత స్నేహపూరితం, కరుణపూరితం,



ప్రేమపూరితం చేసుకుంటూ ప్రేమించాలి, స్నేహించాలి, ఆచరించాలి. స్నేహితుల మధ్య నిరంతరం పరస్పర త్యాగాలు ఉంటాయి.

నవ్వుకుంటూ మీకోసం ఎంత త్యాగం చేసాను అని హాయిగా చర్చించుకోవచ్చు గాని కొట్లాడుకునే సందర్భాల్లో సీరియస్‌గా హక్కులు బాధ్యతలు సందర్భాల్లో త్యాగాలు చర్చించడం వల్ల కలతలు పెరిగే అవకాశం ఉంటుంది. త్యాగాన్ని కూడా ఏం చేసావులే బోడి అని కోపంలో అనే అవకాశం ఉంటుంది. ఆ మాట విన్నాక మరింత గాయపడుతుంది. అందువల్ల కొట్లాడుకునేటప్పుడు చేసిన త్యాగాలను గుర్తుచేసి ఎదురివారి నుండి ఆశించడం చేయకూడదు. ఇద్దరికీ సరియైన జోడీ అయిన మరో స్నేహితునికి ఆ విషయాలు చెప్పి బాధను బాధగా వ్యక్తం చేయాలి. అతడు ఎంతమేరకు అవసరమో అంతమేరకు ఆ స్నేహితులతో మాట్లాడి ఒప్పిస్తారు.

### స్నేహంలో అలిగితే మిగతా స్నేహితులు కలపాలి

స్నేహంలో అలిగినప్పుడు, కొట్లాడుకున్నప్పుడు అది మళ్లీ చిగురిస్తుందని గుర్తుంచుకోవాలి. అందుకనుకూలంగా ప్రవర్తించాలి. కొట్లాడుకున్నంత మాత్రాన, అలిగినంత మాత్రాన స్నేహితుల గురించి వ్యతిరేకంగా ఎక్కడా ప్రచారం చేసుకోకూడదు. అది స్నేహాలను దూరం చేస్తుంది. ఇద్దరికీ కావల్సిన స్నేహితుల మధ్య బాధను బాధగా వ్యక్తం చేసుకోవాలి. ఇద్దరికి కావల్సిన స్నేహితులే ఆ సమస్యను పరిష్కరిస్తారు.

### స్నేహితులు, కుటుంబ సభ్యులతో కూడా స్నేహంగా వుండాలి

స్నేహం ఒక్కరితోనైనా ఆ ఇంట్లోని అందరితో స్నేహపూరితంగా ఉండాలి. ఇలా అలిగినప్పుడు ఇంటివాళ్ళందరితో స్నేహాన్ని ఏదో రూపంలో కొనసాగించాలి. తన స్నేహితుడితో అలిగిన విషయం ఇంటివారికి తెలిసినా వాళ్లు దగ్గర చేయడానికి ప్రయత్నించాలి. కేవలం కొడుకు పక్షమో, తమ్ముడి పక్షమో, చెల్లెలి పక్షమో వహించి ఆ స్నేహితున్ని సందు దొరికింది కదా అని స్నేహం చెడిపోయేవిధంగా మనసు విరిగేట్టుగా చేయకూడదు. బాగా కలిసుండేవాళ్లు కదా అని ఆప్యాయంగా పలకరించి దగ్గర చేయాలి.

### ప్రేమించే వయసులో మంచి స్నేహాలు ఎంతో అవసరం

టీనేజిలో, స్త్రీ పురుషులు ప్రేమించుకునే కాలంలో మంచి స్నేహితులు అవసరం. తన భావాలు కలిసి పంచుకునే స్నేహితులు ఉంటే ఒక స్పష్టత ఏర్పడుతుంది. తన ప్రేమ గురించి స్నేహితురాళ్లతో చెప్పుకోవడం ద్వారా వాస్తవాలకనువైన మంచి సూచనలు చేస్తారు. ఇద్దర్నీ కలిపే భావాజాలాలను అభివ్యక్తిని ప్రేమ ఎలా వ్యక్తం చేయాలో కూడా చెబుతారు. అది సూచించేవారికి కూడా ఒక అనుభవంగా ఉపయోగపడుతుంది. అనగా, తాను కూడా ఎలా ప్రేమించాలో వారితో ఎలా ఉండాలో తెలుసుకోగల్గుతారు.

### పెళ్లైన కొత్తలో కూడా మంచి స్నేహాలు అవసరం

పెళ్లైన కొత్తలో కూడా మంచి స్నేహాలుండాలి. పిల్లలకు కూడా మంచి స్నేహాలుండాలి. ఎన్నో అవసరాల్లో స్నేహితులు ఆదుకుంటారు. తోడు ఉంటారు. తెలియని విషయాలు తెలియజేస్తారు. తాము తెలుసుకుంటారు. స్నేహితులు మగవాళ్లయితే తమ భార్యలను కూడా స్నేహం చేసుకునే విధంగా చూడాలి. స్నేహితులు

ఆడవాళ్లంటే తమ భర్తలను స్నేహం చేసుకునేవిధంగా చూడాలి. వృద్ధాప్యంలో కూడా కొడుకులు, కోడళ్ళ గురించి తమ ఇంటి బాధల గురించి, ఆరోగ్య విషయాల గురించి చెప్పుకోవడానికి కూడా స్నేహితులు ఉండాలి. వృద్ధాశ్రమంలో కూడా స్నేహితులుండాలి.

**తమ వృత్తి ఉద్యోగాల్లో, సంస్థల్లో మంచి స్నేహితులను గుర్తించడం ఎలా?**

యువజన ఉద్యోగ దశల్లో స్నేహాలు ఎక్కువమేరకి ఉద్యోగ సంఘాల ద్వారా తమకు నచ్చిన సంస్థల్లో చేరడం ద్వారా కొనసాగుతుంటాయి. కొన్ని సంస్థలవాళ్లు తమ సంస్థ కార్యకలాపాల్లో భాగంగా అద్భుతంగా స్నేహం చేస్తారు. ఆ స్నేహంలో తోటి స్నేహితులు ఆ సంస్థ లక్ష్యాల కోసం ఎన్ని త్యాగాలైనా చేస్తారు.

'తమ తమ నెలవులు తప్పిన తమ మిత్రులే శత్రువులగుట' అన్నట్లు కొన్ని సంస్థలు వారినుంచి విభేదించి వెళ్లిపోతే ఆ స్నేహ హస్తాలు ముడుచుకుపోతాయి. అప్పుడు వాళ్లు ఏకాకి అవుతారు. అప్పుడు స్నేహితులు లేక విలవిలలాడిపోతారు. డిప్రెషన్, నిరాశ, ఆత్మహత్యల ఫీలింగ్స్ వస్తాయి.

అందువల్ల సంస్థ కార్యకలాపాలు చేసేటప్పుడు ఆ సంస్థ వెలుపల గల ఇతరులతో సంస్థ కోసం పోట్లాట పెట్టుకుని స్నేహాన్ని దూరం చేసుకోకూడదు. భిన్నాభిప్రాయాలు ఉన్నవారిని కూడా గౌరవించడం, స్నేహం చేయడం చేస్తే స్నేహితులకు కొదువ లేదు. పార్లమెంటు చట్టసభల ప్రజా ప్రతినిధులు భిన్న పార్టీలవాళ్లు చాలా సందర్భాల్లో గౌరవించుకుంటారు. అది అందరికీ ఆదర్శం కావాలి.

**రాజకీయాలు స్నేహాలను విరిచేస్తుంటాయి**

రాజకీయాల్లో పల్లెటూరి కార్యకర్తలు పరస్పరం కొట్టుకోకూడదు. పై స్థాయి నాయకులు పార్లమెంటులో కలిసే పని చేస్తుంటారు. అది మరిచిపోకూడదు. పార్టీల విభేదాలు స్నేహాలను విడదీయకూడదు. వారున్న పార్టీల్లో వారు ఎదగడానికి పరస్పరం చర్చించుకుని సహకరించుకోవాలి. అప్పుడే సామాజిక రాజకీయ రంగాల్లో గ్రామీణ ప్రాంతాల్లో స్నేహితుల మధ్య, పార్టీల కార్యకర్తల మధ్య విభేదాలు అంతరించి గ్రామాలు స్నేహపూరితమవుతాయి.

**స్నేహానికి భావాలు, సామాజిక రాజకీయ కార్యకలాపాలు సవాళ్లు విసురుతాయి**

స్నేహానికి ప్రధాన సవాళ్లు సామాజికంగా రాజకీయ సామాజిక రంగాల్లో ఉండే సంస్థలు వాటి భావజాలాలనుండి ఎదురవుతున్నాయి. ప్రచార, ప్రసార సాధనాల హింసాప్రవృత్తి స్వార్థం గురించిన ప్రసారాలు బలీయమైన ప్రభావాలు వేస్తున్నాయి. కులం వ్యత్యాసాలు భిన్న మత సంస్కృతులు స్నేహాలమధ్య అప్పుడప్పుడు పొరపొచ్చాలు సృష్టిస్తుంటాయి. వాటిని స్నేహానికనువుగా పరిష్కరించుకోవాలి.

**చిన్నప్పటి స్నేహాల్లో ఎదుర్కున్న సవాళ్లు**

చిన్నప్పటినుంచి స్నేహానికి కొన్ని సవాళ్లు ఎదురవుతుంటాయి. బడి ఎగవేయడం, అవసరం లేకపోయినా ఇతరుల చేనుల్లో వేరుశనగ కందికాయ తెచ్చుకునే చిన్న చిన్న సాహసాలు చేయడం చేస్తుంటారు. దీనివల్ల ఇరుగుపొరుగు, బంధుమిత్రులతో పోట్లాటలు రావచ్చు. వాటిలో పెద్దలు చొరవ చేసుకుని చెరో పక్షం చేరితే పిల్లల



పోట్లాటలు పెద్దల పోట్లాటలుగా మారుతాయి. అలా చేయకూడదు. పిల్లలు తెచ్చే పోట్లాటలు చూసి పెద్దలు నవ్వుకోవాలి. ఆ సవాళ్లని అలా అధిగమించాలి.

**రాజకీయాల్లో భావజాలాల్లో అప్రోచ్ మార్చుకుంటే స్నేహం సాధ్యమే**

రాజకీయాలు, ద్వేషాన్ని, విమర్శను కాకుండా స్నేహాన్ని, అభివృద్ధిని సహృదయతను ప్రాచుర్యంలోకి తెస్తే స్నేహం మరింత వికసిస్తుంది. ఉదా॥కు ఆయన కూడా మంచివాడే. అయితే నేను మరింత పట్టుదలతో చిత్తశుద్ధితో ప్రజలకు సేవ చేయడానికి కృషి చేస్తాను అని ప్రచారం చేసుకోవచ్చు.

**స్నేహానికి ఎదురయ్యే సవాళ్లు**

వ్యక్తిగతంగా స్వార్థం, అరాచకం, కన్స్యూమరిజం, తాగుడు, జూదం, వ్యభిచారం రాజకీయ విభేదాలు సామాజిక అంశాలు, ఎప్పుడూ అప్పులు అడగడం, విమర్శించడం, ఎదుగుదలను అసూయతో చూడడం, ఉన్నత స్థాయిలో ఉన్నప్పుడు స్నేహం ఉంది కదా అని కించపర్చడం మొదలైనవి స్నేహానికి సవాళ్లను తెచ్చిపెడుతుంటాయి. ఉన్నత లక్ష్యాలతో ముందుకు సాగినపుడు సభ్యతా సంస్కారం, సంస్కృతి, ప్రేమా, ఆప్యాయత పరోపకారం మొదలైనవాటితో వ్యక్తిత్వం వికసించినప్పుడు ఈ సవాళ్లు ఎప్పటికప్పుడు స్నేహానికనువుగా పరిష్కరించబడుతుంటాయి. ఊరికే ఎప్పుడూ స్నేహితులతో ఖర్చుపెట్టించడం మరి స్నేహం అనిపించుకోదు. అది స్నేహితుల్ని వాడుకోవడంగా మారవచ్చు.

**దేశాల మధ్య, ప్రాంతాల మధ్య, మానవాళి మధ్య స్నేహాలు**

రాష్ట్రాల మధ్య, దేశాల మధ్య స్నేహాల కోసం సాంస్కృతిక ప్రదర్శనలు, సాహిత్య అనువాదాలు, ఆటల పోటీలు, విహారయాత్రలు, విజ్ఞానయాత్రలు జరుపుతూ ఉండాలి. స్నేహితులు నిరంతరం స్నేహంగా కొనసాగాలి.

**స్నేహాలను పరిచయాలుగా కుదించుకోవాల్సిన సన్నివేశాలు ఏర్పడుతాయి**

ఏవైనా అనుకోని పరిస్థితులవల్ల దూరతీరాల వల్ల ఇతరులు ఆ స్నేహాన్ని చూసి అపార్థాలు సృష్టించే అవకాశాలు ఉన్నప్పుడు ఆ స్నేహాలను వదులుకోక తప్పని పరిస్థితి ఏర్పడవచ్చు. ఉదాహరణకు బి.జె.పి. కాంగ్రెస్ నాయకులు స్నేహితులైతే, అలాగే ఒక నక్సలైటు పోలీసు అధికారి స్నేహితులైతే ఒక, బ్లాక్‌మార్కెటీర్, ఉన్నతాధికారి స్నేహితులైతే ఆ స్నేహం రెగ్యులర్ స్నేహంగా కొనసాగితే మిగిలిన సమాజం వారిని వారి చిత్తశుద్ధిని అనుమానంగా చూస్తుంది. అందువల్ల ఇలాంటి సందర్భాల్లో ఆ స్నేహాలని ఎంతో పరిమితం చేసుకోక తప్పదు. పరిచయస్తులుగా మిగిలిపోక తప్పదు.

**స్నేహానికి ఎప్పుడూ తలుపులు తెరిచివుంచాలి**

అలాగే మరికొన్ని సందర్భాల్లో ఇలాంటి సన్నివేశాలు రాకపోయినా స్నేహాలు విడిపోయే అవసరం ఏర్పడ్డప్పుడు శత్రువుగా పరస్పరం మారిపోకూడదు, ప్రచారం చేసుకోకూడదు. స్నేహం కొనసాగకపోయినా పాత పరిచయస్థుల్లా కొనసాగాలి. హృదయంలో స్నేహమనే తలుపులు ఎప్పుడూ తెరిచిఉంచాలి. స్నేహితుల్ని

హృదయంలోకి హృదయపూర్వకంగా ఆహ్వానించాలి. అప్పుడప్పుడూ కలిగే అహం, గర్వం, అభిజాత్యం, కోపం, అధికారతత్వం అసూయ మొదలైనవాటిని తొలగించుకుని మనస్సుకు పవిత్రస్నానం ఆచరించి హృదయాన్ని అప్పుడే వికసించిన పువ్వులా మార్చుకోవడానికి యోగా, ధ్యానం, ఆటపాటలు ఎంతో సహకరిస్తాయి.

**స్నేహం కాలాతీతమైంది, స్నేహం ఒక జీవనది**

స్నేహం కాలాతీతంగా కొనసాగే ఒక జీవనది. నిజమైన స్నేహంలో కాలం లేదు. స్నేహం శాశ్వతం. స్నేహం ఐచ్ఛికం. స్నేహం నిరంతరం ఆచరణను కోరుతుంది. జీవితంలో పది మంది మంచి స్నేహితులున్న బతుకెంతో ధన్యం. నలుగురైనా ప్రాణస్నేహితులు ఉంటే ఆ బతుకు మరింత ధన్యం.

### ప్రశ్నలు

1. స్నేహం అంటే ఏమిటి?
2. స్నేహాలు ఎన్ని రకాలు?
3. స్నేహాలు ఎలా మొదలవుతాయి?
4. ఇన్‌స్టెంట్ స్నేహాల వల్ల లాభాలేమిటి? నష్టాలేమిటి?
5. స్త్రీ పురుషుల మధ్య స్నేహాలు ఉండవచ్చా? ఉంటే ఎలా వుండాలి?
6. స్నేహితుల మధ్య ఆర్థిక లావాదేవీలు ఉండవచ్చా? ఏ మేరకు?
7. స్నేహితులు ఎలా, ఎందుకు విడిపోతుంటారు?
8. మీ స్నేహానికి ఎదురయ్యే సవాళ్లను ఎలా పరిష్కరించుకుంటారు?
9. మీ స్నేహితుల గురించి, వారి స్వభావాల గురించి, వారికి మీకు గల అనుబంధాల గురించి వివరంగా రాయండి.



# కుటుంబం అంటే ఏమిటి?
# కుటుంబం పుట్టుక - పరిణామం

## గ్రామానికి కుటుంబ వ్యవస్థకు గల సంబంధం

అమ్మ అనగానే చాలామంది చిన్నపిల్లలైపోతారు. కనిపించే దేవత అంటారు. అమ్మతో గారాలు పోతారు.

"అమ్మ ఒకవైపు, దేవతలంతా ఒకవైపు
సరితూచమంటే నేను ఒరిగేను అమ్మవైపు"

అంటాడు డా॥ సి. నారాయణరెడ్డి.

నాన్న అనగానే ఒక సంకోచం, ఒక భయం. అందరు నాన్న రాగానే ఆడుకుంటున్నవాళ్ళు, నవ్వుకుంటున్నవాళ్ళు క్లాసురూంలోకి టీచర్ వచ్చినట్టుగా క్రమశిక్షణలోకి మారిపోతారు. పిల్లలు ఒకరిమీద ఒకరు అలాగే అప్పటిదాకా అమ్మతో ఆడుకునికూడా అమ్మ మీద గారాబంగా ఫిర్యాదులు చేస్తారు. ఇదొక సగటు మధ్యతరగతి కుటుంబం.

**కుటుంబం అనేది ఒక సామాజిక వ్యవస్థ**

కుటుంబం అనేది ఒక సామాజిక వ్యవస్థ. కుటుంబం అనేది సమాజంలో ఒక మౌలికమైన కుదురు. ఇటీవలిదాకా ఉమ్మడి కుటుంబాలు ఉండేవి. ఉమ్మడి కుటుంబాలు, పిల్లల పెంపకం, సామాజిక వత్తిడులు, వ్యక్తులు, వికాసం విషయంలో చక్కని పాత్ర నిర్వహించాయి. ఉమ్మడి కుటుంబం అంటే తల్లిదండ్రులు, వారి పిల్లలు, కోడండ్లు, మనుమలు, మనుమరాళ్లు, అందరూ కలిసి ఉండే కుటుంబం. మూడు లేదా నాలుగు తరాలు కూడా అన్నదమ్ములు, అక్కాచెల్లెళ్లు, కోడళ్లు, అల్లుళ్లు, తాతలు, నానమ్మలు, మనుమలు, మనుమరాళ్లు, మునిమనుమలు కలిసిఉండే కుటుంబాలు ఉండేవి. బంధుత్వాలు వరుసగా రక్త సంబంధాలను అనుసరించి ఏర్పడతాయి. రక్త సంబంధాలు ఇప్పుడు కుటుంబం పునాదిగా కొనసాగుతున్నది.

**కులవృత్తికి కుటుంబ వ్యవస్థకు గల సంబంధం**

పూర్వం కులవృత్తి చేసుకుంటూ ప్రజలు పల్లెల్లో బతికేవారు. ఒక పల్లెలో 15,

20 కులాలు వారి వారి కులవృత్తులు చేసుకుంటూ ఒకరి ఉత్పత్తులను, సేవలను మరొకరికి వస్తుమారకం పద్ధతిలో ఇచ్చుకుంటూ తీసుకుంటూ కలిసి బతికేవాళ్లు. వడ్ల, కమ్మరి, కుమ్మరి, చాకలి, మంగలి, బ్రాహ్మణ మొదలైన కులాలవారికి కుటుంబానికి ఇంత చొప్పున ఏడాదికి ఒకసారి గాసం లేదా బలాత అనే పేరుతో ఇచ్చేవారు. అవి సాధారణంగా ధాన్యాల రూపంలో ఉండేవి. డబ్బు చలామణి చాలా తక్కువ.

**గ్రామీణ ఉత్పత్తి విధానం కుటుంబ వ్యవస్థను నిర్దేశించిన తీరు**

ఊరికి అవసరమైన అన్ని సేవలు అన్ని ఉత్పత్తులు ఆ ఊళ్లోనే తయారయ్యేవి. ఆ ఊళ్లోనే పంపిణీ అయ్యేవి. రాజులు పంటలో ఆరవ వంతు లేదా నాలుగవ వంతు పన్నుగా వసూలు చేసుకుని వెళ్లేవాళ్లు. ఏ పల్లెకు ఆ పల్లె సాగునీరులోను, తాగునీరులోను, ధాన్యంలోను, బట్ట ఉత్పత్తిలోను, బర్లు గొర్లు మేకలు, పొలాలు, చెలుకలు, చెట్లు, చేమ, అడవి, అడవి ఉత్పత్తులు మొదలైన అన్నిటిలో స్వయం సమృద్ధంగా ఉండేవి.

**గ్రామాల్లో కులాలు వేరైనా కుటుంబ వ్యవస్థ ఒక్కటే**

కులాల మధ్య హెచ్చుతగ్గులు ఉండేవి. దళిత కులాలను దూరంగా ఉంచేవారు. వారితో అన్ని పనులు చేసుకుంటూ కించపరిచేవారు. తక్కువ ప్రతిఫలం ఇచ్చేవారు. చాకలి, మంగలి, సేవాకులాలను కూడా చిన్నచూపు చూసేవారు.

ఈ 15, 20 కులాల వాళ్లకు కులాలవారీగా వాడలు, ఇండ్లు ఉండేవి. ఒక కులం వాళ్లు ఒకేచోట ఉండడంవల్ల ఉత్పత్తి నైపుణ్యం పెరిగేది. చుట్టాలు కలిసి ఉండేవాళ్లు. తిండి కూడా కులాలవారీగా ఒకే రకంగా ఉండేది. కట్టే బట్ట కూడా కులాలవారీగా వేరు వేరు తీరులో కట్టుకునేవారు.

**గ్రామీణ వృత్తులు కులాలు గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ**

గొల్లలు మేకలు, గొర్లు మేపుకుంటూ ఊరిబయట ఉండేవాళ్లు. గొల్ల స్త్రీలు వారికి ఊళ్లోంచి సద్దులు తీసుకుని వెళ్లేవాళ్లు. చాకలివాళ్లు ఊరిపక్కన ఉన్న చెరువులోగాని, వాగులోగాని బట్టలు ఉతికేవాళ్లు. కుమ్మరివాళ్లు ఊరి చెరువులోంచిగాని, పొలిమేరల్లో గాని దొరికే మంచి మట్టిని తీసుకుని కుండలు, గూనపెంకలు మొదలైనవి చేసేవాళ్లు. తెనుగువాళ్లు ఊరు చుట్టూతా ఉండే అడవిలోని చెట్లనుండి కాయలను, పండ్లను సేకరించేవారు. వనమూలికలను సేకరించి తెచ్చేవారు. తేనెపట్టునుండి తేనె తీసేవారు. బెస్తవారు చెరువుల్లో, వాగుల్లో చాపలు పట్టేవారు. వడ్లవాళ్లు వ్యవసాయానికి కావలసిన నాగలి, ఎడ్లబండ్లు, ఇళ్లకు కావలసిన తలుపులను, వాసాలను, దూలాలను, కుర్చీలను తయారుచేసేవారు. అన్ని కులవృత్తులకు అవసరమైన కర్ర పనులు చేసిచ్చేవారు.

కమ్మరివాళ్లు ఇనుముతో కత్తులతోపాటు అన్ని కులాలకు అవసరమైన ఇనుప పరికరాలను చేసిచ్చేవాళ్లు. అవుసుల వాళ్లు బంగారం పని చేసేవాళ్లు. వడ్డెరవాళ్లు బావులు తవ్వటం కాశోల్లు బండ పని చేసేవాళ్లు. ఉప్పరివాళ్లు ఇటుకలు, ఇళ్లు కట్టడం, మొదలైన పనులు చేసేవాళ్లు. ఈడిగలు, గౌడులు కల్లు గీసేవాళ్లు. సాలీలు బట్టలు నేసేవాళ్లు. కురుమలు గొంగళ్లు నేసేవాళ్లు. మాలలు వ్యవసాయ పనులతో పాటు పాలనలో చివరి అంచెల్లో పని చేసేవాళ్లు. మాదిగలు వ్యవసాయ పనులతోపాటు తాళ్లు



నేయడం, చీపుర్లు తయారుచేయడం, డప్పు కొట్టడం, తోళ్లు తయారుచేయడం, ఊరి పరిశుభ్రత మొదలైన 15, 16 రకాల పనులు చేసేవాళ్లు. ఎరుకలి వాళ్లు పందులు పెంచేవాళ్లు. ఈత నారతో బుట్టలు అల్లేవారు. ఈత ఆకుతో చాపలు అల్లేవారు. కాపులు వ్యవసాయం చేసేవాళ్లు. చాలా ఊళ్లల్లో వెనుకట దాదాపు అన్ని కులాలకు వ్యవసాయ భూములు ఉండేవి. అన్ని ఇండ్లల్లో నూలు వడికేవారు. అన్ని ఇండ్లల్లో కోళ్లు, మేకలు, పిల్లులు, కుక్కలు పెంచేవాళ్లు.

పల్లెల్లో అందరూ వ్యవసాయం ప్రధాన జీవన ఆధారంగా బతుకుచక్రం తిరుగుతుండేది. ఇలాంటి పల్లెలను, బతుకుతీరును 'గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ' అని పిలిచేవారు. ఆ ఊళ్లల్లో పుట్టే అదనపు ఉత్పత్తిని సంపదను కోమట్లు కొని ఇతర ప్రాంతాల్లో అమ్మేవాళ్లు. ఉప్పు, జిలకర మొదలైన కొన్ని వస్తువులను లంబాడీలు, పెరికలు ఎడ్లపై వేసుకుని ఊళ్లు తిరుగుతూ అమ్మేవాళ్లు.

రాజు తరఫున పన్ను వసూళ్ళ కోసం ఒక మనిషి ఉండేవాడు. అతడు పీడించి వసూలు చేసేవాడు. పన్ను ఇవ్వని భూములను తానే కబ్జా చేసుకునేవాడు. అలా భూస్వామి, జమీందారు, జాగీర్దారు మొదలైనవాళ్లు ఏర్పడ్డారు.

కులాలు వేరైనా శూద్ర కులాలు పరస్పరం బంధువుల్లా వరుసలతో పలుకరించుకునేవి. ఒకరి కష్టసుఖాల్లో మరొకరు తోడునీడగా ఉండేవారు. అయితే, కుల కట్టుబాట్లను పాటించేవారు.

**పెళ్లి లేకుండా కుటుంబ వ్యవస్థ లేదు**

పెళ్లి లేకుండా కుటుంబ వ్యవస్థ లేదు. పెళ్లి ఒక నిర్మాణం. పెళ్లి ఒక ఒప్పందం. పెళ్లి ఒక సామాజిక అంగీకారం. కుటుంబం దాని విస్తృత నిర్మాణం, దాని కార్యకలాపాలు. ఉత్పత్తి, పిల్లల పెంపకం, తల్లిదండ్రుల పోషణ, రక్త సంబంధీకుల బంధుత్వాలు వాటి హక్కులు, బాధ్యతలు సమాజంతో ఒక యూనిట్‌గా సంబంధంలో ఉండడం అనేవి కుటుంబం యొక్క కార్యకలాపాలు. పెళ్లి వీటికి పునాదివేస్తుంది. పెళ్లిలేని కుటుంబంలో ఇవి ఉండవచ్చు, ఉండకపోవచ్చు. పెళ్లిలేని ప్రేమలుంటాయి. పెళ్లిలేని సంసారాలుంటాయి. అవి కుటుంబ నిర్మాణాన్ని అనుసరిస్తే పెళ్లివలెనే లెక్కించవచ్చు.

**కులాలు ఏర్పడకముందున్న తెగలు కులాలైన తీరు**

కులాలు ఏర్పడకముందు కుటుంబాలు తెగలుగా, తండాలుగా ఉండేవి. తెగలు, తండాలు కూడా కులాలుగా రూపాంతరం చెందాయి. ఎరుకలి, యానాది, లంబాడి, దొమ్మరి, వడ్డెర మొదలైన తెగలు కులాలుగా పరిణామం చెందాయి.

కులం అనేది మొదట తెగ వంటిది. తెగ లక్షణాలను, జాతి లక్షణాలను ఇప్పటికీ కలిగివున్న పెద్ద కుటుంబమే కులం. సంతానం పెరిగినకొద్దీ ఒకే కుటుంబంగా ఉన్న కులం ఉమ్మడి కుటుంబాలుగా ఏర్పడ్డాయి. తిరిగి కులసంబంధాలను అలాగే కొనసాగించుకుంటూ వచ్చాయి.

**సంపద సృష్టికర్తలు ఎవరు?**

స్వామి వివేకానంద (12-1-1863 - 4-7-1902) వర్ణం, కులంగురించి

ఇలా అంటాడు. "శూద్రవర్ణం అంటే కాయకాష్టం చేసి మొత్తం సమాజాన్ని పోషించే కార్మికవర్గం. చరిత్ర ప్రారంభకాలం నుంచి అన్ని నాగరికతలకు ఆధారభూతమైన వర్గం. ఆ వర్గపు శ్రమశక్తే లేకపోతే మనం తినే ఆహారం లేదు, మనం ధరించే వస్త్రాలు లేవు, మనం నివసించే గృహాలులేవు. మనకు నీరిచ్చే బావులు, చెరువులు, కాల్వలు, మనం నడిచే రోడ్లు, మనం ప్రయాణించే వాహనాలు, మనం దైనందిన జీవితంలో ఉపయోగించే పనిముట్లు, వాటితో తయారైన వస్తువులు ఏవీలేవు. అసలు మానవ నాగరికతేలేదు, మానవ సమాజమేలేదు, జీవితమే లేదు. వారి శ్రమశక్తిని దోచుకొని, వారిని అట్టడుగున అణగద్రొక్కి వుంచాయి. మిగతా మూడు వర్ణాలు. ఇది ఇండియాలోనే కాదు, అన్ని దేశాలలోను,అన్ని కాలాలలోను జరిగింది. కాకపోతే ఇండియాలో ఈ వర్ణవిభజన జన్మతః సంక్రమించింది.

ఆదిలో ఇలా వుండేది కాదు. అప్పుడు గుణ, కర్మలను బట్టి వర్ణవిభాగం వుండేది. ఒక వర్ణం నుంచి మరొక వర్ణానికి 'మొబిలిటీ' మార్పిడి వుండేది. బ్రాహ్మణ వర్ణం అన్నిటిలోకి ఉత్తమమైనదిగా, ఆదర్శప్రాయమైనదిగా వుండేది. మిగతా వర్ణాలవారు తమ అర్హతనుబట్టి బ్రాహ్మణ వర్ణంలోకి మారడానికి సంఘం అనుమతించేది. కాని కాలక్రమాన వర్ణవ్యవస్థ భ్రష్టుపట్టిపోయింది. వర్ణం అనేది, కులం అనేది జన్మనుబట్టి సంక్రమించేదిగా మరిపోయింది. వర్ణవ్యవస్థ మార్పునకు అవకాశం లేనిదిగా ఘనీభవించింది.

మూడు అగ్రవర్ణాలు నాలుగవ వర్ణమైన శూద్రవర్ణాన్ని అణచివుంచడానికి వర్ణవ్యత్యాసాలను ఉపయోగించుకున్నాయి. తాము అత్యధిక సంఖ్యాకులైనప్పటికీ, సమస్త సంపదను సృష్టించేది తామే అయినప్పటికి శూద్రులు తమలో తాము అనైక్యం కారణంగా అగ్రవర్ణాల పదఘట్టన క్రింద నలిగిపోయారు." (విశ్వదర్శనం-నండూరి రామోహన్‌రావు)

### కులంలో సోషలిజం

తెగ, కులం అనేవి తమలో తాము, తమకొరకు తాము సోషలిజాన్ని ఆచరిస్తాయి. తెగ, కులం అనే నిర్మాణాలు తొలినాటి సోషలిస్టు నిర్మాణాలు. అవి తొలినాటి సామాజిక వ్యవస్థలు.

డా॥ బి.ఆర్.అంబేద్కర్ (14-4-1891-6-12-1956) కుల నిర్మూలన గ్రంథంలో ఇలా అంటాడు. "ప్రపంచంలో అన్ని దేశాలలోను సాంఘిక విప్లవాలు జరిగినై. భారతదేశంలో సాంఘిక విప్లవాలు ఎందుకు జరగలేదన్నది నిరంతరం నన్ను వేధించే ప్రశ్న. బహుశా అందుకు ఒకే ఒకటి కారణమై ఉండవచ్చు. అది-హిందువులలోని దిగువ తరగతుల ప్రజలు పనికిమాలిన చాతుర్వర్ణ్య వ్యవస్థ కారణంగా అణచిపెట్టబడి, ప్రత్యక్ష చర్యకు పూర్తిగా పనికిరాకుండా చేయబడటం. వారు ఆయుధాలు ధరించకూడదు. ఆయుధాలు లేకుండా తిరుగుబాటు సాధ్యంకాదు. వాళ్ళు సేద్యగాండ్రుగా నిర్ణయించ బడ్డారు. కాని తమ నాగళ్ళ కరుకోలలనైనా ఖడ్గాలుగా చేసుకోవడానికి వీలులేకుండా చేయబడ్డారు. ఏ రకమైన ఆయుధాలు వారికి లేవు. అందువల్లనే ప్రతివాడూ వాళ్ళ తలపై ఎక్కి కూర్చున్నాడు.



చాతుర్వర్ణ వ్యవస్థ కారణంగా దిగువ కులాల ప్రజలు విద్యను అర్జించలేక పోయారు. వీరు విముక్తిని గురించి స్వయంగా ఆలోచించుకొనే శక్తిని కోల్పోయారు. తమ విమోచనకు తాము ఏ విధంగా పాటుపడాలో గుర్తించలేని అజ్ఞానులైనారు. సంఘంలో హీనులుగా, దీనులుగా అణగద్రొక్కి ఉంచడం వల్లను, తమ హైన్యదైన్యాల నుంచి తప్పించుకోవటం ఎలాగో తెలియక పోవడంవల్లను, ఈ ప్రజలు "అంతా తమ కర్మ" అనుకొంటూ, శాశ్వత బానిస వృత్తికి అలవాటైపోయారు".

"బౌద్ధమతం ఒక విప్లవం. ఫ్రెంచి విప్లవమంతటి మహత్తరమైనది. మత విప్లవంగా ప్రారంభమయినా, ఆ స్థాయిని అధిగమించి, సాంఘిక, రాజకీయ విప్లవంగా అది అభివృద్ధి చెందినది. స్వభావరీత్యా ఈ విప్లవం ఎంత లోతైనదో, ఎంత గంభీరమయినదో తెలుసుకోవాలంటే, విప్లవానికి పూర్వం నెలకొనివున్న సాంఘిక పరిస్థితులను తెలుసుకోవడం అవసరం. ఫ్రెంచి విప్లవ పరిభాషలో చెప్పాలంటే-భారతదేశంలో ప్రాచీన పరిపాలనా వ్యవస్థ చిత్రాన్ని కరతలామలకం చేసుకోవాలి."

### కుటుంబ వ్యవస్థకు ముందు

"నలుగురు చూస్తుండగానే, ఆరుబయట ఆర్యులు స్త్రీలతో సమాగమం చేయడానికి వెనకాడేవారుకారు. ఋషులు చేసే మతపరమయిన కొన్ని కర్మకాండలను 'వందేవ్యవ్రతా'లు అంటారు. ఈ కర్మకాండలను యజ్ఞభూమిలోనే నిర్వర్తిస్తూ ఉండాలి. ఎవరైనా స్త్రీ యజ్ఞవేదిక దగ్గరకు వచ్చి, తన లైంగిక కోర్కె తీర్చమని ఋషిని కోరితే, ఆయన అదే సమయంలో అదేచోట ఆరుబయట ఆమె కోర్కెను తీర్చేవాడు. ఇలాంటి సంఘటనలెన్నో చూపించవచ్చు. ఋషి పరాశరుడు, సత్యవతితో జరిపిన తంతు అదే. అలాగే దీర్ఘతాప విషయంకూడా. ఇలాంటి ఆచారం ఉందని చెప్పడానికి 'అయోని' అనే పదాన్నే వుదాహరణగా చూపించవచ్చు. 'అయోని' అనే పదానికి 'పాపం కాని గర్భధారణ' అనే అర్థం వున్నట్లు చెప్పబడుతోంది. నిజానికి ఆ పదానికి అసలు అర్థం వేరు. అదేమిటంటే-యోని అంటే ఇల్లు అని అర్థం. అలాగే అయోనిజ అంటే ఇంటి వెలుపల గర్భంలో పడింది అని అర్థం. అంటే ఆరుబయట జీవం పోసుకున్నదని. ఈ పని తప్పేమీకాదని చెప్పడానికి సీత, ద్రౌపది-ఇద్దరూ అయోనిజలు అనే వాస్తవాన్ని మనం ఇక్కడ గుర్తుచేసుకోవాలి. ఇవి (ఆరుబయట సంగమాలు) ఎంత సర్వసాధారణమయినవో తెలియజెప్పడానికి మతపరమయిన ఆదేశాలు జారీచేయక తప్పని పరిస్థితి ఎదురుకావడం మనం గమనిస్తాం.

### పురుషాధిపత్యం తొలిరోజుల్లో

తమ స్త్రీలను కొంతకాలంపాటు యితరులకు అద్దెకిచ్చుకోవడం ఆర్యుల్లో వాడుకలో వుండేది. మాధవి కథ ఇందుకొక ఉదాహరణ. యయాతిరాజు తన కూతురు మాధవిని గురువు గాలవునికి సమర్పిస్తాడు. గాలవుడు మాధవిని ముగ్గురు వేర్వేరు రాజులకు నిర్ణీత కాలంపాటు అద్దెకిస్తాడు. ఆ కాల వ్యవధి ముగిశాక, గాలవుడు తిరిగి ఆమెను విశ్వామిత్రుని కిచ్చి వివాహం చేస్తాడు. విశ్వామిత్రుని ద్వారా ఒక కొడుకు పుట్టేదాకా మాధవి అతనివద్దనే వుంటుంది. ఆ తర్వాత గాలవుడు ఆమెను, యయాతికి తిరిగి యిచ్చివేస్తాడు.

ఇలా అంటాడు. "శూద్రవర్ణం అంటే కాయకష్టం చేసి మొత్తం సమాజాన్ని పోషించే కార్మికవర్గం. చరిత్ర ప్రారంభకాలం నుంచి అన్ని నాగరికతలకు ఆధారభూతమైన వర్గం. ఆ వర్గపు శ్రమశక్తే లేకపోతే మనం తినే ఆహారం లేదు, మనం ధరించే వస్త్రాలు లేవు, మనం నివసించే గృహాలులేవు. మనకు నీరిచ్చే బావులు, చెరువులు, కాల్వలు, మనం నడిచే రోడ్లు, మనం ప్రయాణించే వాహనాలు, మనం దైనందిన జీవితంలో ఉపయోగించే పనిముట్లు, వాటితో తయారైన వస్తువులు ఏవీలేవు. అసలు మానవ నాగరికతేలేదు, మానవ సమాజమేలేదు, జీవితమే లేదు. వారి శ్రమశక్తిని దోచుకొని, వారిని అట్టడుగున అణగద్రొక్కి వుంచాయి. మిగతా మూడు వర్ణాలు. ఇది ఇండియాలోనే కాదు, అన్ని దేశాలలోను,అన్ని కాలాలలోను జరిగింది. కాకపోతే ఇండియాలో ఈ వర్ణవిభజన జన్మతః సంక్రమించింది.

ఆదిలో ఇలా వుండేది కాదు. అప్పుడు గుణ, కర్మలను బట్టి వర్ణవిభాగం వుండేది. ఒక వర్ణం నుంచి మరొక వర్ణానికి 'మొబిలిటీ' మార్పిడి వుండేది. బ్రాహ్మణ వర్ణం అన్నిటిలోకి ఉత్తమమైనదిగా, ఆదర్శప్రాయమైనదిగా వుండేది. మిగతా వర్ణాలవారు తమ అర్హతనుబట్టి బ్రాహ్మణ వర్ణంలోకి మారడానికి సంఘం అనుమతించేది. కాని కాలక్రమాన వర్ణవ్యవస్థ భ్రష్టుపట్టిపోయింది. వర్ణం అనేది, కులం అనేది జన్మనుబట్టి సంక్రమించేదిగా మరిపోయింది. వర్ణవ్యవస్థ మార్పునకు అవకాశం లేనిదిగా ఘనీభవించింది.

మూడు అగ్రవర్ణాలు నాలుగవ వర్ణమైన శూద్రవర్ణాన్ని అణచివుంచడానికి వర్ణవ్యత్యాసాలను ఉపయోగించుకున్నాయి. తాము అత్యధిక సంఖ్యాకులైనప్పటికీ, సమస్త సంపదను సృష్టించేది తామే అయినప్పటికి శూద్రులు తమలో తాము అనైక్యం కారణంగా అగ్రవర్ణాల పదఘట్టన క్రింద నలిగిపోయారు." (విశ్వదర్శనం-నండూరి రామోహన్‌రావు)

**కులంలో సోషలిజం**

తెగ, కులం అనేవి తమలో తాము, తమకొరకు తాము సోషలిజాన్ని ఆచరిస్తాయి. తెగ, కులం అనే నిర్మాణాలు తొలినాటి సోషలిస్టు నిర్మాణాలు. అవి తొలినాటి సామాజిక వ్యవస్థలు.

డా॥ బి.ఆర్.అంబేద్కర్ (14-4-1891-6-12-1956) కుల నిర్మూలన గ్రంథంలో ఇలా అంటాడు. "ప్రపంచంలో అన్ని దేశాలలోను సాంఘిక విప్లవాలు జరిగినై. భారతదేశంలో సాంఘిక విప్లవాలు ఎందుకు జరగలేదన్నది నిరంతరం నన్ను వేధించే ప్రశ్న. బహుశా అందుకు ఒకే ఒకటి కారణమై ఉండవచ్చు. అది-హిందువులలోని దిగువ తరగతుల ప్రజలు పనికిమాలిన చాతుర్వర్ణ్య వ్యవస్థ కారణంగా అణచిపెట్టబడి, ప్రత్యక్ష చర్యకు పూర్తిగా పనికిరాకుండా చేయబడటం. వారు ఆయుధాలు ధరించకూడదు. ఆయుధాలు లేకుండా తిరుగుబాటు సాధ్యంకాదు. వాళ్ళు సేద్యగాండ్రుగా నిర్ణయించ బడ్డారు. కాని తమ నాగళ్ళ కరుకోలలనైనా ఖడ్గాలుగా చేసుకోవడానికి వీలులేకుండా చేయబడ్డారు. ఏ రకమైన ఆయుధాలు వారికి లేవు. అందువల్లనే ప్రతివాడూ వాళ్ళ తలపై ఎక్కి కూర్చున్నాడు.



చాతుర్వర్ణ వ్యవస్థ కారణంగా దిగువ కులాల ప్రజలు విద్యను అర్జించలేక పోయారు. వీరు విముక్తిని గురించి స్వయంగా ఆలోచించుకొనే శక్తిని కోల్పోయారు. తమ విమోచనకు తాము ఏ విధంగా పాటుపడాలో గుర్తించలేని అజ్ఞానులైనారు. సంఘంలో హీనులుగా, దీనులుగా అణగద్రొక్కి ఉంచడం వల్లను, తమ హైన్యదైన్యాల నుంచి తప్పించుకోవటం ఎలాగో తెలియక పోవడంవల్లను, ఈ ప్రజలు "అంతా తమ కర్మ" అనుకొంటూ, శాశ్వత బానిస వృత్తికి అలవాటైపోయారు".

"బౌద్ధమతం ఒక విప్లవం. ఫ్రెంచి విప్లవమంతటి మహత్తరమైనది. మత విప్లవంగా ప్రారంభమయినా, ఆ స్థాయిని అధిగమించి, సాంఘిక, రాజకీయ విప్లవంగా అది అభివృద్ధి చెందినది. స్వభావరీత్యా ఈ విప్లవం ఎంత లోతైనదో, ఎంత గంభీరమయినదో తెలుసుకోవాలంటే, విప్లవానికి పూర్వం నెలకొనివున్న సాంఘిక పరిస్థితులను తెలుసుకోవడం అవసరం. ఫ్రెంచి విప్లవ పరిభాషలో చెప్పాలంటే-భారతదేశంలో ప్రాచీన పరిపాలనా వ్యవస్థ చిత్రాన్ని కరతలామలకం చేసుకోవాలి."

**కుటుంబ వ్యవస్థకు ముందు**

"నలుగురు చూస్తుండగానే, ఆరుబయట ఆర్యులు స్త్రీలతో సమాగమం చేయడానికి వెనకాడేవారుకారు. ఋషులు చేసే మతపరమయిన కొన్ని కర్మకాండలను 'వందేవ్యవ్రతా'లు అంటారు. ఈ కర్మకాండలను యజ్ఞభూమిలోనే నిర్వర్తిస్తూ ఉండాలి. ఎవరైనా స్త్రీ యజ్ఞవేదిక దగ్గరకు వచ్చి, తన లైంగిక కోర్కె తీర్చమని ఋషిని కోరితే, ఆయన అదే సమయంలో అదేచోట ఆరుబయట ఆమె కోర్కెను తీర్చేవాడు. ఇలాంటి సంఘటనలెన్నో చూపించవచ్చు. ఋషి పరాశరుడు, సత్యవతితో జరిపిన తంతు అదే. అలాగే దీర్ఘతాప విషయంకూడా. ఇలాంటి ఆచారం ఉందని చెప్పడానికి 'అయోని' అనే పదాన్నే వుదాహరణగా చూపించవచ్చు. 'అయోని' అనే పదానికి 'పాపం కాని గర్భధారణ' అనే అర్థం వున్నట్లు చెప్పబడుతోంది. నిజానికి ఆ పదానికి అసలు అర్థం వేరు. అదేమిటంటే-యోని అంటే ఇల్లు అని అర్థం. అలాగే అయోనిజ అంటే ఇంటి వెలుపల గర్భంలో పడింది అని అర్థం. అంటే ఆరుబయట జీవం పోసుకున్నదని. ఈ పని తప్పేమీకాదని చెప్పడానికి సీత, ద్రౌపది-ఇద్దరూ అయోనిజలు అనే వాస్తవాన్ని మనం ఇక్కడ గుర్తుచేసుకోవాలి. ఇవి (ఆరుబయట సంగమాలు) ఎంత సర్వసాధారణమయినవో తెలియజెప్పడానికి మతపరమయిన ఆదేశాలు జారీచేయక తప్పని పరిస్థితి ఎదురుకావడం మనం గమనిస్తాం.

**పురుషాధిపత్యం తొలిరోజుల్లో**

తమ స్త్రీలను కొంతకాలంపాటు యితరులకు అద్దెకిచ్చుకోవడం ఆర్యుల్లో వాడుకలో వుండేది. మాధవి కథ ఇందుకొక ఉదాహరణ. యయాతిరాజు తన కూతురు మాధవిని గురువు గాలవునికి సమర్పిస్తాడు. గాలవుడు మాధవిని ముగ్గురు వేర్వేరు రాజులకు నిర్ణీత కాలంపాటు అద్దెకిస్తాడు. ఆ కాల వ్యవధి ముగిశాక, గాలవుడు తిరిగి ఆమెను విశ్వామిత్రుని కిచ్చి వివాహం చేస్తాడు. విశ్వామిత్రుని ద్వారా ఒక కొడుకు పుట్టేదాకా మాధవి అతనివద్దనే వుంటుంది. ఆ తర్వాత గాలవుడు ఆమెను, యయాతికి తిరిగి యిచ్చివేస్తాడు.

## సంతానం కోసం

ఈ విధంగా ఆర్యుల్లో తమ స్త్రీలను తాత్కాలికంగా మరొకరికి అద్దెకిచ్చే ఆచారంతో పాటుగానే, మరొక ఆచారంకూడా వుంది. అది-సంతానోత్పత్తికోసంకూడా శ్రేష్ఠులయిన ఆర్యులకు తమ స్త్రీలను యివ్వడం. కుటుంబాన్ని వృద్ధి చేయడమంటే - ఆర్యుల దృష్టిలో పిల్లల్ని కని, వంశాన్ని ఉద్ధరించడం.

ఆర్యుల్లో ఒక ప్రత్యేక వర్గం దేవతలు. వారు సయితం ఆర్యులే. అయితే వారు శ్రేష్ఠమయిన హోదా కలిగిన పరాక్రమవంతులు. ఉత్తమ సంతానం పొందడంకోసం ఆర్యులు తమ భార్యలను దేవవర్గానికి చెందిన ఎవరితోనైనా లైంగిక సంబంధం పెట్టుకోవడాన్ని ప్రోత్సహించేవారు. ఈ ఆచారం ఎంత విస్తృతంగా సాగుతుండేదంటే - ఆర్య స్త్రీలను అర్ఘ్యంగా పొందడం దేవతలు తమ స్వతస్సిద్ధమైన హక్కుగా భావించసాగారు. తాము దేవతలకు అర్ఘ్యంగా సమర్పించడం నుంచి విముక్తి పొందే పర్యంతం ఆర్య స్త్రీలకు వివాహాలు జరిగేవి కావు. ఆ ప్రక్రియని అవధానం అనేవారు. ప్రతి హిందూ వివాహంలోనూ 'లజహూమం' చేస్తూ వుంటారు.

అశ్వలాయనుని గృహ్యసూత్రాల్లో దీనిగురించి చాలా వివరంగా చెప్పబడింది. ఇది దేవతల లైంగిక పట్టునుంచీ, హక్కు నుంచీ ఆర్య స్త్రీలు విముక్తి పొందడానికి సంబంధించిన చర్య యొక్క అవశేషం. లజహోమంలో చేసే అవధానం మరేమీకాదు. వధువుపై దేవతల హక్కుకి తాజాగా వెలకట్టి దాన్ని దేవతలకి సమర్పించుకోవడం. హిందూ వివాహాల్లో నిర్వర్తించే 'సప్తపది'ని ప్రధానమయిన కర్మకాండగా గుర్తిస్తారు.

ఇది చెయ్యకుండా ఆ వివాహం న్యాయసమ్మతమైనదని అనిపించుకోదు. కారణం ఈ ప్రక్రియ ద్వారా ఆర్య స్త్రీలపై దేవతలకి వున్న లైంగిక హక్కుని పరిసమాప్తి చేయడం. సప్తపది అంటే వధువుతో కలిసి వరుడు ఏడడుగులు వేయడం. ఇంతకీ వివాహంలో దీని అవసరం ఏమొచ్చింది? వివాహంలో తమకి సమర్పించే నష్టపరిహారంవల్ల ఒకవేళ తాము సంతృప్తి చెందకపోతే, వధూవరులు ఏడో అడుగు వేసేలోగానే దేవతలు ఆమెపై హక్కుని పునరుద్ధరించుకోవచ్చు. ఇది దీని అంతరార్థం. ఏడో అడుగు వేసేసిన తర్వాత, ఆమెపై గల దేవతల హక్కు పరిసమాప్తమవుతుంది. అంతట వరుడు వధువుని తనతో తీసుకొనివెళ్లి భార్యభర్తలుగా చక్కని కాపురం చేసుకుంటారు. ఆతర్వాత దేవతలు ఆ కాపురంలో విఘాతం కల్గించడంగానీ, ఆ భార్యపై అత్యాచారం జరపడంగానీ చేయరు.

## వెనకటి కన్య అంటే

పవిత్రత, సచ్ఛీలత అనేవి కన్యలకి వుండాలనే నియమం లేదు. ఎలాంటి వివాహబంధమూ లేకుండాకూడా కన్య ఎవరితోనైనా శరీర సంబంధం పెట్టుకోవచ్చు. పిల్లల్ని కనవచ్చు. దీనికి ఆధారం కన్య అనే పదమే. దాని మూలార్థం 'కామ్' అనే మూలపదం నుంచి కన్య అనే పదం వచ్చింది. కన్య అంటే యధేచ్ఛగా ఏ మగాడికైనా తనను తాను సమర్పించుకునేది అని అర్థం. క్రమబద్ధమైన ఏ వివాహమూ లేకుండా తమని తాము ఏ పురుషునికైనా అర్పించుకొని, పిల్లల్ని కనవచ్చును. కుంతి, మత్స్యగంధుల గాథలు ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చును. పాండురాజుతో వివాహానికి ముందే కుంతికి వివిధ పురుషుల నుంచి సంతానం కలిగింది. మత్స్యగంధి,



భీష్ముని తండ్రి శంతనునితో పెళ్లికాక ముందే పరాశరునితో శరీర సంబంధం పెట్టుకుంది.

ఆర్యుల్లో పశుప్రవృత్తి ప్రబలంగానే వుండేది. దాముడనే ఋషి ఆడలేడితో శరీర సుఖం అనుభవించడం కథగా ప్రసిద్ధం. సూర్యుడు ఆడ గుర్రంతో మదనకేళి జరపడమూ మనకి తెలిసిందే. అన్నికన్నా నికృష్టమైనది అశ్వమేధయాగంలో పట్టపురాణితో మగ గుర్రం చేసే లైంగిక క్రియ. (డా॥ బి.ఆర్ అంబేద్కర్ రచనలు, ప్రసంగాలు 3వ సంపుటం - పేజి నెం. 169, 172, 173, పేరాల విభజన, సబ్‌హెడ్డింగ్స్ నావి)

## బుద్ధుడు చెప్పిన ఆదర్శ కుటుంబం

బుద్ధుడు తన కాలంలో గల ఇలాంటి దురాచారాలన్నింటిని వ్యతిరేకించాడు. బుద్ధుడు ఆదర్శ సమాజాన్ని, ఆదర్శ కుటుంబ వ్యవస్థను ప్రతిపాదించాడు. కర్మకాండను మొత్తంగా ఖండించాడు. ప్రతిమనిషి గౌరవనీయుడే అని ప్రతిపాదించాడు. అలా బౌద్ధం ఒక మహోన్నత సామాజిక విప్లవాన్ని తెచ్చింది.

అయినప్పటికి ఇప్పటికి కొన్ని కులాలలో తెగలలో ఆటవిక దురాచారాలు కొనసాగుతున్నాయి. వాటికి కారణాలు ఎన్నో...

కత్తిపద్మారావు ఇలా అంటాడు. "ఆర్యుల దాడికి గురై, సంస్కృతీకరణకూ, హైందవీకరణకూ, గురైన తెగలన్నీ రాను రాను మాతృస్వామిక లక్షణాలను పోగొట్టుకొని పితృస్వామిక సమాజాలుగా మారిపోయాయి. అయితే అన్ని గిరిజన తెగలు ప్రారంభంలో మాతృస్వామికంగానే వుండేవి. గిరిజన తెగల్లో ఈ మార్పులు అనేక సామాజిక, ఆర్థిక పరిణామాలతోపాటుగా తెగల్లోని పురుషసభ్యుల ఆలోచనా ధోరణిలో వచ్చిన పెక్కు మార్పుల కారణంగా సంభవించాయి. ఈ క్రమం సమాజంలో పదివేల సంవత్సరాలనాడు ప్రారంభమయ్యిందని చెప్పవచ్చు. ఆహారసేకరణ దశలో ఎటువంటి తేడాలు లేకుండా స్త్రీ పురుషులు నివశించారు.

ఏ సమాజంలో పితృస్వామ్యం కొనసాగుతుందో అది నాగరికత ముసుగులో కొనసాగుతున్న బానిస సమాజమే. అయితే ఆ బానిస తిరగబడడం చారిత్రక అనివార్యత. (పితృసామ్య వ్యవస్థలో స్త్రీ- పేజి 69,71)

## కుటుంబంలో స్త్రీల హక్కులు ఎలా వుండేవి?

పూర్వం భార్యను భర్తపేరుతో పిలిచేవారు కాదు. ఔ అని, ఏమండి అని, వున్నావా అని సంబోధించేవారు. ఇప్పుడు స్నేహితుల్లా ఉల్లాసంగా పరస్పరం స్నేహితుల్లా పేర్లతో పిలుచుకుంటున్నారు. మగపెత్తనం తగ్గించుకొని స్త్రీలను గౌరవించే సంస్కృతి కొద్దికొద్దిగా పెరుగుతున్నది. భార్యాభర్తల ప్రేమ అంటే ఏమిటో ఓహెన్రీ ఒకథలో చక్కగా చిత్రించారు. పేదరికంవల్ల మ్యారేజ్‌డేకి ఏం తీసుకోవాలోఅని ఆలోచించి భార్య తన జుట్టు అమ్మి భర్త కోటుకోసం మంచి గుండీలు కొంటుంది. భర్త తన కోటు అమ్మి భార్యకు జడలో పెట్టుకొనే పువ్వు కొనుక్కొస్తాడు. సాయంత్రం ఇద్దరు ఇంటివద్ద చూసుకొని ఒకరికానుక మరొకరికి ఇచ్చుకుంటారు. విషాదంగా నవ్వుకుంటారు. అతనికి గుండీలు పెట్టుకోవడానికి కోటులేదు, ఆమెకు జడపువ్వు పెట్టుకోవటానికి జడలేదు. అదీ ఆ ప్రేమకథ.

### పెళ్లి ఎన్ని విధాలు?

పెళ్లి పలువిధాలు, పూర్వం స్వయంవరం, గాంధర్వం, రాక్షస వివాహంవంటి పేర్లతో వర్గీకరించారు. గాంధర్వం అంటే ఎవరి ప్రమేయం లేకుండా ఎవరి సాక్ష్యం అక్కర్లేకుండా స్త్రీ, పురుషులు కలుసుకోవడం, పెళ్లి చేసుకొని జీవించడం. స్వయంవరం అంటే రాజకుమారులందరిని పిలిచి వారిలో ఒకరిని పూలదండవేసి వరించడం. రాక్షసవివాహం అంటే కుటుంబ పెద్దలు వ్యతిరేకించినా స్త్రీ అంగీకారంతో ఆ యింట్లోంచి బలవంతంగా తీసుకొనిపోయి పెళ్ళి చేసుకోవడం. అలాగే తల్లిదండ్రులు పిల్లలకు బాల్యవివాహాలు చేసేవాళ్లు. వాళ్లు కాపురానికి వచ్చేలోగానే ఏవో గొడవలై విడాకులు తీసుకొని తిరిగి రెండోపెళ్లి చేసేవాళ్లు.

స్త్రీవాదంలో ఒక వర్గం గాంధర్వ వివాహాలని, స్వయంవరాలని అంబేద్కర్ వివరించిన కన్యావిధానాన్ని, అయోనిజ విధానాన్ని అధునిక అవసరాలకు అనువుగా జండర్ స్వేచ్ఛ పేరిట ఆచరించడానికి కృషి చేస్తున్నది. పెళ్లి చేసుకున్నామని ఇతరులకు చెప్పనవసరం లేదని కొందరు భావిస్తున్నారు. దీన్ని పాతభాషలో కూడుకున్నారు అని గాంధర్వ వివాహం అని వ్యవహరిస్తారు. అంటే పెళ్లి లేకుండా జీవించడాన్ని ఎంతో కొంత మేరకు వెనకటకూడా అంగీకరించేవారని అంబేద్కర్ విశ్లేషణ తెలుపుతున్నది.

### ఒకరికి అనేకమంది భార్యలుండే కుటుంబం

పూర్వం ఒక్కొక్కరికి ఇద్దరు ముగ్గురు భార్యలుండేవారు. అలాగే ఒక్కొక్కరికి ఇద్దరు ముగ్గురు భర్తలుండేవారు. భర్త ఉండగా మరొక ప్రియుడుంటే 'మిండడు' అని పిలిచేవారు. భార్య ఉండగా మరొక భార్య ఉంటే పెద్దభార్య, చిన్నభార్య అని పిలిచేవారు.

ఒకాయనకు ఇద్దరు భార్యలు. ఒకామె పెళ్లి భార్య. మరొకామె ఉద్యోగం చేస్తున్నప్పుడు పరిచయమై ప్రేమించుకొని చిన్న భార్యగా మారినామె. ఒకరికన్నా ఎక్కువ భార్యలుంటే వారిని సవతులు అంటారు. సవతులు పోట్లాడుకునేవాళ్లు. కొంత కాలానికి ఒక అవగాహన కుదిరింది. మొదటిభార్య దగ్గర మొదటి మూడురోజులు రెండవభార్య దగ్గర తరువాత మూడు రోజులు ఉండడం. కాలక్రమేణ వారిద్దరి పిల్లలు కలిసి ఆడుకుంటారు. అతడు రెండిళ్లకు వెళ్లివస్తుంటాడు. ఇది శతాబ్దాలుగా సాగుతూ వస్తున్నది. శివుడు, విష్ణువు, తిరుపతి వెంకటేశ్వరస్వామికి ఇద్దరేసి భార్యలున్నారు. కృష్ణునికి ఎనిమిదిమంది భార్యలు.

### ఒకరికి అనేకమంది భర్తలుండే కుటుంబం

ఒక స్త్రీ ద్రౌపదిలా కాకపోయినా కనీసం ఇద్దరు భర్తలతో కాపురం చేయాలనుకుంది. ఆమె ఇద్దరిని విడిచి ఉండలేదు. మూడు రోజులు పెద్దభర్తతో, మూడు రోజులు చిన్నభర్తతో ఉంటున్నది. పెద్ద భర్తకు ఒకరిని చిన్నభర్తకు ఒకరిని కన్నది. ఆ పిల్లలు కలిసి ఆడుకుంటారు. భర్తలకు వేరే భార్యలు లేరు. ఒకే భార్యతో ఇద్దరు భర్తలు కలసి హాయిగా కాపురం చేసుకుంటున్నారు. ఆమెకు ఇద్దరు భర్తలు. నా భార్య ఇవాళ



ఇంట్లోలేదు. చిన్న భర్త దగ్గరికి పోయింది. మూడురోజుల తరువాత మళ్లీ ఇక్కడికి వస్తుంది అని స్నేహితులతో చెప్పుకొనే అవకాశం స్త్రీలకుకూడా ఉండాలని అంగీకరించినప్పుడే ఇద్దరు భార్యలను అంగీకరించవచ్చు అని కొందరు అంటారు.

### ఒక పురుషునికి ఒకరే భార్య అనడంతో

### ప్రపంచంలో మొదటిసారిగా రిజర్వేషన్లు ప్రారంభమయ్యాయి

ఇలాంటివన్నీ చూసి సమాజం ఒక స్త్రీ ఒక పురుషుడు పెళ్లి చేసుకొని కలసి జీవించాలని ఒక సంస్కృతిని రూపొందించికుంది. రిజర్వేషన్ విధానం ప్రపంచంలో మొదటిసారిగా ఒకే భార్య ఒకే భర్త అనే పెళ్లి, కుటుంబవ్యవస్థలో మొట్టమొదటగా అమలు జరపబడింది. తద్వారా సామాజిక సంఘర్షణలను చాలావేరకు నివారించుకోవడం సాధ్యపడింది. నాకు ధనం వుంది, శక్తివుంది, ప్రతిభవుంది, రాజ్యంవుంది కనుక ఎంతమంది స్త్రీలనైనా, ఎంతమంది పురుషులనైనా పెళ్లిచేసుకొనే హక్కుందని లేదా ఉంచుకొనే హక్కుందని కొందరు వాదించారు. వారి వాదనను సమాజం అంగీకరించలేదు.

అలాగే నాకు ప్రతిభవుంది, ధనంవుంది, శక్తివుంది, రాజ్యంవుంది కనుక రిజర్వేషన్లు వద్దని తనకే అవకాశమివ్వాలని కొందరు కోరుతున్నారు. అందరికి భార్యలు, భర్తలు అవసరం అయినట్టుగానే అందరికి చదువు ఉద్యోగాలు అవసరం. అంతేకాని ప్రతిభతో శక్తితో చర్చలుచేస్తే కుటుంబం పెళ్లివ్యవస్థకూడా భార్యాభర్త అనే రిజర్వేషన్లుకూడా ఉండవు, ఉండనవసరంలేదని కోరుకున్నవాళ్ళవుతారు. అలాగే సరిహద్దులమీద రక్షణకోసం సైన్యంకూడా అవసరం లేదని, ప్రతిభ వున్నవాళ్లే దేశాలను ఆక్రమించుకోవచ్చని చాతనైనవాళ్ళు స్వయంగా కాపాడుకుంటారని, అలాగే ఇతరదేశాల సరుకులను, మతాలను స్వేచ్ఛగా రానివ్వాలని అందువల్ల ఎగుమతి దిగుమతి నిబంధనలు ఉండనవసరంలేదని అప్పుడే నిజమైన ప్రతిభ స్వేచ్ఛ ఉంటుందని కొందరు అంటున్నారు. రిజర్వేషన్ వ్యతిరేకవాదులు, పెళ్లి అవసరం లేదనే స్త్రీవాదులు వీటినికూడా సమర్థించినపుడు వారికి చిత్తశుద్ధి ఉన్నట్టని వాళ్ళు అంటారు. అయితే ఇదంతా మానవ సమాజం గడచివచ్చిన ఆటవిక దశలకు తిరిగి వెళ్ళడమే అని మరికొందరు అంటారు. వెనకటి ఆర్యుల ఆటవిక సమాజాన్ని అంబేద్కర్ ఉల్లేఖనలో పైన చూశాం. ఇలాంటి సమాజాన్నా ఫెమినిస్ట్లు, హిందువులు కోరుకునేది? అని కొందరు ప్రశ్నిస్తున్నారు.

స్త్రీలను గౌరవిస్తూ ఎదిగించడంకోసం 'పురుషుణ్ణి విద్యావంతుణ్ణి చేస్తే ఒకరిని విద్యావంతుణ్ణి చేసినట్లు. స్త్రీని విద్యావంతురాలిని చేస్తే ఒక కుటుంబాన్ని విద్యావంతం చేసినట్లు' అని సూక్తులు ఆవిర్భవించాయి అని అంటాడు కత్తిపద్మారావు.

### స్వార్థాన్ని నేర్పుతున్న నేటి కుటుంబం

సామాజిక ప్రాథమిక యూనిట్గా ఉన్న నేటి కుటుంబం సామాజిక కర్తవ్యాలను త్యాగాలను నేర్పకుండా వ్యక్తిగత స్వార్థాన్ని వ్యక్తిగత ఆలోచనా విధానాన్ని నేర్పుతున్నది. దీని వల్ల సమాజం మొత్తం కలుషితమైపోయింది. ఇలాంటి కుటుంబం విచ్ఛిన్నమైతే పిల్లలు మనుషులందరిని ప్రేమించడం ప్రారంభిస్తారు. ఈ కుటుంబ వ్యవస్థ ఉన్నంతకాలం తల్లిదండ్రులు తమ పిల్లల్ని మాత్రమే ప్రేమిస్తారు.

## కుటుంబ వ్యవస్థ రద్దు అవసరమా?

కుటుంబం మొత్తం సమాజాన్ని ప్రేమించే సంస్కృతిని నేర్పితే కుటుంబం విచ్ఛిన్నమయ్యే అవసరమూ లేదు. వ్యక్తిగత కుటుంబంలో పిల్లలు తమ వాళ్ళను, తమ స్వార్థాన్ని మాత్రమే ప్రేమిస్తారు. ప్రస్తుత కుటుంబ వ్యవస్థ ఒక పంజరం.

కుటుంబం అనేది సమాజిక వ్యవస్థయొక్క చిన్న యూనిట్. సామాజిక వ్యవస్థ ఎలా ఉంటే కుటుంబం అలా ఉంటుంది. ఫ్యూడల్ సమాజంలో ఫ్యూడల్ కుటుంబం ఉంటుంది. పెట్టుబడిదారి సమాజంలో పెట్టుబడిదారి కుటుంబం ఉంటుంది. కుల సమాజంలో కులవ్యవస్థ తాలూకు కుటుంబ నిర్మాణం ఉంటుంది. గ్లోబలైజేషన్, ప్రైవేటైజేషన్, లిబరలైజేషన్ సమాజంలో కుటుంబంకూడా దీన్ని అనుసరించే లిబరలైజ్, ప్రైవేటైజ్ అవుతుంది. కుటుంబంలో అన్ని సరళీకృతం స్వేచ్ఛాయుతం అవుతాయి అని అంటారు.

వ్యక్తిగతమని పిలిచే ప్రతీది రాజకీయమైనదే అని కొందరు స్త్రీవాదులు సిద్ధాంతీకరించారు. అయితే మరికొందరు స్త్రీవాదులు సహజీవనం చేస్తున్నాం అంటారు. అయితే అలా అనికాని పెళ్లిచేసుకున్నామనికాని చెప్పరు. ఇది మా వ్యక్తిగత విషయం అని అంటారు.

## పరిష్కారాలు రెండు రకాలు

ఆరోగ్యాన్ని కాపాడుకునే విధానాలు రెండు రకాలు. ఒకటి రోగాలు వచ్చాక నయం చేసుకోవటం. రెండు రోగాలు రాకుండా చూసుకోవడం. పాశ్చాత్య దేశాల్లో కుటుంబ వ్యవస్థ అస్థవ్యస్థమైందని దాని తిరిగి బాగుచేసుకోగోరుతున్నారని అందుకు ఆసియా దేశాల కుటుంబ వ్యవస్తవైపు ఆశగా, ఆదర్శంగా చూస్తున్నారని కొందరు అంటారు. అదే నిజమైతే భారతీయులకు కుటుంబవ్యవస్థ జబ్బు పడకుండా దాన్ని మరింత ఉన్నతంగా ఆధునిక జీవితానికి అనుకూలంగా మార్చుకోవడం అవసరం.

## కుటుంబం ఇప్పుడు ఎవరికి రక్షణ ఇస్తుంది?

కుటుంబ నియంత్రణవల్ల, వ్యక్తి కుటుంబాల వల్ల ఇంట్లో పిల్లల సంఖ్య తగ్గి కుటుంబానికి పరిమితమౌతూ చొరవ కోల్పోతూ బంధువులనే సెంటిమెంట్స్ తగ్గుతున్నాయనే అభిప్రాయం తప్పు అంటారు. కుటుంబం ఒక రక్షణ కేంద్రంగా చాలామంది భావిస్తారు. కుటుంబం ఇచే రక్షణగురించి తత్వవేత్తలమధ్య భిన్నాభిప్రాయాలున్నాయి.

ఓషో ఇలా అంటాడు 'జీవితంలో రక్షణ పట్ల వ్యామోహం పెంచుకోకండి. రక్షణ అనేది అసంభవం. ఏ రక్షణ లేకపోవడమే జీవితం.' అతని ప్రకారం చూస్తే కుటుంబ వ్యవస్థలో సమాజంలో ఉండే రక్షణ పట్ల ఆశ పెంచుకోకూడదు.

కుటుంబ వ్యవస్థ రక్షణపేరుతో ఈ రోజు స్వార్థానికి కేంద్రం అయ్యింది. వారసత్వ ఆస్తి హక్కువల్ల తల్లిదండ్రులు పిల్లల భవిష్యత్తు అనే పేరుతో స్వార్థానికి కేంద్రంగా కుటుంబాన్ని మార్చారు. పిల్లలు తమ స్వార్థం కోసం తల్లిదండ్రున్ని కూడా లెక్క చేయడం లేదని, ఉన్న ఈ చిన్నపాటి కుటుంబ వ్యవస్థ అంతరిస్తే ఎలా అని వాపోవడం సరిఅయినదికాదు. ఈ కుటుంబ వ్యవస్థ ముఖ్యంగా దీనితో ముడిపడివున్న వారసత్వం,



ఆస్తిహక్కు ఎంత తొందరగా అంతరిస్తే అంత తొందరగా మనుషుల మధ్య, అనురాగం, ఆత్మీయత పెరిగే నవసమాజం ఆవిర్భవిస్తుంది. అది మునుపటి సోషలిస్టు వ్యవస్థ కన్నా ఉన్నతంగా ఉంటుందని కొందరు భావిస్తారు.

స్వార్థమే కుటుంబ వ్యవస్థలో... పిల్లల పెంపకంలో మూలభాష. వారసత్వం, ఆస్తిహక్కు స్వార్థం నశిస్తే కుటుంబ వ్యవస్థ కూడా అదృశ్యమవుతుంది. తోటి వారికి తోడ్పడే స్వభావం, వారిని ప్రేమించే స్వభావం, భాష, ఆచరణ కుటుంబంలో నేర్పితే సమాజం మొత్తం ప్రేమ పూరితమవుతుంది. అప్పుడు ఇప్పటిలా ఏ కొందరో మొత్తం సమాజం మారడానికి యుద్ధంలో బలిఅయ్యే దశ అంతరిస్తుంది. అందరు కల్సి సమాజాన్ని ఆనందమయంగా మార్చుకుంటారు అని అంటారు.

## వివాహం పట్ల భ్రమల్ని వదలాలి అన్న జిడ్డు కృష్ణమూర్తి

జిడ్డు కృష్ణమూర్తి వివాహాన్ని గురించి వున్న భ్రమలను పటాపంచలు చేస్తాడు. అందులో వుండే రక్షణ ఎంత డొల్లో వివరిస్తాడు. ఆయన ఇలా అంటాడు. "వివాహాన్ని ఒక ఆదర్శవాదంగా చేయవద్దు. ఉన్నదానిని వున్నట్లుగా చూద్దాం. అప్పుడే ఆ విషయంలో ఏదైనా చేయగలుగుతాం. అది ఒక పూలబాట అన్నట్లుగా చిత్రించుకుంటే యిక దానిని గురించి ఏ చర్యా తీసుకోలేము.

సరే, వాస్తవంలో అసలు ఏం జరుగుతుంది? యౌవనంలో వున్నప్పుడు శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన వాంఛ చాలా తీవ్రంగా వుంటుంది. దీనికి హద్దులు ఏర్పరచడం కోసం వివాహం అనే వ్యవస్థను ఏర్పాటు చేశారు. ఇరు పక్షాలలోను యీ శరీర సంబంధమైన వాంఛ వుంటుంది. అందువల్లనే మీరు పెళ్లిళ్లు చేసుకుంటున్నారు. పిల్లల్ని కంటున్నారు. ఒక పురుషుడికో, ఒక స్త్రీకో జీవిత పర్యంతం మిమ్మల్ని కట్టి వేసుకుంటుంటారు. ఈ విధంగా సుఖాన్ని అందించడానికి ఒక శాశ్వతమైన ఏర్పాటూ, మీ భద్రతకు హామీ లభిస్తాయి. దీని ఫలితంగా క్రమక్రమంగా మీరు క్షీణించిపోతారు. అలవాటు అనే చక్రంలో పడి, జీవిస్తూ వుంటారు.

అలవాటు అంటేనే క్షీణించిపోవడం. ఈ శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన వాంఛను అవగాహన చేసుకోవాలంటే విశేషమైన తెలివి వుండాలి. అయితే యింత వివేకం మనలో కలిగేలా మనకి విద్యాబోధన చేయడంలేదు. కలిసి జీవితం గడపవలసిన పురుషునితో లేదా స్త్రీతో ఎట్లాగో ఒకలాగా నెట్టుకొని పోతుంటాం. 20, 25 ఏళ్ల వయసులో నేను పెళ్లి చేసుకుంటాను. ఇక తక్కిన జీవితకాలమంతా, ఆ స్త్రీ గురించి నాకు ఏమీ తెలియకపోయినా ఆమెతో నేను గడిపితీరాలి. ఆమెను గురించి నాకు కాస్తయినా తెలియదు. అయినా జీవితాంతం ఆమెతో నేను జీవించాలని మీరు అంటున్నారు. వివాహం అనే పేరుతో మీరు పిలుస్తున్నది యిదేనా? నేను ఎదుగుతున్న కొద్దీ, పరిశీలిస్తున్న కొద్దీ, ఆమెకూ నాకూ మధ్య ఎన్నో వ్యత్యాసాలు కనిపిస్తుంటాయి. ఆమె వేరూ అని, ఆమె అభిరుచులు పూర్తిగా భిన్నమైనవనీ గ్రహిస్తాను. ఆమెకి క్లబ్బులకి వెళ్లడం అంటే చాలా యిష్టం. నాకేమో గంభీరమైన విషయాల్లో ఆసక్తి, లేదూ ఆమెకి యిందులోనూ నాకు అందులోనూ ఆసక్తి. అయినా కూడా మీకు పిల్లలు కలుగుతారు. అదే యిందులో వున్న వింత.

## వివాహాన్ని ఒక అలవాటుగా మార్చుకుంటే ఏం జరుగుతుంది?

చాలా చాలా కొద్దిమందికి, ప్రేమించేవారికి మాత్రమే వివాహ బాంధవ్యానికి వున్న విలువ తెలుసు. వారికి అది విడదీయరానిది. కేవలం ఒక అలవాటు వంటిదో, ఒక సౌందర్యం వంటిదో కాదు. అది శరీర సంబంధమైన, సెక్స్ సంబంధమైన అవసరాల మీద ఆధారపడినది కాదు. ఏ నిబంధనలూ లేని ఆ ప్రేమలో వ్యక్తిత్వాలు పూర్తిగా కలిసి ఒకటైపోతాయి. అటువంటి బాంధవ్యంలోనే వుపశాంతి లభిస్తుంది. ఆశ వుంటుంది. అయితే మీలో చాలామందిలో మీ మీ వివాహ బాంధవ్యాల్లో యిటువంటి ఐక్యత వుండదు. వేరు వేరుగా వున్న రెండు వ్యక్తిత్వాలు కలసి ఒకటైపోవాలంటే, మిమ్మల్ని మీరు తెలుసుకోవాలి. ఆమే తనని తాను తెలుసుకోవాలి. దీని అర్థమే ప్రేమ. కాని మీకు ప్రేమ లేదు, అదీ స్పష్టంగా కనబడుతున్న వాస్తవం. ప్రేమ ఎప్పుడు కొత్తగా, నవ్య నూతనంగా వుంటుంది. అది కేవలం కోరికలు తృప్తి పరచుకోవడం కాదు. వట్టి అలవాటూ కాదు. దానికి ఏ షరతులూ వుండవు. మీ భర్తని, లేదా భార్యని మీరు యీ విధంగా చూడరు. అవునా? మీ ఏకాంతవాసంలో మీరు నివసిస్తుంటారు, తన ఏకాంతవాసంలో ఆమె నివసిస్తుంటుంది. అయినా నిరాటంకంగా సెక్స్ సుఖపు అలవాట్లను సాగించుకుంటూ వుంటారు. ఒక స్థిరమైన ఆదాయం క్రమం తప్పకుండా వస్తూ వుంటే ఆ వ్యక్తి ఏమైపోతాడు? నిస్సందేహంగా దిగజారిపోతాడు. మీరా సంగతి గమనించలేదూ? స్థిరమైన ఆదాయాన్ని పొందుతున్న ఒక వ్యక్తిని జాగ్రత్తగా గమనించండి. అతని బుద్ధి అతివేగంగా శుష్కించిపోతూ వుండటం మీరు చూడవచ్చు. అతను గొప్ప పదవిలో వుండవచ్చు, మహా చాతుర్యం గల వాడనే ఖ్యాతి వుండొచ్చు. అయితే జీవితంలోని అసలైన ఆనందాన్ని మాత్రం అతను కోల్పోయాడనే చెప్పాలి.

వివాహాన్ని ఒక అలవాటుగా, ప్రతిరోజూ సుఖాన్ని అందజేసేదానిగా అలవరచుకుంటే, అది మనిషి దిగజారిపోవడానికి కారకమవుతుంది. ఎందుకంటే అలవాటులో ప్రేమ వుండదు. ప్రేమ అలవాటయిపోదు. ప్రేమ అంటే చాలా వుల్లాసకరమైనది. సృజనాత్మకమైనది. నవ్యనూతనమైనది. అందుకని అలవాటు ప్రేమకి పూర్తిగా ప్రతికూలమైనది. అయితే మీరు అలవాటులో చిక్కుకుపోయారు. ఎదుటివారితో మీ బాంధవ్యం అలవాటుగా మారిందంటే అది నిస్సందేహంగా నిర్జీవమైపోయినట్టే.

## కుటుంబంలో ఆదాయాల పంపిణీ ఎలా వుండాలి?

ఉద్యోగస్తులకు, సంఘటిత రంగ కార్మికులకు యాజమాన్యాలు కుటుంబం యూనిట్‌గా తీసుకుని వాటి ఖర్చు వెచ్చాలకు, జీవన ప్రమాణాలకు లెక్కించి జీతమిస్తారు. సుమారుగా ఐదుగురు పోషణకు సరిపోయే జీతం నిర్ణయించబడుతుంది. ఇందులో తల్లిదండ్రులు, భార్యాభర్తలు, వారి ఇద్దరి పిల్లలు లెక్కించబడతారు. ఇద్దరు పిల్లలను హాఫ్ టికట్‌లాగా లెక్కించి చూసుకుంటే ఐదుగురికి సరిపోయే మేరకు జీతం ఇస్తున్నారనుకోవచ్చు.

అయితే ఇస్తున్న జీతం ఉద్యోగి చేతికే వస్తుంది. దీన్ని అతడు లేదా ఆమె ఒక ధర్మకర్తగా ఆ కుటుంబ సభ్యులకు సమంగా అవసరాల ననుసరించి ఖర్చు చేయాలి. అనగా ఉద్యోగి లేదా కార్మికుడు తాను సంపాదించే సంపాదనలో 20 శాతం మాత్రమే



తనకోసం ఖర్చు చేసుకోవాలి. మిగతా 80 శాతం కుటుంబానికి ఖర్చు చేయాలి.

ఈ 80 శాతం నుండి ఆస్తులు కూడబెట్టుకోవడానికి, పొదుపు చేసుకోవడానికి అనుకోకుండా వచ్చే ఆపదలకు, ఖర్చులకు కూడా పక్కన పెట్టవలసి వుంటుంది. ఉద్యోగి లేదా కార్మికులు తమ జీతంలో 20 శాతంతోనే అన్ని ఖర్చులు వెళ్లదీసుకోవాలి. ఇలా జరిగినపుడు తల్లిదండ్రులు, పిల్లలు వారి వారి సౌకర్యాలు చదువులు చక్కగా కొనసాగుతాయి. ఆనందంగా ఉంటారు. భార్యకు ఈ లెక్కన భర్త జీతంలో 20 శాతం మేరకు హక్కు ఉంటుంది. తన చీరలు సారెలు, తిండి, వసతి, ఖర్చులు, నగలు, మరియు పొదుపు అంతా ఈ 20 శాతం లోనే సాగవలసి వుంటుంది.

వ్యక్తి కుటుంబాలు ఏర్పడ్డాక తల్లిదండ్రులు, పిల్లలు ఉద్యోగం చేసేచోటికి వెళ్లడంలేదు. కనుక వారిపై అదుపు అధికారం లేకుండా పోయింది. భార్య తనమీద ఆధారపడిందే. పిల్లలు నోరులేనివారు. ఈ సందు చూసుకుని ఉద్యోగులు, కార్మికులు, సంపాదనపరులు 20 శాతానికి బదులుగా 70, 80 శాతం తన ఒక్కడి కోసమే ఖర్చు చేసుకుంటున్నారు. జీతం తన చేతికి వస్తుంది కాబట్టి తన ఇష్టప్రకారంగా ఖర్చు పెట్టుకుంటానని భార్యాపిల్లలను, తల్లిదండ్రులను దబాయిస్తున్నారు. సమాజాన్ని కూడా దబాయిస్తున్నారు.

## వ్యక్తి కుటుంబాలు ఏర్పడ్డాక పెరిగిన స్వేచ్ఛ ఏం చేసింది?

ఇలా వ్యక్తి కుటుంబాలు ఏర్పడ్డాక వచ్చిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల వల్ల మద్యపానం, సిగరెట్లు, ధూమపానం, హోటళ్లు, సినిమాహాళ్లు, వ్యభిచారకొంపలు, పేకాట, జూదం, ఇష్టాయాత్రలు పెరిగాయి. మద్యపానం పెరగడానికి వ్యక్తి కుటుంబాలు పెరగడానికి మధ్య ప్రత్యక్ష సంబంధం ఉంది. భార్య నిలదీస్తే బెదిరిస్తారు. ఇలా ఐదుగురి కోసం ఇచ్చే జీతభత్యాలు ఒక్కడి ఇష్టారాజ్యంగా ఖర్చు చేయడంవల్ల లక్షలాది కుటుంబాలు ఎదగకుండా పోతున్నాయి.

ఉమ్మడి కుటుంబ వ్యవస్థ కష్టాలు ఉమ్మడి కుటుంబ వ్యవస్థకూ ఉన్నాయి. ఇంటిపెత్తనం అంతా పాత భావాలతో నిండిపోయిన పెద్ద చేతిలో ఎవరికీ స్వేచ్ఛ ఉండేది కాదు. అయితే ఉమ్మడి కుటుంబ ప్రయోజనాల కోసమే కుటుంబం, కులవృత్తి కొనసాగేది.

వెనకటి ఉమ్మడి కుటుంబాలలో పెద్దల ముందు భార్యాభర్తలు చూసుకోకూడదు, మాట్లాడుకోకూడదు. నవ్వుకోకూడదు. అపరిచితుల్లా ప్రవర్తించాలి. ఇంటికి కోడలుగా తప్ప భర్తకు భార్యగా ఉండే అవకాశాలు ఉండేవి కావు. అయితే పల్లెల్లో విస్తారమైన పొలాలు, పెరండ్లు, చెరువులు, చెలుకలు, వ్యవసాయ పనుల వల్ల భార్యాభర్తలు ఇంటి బయట ఎక్కడైనా హాయిగానే ఉండేవారు.

మరోవైపు చూస్తే ఇంటివద్దే కులవృత్తులు చేసే సాలీలు, విశ్వబ్రాహ్మణులు, వైశ్యులు మొదలైన కులాల్లో బయటికెళ్లడం తక్కువ. కనుక, కొడుకు కోడలు ముచ్చటించుకునే అవకాశాలు ఉండేవికావు.

ఉమ్మడి కుటుంబాల కాలంలో కులవృత్తులే బతుక్కు ఆధారం. అయిదు, పది ఏళ్ళ వయసులోనే పెళ్లిళ్లు చేసేవాళ్లు. పండగ పండక్కు వీరిని తీసుకురావడం,

తీసుకుపోవడం పేరిట ఎన్నో విందులు జరిగేవి. విందుల్లో ఎప్పుడైనా లోపం జరిగితే ముందే చెప్పినట్టు విడాకుల దాకా పంచాయతీ జరిగేది.

**సమాజంలో స్త్రీ పురుషుల సంబంధాలు**

భారతీయులలో కూడా దిగువ మధ్య తరగతి, శ్రామిక ప్రజానీకంలో మిగతా ప్రపంచంలో లాగే విడాకులు, మారుమనువులు సర్వసాధారణం. అవి మొదటి నుంచి ఉన్నాయి. వాటిని మెజార్టీ ప్రజలు ఎపుడూ తప్పుగా భావించలేదు. అయితే మెయిన్ స్ట్రీం సృష్టిస్తున్న సంస్కృతి వేరు. దాన్ని అడాప్ట్‌చేసుకొని సాంస్క్రిటైజ్ అవుతూ యిప్పుడు తప్పని కొందరనుకుంటున్నారు. మరో వైపు ఫెమినిస్టులు దాన్ని వ్యతిరేకిస్తున్నారు. దీనికి బదులుగా కత్తిపద్మారావు చెప్తున్నట్టుగా మన పూర్వీకుల తల్లి సంస్కృతిని హైలైట్ చేస్తూ ప్రధాన జాతీయ సంస్కృతిగా మీడియాలో పాఠ్యపుస్తకాల్లో చెప్పగలిగితే ఫెమినిజంకన్నా వందరెట్ల శక్తితో అద్భుతాలు సృష్టించవచ్చు.

నేటి కుటుంబం చిన్న కుటుంబంగా కుదించుకుపోయింది. భార్యాభర్తలు, వారి పిల్లలు కలిసి కుటుంబంగా మారింది. వారి తల్లిదండ్రులు ఎక్కడో ఉంటారు. ఇప్పుడు చదువుల పేరుతో పిల్లలు కూడా ఇతర ఊళ్లల్లో, హాస్టళ్లలో ఉంచబడుతున్నారు. చివరకు భార్యాభర్తలే కుటుంబంగా మారింది.

### ప్రశ్నలు

1. కుటుంబం అంటే ఏమిటి?
2. కుటుంబం ఎలా పుట్టింది?
3. కుటుంబ వ్యవస్థ పుట్టకముందు మానవులు ఎలా జీవించేవారు?
4. కుటుంబ వ్యవస్థకు పెళ్లి ఒక ప్రాతిపదిక అవుతుందా? కాదా? చర్చించండి.
5. పూర్వం పెళ్లి కాకముందు, కుటుంబ వ్యవస్థకు ముందు స్త్రీ పురుష సంబంధాలు ఎలా వుండేవి?
6. బహుభార్యత్వం, బహుభర్తృత్వం ఎలా, ఎందుకు తగ్గుతూ వచ్చింది?
7. కుటుంబం ఇచ్చే భద్రత, రక్షణ ఎలాంటిది?
8. నేటి కుటుంబ వ్యవస్థ ఎలా వుంది?
9. మీ కుటుంబం ఎలా వుంది? వివరంగా రాయండి.



# కుటుంబ వ్యవస్థ ఉండాలంటే ఏం చేయాలి?

## రద్దు అవాలంటే ఏం చేయాలి?

కొందరు కుటుంబ వ్యవస్థ ఉండాలని కోరుతున్నారు. కొందరు అవసరం లేదని అంటున్నారు. కొందరు కుటుంబ వ్యవస్థ అదృశ్యమవుతుందని ఊహాలు చేశారు. అందుకు వాళ్లు ఇప్పటికే యూరప్, అమెరికా, రష్యా, ఆస్ట్రేలియా దేశాలలో, కుటుంబ వ్యవస్థను ఇరవై శాతం మంది వదిలేశారని చూపిస్తున్నారు. కొందరు గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చారు. దాహం వేసినప్పుడు నీళ్ళు తాగినట్లు, కోరిక కలిగినప్పుడు ఎవరితోనైనా సరే సెక్సు ఉబలాటం తీర్చుకోవచ్చు అని దీని అర్థం. పెళ్ళి కుటుంబం అవసరంలేదని వారి భావం. అంటే వెనకట ఆర్య స్త్రీలు, పురుషులు యధేచ్ఛగా కలుసుకున్నట్టుగా కలుసుకోవాలని కోరుతున్నారు. దీన్ని కొందరు ఫెమినిస్టులు, కొందరు మార్క్సిస్టులు కూడా సమర్థిస్తున్నారు. ఆచరిస్తున్నారు.

**కుటుంబ వ్యవస్థలో కన్నా తక్కువ ఖర్చుతో ఆ సౌకర్యాలు సాధ్యమా?**

కుటుంబ వ్యవస్థ కన్నా తక్కువ ఖర్చుతో ఎక్కువ ఆనందంగా జీవించే సామాజిక వ్యవస్థ కుటుంబం తీర్చే అవసరాలన్నీ తీర్చితే కుటుంబ వ్యవస్థ యొక్క అవసరం తీరిపోతుంది. అయితే అది సాధ్యమా? సాధ్యం కావాలంటే కుటుంబ వ్యవస్థ వల్ల ఎన్ని సామాజిక కార్యకలాపాలు, సంస్కృతి ఆత్మీయతలు, అనుబంధాలు, ఆర్థిక సంబంధాలు, మానవ ఉత్పత్తి సంబంధాలు కొనసాగుతున్నాయో పరిశీలించాలి. అంతకన్నా తక్కువ ఖర్చుతో అంతకన్నా ఉదాత్తంగా మానవ సంబంధాలు ఎదగాలి. అప్పుడే కుటుంబ వ్యవస్థ అవసరం తీరిపోతుంది.

కాని ఇటీవల జపాన్‌లో కుటుంబాలుగా కలిసి జీవించాలని పెయిడ్ సభ్యులు నిజమైన కుటుంబాలుగా కలిసి జీవించే రూపాలను ఏర్పాటు చేసుకుంటున్నారు ఎందువల్ల?

ఇప్పటికైతే యూరప్‌లో, అమెరికాలో, ఇండియాలో కూడా మధ్య తరగతి జీవితంలోనే కుటుంబ వ్యవస్థలో దొరికే సౌకర్యాలు కుటుంబ వ్యవస్థ లేకపోయినా సాధించుకోవడం జరుగుతుంది. ముఖ్యంగా డిగ్రీ కాలేజి లెక్చరర్‌లు, సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లు స్థాయిలో జీవించే వారికి ఇది సాధ్యమవుతున్నది. కాని ఇతరులకు హోటల్ ఖర్చులు,

పిల్లల పెంపకం, సెక్స్ అవసరాలు, ఆత్మీయ అవసరాలు, ప్రసూతి, బాలింతలకు తోడు ఉండడం చాలా ఖర్చుతో కూడుకున్న పనైపోయింది. ఇండియా నుండి అమెరికాలో ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళు తల్లిదండ్రులను పిలిపించుకుంటున్నారు. పిల్లల పెంపకానికి, ఇంటికాపలాకు, ఇతర పనులకు వారు అవసరమవుతున్నారు. పని మనుషులు లేకుండా అన్ని పనులు వాళ్ళే చేసుకుంటున్నారు. ఇవన్నీ ఇతరుల ద్వారా సేవలకు చెల్లించే డబ్బు అసలు జీతం కన్నా ఎక్కువ ఖర్చవుతుంది. అందుకని అన్ని పనులు వాళ్ళే చేసుకుంటున్నారు.

అనగా ఏమిటి? కుటుంబ వ్యవస్థలో అన్ని చవకగా చక్కగా లభించేవి. అవి బయటకొంటే ఎన్నో రెట్ల హెచ్చు ఖర్చు పెరుగుతుంది. కనుక ఉత్పత్తి ఖర్చు, సేవల ఖర్చు కుటుంబ వ్యవస్థలో ఉన్నంత తక్కువ ఖర్చు ఇతర వ్యవస్థల్లో వందేళ్ళయినా సాధ్యం కావడం లేదు. అందువల్ల కుటుంబ వ్యవస్థ రద్దవడం అనేది అంత సులభం కాదు. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, వారసత్వ అవసరాలు అలాంటివి. అసలు అలాంటి అవసరాల కోసమే వేల ఏళ్ళ చారిత్రక పరిణామంలో అన్ని మతాల్లో, అన్ని దేశాల్లో కుటుంబ వ్యవస్థ రూపుదిద్దుకున్నది. అది ఏ ఒక్కరి సిద్ధాంతం కాదు. వేల ఏళ్ళ మానవాళి ప్రయోగాల, అనుభవాల ఫలం.

అసలు కుటుంబ వ్యవస్థ ఎందుకు ఉండాలి? అది ఎందుకు విచ్ఛిన్నం కావాలి? గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతం ఎందుకు? జెండర్ స్వేచ్ఛ అంటే ఏమిటి? అది గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతమా! జెండర్ స్వేచ్ఛ కుల వ్యవస్థను, కుల వివక్షతను నిర్మూలిస్తుందా? ఉన్నతమైన కుటుంబ వ్యవస్థ ఎలా ఉండాలి? ఇంతదాకా కుటుంబ వ్యవస్థ ఎలా కొనసాగింది? ఎన్ని పరిణామాలు పొందింది? తెగకు, కుటుంబానికి, కులానికి, జాతికి మధ్య గల సంబంధాలు ఏమిటి? కులం అనేది ఒక పెద్ద కుటుంబమా? తెగ అనేది కూడా ఒక కుటుంబ వ్యవస్థేనా? జాతి అనేది కూడా కుటుంబ వ్యవస్థ వంటిదేనా? వీటిని పరిశీలిద్దాం.

## కుటుంబ వ్యవస్థ ఎందుకు అవసరమో అని చెప్పేవాళ్ళ కారణాలు

1. కుటుంబ వ్యవస్థ సమాజానికి ఒక ప్రాథమిక యూనిట్. పిల్లల పెంపకం, వారి చదువులకు, కుటంబ సభ్యుల రక్షణకు బాధ్యత వహిస్తుంది.
2. భోజనం-వంట, ఇళ్ళు-వసతి, పడక-నిద్ర, సుఖశాంతులు, నివాసం కోసం కుటుంబ వ్యవస్థ అవసరం.
3. వేల ఏళ్లలో మానవ సమాజం ప్రపంచమంతటా ఎన్నో పరివర్తనల తర్వాత ఈ కుటుంబ వ్యవస్థకు చేరుకున్నది. అనగా కోట్లాది ప్రజల, వేలాది సంవత్సరాల సామాజిక పరిణామంలో అనుభవాల్లో వాటి గుణపాఠాల్లో నిర్మించుకున్నదే ఈ కుటుంబ వ్యవస్థ. అందువల్ల రద్దు చేయడం ప్రకృతి వ్యతిరేకం. సమాజ వ్యతిరేకం అవుతుంది. సమాజం తిరిగి అనాగరిక, ఆటవిక దశల్లోకి మారుతుంది. మానవ సంబంధాలు ఆటవిక రాజ్యాన్ని తలపిస్తాయి. అందువల్ల కుటుంబ వ్యవస్థ అవసరం.
4. సెక్సు, శృంగారం, లైంగిక ప్రేమ కోసం
5. కుటుంబ సభ్యుల మధ్య ప్రేమ, ఆత్మీయత, అనుబంధాలు
6. కుటుంబ సభ్యుల రక్షణ-హక్కులు-బాధ్యతలు
7. కుటుంబ క్రమశిక్షణ మంచి సమాజాన్ని నిర్మిస్తుంది.
8. ఒకరికొకరు తోడు
9. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, పిల్లలు, మనవలు, మనవరాండ్లు కలుసుకోవడానికి, అప్పుడప్పుడైనా అందరూ కలిసి ఉండటానికి, అనుబంధాలకు, ఆత్మీయతలకు కుటుంబ వ్యవస్థ అవసరం.
10. కుటుంబ వ్యవస్థ, వృత్తి నైపుణ్యం, కుల వృత్తి నైపుణ్యం నేర్పుతుంది. తల్లి భాష నేర్పుతుంది.
11. సంస్కృతి, అలవాట్లను, కుటుంబ వ్యవస్థ నేర్పి సమాజం యొక్క కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది.
12. భార్యను ఎదిగిస్తుంది. భర్త తోడుంటాడు.
13. వంశపారంపర్య ఆస్తి హక్కులు సంక్రమిస్తాయి.
14. ఇన్సూరెన్స్, నామిని రక్షణలు ఉంటాయి.
15. కుటుంబంలో ఉన్నప్పుడు ఇతర సభ్యులకు భయపడి దురలవాట్లకు దూరంగా ఉంటారు. (మద్యం, సిగిరెట్లు, వ్యభిచారం, జూదం మొ॥)
16. క్రమశిక్షణతో వేళకు ఇంటికి రావటం-సమయపాలన.
17. సమిష్టి కృషికి, టీమ్ స్పిరిట్‌కి ఇల్లు, కుటుంబం తొలి ప్రాతిపదికగా ఉంటుంది.
18. పెళ్ళిళ్ళు జరపడానికి ఇల్లు, కుటుంబం ఆధారంగా ఉంటుంది.
19. పొట్టతో ఉన్నప్పుడు, బాలింతగా ఉన్నప్పుడు సేవలు, రక్షణ అందిస్తుంది.
20. బంధుమిత్రులను, సొంత కుల సమాజాన్ని రెడీమేడ్‌గా అందిస్తుంది.
21. కని పెంచి యుద్ధాలకు సైన్యంగా సప్లై చేయడానికి పనికి వస్తుంది.
22. పౌర సమాజంగా ఎదగడానికి ఇల్లు, కుటుంబం ఆధారంగా ఉంటుంది.
23. కుటుంబం సహజీవన సంస్కృతిని, పరస్పర గౌరవాన్ని తెలుపుతుంది.
24. కుటుంబం క్లాస్‌రూమ్ వంటి ఒక యూనిట్‌గా పనిచేస్తుంది.
25. కుటుంబంలో భార్య కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, శయనేషు రంభా, భోజ్యేషు మాతా అని అంటారు. అలాగే ఇప్పుడు భర్త కూడా కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ వగైరా కూడా భార్యకు కూడా సేవలందించవచ్చు.
26. 'తల్లిగారి ఇల్లు' అనేది ఆడపిల్లలకు పెళ్ళైనప్పటికీ జీవితాంతం ఒక స్ఫూర్తి కేంద్రం. ఒక నైతిక మద్దతును రక్షణను ఇస్తుంది.

పిల్లల పెంపకం, సెక్స్ అవసరాలు, ఆత్మీయ అవసరాలు, ప్రసూతి, బాలింతలకు తోడు ఉండడం చాలా ఖర్చుతో కూడుకున్న పనైపోయింది. ఇండియా నుండి అమెరికాలో ఉద్యోగాలు చేస్తున్న వాళ్ళు తల్లిదండ్రులను పిలిపించుకుంటున్నారు. పిల్లల పెంపకానికి, ఇంటికాపలాకు, ఇతర పనులకు వారు అవసరమవుతున్నారు. పని మనుషులు లేకుండా అన్ని పనులు వాళ్ళే చేసుకుంటున్నారు. ఇవన్నీ ఇతరుల ద్వారా సేవలకు చెల్లించే డబ్బు అసలు జీతం కన్నా ఎక్కువ ఖర్చవుతుంది. అందుకని అన్ని పనులు వాళ్ళే చేసుకుంటున్నారు.

అనగా ఏమిటి? కుటుంబ వ్యవస్థలో అన్ని చవకగా చక్కగా లభించేవి. అవి బయటకొంటే ఎన్నో రెట్ల హెచ్చు ఖర్చు పెరుగుతుంది. కనుక ఉత్పత్తి ఖర్చు, సేవల ఖర్చు కుటుంబ వ్యవస్థలో ఉన్నంత తక్కువ ఖర్చు ఇతర వ్యవస్థల్లో వందేళ్ళయినా సాధ్యం కావడం లేదు. అందువల్ల కుటుంబ వ్యవస్థ రద్దవడం అనేది అంత సులభం కాదు. ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక, వారసత్వ అవసరాలు అలాంటివి. అసలు అలాంటి అవసరాల కోసమే వేల ఏళ్ళ చారిత్రక పరిణామంలో అన్ని మతాల్లో, అన్ని దేశాల్లో కుటుంబ వ్యవస్థ రూపుదిద్దుకున్నది. అది ఏ ఒక్కరి సిద్ధాంతం కాదు. వేల ఏళ్ళ మానవాళి ప్రయోగాల, అనుభవాల ఫలం.

అసలు కుటుంబ వ్యవస్థ ఎందుకు ఉండాలి? అది ఎందుకు విచ్ఛిన్నం కావాలి? గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతం ఎందుకు? జెండర్ స్వేచ్ఛ అంటే ఏమిటి? అది గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతమా! జెండర్ స్వేచ్ఛ కుల వ్యవస్థను, కుల వివక్షతను నిర్మూలిస్తుందా? ఉన్నతమైన కుటుంబ వ్యవస్థ ఎలా ఉండాలి? ఇంతదాకా కుటుంబ వ్యవస్థ ఎలా కొనసాగింది? ఎన్ని పరిణామాలు పొందింది? తెగకు, కుటుంబానికి, కులానికి, జాతికి మధ్య గల సంబంధాలు ఏమిటి? కులం అనేది ఒక పెద్ద కుటుంబమా? తెగ అనేది కూడా ఒక కుటుంబ వ్యవస్థేనా? జాతి అనేది కూడా కుటుంబ వ్యవస్థ వంటిదేనా? వీటిని పరిశీలిద్దాం.

## కుటుంబ వ్యవస్థ ఎందుకు అవసరమో అని చెప్పేవాళ్ళ కారణాలు

1. కుటుంబ వ్యవస్థ సమాజానికి ఒక ప్రాథమిక యూనిట్. పిల్లల పెంపకం, వారి చదువులకు, కుటంబ సభ్యుల రక్షణకు బాధ్యత వహిస్తుంది.
2. భోజనం-వంట, ఇళ్ళు-వసతి, పడక-నిద్ర, సుఖశాంతులు, నివాసం కోసం కుటుంబ వ్యవస్థ అవసరం.
3. వేల ఏళ్లలో మానవ సమాజం ప్రపంచమంతటా ఎన్నో పరివర్తనల తర్వాత ఈ కుటుంబ వ్యవస్థకు చేరుకున్నది. అనగా కోట్లాది ప్రజల, వేలాది సంవత్సరాల సామాజిక పరిణామంలో అనుభవాల్లో వాటి గుణపాఠాల్లో నిర్మించుకున్నదే ఈ కుటుంబ వ్యవస్థ. అందువల్ల రద్దు చేయడం ప్రకృతి వ్యతిరేకం. సమాజ వ్యతిరేకం అవుతుంది. సమాజం తిరిగి అనాగరిక, ఆటవిక దశల్లోకి మారుతుంది. మానవ సంబంధాలు ఆటవిక రాజ్యాన్ని



తలపిస్తాయి. అందువల్ల కుటుంబ వ్యవస్థ అవసరం.

4. సెక్సు, శృంగారం, లైంగిక ప్రేమ కోసం
5. కుటుంబ సభ్యుల మధ్య ప్రేమ, ఆత్మీయత, అనుబంధాలు
6. కుటుంబ సభ్యుల రక్షణ-హక్కులు-బాధ్యతలు
7. కుటుంబ క్రమశిక్షణ మంచి సమాజాన్ని నిర్మిస్తుంది.
8. ఒకరికొకరు తోడు
9. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు, పిల్లలు, మనవలు, మనవరాండ్లు కలుసుకోవడానికి, అప్పుడప్పుడైనా అందరూ కలిసి ఉండటానికి, అనుబంధాలకు, ఆత్మీయతలకు కుటుంబ వ్యవస్థ అవసరం.
10. కుటుంబ వ్యవస్థ, వృత్తి నైపుణ్యం, కుల వృత్తి నైపుణ్యం నేర్పుతుంది. తల్లి భాష నేర్పుతుంది.
11. సంస్కృతి, అలవాట్లను, కుటుంబ వ్యవస్థ నేర్పి సమాజం యొక్క కర్తవ్యాన్ని నెరవేరుస్తుంది.
12. భార్యను ఎదిగిస్తుంది. భర్త తోడుంటాడు.
13. వంశపారంపర్య ఆస్తి హక్కులు సంక్రమిస్తాయి.
14. ఇన్సూరెన్స్, నామిని రక్షణలు ఉంటాయి.
15. కుటుంబంలో ఉన్నప్పుడు ఇతర సభ్యులకు భయపడి దురలవాట్లకు దూరంగా ఉంటారు. (మద్యం, సిగిరెట్లు, వ్యభిచారం, జూదం మొ॥)
16. క్రమశిక్షణతో వేళకు ఇంటికి రావటం-సమయపాలన.
17. సమిష్టి కృషికి, టీమ్ స్పిరిట్‌కి ఇల్లు, కుటుంబం తొలి ప్రాతిపదికగా ఉంటుంది.
18. పెళ్ళిళ్ళు జరపడానికి ఇల్లు, కుటుంబం ఆధారంగా ఉంటుంది.
19. పొట్టతో ఉన్నప్పుడు, బాలింతగా ఉన్నప్పుడు సేవలు, రక్షణ అందిస్తుంది.
20. బంధుమిత్రులను, సొంత కుల సమాజాన్ని రెడీమేడ్‌గా అందిస్తుంది.
21. కని పెంచి యుద్ధాలకు సైన్యంగా సప్లై చేయడానికి పనికి వస్తుంది.
22. పౌర సమాజంగా ఎదగడానికి ఇల్లు, కుటుంబం ఆధారంగా ఉంటుంది.
23. కుటుంబం సహజీవన సంస్కృతిని, పరస్పర గౌరవాన్ని తెలుపుతుంది.
24. కుటుంబం క్లాస్‌రూమ్ వంటి ఒక యూనిట్‌గా పనిచేస్తుంది.
25. కుటుంబంలో భార్య కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, శయనేషు రంభా, భోజ్యేషు మాతా అని అంటారు. అలాగే ఇప్పుడు భర్త కూడా కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ వగైరా కూడా భార్యకు కూడా సేవలందించవచ్చు.
26. 'తల్లిగారి ఇల్లు' అనేది ఆడపిల్లలకు పెళ్ళైనప్పటికీ జీవితాంతం ఒక స్ఫూర్తి కేంద్రం. ఒక నైతిక మద్దతును రక్షణను ఇస్తుంది.

## కుటుంబ వ్యవస్థ రద్దు కావాలని కోరేవారు చెబుతున్న కారణాలు.

1. అధికార కేంద్రం, తల్లి తండ్రి లేదా కుటుంబ పెద్ద వల్ల ఇతరుల స్వేచ్ఛకు భంగం.
2. భర్తతో పాటు ఇతర కుటుంబ సభ్యులు పెట్టే గృహ హింస.
3. భర్త పెట్టే మానసిక హింస
4. పిల్లల పట్ల పెద్దలుపెట్టే మానసిక హింస
5. స్వార్థాన్ని పెంచే కేంద్రం. ఎవరికి పెట్టకుండా తిను అని తల్లే నేర్పడం.
6. కుటుంబ పరిధిలోనే ఆలోచించడం. సమాజాన్ని పట్టించుకోకపోవడం.
7. స్త్రీలకు సమాన హక్కులు లేకపోవడం.
8. భర్తకన్నా భార్య ఎదిగితే భర్త భరించలేకపోవడం. ఎదగనీయకపోవడం.
9. ఇష్టంలేని సెక్స్‌కు భర్త బలవంతం చేయడం.
10. లైంగిక స్వేచ్ఛ లేకపోవడం. బ్రహ్మచర్యానికి అవకాశం లేకపోవడం.
11. ఇతరులతో లైంగిక సంబంధాలు ఆమోదించకపోవడం
12. ఆస్తి హక్కులు కేవలం మగవారికే చెందడం. స్త్రీలకు లేకపోవడం.
13. ఆస్తి హక్కుల్లో సమాజానికి, ప్రభుత్వానికి, కులానికి వాటా హక్కు లేకపోవడం.
14. కులం, మతం కుటుంబ వ్యవస్థ వల్లనే కొనసాగుతున్నది. కుటుంబాన్ని రద్దు చేస్తే కుల వ్యవస్థ రద్దవుతుంది.
15. కుల వృత్తిని, కుల సంస్కృతిని చలనం లేకుండా ఘనీభవింపచేస్తుంది. కుల వివక్ష నూరిపోసే కేంద్రం కుటుంబం.
16. మానవుల మధ్య సంబంధాలు లేక గిడసబారిపోయేట్టు చేస్తున్నది.
17. కుటుంబ వ్యవస్థ వల్లనే దాని వెలుపల వ్యభిచార వ్యవస్థ ఏర్పడింది.
18. వ్యభిచార వ్యవస్థకు కుటుంబ వ్యవస్థే మూలం.
19. ఇష్టంలేని పెళ్ళిళ్ళకు ఆడపిల్లలను, మగ పిల్లలను ఒప్పించడం జరుగుతుంది.
20. బలవంతపు కాపురాలు చేయించడం.
21. జీవితమంతా ఒకే భర్తతో, భార్యతో కాపురం చేయడం విసుగు. విడాకులు కష్టమవుతున్నాయి.
22. భార్య చనిపోతే భర్త పెళ్ళి చేసుకుంటున్నాడు. భర్త చనిపోతే పెళ్ళి చేసుకోనీయడం లేదు. పిల్లల పెంపకం అంటగడుతున్నారు.
23. ఇంటి చాకిరికి, పిల్లల చాకిరి, విలువ లేకపోవడం, అది స్త్రీల పనిగా మారడం.
24. కుల వృత్తులు వదిలేయడానికి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం అవసరం.



25. కుల వివక్ష సంస్కృతిని వదులుకోవడానికి పేదలకు కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం ఎక్కువ అవసరం.
26. కులాతీత వివాహాలు కావడానికి కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం అవసరం.
27. జెండర్ స్వేచ్ఛ, సమానత్వం కోసం కుటుంబ వ్యవస్థ రద్దు కావాలి.
28. పెళ్ళి కాగానే స్త్రీల ఇంటిపేరు మారిపోవడం.
29. ఇష్టంలేని గర్భాన్ని గర్భస్రావం చేయించుకోనివ్వడం లేదు.
30. కుటుంబ నియంత్రణ ఆపరేషన్లు స్త్రీలకు చేయిస్తున్నారు. స్త్రీల ఆరోగ్యం చెడుతున్నది.
31. పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థలు కుటుంబ వ్యవస్థను రద్దు చేయక తప్పదు. అందులో భాగంగానే 20 శాతం జనాభా అనగా ఐదుగురిలో ఒకరు ఇప్పటికే కుటుంబ వ్యవస్థ రద్దయిన సమాజంగా ఎదిగారు.
32. సోషలిస్టు వ్యవస్థలో కూడా కుటుంబ వ్యవస్థను రద్దు చేయక తప్పదు. కమ్యూనిస్టు వ్యవస్థలో అసలు కుటుంబమే ఉండదు. రష్యాలో 1985 నాటికే యూరప్, అమెరికాల్లో లాగే 20 శాతం జనాభా కుటుంబ వ్యవస్థ రద్దు చేసుకొని హాయిగా, స్వేచ్ఛగా జీవిస్తున్నారు.
33. కుటుంబ వ్యవస్థ రద్దయితేనే మనిషిలోని సమస్త శక్తులు, సామర్థ్యాలు వికసిస్తాయి. స్వేచ్ఛాపూరిత సమాజం ఏర్పడుతుంది.
34. కుటుంబ వ్యవస్థ రద్దయితే మునుపెన్నడూ లేనంత ప్రేమపూరితంగా మనుషుల మధ్య ప్రేమలు, ఆత్మీయతలు, అనుబంధాలు కొనసాగుతాయి.
35. ఆస్తి హక్కుల సమస్యే ఉండదు. వారసత్వ హక్కుల సమస్య ఉండదు. కనుక రేపటికోసం కూడ బెట్టాలనే స్వార్థం నశించి పరోపకారం, స్నేహం, మానవీయ విలువలు పెరుగుతాయి.
36. గ్లాసెడు మంచినీళ్ళ సిద్ధాంతాన్ని ఆచరించుకోవచ్చు.
37. మార్క్స్, ఏంగిల్స్, లెనిన్, మావోలు కుటుంబం రద్దు కావాల్సిందేనని చెప్పారు.
38. గృహ హింస నుండి స్వేచ్ఛ లభిస్తుంది.
39. కుటుంబ పరిధి నుంచి బయటపడి స్వేచ్ఛగా మొత్తం ఈ ప్రపంచం మనదే అని ఆలోచిస్తారు.
40. కుటుంబ వ్యవస్థ రద్దయితే ప్రభుత్వం, సమాజం ఎలా చెపితే అలా నడుచుకునే పౌరులుగా ఎదుగుతారు. సామాజిక మార్పులకు కుటుంబ వ్యవస్థ దేవుడికి-భక్తుడికి మధ్య పూజారిలా అడ్డం పడుతున్నది. కన్సర్వేటివ్ పాత్ర నిర్వహిస్తున్నది. కనుక రద్దు చేయాలి. రద్దు చేయడం ఆధునిక ప్రపంచావసరం.
41. స్త్రీలకు ఇంటిచాకిరికి, వంట, పిల్లల పెంపకం, ఇల్లాలుగానే ఉండిపోవడం కుటుంబ వ్యవస్థలో ఒక శాపం - ఒక నరకం. స్త్రీల సృజనవికాసం అణగారిపోతున్నది. మగవారు తమ భార్యలు జ్వరంతో వున్నపుడైనా వారి బట్టలు ఉతకడం, పిల్లల పీతిముడ్డి కడగడం, పిల్లల్ని తల్లిలా సాకడం, వాకిలి పేడతో

అలుకుచల్లడం, వంటచేయడం, స్త్రీలకు కేటాయించిన పనులు చేస్తున్నవాళ్ళు ఎందరో ఆత్మవిమర్శ చేసుకోవడం అవసరం అని అంటారు స్త్రీవాదులు.

42. కుటుంబ వ్యవస్థ రద్దయితే ఎవరిష్టమొచ్చినట్టు వాళ్లు స్వేచ్ఛగా జీవిస్తారు. స్వేచ్ఛగా తింటారు, స్వేచ్ఛగా ఉంటారు. స్వేచ్ఛగా పడుకుంటారు. స్వేచ్ఛగా ఏదైనా కొనుక్కుంటారు.
43. కుటుంబ వ్యవస్థ ఒక కేయాస్‌గా మారింది. అందులో ఎవరికీ స్వేచ్ఛ లేదు. అందరూ బస్టాండులో ఎవరి గోల వారిదన్నట్టుగానే కుటుంబం గోలగోలగా సంక్షోభంగా తయారైంది.
44. మతానికి, కులానికి మూలకేంద్రం కుటుంబమే. ఇవి ఈ రెండూ రద్దు కావడంలో భాగంగా కుటుంబం కూడా రద్దు కావల్సిందే.

    కుటుంబం లేకుండా పెరిగినవాళ్లు భిన్నంగా ఉంటున్నారు. అమెరికా, రష్యా, యూరప్ దేశాల పరిణామాలను చూపిస్తున్నారు. జిడ్డు కృష్ణమూర్తి వంటి తత్వవేత్తలు చాలా మంది ఫెమినిస్టులు కూడా కుటుంబ వ్యవస్థ అనవసరం అని అనేక కోణాల్లో చెపుతున్నారు. ఆయా దేశాల కుటుంబ పరిణామాలను తరువాతి అధ్యాయంలో చూద్దాం.

మనిషి సంఘజీవి. వ్యక్తిగత స్వేచ్ఛ అనేది ఎప్పుడూ ఉండదు. సంఘానికి లోబడి సంఘ జీవిత పరిమితులు ఉంటాయి. దానికి లోబడి వ్యక్తిస్వేచ్ఛ ఉంటుంది. కుటుంబం రద్దయినా సంఘ జీవిత పరిమితులకు లోబడే జీవించాల్సి వుంటుంది. అందువల్ల సంఘం, సామాజిక వ్యవస్థ అనుమతించిన స్వేచ్ఛ, సమానత్వం, స్వాతంత్ర్యం మేరకు కుటుంబ వ్యవస్థను ప్రజాస్వామీకరించాలి. అంతేతప్ప కుటుంబ వ్యవస్థ రద్దు కావడం అన్నివిధాలా అనర్థదాయకం అంటారు.

### ప్రశ్నలు

1. కుటుంబ వ్యవస్థ రద్దు కావాలని అనేవాళ్లు చూపే కారణాలు ఏమిటి?
2. కుటుంబ వ్యవస్థ కొనసాగాలని అనుకునేవాళ్లు చూపే కారణాలు ఏమిటి?
3. కుటుంబ వ్యవస్థ గురించి మీరేమనుకుంటున్నారు?
4. స్త్రీలకు కుటుంబ వ్యవస్థ బందిఖానాగా మారింది అనే వాదం పట్ల మీ అభిప్రాయాలు వివరించండి.
5. కుటుంబంలో పురుషులకుండే స్వేచ్ఛ స్త్రీలకు ఇవ్వడానికి మీరు చేస్తున్న కృషి వివరించండి.



# కుటుంబ వ్యవస్థ గురించి

## అమెరికా, రష్యా, యూరప్‌ల్లో ఏం జరిగింది?

**కుటుంబం పుట్టుకతో ఏర్పడుతుంది**

కుటుంబం అనేది పుట్టుకతో ఏర్పడుతుంది. తెగ, కులం, జాతి అనేవి కూడా పుట్టుకతో ఏర్పడతాయి. వర్గం కూడా పుట్టుకతో వస్తుంది. కానీ వర్గాలు మార్చుకోవచ్చు. ఆస్తి హక్కులు లేకపోతే వర్గాలు పుట్టుకతో ఏర్పడ్డం ఆగిపోతుంది. తెగ, కులం, జాతి కొనసాగుతాయి. వర్గం పనిసంబంధమైనది. వృత్తి మానగానే సంబంధాలు మారతాయి. ఆర్థికంగా మారగానే వర్గం కూడా మారుతుంది. తెగ, కులం, జాతి, కుటుంబం అలాంటివి కావు.

**కుటుంబం అనేది ఒక చిన్న దేశం**

కుటుంబం అనేది ఒక చిన్న దేశం వంటిది. దానికొక హోం మినిష్టర్, ప్రైం మినిష్టరు, క్యాబినెట్, పార్లమెంటు సభ్యులుంటారు. దానికొక పోలిట్‌బ్యూరో, ప్రణాళికాసంఘం ఉంటుంది. పూర్వం పెద్ద వయస్సువాళ్లే ప్రధానమంత్రిగా, సైన్యాధ్యక్షుడిగా పోలిట్‌బ్యూరోగా కుటుంబంలో వ్యవహరించేవాళ్లు. ఇప్పుడు కొడుకులు ప్రధానమంత్రులు అయ్యారు. తల్లిదండ్రులు రాష్ట్రపతులు అయ్యారు.

ప్రధానమంత్రిపై అనగా తల్లిదండ్రులపై ఫిర్యాదు చేయడానికి పార్లమెంటు సభ్యులు అనగా పిల్లలు రాష్ట్రపతిలాగా తాతయ్యలను, నానమ్మలను ఆశ్రయిస్తారు. వాళ్లు రాష్ట్రపతిలాగా, పార్లమెంటు స్పీకర్‌లాగా అప్పుడప్పుడు రూలింగ్ ఇస్తారు. తల్లిదండ్రులు వాటిని పాటిస్తుంటారు. తల్లిదండ్రుల విద్యాహింస, భయం నుండి పిల్లలకు తాత, నానమ్మ కాస్త స్వేచ్ఛ అందిస్తారు. తల్లిదండ్రులతో స్వేచ్ఛగా ఉండలేని పిల్లలు తాత, నానమ్మ, అమ్మమ్మలతో స్వేచ్ఛగా ఉంటారు. హాయిగా వారితో ఆడుకుంటారు. ఉమ్మడి కుటుంబం, వ్యక్తి కుటుంబం కూడా పిల్లలకు ఈ స్వేచ్ఛను అందిస్తున్నది. కుటుంబ వ్యవస్థ అమ్మప్రేమను, తండ్రిప్రేమను, ఆత్మీయతను, సంస్కృతిని అందిస్తున్నది.

**తెగ, జాతి, కులం, ప్రాంతం, భాష అనేవి కూడా చిన్న దేశాల వంటివే**

కుటుంబం, తెగ, కులం, జాతి, ప్రాంతం, మతం, ఊరు, స్వంత భాషీయులు అనేవి కూడా చిన్న దేశం వంటివే. ఒక రాజ్యానికి ఎన్ని లక్షణాలు ఉంటాయో వీటికి

కొన్ని లక్షణాలు ఉన్నాయి. ఒక రాజ్యానికి, దేశానికి ఉన్న లక్షణాలు ఏమిటి? 1.పరిపాలన. 2.సరిహద్దుల రక్షణ. 3.ఆస్తుల రక్షణ. 4.దేశరక్షణ. 5.సంపద సృష్టి, ఉత్పత్తిలో పాల్గొనడం. 6.సంక్షేమం, ఉచిత విద్యా వైద్యం. 7.నైతిక మద్దతు, మనమంతా ఒకటి అని ఆత్మవిశ్వాసం, స్థైర్యం, ధైర్యం, మానసిక ఐక్యత. 8.రాజు, మంత్రి, సైన్యాధ్యక్షుడు లేదా ప్రధాని, రాష్ట్రపతి, పార్లమెంటు. ఇవి కుటుంబం, తెగ, కులం, జాతి, ప్రాంతం, మతం వంటి వాటికి కూడా ఉన్నాయి.

### మానసిక ఐక్యత, భౌతిక పునాది

అందువల్ల వీటన్నిటికీ భౌతిక పునాదితో పాటు భావజాల పునాది, మానసిక ఐక్యత పునాది అనేవి కొనసాగుతున్నాయి. కులాన్ని, కుటుంబాన్ని కూడా ఉత్పత్తి విధానమే నిలబెడుతున్నది. దానికితోడు స్వంత కులంలో పెళ్లిళ్లు అనేవి వస్తూత్పత్తి విధానంకన్నా బలీయమైనవి. మార్చుకోలేనివి. ఆధునిక పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలు ఎప్పుడైనా ఏ క్షణంలో అయినా మార్చుకోగలిగేవి. అందువల్ల వర్గం వలె కులం, తెగ, కుటుంబం, జాతి అనేవి చిన్న విషయాలు కావు. వీటిముందు వర్గం అనేది చాలా చిన్న విషయం. అది ఎప్పటికప్పుడు మారుతూ ఉంటుంది. ఈ వర్గంలోంచి ఆ వర్గంలోకి, ఆ వర్గంలోంచి ఈ వర్గంలోకి నిరంతరం మారుతూనే ఉంటారు.

### కుటుంబంలోని ఆత్మీయత లేకపోవడం వల్ల...

కుటుంబంలోని ఆత్మీయతలు లేని దశ సమాజాన్ని పతనానికి నెట్టివేస్తుంది. కుటుంబ వ్యవస్థ లేకపోతే పిల్లలకు రక్షణ లేదు. పిల్లలకు బాల్యం లేదు. తండ్రి లేకుండా తల్లి ఒక్కతే పిల్లలకు బాధ్యత వహించడంవల్ల బరువు బాధ్యతలు స్త్రీల పైనే ఎక్కువ అవుతున్నాయి. సింగిల్ పేరెంట్ కుటుంబం అనగా తల్లి గానీ, తండ్రి గానీ ఒక్కరే ఉండడం వల్ల సింగిల్ పేరెంట్‌కు పిల్లల పెంపకం రెట్టింపు భారం అవుతున్నది. వృద్ధ తల్లిదండ్రుల కాలక్షేపం, అదే సమయంలో పిల్లల పెంపకంలో వారి సహకారం ఆర్థికంగా, ఆరోగ్యపరంగా, సంస్కృతిపరంగా మూడు తరాలకు ఒక రక్షణ కవచంగా కుటుంబ వ్యవస్థ పనిచేస్తుంది.

### గత యాభైఏళ్ళలో పాశ్చాత్య దేశాల్లో ఏం జరిగింది?

కుటుంబ వ్యవస్థ గురించి అమెరికాలో ఏం జరిగింది? రష్యాలో ఏం జరిగింది? యూరోప్‌లో ఏం జరిగింది? అక్కడ కుటుంబ వ్యవస్థ రద్దయి పెరిగిన రెండు తరాలు వచ్చేసాయి. ఇప్పుడు ఆ అనుభవాలను చూసి తిరిగి కుటుంబ వ్యవస్థ కావాలని కోరుకుంటున్నారు. ఆసియా దేశాల్లో కొనసాగుతున్న కుటుంబ వ్యవస్థను తిరిగి అధ్యయనం చేస్తున్నారు. మార్పులు చేర్పులతో దీన్ని ఆదర్శీకరించాలనుకుంటున్నారు. వాళ్లు మనవేపు చూస్తుంటే, ఇక్కడి ఫెమినిస్టులు, మార్క్సిస్టులు అటువేపు చూస్తూ దాన్ని అనుకరించాలని సిద్ధాంతాలు చేయడం తెలివితక్కువ పని. అది భావజాల బానిసత్వం. స్వంతంగా ఆలోచించలేకపోవడం. ఇండివిడ్యువల్ స్వేచ్ఛ అనేది ఇండివిడ్యువల్ ఫాసిజమే. అది అరాచకవాదం. దాన్ని స్వేచ్ఛ అని ఎలా అంటారు?



### స్వేచ్ఛ పేరిట ఒంటరి అయిపోయిన జీవితాలు

ఇప్పుడు ఇక్కడ కూడా చూడ్డంలేదా? తల్లిదండ్రులు పల్లెల్లో ఉంటే నగరాల్లో ఉద్యోగాలు చేస్తూ పెద్ద పెద్ద జీతాలు ఎత్తుతున్న కుర్రకారు యువతరంలోని అసహనం ఇండివిడ్యువల్ ఫాసిజంలో భాగమే. వాళ్ల డబ్బుతో అన్నీ కొనగలమని అనుకుంటున్నారు. ఎవర్నీ గౌరవించడంలేదు. అన్నిటికీ నా ఇష్టం అంటున్నారు.

### స్వేచ్ఛ పేరిట కన్స్యూమరిజంలో కూరుకుపోయిన సమాజం

వీళ్లకు సామాజిక శాస్త్రాల విద్యాబోధన జరగలేదు. దాంతో సమాజమంటే కూడా ఏమిటో తెలియదు. తన చుట్టూతా ఉన్న వాళ్లే మొత్తం సమాజం అనుకుంటున్నారు. వారికి పేదల సమస్యలు పట్టవు. మాకెందుకు చెప్తున్నారు వాళ్ల గోల అని ఎదురు తిరుగుతున్నారు. బ్రాండెడ్ ఎమ్ఎన్‌సిల సరుకులనే కొంటున్నారు. వందలో వచ్చేదానికి బ్రాండెడ్ పేరుమీద 500 ఖర్చు పెడుతున్నారు. మేము సంపాదిస్తున్నాం, మేం ఖర్చు చేసుకుంటాం. అడగడానికి మీరెవరు? మీవన్నీ వెనకటి బుద్ధులు. మీదంతా పాత ట్రెండు. ఏ రాత్రి ఇంటికి వస్తే మీకేంటి? ఈ ఇంట్లో ఉండనివ్వకపోతే ఇంకో ఇల్లు వెతుక్కుంటాం. ఇలా కుర్రకారు యువతరం మాట్లాడుతున్నది.

ఇదంతా పెట్టుబడిదారీ సామ్రాజ్యవాద మల్టీనేషనల్ సంస్థల సరుకులు కొనే యంత్రాలుగా మనుషులను మార్చివేయడం కాదా? వాళ్లు చెప్పే స్వేచ్ఛ నిజమైన స్వేచ్ఛ కాదు. అది పారిశ్రామికవేత్తలు సరుకులు కొనిపించి దుర్మార్గ కన్స్యూమరిస్టు వ్యవస్థ. దాని ఫలితాన్ని వాళ్లే అనుభవిస్తున్నారు. ఇప్పుడు కొట్టుకుచస్తున్నారు.

### కుటుంబ వ్యవస్థ రద్దయితే పెరుగుతున్న క్రైం రేటు

ఆ దేశాల్లో ఉన్నంత క్రైం రేటు అనాగరిక, ఆటవిక సమాజాల్లో కూడా లేదు. హారర్, క్రైం సినిమాలు, నీచమైన సెక్స్ వెబ్‌సైట్లు, టీ.వీ.ప్రోగ్రాంలు మనుషులను సెక్స్ కోసమే బతుకుతున్న జంతువులుగా పెట్రోల్ తాగే కారుయింజన్లు మనుషులు వాళ్ల సరుకులను నిత్యం వాడే యంత్రాల్లా మార్చుతున్నారు. ఇందుకోసమా కుటుంబం రద్దు కావడం? రష్యాలో కుటుంబం రద్దు అయి పిల్లల పెంపకం సమాజానికి, ప్రభుత్వానికి అప్పగిస్తే ఏం జరిగింది? ఆ పిల్లలంతా చెప్పేవాళ్లు లేక ఇష్టారాజ్యంగా పెరిగారు. అక్కడి సమాజం ఎలా మారిపోయింది? ఇవన్నీ చూస్తూ కుటుంబం రద్దు కావాలని చర్చించడంలో ఏమైనా అర్థం ఉందా? అని ప్రశ్నిస్తున్నారు. ఇంకా వాళ్లు ఇలా అంటున్నారు.

### అనాథ పిల్లల పెంపకంలోని లోపాలు

తల్లిదండ్రులు లేని పిల్లలు అనాథలుగా పెరుగుతున్నారు. చిన్నప్పటినుంచీ హాస్టల్సులో ఉంచి చదివించినవాళ్లు కూడా ఇంట్లో పెరిగిన పిల్లల్లా ఉండడంలేదు. అరాచకంగా ప్రవర్తిస్తున్నారు. కుటుంబంలో పెరగని పిల్లలు చెప్పేవాళ్లు లేక ఏగి తిరుగుతుంటారు. దురలవాట్లకు లోనవుతారు. చెడుస్నేహాలు పెరుగుతాయి. స్వేచ్ఛ దుర్వినియోగం అవుతుంది. ఎవరి భయం, అదుపు లేక కంట్రోల్ చేసేవారు లేక యూరప్, అమెరికా దేశాల్లో వెబ్‌సైట్లు చూసి చిన్న వయస్సునుండే సెక్స్‌లో పాల్గొంటున్నారు.

**పల్లె పేదల్లో నాగరికులు కూడా బతకాలా?**

తల్లిదండ్రులు సాదని పేద కులాల పిల్లలు, గిరిజనుల పిల్లలు ఆరేడేళ్ల వయస్సునుండే పని చేసుకుంటూ బతుకుతున్నారు. వారు ఎలా జీవిస్తున్నారో కుటుంబ వ్యవస్థ రద్దయితే అందరూ అలాగే అరాచకంగా, దీనంగా జీవిస్తారు. అది సరైనది కాదు అని అంటారు. ఈ రెండు వాదాలను ఎలా అర్థం చేసుకోవాలి?

**నిన్నటి రాజులు ఏమై పోయారు?**

ఒకనాటి రాజులు ఇవ్వాళ పాలకవర్గంగా లేరు. నిన్నటి పాలకవర్గం ఎన్నికలతో తుడిచిపెట్టుకొనిపోతుంది. కొత్త ప్రభుత్వం కొత్త పాలకవర్గం ఏర్పడుతుంది. బిల్‌గేట్స్ మొదలుకొని రిలయన్స్ అంబానీ దాకా సామాన్య ప్రజల నుండి పాలకవర్గాలుగా, పారిశ్రామికవేత్తలుగా నిరంతరం ఎదుగుతూనే ఉంటారు. కొందరు దివాలా తీస్తూనే ఉంటారు. అందువల్ల వర్గం అనేది చలనశీలమైనది. దినపత్రికల్లో వార్తల్లాగా నిరంతరం మారుతూ ఉండేది.

**వేల ఏళ్ళుగా కులం, కుటుంబం, తెగ, జాతి, సమాజాలు ఎందుకు కొనసాగుతున్నాయి?**

కులం, కుటుంబం, తెగ, జాతి, సమాజం అనేవి ఇలాంటివి కావు. అవి వేల ఏళ్ల సమాజంలో పలు దశలు దాటి ఎన్నో పరిణామాలు పొందుతూ కూడా తిరిగి కొత్త రూపాల్లో, కొత్త వ్యవస్థల్లో కూడా కొనసాగుతూ వస్తున్నాయి. అందులో భాగంగానే సోషలిస్ట్ వ్యవస్థ పేరిట ఒక దేశంగా మారిన ప్రాంతాలు 1985లో ఎవరి జాతులు వాళ్లుగా, ఎవరి మతాలు వాళ్లుగా, ఎవరి తెగలు వాళ్లుగా 13 దేశాలుగా విడిపోయారు.

తెగ లక్షణాలే విస్తరించి కులం లక్షణాలు అయ్యాయి. తెగ, కులం లక్షణాలు విస్తరించి జాతి లక్షణాలు అయ్యాయి. ఆరెసెస్ చెప్పే జాతి నిర్వచనం వేరు. మార్క్సిస్టులు చెప్పే జాతి నిర్వచనం వేరు. మతం చెప్పే జాతి నిర్వచనం వేరు. ఇక్కడ మేం చెప్పే జాతి నిర్వచనం వేరు. భారత రాజ్యాంగం ఇచ్చిన జాతి నిర్వచనం వేరు.

**మార్క్సిస్టులు జాతికి ఇచ్చిన నిర్వచనం చాలా చిన్నది**

మార్క్సిస్టులు పెట్టుబడిదారులకనువుగా వారి ప్రయోజనాల కోసం జాతి నిర్వచనాలను ఇచ్చారు. పెట్టుబడిదారీ వ్యవస్థ తన సరుకుల అమ్మకం కోసం జాతి సిద్ధాంతాన్ని పురికొల్పింది అని అంటూ వారి సేవ చేసే విధంగా జాతిని, జాతీయతను నిర్వచించింది.

అందుకే జాతుల సమస్య పరిష్కారం ముద్రవేసి, పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాల ప్రయోజనాలకు జాతీయ ప్రయోజనాల పేరిట మద్దతునిస్తుంది. అదేసమయంలో కులాల సమస్య పేరిట ఆ యా కులాల ముఖ్యంగా బీసీ, ఎస్సీ, ఎస్టీ కులాల పెట్టుబడిదారుల ప్రయోజనాలను జాతీయ ప్రయోజనాలుగా భావించడాన్ని వ్యతిరేకిస్తుంది. తద్వారా దోపిడీ కులాల పెట్టుబడిదారీ వర్గాల ప్రయోజనాలే జాతుల ప్రయోజనాలని, జాతీయ ప్రయోజనాలని ప్రచారం చేస్తుంది. కాంగ్రెస్ మొదలుకొని బిజెపి, ఆరెసెస్, తెలుగుదేశం, వామపక్షాలు, మావోయిస్టులు, నక్సలైట్లు అందరూ ఈ విషయంలో ఇదే పాట కోరస్‌గా పాడుతుంటారు. బీసీ, ఎస్సీ, ఎస్టీ బూర్జువాలు ఎదగడాన్ని జాతీయ బూర్జువాల ఎదుగుదల అనకుండా కుల గజ్జి, కులతత్వం అని



ఈసడిస్తుంటారు. అనగా వాళ్లకు అగ్రకుల గజ్జి, అగ్రకుల తత్వం, దోపిడి కులాల ప్రయోజనాలు జాతీయ ప్రయోజనాలుగా కనపడుతున్నాయి.

**జాతి నిర్వచనం విస్తృత పరిధి**

నేను జాతి అనే నిర్వచనాన్ని తెగ నిర్వచనం నుండి, కులం నిర్వచనం నుండి, వేల ఏళ్ల నాటి నుండి కొనసాగుతున్న నిర్వచనం నుండి తీసుకుంటున్నాను. పెట్టుబడిదారీ, భూస్వామ్య వ్యవస్థలకు ముందు నుండి కూడా బుద్ధుని కాలం నుండి కూడా అంతకన్నా ముందునుండి కొనసాగుతున్న ఆర్య, ద్రావిడ జాతుల నిర్వచనాల నుండి జాతి నిర్వచనాన్ని తీసుకుంటున్నాం. అందువల్ల ఇతరుల జాతీయ నిర్వచనానికి, రాజ్యాంగంలోని జాతి నిర్వచనానికి ఇది భిన్నమైనది. ప్రత్యేకమైనది. విశిష్టమైనది. వేలఏళ్ల చరిత్ర గలది. ఆంత్రోపాలజీ నిర్వచనాలుకూడా ఈ జాతి నిర్వచనంలో, కులం నిర్వచనంలో, తెగ నిర్వచనంలో అంతర్లీనంగా కొనసాగుతున్నాయి.

**అవగాహనలో వైరుధ్యం**

కొందరు ఒకవేపు కుటుంబం విచ్ఛిన్నమౌతున్నది అని వాదిస్తున్నారు. వాళ్లే మరోవేపు కులతత్వం, కుల చైతన్యం పెరుగుతున్నది అని విమర్శిస్తున్నారు. మరోవేపు జెండర్ స్వేచ్ఛ పెరిగిందని గోలపెడుతున్నారు. ఇవి రెండూ పరస్పర విరుద్ధ అంశాలు. కుటుంబం విచ్ఛిన్నం అయితే కులం ఎక్కడ వుంటుంది? కులచైతన్యం ఎక్కడ వుంటుంది? అయితే ఒకటి జరిగి వుండాలి. కుటుంబం రద్దు అయినా ఏకవ్యక్తిలో కూడా కులం, కులతత్వం, కులచైతన్యం కొనసాగుతున్నది అని అర్థం చేసుకోవాలి. లేదా కులచైతన్యం తగ్గుతున్నది అని అర్థం చేసుకోవాలి.

**కులం మీద ఆధారపడ్డ ఇండియా కుటుంబం**

మనదేశంలో కులం మీద ఆధారపడి కుటుంబం నడుస్తున్నది. జపాన్‌లో, చైనాలో బౌద్ధంలో భాగంగా ఆధునిక వ్యవస్థల్లో కుటుంబం ఎలా మారుతూ వస్తున్నదో పరిశీలించడం ఆసియా దేశాలకు ఎక్కువ ఉపయోగం. అయినప్పటికీ భారతదేశం నుండే కుటుంబ వ్యవస్థ గురించి ప్రపంచం ఆశగా ఎదురుచూస్తున్నది. ఎందుకు ప్రపంచం మనవేపు చూస్తున్నది? మన కుటుంబ వ్యవస్థ ప్రత్యేకత ఏమిటి? దీనిగురించి ప్రత్యేకంగా అధ్యయనం చేయడం అవసరం. ఆరెసెస్ వాళ్లు ఇందుకు మతపరమైన కారణాలు చెప్పవచ్చు. నిజానికి వాళ్లు తమది మతం కాదని హిందూ జీవన విధానమని దాన్ని వ్యవహరిస్తారు. అందువల్ల వారి ప్రకారం హిందూ జీవన విధానంలోని కుటుంబం యొక్క ప్రత్యేకత ఏమిటి? విశిష్టత ఏమిటి?

**రాజ్యం లేకపోయినా కొనసాగుతున్న కుటుంబ వ్యవస్థ**

సమాజం రాజ్యం లేకపోయినా, ప్రభుత్వం నడవడానికి ఉన్నటువంటి వ్యవస్థ లేకపోయినా నిలబడి సజావుగా క్రమశిక్షణతో కొనసాగడానికి ఈ కుటుంబ వ్యవస్థే మూలం. అది మొదట గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ అని పిలువబడిన కులవ్యవస్థ, పితృస్వామ్య వ్యవస్థ ఏర్పడే క్రమంలో వర్ణ వ్యవస్థలో రూపుదిద్దుకున్నది. శతాబ్దాల తరబడి విదేశాలనుండి గానీ, పొరుగు రాజ్యాల నుండి గానీ, ఎన్ని దాడులు, ఎన్ని దండయాత్రలు

కొనసాగినా ఈ సమాజం విచ్ఛిన్నం కాలేకపోయింది. అందుకు స్వయంపోషక గ్రామీణ ఆర్థిక కులవ్యవస్థ కారణం. ఇది ఎప్పటికప్పుడు అమీబా లాగా, 'ఎర' లాగా తెగిపోయినకొద్దీ దేనికది స్వతంత్రమవుతూ అదే స్వభావంతో తిరిగి విస్తరిస్తూ వస్తున్నది. అందువల్ల కొత్తగా రూపొందిన గ్రామాల్లో కూడా అదే వ్యవస్థ, అవే కులాలు, అవే హోదాలు కొనసాగాయి. చాలాకాలం పాటు ఒక కులం నుండి మరో కులానికి మారిన చరిత్ర కొనసాగింది. మూడు తరాలలో కులం ఇప్పటికీ పూర్తిగా మారిపోవడం గమనించవచ్చు.

**కులం లేకపోయినా కొనసాగుతున్న కుటుంబ వ్యవస్థ**

కుటుంబంలో భాగంగా రూపొందిన కులవ్యవస్థ అన్ని కులాల్లో ఒకేరీతిగా రూపొందింది. అనగా తెగ అనేది మాతృస్వామిక వ్యవస్థ నుండి పితృస్వామిక వ్యవస్థగా మారిన తరువాత పితృస్వామిక వ్యవస్థలో కుటుంబం ముందు ప్రారంభమై ఆ తర్వాత అది కులం రూపం తీసుకున్నది. అంబేద్కర్ కులం పుట్టుక గురించి చేసిన విశ్లేషణ కూడా కులాలు ఏర్పడ్డ తీరును 'పితృస్వామిక కుటుంబం' ఏర్పడ్డ తీరునుండే నిర్వచించడం జరిగింది.

**మతం రద్దయితే కులం రద్దవుతుందా? కుటుంబం రద్దయితే కులం రద్దవుతుందా?**

హిందూ మతం రద్దు అయితేనే కులం రద్దు అవుతుందని కొందరి భావన. అయితే హిందూమతం లేదా హిందూ జీవనవిధానం రద్దు అయితే ఈ కుటుంబ వ్యవస్థ రద్దు అవుతుందా? బౌద్ధ ధర్మంలోకి మారితే ఈ కుటుంబ వ్యవస్థ ఎలా వుంటుంది? అందుకు బౌద్ధ మతం ఉన్న జపాన్, చైనా కుటుంబాలను పరిశీలించవలసి వుంది. అక్కడి కుటుంబాలు భారతీయ కుటుంబాల్లాగే కొనసాగుతున్నాయి. కులం రద్దయినా, మతం రద్దయినా కుటుంబ వ్యవస్థ రద్దు కాదని అనుభవాలు తెలుపుతున్నాయి.

**చైనా, జపాన్‌లో బౌద్ధంలో కుటుంబం ఎలా వుంది?**

చైనా, జపాన్‌లలో జాతీయ ప్రభుత్వాలు కొనసాగుతున్నాయి. చైనాలో ఏకపార్టీ జాతీయ ప్రభుత్వం ఉండగా జపాన్‌లో బహుళ పార్టీ ప్రజాస్వామిక వ్యవస్థ కొనసాగుతున్నది. అక్కడ కూడా కుటుంబ వ్యవస్థ ఇండియాలో వున్నట్టుగానే వుంది. ఇండియా కన్నా ఇంకాస్త బాగుంది. చైనాలో జరిగిన సాంస్కృతిక విప్లవ కాలంలో తీసిన "ఇన్‌లాస్" అనే సినిమాలో నాలుగు తరాల మనుషులు ఒకే కుటుంబంలో కలిసి జీవిస్తున్న గ్రామీణ జీవితాన్ని చూపించారు. విప్లవం తరువాత అక్కడ వ్యక్తి కుటుంబాలుగా విడిపోయే అవసరాలు తగ్గిపోయాయి. కమ్యూన్‌ల వ్యవస్థలలో ప్రతి కమ్యూన్ ఒక దేశంలా స్వయం సమృద్ధి సాధించడానికి అనువుగా ప్రణాళికలు రూపొందించడం వల్ల మనుషుల వలస అవసరం తీరిపోయింది. కుటుంబ సభ్యులందరు ఒకే ఊళ్ళో ఉండే అవకాశాలు పెరిగాయి. ఇలా పారిశ్రామిక వికేంద్రీకరణ తిరిగి విడిపోయే హక్కుతో పాటు ప్రజాస్వామిక స్వేచ్ఛగల సమిష్టి కుటుంబంగా మారే కుటుంబ వ్యవస్థను రూపొందించడానికి పునాది అయింది.

పార్టీలు ఏవైనా, రాజ్యాంగాలు ఏవైనా, మతాలు ఏవైనా, దేశాలు ఏవైనా ఆసియా దేశాల్లో ఒక రకమైన కుటుంబ వ్యవస్థ - యూరప్, అమెరికా దేశాల్లో ఒక రకమైన కుటుంబ వ్యవస్థ రూపుదిద్దుకొని కొనసాగుతున్నాయి. గ్రీకుల కాలం నుండి, ద్రావిడుల,



ఆర్యుల కాలం నుండి ఇవి పరిణామం చెందుతూ వస్తున్నాయి.

రేపు కుటుంబ వ్యవస్థ మరింత చిన్న కుటుంబంగా మారవచ్చు. మరింత స్వేచ్ఛను, ప్రజాస్వామీకరణను పొందవచ్చు. లేదా ఇప్పటి కుటుంబ వ్యవస్థే అందరికీ సమానత్వం, స్వేచ్ఛ అనే పద్ధతిలోకి మారుతూ కొనసాగవచ్చు. తిరిగి ఉమ్మడి కుటుంబంగా కొత్త రూపం సంతరించుకోవచ్చు.

**కుటుంబం రద్దయితే చేయాల్సిన కర్తవ్యాలు, కార్యక్రమాలు**

కుటుంబం అనేది రద్దు అయితే లేదా తన బాధ్యతలను వదిలేస్తే లేదా పేదరికంతో నిర్వహించలేకపోతే వాటిని ప్రభుత్వం, సమాజం స్వీకరించాల్సి ఉంటుంది. ఉదా॥కు 1.పిల్లల పెంపకం. 2.ఉచిత విద్య, వైద్యం, హాస్టల్స్. 3.మదర్స్ డే. 4.ఫాదర్స్ డే. 5.గృహవసతి దినోత్సవం. 6.అక్షరాస్యతా దినోత్సవం. 7.బాలల దినోత్సవం. 8.యువజనుల దినోత్సవం. 9.ప్రేమికుల దినోత్సవం మొదలైనవి ప్రభుత్వాలు, ఐక్యరాజ్యసమితి సమాజానికి తిరిగి గుర్తు చేసే, ఆచరించే కర్తవ్యాలుగా మారిపోయాయి. అన్నం ఎలా తినాలో, తెలపడానికి యూరప్, అమెరికాల్లో పుస్తకాలు వచ్చాయి. అవి కుటుంబం విచ్ఛిన్నం అవుతున్న క్రమంలో కామన్ కల్చర్ కోసం కూడా కావచ్చు. అనగా ఇవన్నీ కుటుంబ వ్యవస్థ అవసరాన్ని తెలుపుతాయి. లేదా ఇవన్నీ ఇంతదాకా కుటుంబం నిర్వహించిన పాత్రను తెలియజేస్తాయి. డబ్బుతో అన్నీ కొనలేరు. అమ్మ ప్రేమ, నాన్న ప్రేమ, పిల్లలు, అనుబంధాలు మొదలైనవి కుటుంబం రద్దు అయితే ఎలా సాధ్యం? అనే ప్రశ్నలు వుండనే వున్నాయి.

**కుటుంబ వ్యవస్థ కింది నుంచి పైకి నిర్వహిస్తుంది**
**సమాజం చేపడితే పై నుండి కిందికి ఆధిపత్యంగా మారుతుంది**

కుటుంబం నిర్వహించే కర్తవ్యాలను సమాజం లేదా ప్రభుత్వం చేయాల్సి వచ్చినప్పుడు అవి పైనుండి కిందికి వ్యాపించాల్సి ఉంటుంది. తద్వారా ప్రచారం అనివార్యమౌతుంది. దాంతో ప్రేమ కూడా 'ప్రదర్శన' (ఎగ్జిబిషనిజం)గా మారవచ్చు. హృదయాల్లోకి చేరడానికి అవి పాఠ్యాంశాల్లా మారుతాయి. అయితే 'సంస్కృతి' అనేది చూసి నేర్చుకునేది. అనుకరణతో వచ్చేది. పాఠ్యాంశం కష్టపడి నేర్చుకుంటే వచ్చేది. కుటుంబం సంస్కృతిని కింద నుండి అనగా ప్రాథమిక దశ నుండి పైకి విస్తరించే విధంగా సమాజం స్వీకరిస్తుంది. సమాజం, ప్రభుత్వాలు అధికారికంగా చెప్తే అవి పైనుండి కిందికి విస్తరిస్తుంటాయి. సిద్ధాంతాలు పైనుండి కిందికి వస్తుంటాయి. ఏదైనా కుటుంబంలో భాగం అయితే కింది నుండి పైకి, సమాజంలోకి విస్తరిస్తుంది.

దసరా, దీపావళి, సంక్రాంతి, ఉగాది, పెత్రమాస మొదలైనవి కుటుంబ పండుగలుగా మారిపోయాయి. పెత్రమాస తమ కుటుంబంలో చనిపోయిన పెద్దలను గుర్తుచేసుకోడానికి సంబంధించిన పండగ. దసరా ఇంటివాళ్లందరూ కలుసుకోవడానికి కొత్తబట్టలు కుట్టించుకోడానికి కలిసివచ్చే పండుగ. దీపావళి, సంక్రాంతి కూతుళ్లు, అల్లుళ్లను పిలిపించుకునే పండుగ. ఉగాది ఇంటింటి పండుగ. ఇవి సమాజంనుండి విస్తరించి కుటుంబంలో భాగమయ్యాయి. కుటుంబం లేదా తెగ నుండి విస్తరించి సమాజంలో భాగం అయ్యాయి.

**కులాతీత వివాహాలు కుటుంబంలో భాగం కావాలి**

కులాతీత వివాహాలు ప్రస్తుత కుటుంబానికి వెలుపల కొనసాగుతున్నాయి. అవి పైనుండి కిందికి వస్తున్నాయి. కులాతీత వివాహాలు కుటుంబంలో భాగమై సమాజంలోకి విస్తరించాలి. అదే మౌలిక మార్పు. అదే కులాలను కలిపేస్తుంది. అన్ని కులాలు ఒకటౌతాయి.

కులాతీత వివాహాల్ని కుటుంబ పెద్దలు ఆ యా కులాలవాళ్లు వ్యతిరేకిస్తే ప్రేమికులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. తద్వారా కుటుంబం, కులం యథాస్థితిలో కొనసాగడానికి కారకులౌతున్నారు.

## ప్రశ్నలు

1. కుటుంబ వ్యవస్థ గురించి అమెరికా, రష్యా, యూరప్‌ల్లో ఏం జరిగింది?
2. స్వేచ్ఛ పేరిట కన్స్యూమరిజం ఎలా పెరుగుతూ వస్తున్నది?
3. కుటుంబం ఎలా ఏర్పడుతుంది? దేశానికి, కుటుంబానికి గల సామాన్య పోలికలేమిటి?
4. వేల యేళ్లుగా కుటుంబం, కులం, తెగ, జాతి సమాజాలు ఎందుకు కొనసాగుతున్నాయి? మీ అభిప్రాయాలు వివరంగా రాయండి.
5. కులం, మతం రద్దు అయితే కుటుంబం రద్దు అవుతుందా?
6. కుటుంబం రద్దు అయితే ప్రభుత్వం, సమాజం, చేయాల్సిన కర్తవ్యాలు, కార్యక్రమాలు ఏమిటి?



# ఫెమినిజం అంటే ఏమిటి?

## ఏ అవసరాల కోసం? ఏ సామాజిక నేపథ్యంలో పుట్టింది?

ఫెమినిజం అంటే ఏమిటి? ఏ అవసరాల కోసం, ఏ సమస్యల పరిష్కార కోసం ఫెమినిజం పుట్టింది? మొదలైనవి తెలుసుకోవడం అవసరం. ఫెమినిజం కుటుంబ వ్యవస్థను సమూలంగా మార్చడం కోసం పుట్టింది. ప్రస్తుతం ఉన్న కుటుంబ వ్యవస్థ మగవాళ్లకు అనుకూలంగా, స్త్రీలకు వ్యతిరేకంగా, స్త్రీలను అణిచివేసేదిగా ఉంది. స్త్రీ తన మనస్సును తాను తెలుసుకొని ఆచరించడం, జీవించడం ఫెమినిజం.

సమాజంలో అందరితో సమానంగా స్త్రీ స్వేచ్ఛ, సమానత, సమాన అవకాశాలు పొందడం ఫెమినిజం. మగపెత్తనాన్ని స్థిరపరచిన పితృస్వామ్య వ్యవస్థ సంస్కృతిని అనగా మగవాళ్లకు మాత్రమే అనుకూలంగా ఉండే సంస్కృతిని, ఆలోచనా విధానాన్ని కుటుంబం, సమాజం వంటి వాటిని సమూలంగా మార్చడం నూతన విలువలతో అందరూ సమానంగా స్వేచ్ఛగా జీవించడం ఫెమినిజం.

ఇంటిపని, వంటపని పిల్లల పెంపకం నుండి స్త్రీలను విముక్తులను చేయాలి. అనేక కట్టుబాట్ల నుండి స్త్రీలను విముక్తం చేయాలి. స్త్రీ, పురుషుల మధ్య వివక్షతను తొలగించాలి. స్త్రీలు చేసే అన్ని పనులు పురుషులు చేయాలి. పురుషులు చేసే అన్ని పనులు స్త్రీలు చేయాలి.

అందువల్ల స్త్రీ వాదం పురుష అహంకారాన్ని మగపెత్తనాన్ని వ్యతిరేకిస్తున్నది. సమాజానికి సంబంధించిన నిర్మాణ రూపాలు చాలామేరకు మగపెత్తనానికి అనుకూలంగా నిర్మించుకున్నదే. అందువల్ల రాజకీయ వ్యవస్థతో పాటు ఈ సమాజాన్ని, కుటుంబాన్ని రాజకీయ పార్టీలను సమూలంగా మార్చాలి.

**మార్క్సిజానికి మోర్గాన్ పరిశోధనలు ఒక ప్రధాన భూమిక**

మోర్గాన్ పరిశోధించి గ్రంథస్తం చేసిన "పురాతన సమాజం" విశ్లేషణను ఆధారం చేసుకొని ఎంగిల్స్ రాజ్యం, వ్యక్తిగత ఆస్తి కుటుంబం పుట్టుక దాదాపు ఏక కాలంలో సంభవించాయంటాడు. వ్యక్తిగత ఆస్తి కూడబెట్టడం నుండి పితృస్వామిక వ్యవస్థ రూపొందింది. పితృస్వామిక దృక్పథం పురుషాధిపత్య కుటుంబానికి రూపకల్పన చేసింది. వ్యక్తిగత ఆస్తి, పితృస్వామికం, రాజ్యవ్యవస్థ పరస్పర సంబంధంలో రూపొందాయి. వ్యక్తిగత ఆస్థి అంటే నాది అనే భావన, హక్కు అధికారం. నాదనే భావాన్ని

వదిలించుకోవాలని భారతీయ తత్వ శాస్త్రాలు చాలా చర్చ చేసాయి. అవి శూద్రులను పరాయికరించడానికి పనికివచ్చాయి.

### స్త్రీల స్వయంవరం-జెండర్ స్వేచ్ఛ

స్త్రీవాదులు "స్వయంవరాన్ని" జెండర్‌ను ఎన్నుకునే స్వేచ్ఛగా పేర్కొంటారు. స్త్రీ వాదులు ఆచరించే స్వయంవరం పితృస్వామికాన్ని కూల్చివేయడంలో తొలిమెట్టు అవుతుంది. స్త్రీవాదుల స్వయంవరం పురుషాధిపత్యానికనువుగా ఉన్న నేటి కుటుంబ వ్యవస్థను స్వరూపంలో, స్వభావంలో ఎంతో మార్చుతుంది. తద్వారా రాజ్యం యొక్క ఒక ప్రాథమిక యూనిట్‌గా ఉండే "కుటుంబం" ప్రజాస్వామిక సోషలిజానికి ఒక యూనిట్‌గా రూపుదిద్దుకుంటుంది.

### ఫెమినిస్ట్ తత్వశాస్త్రం

మహిళలకు సమాన హక్కుల కోసం కృషిచేసే సాంఘిక ఉద్యమం ఫెమినిజం. విండికేషన్ ఆఫ్ ది రైట్స్ ఆఫ్ ఉమెన్ అనే గ్రంథం 1792లో మొదటిసారిగా బలంగా స్త్రీల సమానత్వం గురించి వ్యక్తీకరించింది. 1848లో సెనెకా ఫాల్స్ కన్వెన్షన్, ఎల్జిబెత్ కాడి స్టాన్టన్ మట్ తదితరులతో సదస్సు జరిగింది. మహిళలకు చట్టబద్ధంగానూ అన్ని రంగాలలోను సమానత్వం కోసం విద్యా అవకాశాలకోసం సమానమైన వేతనం కోసం చర్చలు ముందుకు తెచ్చారు. ఆ తరువాత ఉమెన్ సఫరేజ్ అనే ఉద్యమం మహిళలను కదలించడానికి మొదలైంది. మహిళా ఉద్యమం అమెరికా నుండి యూరప్‌కు విస్తరించింది అని అంటారు. అమెరికా మహిళలు రాజ్యాంగ సవరణ ద్వారా 1920 నుండి ఓటు హక్కు పొందారు. కాని ఇంటిపని, పని స్థలాలు స్త్రీల పట్ల దృక్పథం పెద్దగా మారలేదు. సైమన్ దిబోవర్ అనే రచయిత్రి 1949లో సెకండ్ సెక్స్ అనే గ్రంథాన్ని రాసింది. సైమన్ దిబోవర్, జీన్‌పాల్ సార్త్రే పెళ్ళి లేకుండానే 40 ఏళ్ళు కలసి కాపురం చేసారు. సెకండ్ సెక్స్ గ్రంథం ఆధునిక ఫెమినిజంలో ఒక మైలు రాయి. ఆ తరువాత ది ఫెమినేన్ మిస్టిక్ (1963) అనే గ్రంథం బెట్టి ఫ్రీడన్ రాసారు. 1966లో మహిళలకోసం జాతీయ సంస్థ ఆవిర్భవించింది.

### రష్యాలో స్త్రీలకు సమాన హక్కులు

రష్యాలో మహిళలకు విప్లవం వచ్చాక ఓటు హక్కు వచ్చింది. ఇంగ్లాండ్‌లో, ఫ్రాన్స్‌లో కూడా స్త్రీలకు ఓటు హక్కు వచ్చింది. ఇండియాలో 1950, జనవరి, 26 నుండి పూర్తి స్థాయిలో పురుషులతో సమానంగా స్త్రీలకు ఓటు హక్కు వచ్చింది. అయితే పురుషులతో సమానంగా ఆస్థి హక్కు రాలేదు. దీనికోసం అంబేద్కర్ న్యాయశాఖ మంత్రిగా స్త్రీల హక్కుల కోసం హిందూ కోడ్‌బిల్లు ప్రవేశపెట్టాడు. ఛాందసవాది అయిన రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్‌తో సహా చాలామంది కాంగ్రెస్ పార్లమెంట్ సభ్యులు వ్యతిరేకించారు. ప్రధాని నెహ్రూ పార్టీ తరపున విప్ జారీ చేసి బిల్లుకు అనుకూలంగా ఓటు చేయవలసిందే అని చెప్పలేదు. దాంతో హిందూ కోడ్‌బిల్లు పార్లమెంట్‌లో ఓడిపోయింది. ఈ అవమానంతో, కాంగ్రెస్, నెహ్రూల సహాయ నిరాకరణతో అంబేద్కర్ న్యాయశాఖా మంత్రి పదవికి రాజీనామా చేశారు.



### ప్రపంచ మహిళా దశాబ్దం

1980లో ఐక్యరాజ్య సమితి అంతర్జాతీయ మహిళా దశాబ్దాన్ని ప్రకటించింది. అలా పదేళ్ళపాటు ప్రపంచమంతట స్త్రీల సమాన హక్కుల గురించి, సమాన వేతనాల గురించి అన్ని సంస్థల్లో, చట్టసభల్లో, ఉద్యోగ రంగాల్లో, విద్యారంగాల్లో స్త్రీలకు రిజర్వేషన్‌లు కావాలని ఉద్యమాలు మొదలయ్యాయి. మహిళా సాధికారికత కోరుతూ ప్రపంచమంతటా పలు భాషల్లో సిద్ధాంత సాహిత్యం, సాహిత్యం కళలు, సినిమాలు, టీవీలు, ఎలక్ట్రానిక్ మీడియా, ప్రింట్‌మీడియాలో సాహిత్యం కళలు విస్తారంగా వెలువడ్డాయి.

### ఫెమినిజం కన్జ్యూమరిజంలో, సామ్రాజ్యవాదంలో భాగమనడం సరైనదేనా?

మల్టీనేషనల్స్ సరుకులను అమ్ముకోవడానికి పెట్టినపేరే ఫెమినిజం అని కొందరు తీవ్రంగా నిరసిస్తారు. వ్యక్తిగత స్వేచ్ఛావాదం, కుటుంబ వ్యవస్థ విచ్ఛిన్నం కావడం. అందువల్ల కుటుంబ వ్యవస్థను ఇలాంటి దోపిడీదారులకోసం, వారి సరుకులను అమ్మడం కోసం వారికి మనుషులు యంత్రాల్లా పనిచేయడంకోసం వ్యక్తిగత స్వేచ్ఛను, కుటుంబ విచ్ఛిన్నాన్ని కోరుతున్నారని అంటారు. ఇలా ఫెమినిజం కన్స్యూమరిజంలో, సామ్రాజ్యవాదంలో భాగం అని కొందరు అంటారు. ఆ మాట సరైనది కాకపోవచ్చు.

### ప్రపంచానికి ఫెమినిజం ఇచ్చిన వెలుగు

ఫెమినిజం అనేక విషయాలను చర్చకు తెచ్చింది. స్త్రీల శరీరం చుట్టూతా అల్లిన అనేక కల్లబొల్లి కబుర్లను బట్టబయలు చేసింది. స్త్రీల శరీరం పట్ల స్త్రీలకు స్వస్వరూప జ్ఞానాన్ని కలుగజేసింది. శీలం, పాతివ్రత్యం మొదలైన అంశాలలో పితృస్వామిక పురుషాధిపత్య భావజాలం ఎలా కొనసాగుతున్నదో స్పష్టం చేసింది.

### మార్క్సిజం పితృస్వామ్య భావజాలమే అని చెప్పిన ఫెమినిజం

మార్క్సిజం చెప్పిన చారిత్రక భౌతిక వాదంలో పురుషాధిపత్య పితృస్వామిక దృక్పథమే కొనసాగిందని, స్త్రీల కోణం లోపించిందని తద్వారా సగం జనాభాను వదిలివేసిందని నిర్ధారించారు. మార్క్సిజం చెప్పిన అదనపు విలువ, పెట్టుబడి, శ్రమశక్తి, ఉత్పత్తి సంబంధాలలో ఇంటిలోని చాకిరీ, పిల్లలపెంపకం, వంట, భర్త లైంగిక అవసరాలు తీర్చడం, వృద్ధుల సంరక్షణ మొదలైనవన్నీ అదనపు విలువను సృష్టించడంలో భాగమేనని నిర్ధారించారు.

### చారిత్రక భౌతికవాదం, మార్క్సిస్టు అర్థశాస్త్రం పురుషాధిపత్య దృక్పథమే

అలా మార్క్సిస్టు అర్థశాస్త్రంలోని లోపాలను చాలా లోతుగా విశ్లేషించారు. మార్క్సిజం పితృస్వామిక భావజాలంలో ఉండడం వల్ల దాని అర్థశాస్త్రం, చారిత్రక భౌతిక వాదం, కార్మిక వర్గ ఉద్యమాలు, కార్యక్రమాలు అన్నిట్లో పితృస్వామిక పురుషాధిపత్య భావజాలానికి నాయకత్వానికి అనుకూలంగా మాత్రమే కొనసాగుతున్నాయని స్పష్టం చేసింది. అందువల్ల సగం మంది వున్న స్త్రీలు అన్ని సంస్థల్లో, అన్ని పార్టీల్లో అన్ని ఉద్యమాల్లో, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, పారిశ్రామిక సమస్త రంగాల్లో స్త్రీలు సగం మంది ఉండాలని స్పష్టం చేసింది.

## భాషకు, ఉత్పత్తి సంబంధాలకు, సంస్కృతికి పురుషాధిపత్య స్వభావం ఉంది

భాషకు, ఉత్పత్తి సంబంధాలకు, మార్క్సిజం చెప్పే వర్గ స్వభావానికి, సంస్కృతికి పురుషాధిపత్య స్వభావం ఉంది. భాషకు కులం ఉంది. సంస్కృతికి కులం ఉంది. పితృస్వామిక స్వభావం ఉంది అని ఫెమినిజం విశ్లేషించింది.

## ఒకే ఇంట్లో కలిసి జీవించకపోయినా కుటుంబమే అని నిర్వచనం మారిన తీరు

కుటుంబం అంటే భార్యాభర్తలు, పిల్లలు కలిసి ఒకే ఇంటిలో జీవించాల్సిన అవసరం లేదని కొత్త నిర్వచనం ఇచ్చింది. సింగిల్ పేరెంట్ కుటుంబ వ్యవస్థ అమెరికా, యూరప్ దేశాల్లో అవతరించింది. 20 శాతం జనాభా సింగిల్ పేరెంట్ కుటుంబాలుగా జీవిస్తున్నారు. సింగిల్ పేరెంట్ కుటుంబం అంటే తల్లితో గాని, తండ్రితో గాని పిల్లలు ఉండడం. తల్లిదండ్రులు కలిసి వున్నప్పటికీ ఎవరి ఇల్లు వారికే ఉండడం. కుటుంబం అంటే 1985 తరువాత అక్కడ నిర్వచనమే మారిపోయింది. కుటుంబం అంటే భార్య భర్తలు ఒకే ఇంట్లో జీవించనవసరం లేదు. పిల్లలు వారితో జీవించనవసరం లేదు. వృద్ధులు వారితో ఒకే ఇంట్లో జీవించనవసరం లేదు. అయినప్పటికీ దాన్ని కుటుంబం అని పిలుస్తున్నారు.

## తెల్లజాతి స్త్రీల ఫెమినిజం

స్త్రీవాదం ప్రపంచమంతటా ఒకే విధంగా లేదు. యూరప్ అమెరికాల్లో ఫెమినిజం తెల్లజాతి స్త్రీల అవసరాలు, అవగాహన అనుసరించింది. అనగా పారిశ్రామిక విప్లవంలో యజమానులుగా, మధ్యతరగతిగా, కార్మికులుగా ఎదిగి జీవన ప్రమాణాలు పెంచుకున్న క్రమంలో, వలసల క్రమంలో ఉమ్మడి కుటుంబాలు వ్యక్తి కుటుంబాలుగా మారిన తరువాత ఆ వ్యక్తి కుటుంబాలు కూడా సింగిల్ పేరెంట్ కుటుంబాలుగా మారే క్రమంలో తెల్లజాతి స్త్రీల ఫెమినిజం వారి సమస్యలకు పరిమితమైందని అర్థం. అంతకన్నా విస్తృతమైన మిగతా స్త్రీల సమస్యల పట్ల వైట్ ఫెమినిజం స్పందించలేదు.

## నల్లజాతి స్త్రీల ఫెమినిజం ప్రత్యేకత

నల్లజాతి స్త్రీల ఫెమినిజం తెల్లజాతి స్త్రీల ఫెమినిజంలాగా స్త్రీల వ్యక్తిగత అభివృద్ధి, వ్యక్తిగత స్వేచ్ఛ, సమానత్వం కోసం మాత్రమే కాకుండా సామాజిక సమస్యలన్నీ నల్లజాతి స్త్రీల సమస్యల్లో భాగమని గుర్తించి వాటన్నిటిలో గల పితృస్వామిక భావజాలాన్ని, ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ మగవాళ్ళతో కలిసి పని చేస్తూ నల్లజాతి ఫెమినిజాన్ని సామాజిక ఉద్యమాల ఫెమినిజంగా అభివృద్ధి పరిచారు. ఇలా తెల్లజాతి స్త్రీల ఫెమినిజం సామాజిక సమస్యలతో సమన్వయించకుండా స్వతంత్ర ఉద్యమంగా, భావజాలంగా కొనసాగుతే నల్లజాతి స్త్రీల ఫెమినిజం సామాజిక సమస్యలను, ఉద్యమాలను భావజాలంగా సమన్వయించుకుంటూ నాయకత్వంగా కూడా ఎదుగుతూ ఒక సమగ్ర దృక్పథంతో కొనసాగుతున్నది.

## నాలుగు రకాలుగా సాగుతున్న భారతీయ ఫెమినిజం

భారతదేశంలో కూడా ఫెమినిజం నాలుగు దశల్లో కొనసాగుతున్నది. తెల్లజాతి స్త్రీల ఫెమినిజాన్ని పట్టణ, నగర ప్రాంతాల్లో ఎదిగిన అగ్రకుల స్త్రీల వ్యక్తిగత సమస్యలకు,



వ్యక్తిగత స్వేచ్ఛకు, అభివృద్ధికి పరిమితమై కొనసాగుతున్నది. వీళ్ళు చట్టసభల్లో స్త్రీలకు రిజర్వేషన్లు ప్రవేశ పెట్టాలని కోరతారు. కానీ బిసి, ఎస్సీ, ఎస్టీ స్త్రీలకు అందులో రిజర్వేషన్లు ఉండాలి అనడాన్ని వ్యతిరేకిస్తారు. అందువల్ల సుమారుగా పదేళ్ళుగా చట్టసభల్లో రిజర్వేషన్లు అనే అంశం మూలకు పడుతూ వస్తున్నది. స్త్రీల పేరిట అగ్రకుల మగవాళ్ళ స్థానంలో ఆడవాళ్ళు రావడం కోసమే స్త్రీలకు రిజర్వేషన్లు ఎందుకని బిసి, ఇతర కులాల స్త్రీలకు రిజర్వేషన్లలో కోటా ఉండాలని బిసి, ఎస్సీ వర్గాలు బలంగా ఉద్యమిస్తున్నాయి. ఇలా ఉద్యమిస్తున్న స్త్రీలు నల్లజాతి ఫెమినిజం స్కూలుకు చెందిన వారుగా చెప్పవచ్చు. అలాగే గ్రామీణ ఫెమినిజం వేరుగాను, పట్టణ ఫెమినిజం వేరుగాను కొనసాగుతున్నాయి. వారి సమస్యలు ప్రత్యేకమైనవి కాబట్టి వేరువేరు ప్రాధాన్యతలతో, కార్యక్రమాలతో ముందుకు సాగుతున్నాయి. కుల సమస్య ప్రధాన సమస్యగా స్త్రీలను అణచివేస్తున్న సమస్యగా భారతీయ ఫెమినిస్టులు చాలా మంది భావిస్తున్నారు. అందువల్ల భారతదేశంలో ఫెమినిజానికి దోపిడీ కుల స్వభావం ఉందని దాన్ని వ్యతిరేకించే పీడిత కుల ఫెమినిజం ముందుకు వస్తున్నది. ఇలా నాలుగు రకాల, నాలుగు దశల ఫెమినిజం కలిసి పని చేస్తూ, ప్రత్యేకంగా ఎవరికి వారు విడిగా కార్యక్రమాలు కూడా తీసుకొని ముందుకు సాగుతున్నారు.

## ఫెమినిజంలో పట్టణ, మధ్యతరగతి అగ్రకులాలదే పెద్దపీట

సాహిత్యంలో సామాజిక ఉద్యమాల్లో దోపిడీ కులాల స్త్రీల అభివృద్ధి పరిణామాల కనువుగా పట్టణ, ఉన్నత, మధ్య తరగతి ఆకాంక్షల అవసరాల మేరకే పరిమితమైన ఫెమినిజం ముందుకు వస్తున్నది. గ్రామీణ స్త్రీల ఆధునిక అభివృద్ధికి అనువుగా వెనుకబడిన స్త్రీల సమస్యల పట్ల ఫెమినిజం మరింత నిర్దిష్టమైన ఉత్పత్తి సంబంధాల ఫెమినిజం రూపు దిద్దుకున్నది. దీన్ని వామపక్షాలైనా స్వీకరించడానికి వారిలోని పితృస్వామిక భావజాలం దానికి అనుకూలమైన కార్యక్రమాల రూపకల్పన అడ్డగిస్తున్నది.

## ఫెమినిజం సమాజానికి ఎంతో అవసరం

ఫెమినిజం సరుకుల ఉత్పత్తి, సంతానోత్పత్తిలో స్త్రీల శ్రమ శక్తి పాత్రను, మానవ వనరుల ఉత్పత్తిలో గల ప్రాధాన్యతను అదనపు విలువలో స్త్రీల ఇంటి శ్రమశక్తి ప్రధమ పాత్రను ప్రత్యేకంగా లోతుగా చర్చించి వాటి ప్రాధాన్యతలను వెలికి తీసింది. ఇంటిచాకిరి కూడా సామాజిక ఉత్పత్తి శ్రమలో ఎలా భాగమవుతుందో నిర్ధారిస్తూ పలు గ్రంథాలు వెలువడ్డాయి. అయినప్పటికీ ప్రజాస్వామిక సిద్ధాంతాలు, వామపక్ష సిద్ధాంతాలు వాటిని పూర్తిస్థాయిలో స్వీకరించడానికి సిద్ధంగా లేవు. అయితే జీతం ఏ ప్రమాణాల ప్రకారంగా నిర్ణయించాలి అనే అంశంలో మొత్తం కుటుంబ అవసరాలను, ప్రమాణాలను లెక్కలోకి తీసుకోవడం ప్రపంచ వ్యాప్తంగా అమల్లోకి వచ్చింది. ఇది ఫెమినిజం యొక్క ఘన విజయంగా చెప్పవచ్చు. ఇలా ఫెమినిజం ప్రతి రంగంలో ఎంతో అదనపు చేర్పును అందించింది.

## అన్ని రంగాల్లో, అన్ని ఉద్యమాల్లో, అన్ని స్థాయిల్లో నాయకులుగా స్త్రీలు 50 శాతం ఉండాలి

ఫెమినిజం అన్ని రంగాల్లో 50 శాతం స్త్రీలు నాయకత్వంలోకి రావలసిన

ఆవశ్యకతను నొక్కి చెప్పింది. వంట చేసుకోడానికి, పిల్లలను పెంచి పోషిస్తూ బడికి పంపిస్తూ, వృద్ధుల బాధ్యతను నెరవేరుస్తూ, సామాజిక ఉద్యమాల్లో పనిచేసే విధంగా, నాయకత్వం వహించే విధంగా కార్యక్రమాలను, వ్యూహం ఎత్తుగడలను సమూలంగా మార్చుకోవల్సిన అవసరం ఉందని ఫెమినిజం స్పష్టం చేస్తున్నది. పార్లమెంటరీ పార్టీలు ఈ విషయంలో కాస్త ముందున్నాయి. ఉద్యోగ సంఘాలు, ట్రేడ్ యూనియన్లు ఇంకా ముందుకు రావడం లేదు, కుటుంబాలను, స్త్రీలను తమ ఉద్యమాల్లో తమ వెంట తీసుకురావాలనే ప్రాధాన్యతను ఆచరించడం లేదు. స్త్రీల నాయకత్వం, స్త్రీల వ్యక్తిగత సామాజిక అభివృద్ధి, దేశంలోని సామాజిక అభివృద్ధిని జీవన ప్రమాణాలను ఎన్నో రెట్లు పెంచుతుంది. ఇన్ఫీరియార్టీ కాంప్లెక్స్ సమాజం నుంచి అదృశ్యం కావడానికి ప్రధాన పాత్ర వహిస్తుంది.

**స్త్రీలంతా ఒక్కటే కాదు-వర్గాలు, కులాలు, ప్రాంతీయ భేదాలు వున్నాయి**

స్త్రీలంతా ఒక్కటే కాదు. స్త్రీలలో వర్గాలు వున్నాయి. కులాలు వున్నాయి. ప్రాంతీయ భేదాలున్నాయి. భాషా భేదాలున్నాయి. ఉదాహరణకు ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో తెలంగాణ స్త్రీ వాదులు చురుకుగా పాల్గొంటున్నారు. కోస్తా ఆంధ్ర స్త్రీ వాదులు చురుకుగా పాల్గొనడం లేదు. పైగా చాలా మంది అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు. క్రింది కులాల స్త్రీల లైంగికత సమస్య ప్రత్యేకమైనది. క్రింది కులాల స్త్రీల స్త్రీత్వంపై అగ్రకుల పీడన కొనసాగుతున్నది. ఇలా క్రింది కులాల గ్రామీణ స్త్రీలు ఇతర స్త్రీల కన్నా ఎన్నో రెట్లు పితృస్వామిక, వర్ణవివక్ష, కులవివక్ష పీడనలకు, దోపిడీలకు, అణచివేతలకు గురవుతున్నారని పీడిత కుల గ్రామీణ స్త్రీవాదులు భావిస్తున్నారు.

**పట్టణ అగ్రకుల ఫెమినిజం పట్ల గ్రామీణుల వ్యతిరేకత ఎలా ఉంటుందంటే..**

పట్టణ అగ్రకుల ఫెమినిజం పట్ల గ్రామీణ శ్రామిక కులాల సమాజానికి వున్న వ్యతిరేకత లేదా అపోహలు ఎలా కొసాగుతున్నాయో ఈ కింది సంభాషణ తెలుపుతుంది. "ఫెమినిస్టుల సెమినార్‌కు రమ్మన్నానని పొరపాటున ఫెమినిస్టును పెళ్ళి చేసుకునేవు. చేసుకుంటే నీ కుటుంబం మొత్తం ఆగం అవుతుంది జాగ్రత్త. ఫెమినిస్టులు తనకు తానువ్యక్తిగతంగా మరింత ఎదగాలని కోరుకుంటారే తప్ప ఆమె కన్నా వెనకబడిపోయిన మీ తమ్ముణ్ని, తల్లిదండ్రుల్ని ఎదిగిస్తూ పోషిస్తూ కూర్చోరు. అదంతా వాళ్ళ దృష్టిలో వేస్టు లగేజీ. మనలాగ నూటికొక్కడు పైకొచ్చే కుటుంబాల్లో ఫెమినిస్టులను పెళ్ళి చేసుకొంటే మన అభివృద్ధి నీవాళ్ళకందకుండా పోతుంది. అసలు ఉమ్మడి కుటంబం విచ్ఛిన్నమై, వ్యక్తి కుటుంబం ఏర్పడితే తప్ప ఫెమినిజం పుట్టడం సాధ్యం కాదు" అన్నాడు విక్రాంత్ - ఎక్కడ లత బుట్టలో పడిపోతాడేమో అని ఆలోచిస్తూ." ('బతుకుపయనం' కథల సంపుటిలోని జీవనయానం కథ - బిఎస్‌రాములు పేజి 76)

**గ్రామీణ మగవాళ్ళ దృక్పథాన్ని సరిచేసిన గ్రామీణ, దళిత ఫెమినిస్టులు**

అలాగే శ్రామిక కులాల మగవాళ్ళలో కొనసాగుతున్న ఫెమినిస్టు వ్యతిరేక దృక్పథాన్ని గ్రామీణ స్త్రీలు ఎదిగిన తరువాత ఎండగట్టిన తీరును ఈ సంభాషణ తెలుపుతుంది. అగ్రకుల ఫెమినిజమైనా, తెల్లజాతి ఫెమినిజమైనా అది సాధించిన అభివృద్ధి గ్రామీణ స్త్రీల ఫెమినిజానికి, అభివృద్ధికి ఎలా ఉపయోగపడుతుందో ఈ



మాటలు స్పష్టం చేస్తాయి.

"అరవింద్! నువ్వూ నేనూ ఫెమినిస్టులను పెళ్ళి చేసుకుంటే మన కుటుంబాలు ఇలా అభివృద్ధి అయ్యేవేనా! లేదా మనం మన స్వార్థం, మన సుఖాల కోసం సిటీలో స్థిరపడితే మన కుటుంబాలు, మన బంధువులు ఇలా వానతో నీటిమట్టం అంతటా పెరిగినట్లు పెరగడం సాధ్యమయ్యేదా...!

"...కాకపోతే మనం వ్యక్తిగతంగా ఎవరికీ నీడనివ్వని తాడిచెట్టులా ఇంకా ఎదిగి ఉండేవాళ్ళమేమో! మన పిల్లలు మన బంధువుల్తో సంబంధాలు కోల్పోయి, మన సంపాదన, సోషల్ స్టేటస్‌తో క్రిమీ లేయర్ ఎలైట్ క్లాసుగా పచ్చి స్వార్థ పరులుగా మారే క్రమం మొదలయ్యేది. ఏమంటావు?" అంటూ అడిగాడు విక్రాంత్.

"పైగా యిక్కడ ఉన్న గుర్తింపు గౌరవం, ప్రేమ సిటీలో ఎందుకుంటుంది? అక్కడ మనం మన సమాజానికి చేసే మేలంటూ ఏముంటుంది?" అని గొంతుకలిపాడు అరవింద్.

అప్పుడే యింట్లోకి వచ్చిన డాక్టర్ లత నవ్వుతూ అడిగింది.

"బావా బామ్మరుదులు చాల్రోజుల తర్వాత ఏదో తీరికగా చర్చిస్తున్నారు."

అరవింద్ జరిగిన చర్చ చెప్పాడు. లత నవ్వుతూ అంది.

"అయితే మీకు ఫెమినిజం మీద యింకా కోపం పోలేదన్నమాట! అసలు యిదంతా ఫెమినిజం వల్లే సాధ్యపడింది. ఫెమినిజం వల్లే స్త్రీలను సమానంగా గౌరవిస్తున్నారు. ఫెమినిజం వల్లే మహిళలకు మూడోవంతు అన్ని రంగాల్లో రిజర్వేషన్లు ఏర్పడ్డాయి...

"ఈ రిజర్వేషన్ల వల్లే అత్తమ్మలాంటి వాళ్ళు ఎందరో స్త్రీలు ఎన్నికల్లో గెలిచారు. ఎస్సీ, బిసి, ఎస్టీల వారీగా మహిళలకు రిజర్వేషన్లు లేకపోయి ఉంటే అత్తమ్మలాంటి వారు గెలిచేవారా? ఏ ఓసీ స్త్రీలో గెలిచి ఉండేవాళ్ళు. నేనూ, రాధా, అరుణా ఫెమినిస్టులం కాదని ఎందుకనుకున్నారు? మీకు ఎదురు తిరగకుండా వినయంగా సంసారాలు చేస్తున్నందుకా?"

"అది కాదు లతా!" అంటూ విక్రాంత్ ఏదో చెప్పబోయాడు.

లత విన్పించుకోలేదు.

"మీ దృష్టిలో పీడిత వర్గ, పీడితకుల, రూరల్ (గ్రామీణ) దృక్పథంతో పని చేసే ఫెమినిస్టులు. ఫెమినిస్టులు కారా? మీ దృష్టిలో లూజ్ క్యారక్టర్ ఉంటేనే ఫెమినిస్టులా? లేక ఆర్గనైజ్డ్ ఓసీ క్యాస్ట్ ఎలైట్ ఫెమినిస్టులే ఫెమినిస్టులనుకుంటున్నారా?...

"అంటే మీలోనూ ఆర్గనైజ్‌డ్ ఓసీ ఎలైట్ లూజ్‌క్యారక్టర్ ఫెమినిస్టులే ఫెమినిస్టులనే దృక్పథం హాంగోవర్‌గా కొనసాగుతోందన్నమాట. మేన్ స్ట్రీం మీడియా మీపై కూడా ఎంత ప్రభావం వేస్తోంది?" అంటూ డాక్టర్ లత ఉపన్యాసం దంచింది.

విక్రాంత్, అరవింద్‌లు ఆ వాగ్ధాటికి అవాక్కయ్యారు.

ఈమె తనకోడలేనా అని కొత్తగా ఆశ్చర్యపోయింది సక్కుబాయి. మెచ్చుకోలుగా చూసి అంది.

"ఈ సారి ఎమ్మెల్యేగా పోటీ చేయి కోడలా! ఎస్సీల్లో యింత తెలివి ఉన్నప్పుడు రిజర్వేషన్ సీట్లో పోటీ ఎందుకు చెయద్దు?"

కులాంతర వివాహం అంగీకరించిన సక్కుబాయి బిసి కులానికి చెందిన స్త్రీ.

### 1990 నుండి పెరిగిన దళిత స్త్రీవాద చైతన్యం

అలాగే 1994లో దళిత స్త్రీవాదం అగ్రకుల స్త్రీవాదాన్ని ఇలా ప్రశ్నించింది. "మీ నుండి నిజమైన సహృదయత కావాలి. అందువల్ల దయచేసి ఏడాదికోనెలైనా, నెలకోవారమైనా మా ఇళ్ళకొచ్చి మా ముట్టుబట్టలు, పీతిబట్టలు ఉతికి ఇచ్చిపొండి. మీరిచ్చినంతే కూలీ ఇస్తాం అంటే చాకలిదానికి ఎంత గర్వం వచ్చిందీ అని గుడ్లురిమి చూస్తారు. వాషింగ్‌మిషన్ తెచ్చుకొని నాకున్న ఆకాస్త పనినీ పోగొడ్తారు. ఇలా అభివృద్ధి ఫలితాలు మీ పాలు, ఉపాధి కోల్పోవడం, నిరుద్యోగం మాపాలు, ఎందుకు తల్లీ నీ హితబోధలు! నిజంగానే నా బాధలు ఆర్చడానికి తీర్చడానికేనా? ఏడాదల్లా మీ గిన్నెలు తోముతున్నాను గదా! కనీసం నెలకో మూడురోజులైనా మా ఇంట్లో గిన్నెలు తోముమని అదే కూలి ఇస్తానని నిన్ను నేనడిగితే యీ పనిమనిషి ముండకు కావరం వచ్చింది. చిన్నంతరం, పెద్దంతరం లేకుండా మాట్లాడుతుందని నీ మగనితో అంటావు. మా యీ సామాజిక గౌరవం హోదా గురించి మీరేం చేస్తున్నారని మేం నిలదీస్తే ఇదెక్కడి ముండ చిల్లరకులమేగంత అని అనేస్తారు. లేదా మనస్సులో అనుకొంటారు. వాషింగ్‌మిషన్‌లాగే అంట్లు తోమే మిషన్ కూడా తయారు చేయమని మీ మగన్ని పురమాయిస్తారు. ఇలాంటి గోడ మీద పిల్లుల పిల్లి కూతలకు మా దళిత స్త్రీ దృక్పథం ఉట్టి తెగదు. దళిత స్త్రీ సాహిత్యం ఆగిపోదు."

"... నీ కొడుకు నా బిడ్డను ప్రేమించిండు. పెళ్ళిచేద్దాం అని నేను అంటే అది నా కొడుక్కి కన్నుకొట్టి వలలో వేసుకున్నదటనే- నా ఆస్తి చూసి, నా పెద్ద కులం చూసే - అని నీవు యీసడించి యీ చిల్లర కులపోల్లేగింత అని మనస్సులో అనుకొని 5, 10 వేలు లంచం ఇచ్చి మంచి మొగన్ని జూసి దానికి పెళ్లి చెయ్యివే అని హితబోధ చేసినపుడు నీలోని స్త్రీతత్వం, ఎక్కడుందని వెతకాలి తల్లీ!

"నీ బిడ్డకు నీ కులంలో లెక్కలేనన్ని సంబంధాలు వెతికి వేలు లక్షలు పోసి ఆ తాగుబోతుకు మంచి నౌకరి అని తగులకడితివి. వాడు యాడాది తిరగకుండానే కిరోసిన్ పోసి, చంపి ప్రమాదవశాత్తు చచ్చిపోయిందని టెలిగ్రాం ఇచ్చె. అవ్వా! గవ్వే పైసలు నా కొడుక్కో, నా తమ్మునికో పోసి ఓ దుకాణమో, వ్యవహారమో పెట్టిస్తేంది? బిడ్డ అల్లుడూ మీ కండ్ల ముంగట వుంటారని నేను బతిమిలాడ్తే నువ్వూ నీ మొగుడూ కలిసి చిల్లర కులపు మాదిగిదానా చెప్పు తీసుకొని పండ్లు రాలగొడ్తా-బ్రాహ్మణదాన్ని, వెలమదాన్ని, కోమటిదాన్ని, రెడ్డిదాన్ని, కమ్మదాన్ని, నన్ను ఎంత మాటడిగితివే అని తిట్టినప్పుడు ఎక్కడ పోయిందవ్వా నీలోని స్త్రీత్వం, స్త్రీతత్వం? అవ్వా ఇవేవీ నువ్వు పట్టించుకోకపోతే నువ్వేరకం స్త్రీవాదివవ్వా? యధాతథవాద జడాత్మక భ్రామక అగ్రకుల స్త్రీవాదం కాదానీది?" (కథలబడి-కథాసాహిత్య అలంకార శాస్త్రం - బి.యస్.రాములు ముద్రణ:1998 పేజి 115-116)



### పెళ్లి ఇద్దరి స్వేచ్ఛలను అరికడుతున్నదా?

పెళ్లి అన్ని స్వేచ్ఛలను స్త్రీలకు అరికడుతున్నది అని ఫెమినిస్టుల్లో కొందరు భావిస్తారు. మరికొందరు ఫెమినిస్టులు పెళ్లి, కుటుంబ వ్యవస్థ ఉండాల్సిందే. అయితే ఇంటిపని, పిల్లల పెంపకం చెరిసగం సమానంగా చేయాలి. పరస్పరం స్నేహితులుగా కలిసి ఉండాలి. ఇష్టం లేనపుడు విడిపోవాలి అని కుటుంబ వ్యవస్థ ఉండాలి, ఉండవచ్చు అని ఫెమినిస్టులు భావిస్తారు.

### పెళ్ళిలో ఉండే దృక్పథం

పెళ్ళి చేసికోవడంలో ఒక దృక్పథం ఉంటుంది. స్త్రీ, పురుషులు ఒక జంటగా, దంపతులుగా కల్సి జీవించడం అందులో ఉండే దృక్పథం, నేటి పెళ్ళి దృక్పథం పురుషాధిపత్య దృక్పథంలో భాగంగా ఏర్పడింది. పురుషాధిపత్యాన్ని తొలగిస్తే నేటి పెళ్ళి దృక్పథం మారుతుంది. స్త్రీలు, పురుషులు సమాన గౌరవంతో సమానమైన పని చేస్తూ కలిసి జీవిస్తారు.

స్త్రీ వాదం పురుషాధిపత్యం లేని పెళ్ళిని ప్రతిపాదిస్తుంది. స్త్రీ పురుషులు అన్ని పనుల్లో సమానంగా పనిచేయాలంటుంది. పెళ్ళి అనే పదానికున్న అర్థం పితృస్వామిక దృక్పథానికి చెందింది. కనక స్త్రీవాదం పెళ్ళిని "సహజీవనం" అని పిలుస్తుంది.

పెళ్ళి చేసికొనే దృక్పథంలో చాలా మందిలో ప్రపంచవ్యాప్తంగా పితృస్వామిక దృక్పథం ఉంటుంది. కాని పెళ్ళి చేసికొనే సంస్కృతి దేశానికి, ప్రాంతానికి, జాతికి, కులానికి తీరు, తీరుగా వైవిధ్యంతో ఉంటుంది. స్థలకాల నిర్దిష్టతల ననుసరించి పెళ్ళి దృక్పథం యింత వైవిధ్యపూరితమైన సంస్కృతుల రూపంలోకి ఒదిగిపోయింది. ఇలా పెళ్ళి సంస్కృతి నిర్దిష్ట(పర్టిక్యులర్)మైనదిగా పెళ్ళి దృక్పథం సార్వత్రికమైనది (యూనివర్సల్)గా రూపు దిద్దుకున్నది.

పెళ్ళి సంస్కృతి మారాలని నాస్తిక, హేతువాద, భౌతికవాద, స్త్రీవాద స్త్రీ పురుషులు కోరుతుంటారు. స్టేజి మ్యారేజి సభా పెళ్ళిని ప్రతిపాదిస్తారు. స్త్రీవాదులు కొందరు అదీ అవసరం లేదు అంటారు.

ఇష్టంలేని పెళ్ళికి విడాకులివ్వడాన్ని చాలా సమాజాలు అంగీకరించాయి. విడాకులు తీసుకునే పద్ధతి దేశానికి, ప్రాంతానికి, కులానికి, తెగకో తీరుగా కొనసాగుతున్నది. ఇలా సంస్కృతి నిర్దిష్ట పద్ధతిని రూపాన్ని కూడా తెలిపే ప్రాపంచిక దృక్పథం.

### కుల వివక్ష బాధితులకు ఫెమినిజం వర్తిస్తుంది

సరిగ్గా కుల వివక్ష బాధితులు కూడా ఫెమినిస్టుల లాగే భావిస్తున్నారు. అంబేడ్కర్ వంటి వాళ్లు కులం రద్దు కావాలని స్పష్టం చేశారు. మరికొందరు కులాల మధ్య అసమానతలు తొలగాలని, ఏ కులమూ గొప్పది కాదని, ఏ కులమూ చిన్నది కాదని, అన్ని కులాలూ సమానమే అని, అన్ని కులవృత్తులూ గౌరవనీయమైనవే. అన్ని కులవృత్తులను అన్ని కులాలవాళ్లు చేయాల్సిందే అని భావిస్తారు. ఇందులోని సామాజిక, ఆర్థిక అంశాల్ని తరువాతి అధ్యాయంలో వివరంగా చూస్తాం.

## పెళ్లి లేకుండా జీవించడం ఎంతమేరకు సాధ్యం?

కొందరు పెళ్లి చేసుకోకుండా జీవిస్తున్నారు. సినీ గాయని లతామంగేష్కర్, తెలుగు రచయిత్రి వాసిరెడ్డి సీతాదేవి పెళ్లి చేసుకోకుండానే జీవిస్తూ సీనియర్ సిటిజన్స్ అయ్యారు. పెళ్లి లేకుండా క్రైస్తవ సన్యాసినులు, ఈశ్వరీయ ప్రజాపిత బ్రహ్మకుమారి సమాజం వాళ్లు, సాయి భక్తులు, శివసత్తులు పెళ్లి చేసుకోకుండా జీవిస్తున్నారు. ఆరెసెస్ పూర్తికాలపు కార్యకర్తలు కొందరు మగవాళ్లు ఇలా పెళ్లి చేసుకోకుండా జీవిస్తున్నారు. లేదా భార్యా పిల్లలను వదిలి ఒక్కరుగా జీవిస్తున్నారు.

అయితే పల్లెల్లో స్త్రీలు పెళ్లి లేకుండా జీవించడం సులభం కాదు. తల్లిదండ్రులు గట్టిగా ఉండి ఆ ఊళ్లో ఆధిపత్య స్థానంలో ఉంటే స్త్రీలు పెళ్లి లేకుండా జీవించే అవకాశం ఉంది. బీసీ, ఎస్సీ, ఎస్టీలకు సాంఘిక భద్రత తక్కువ గనుక కష్టం. పెళ్లి లేకుండా జీవించాలనుకునేవారిని వేశ్యగా, ఉండుపుగత్తెగా మార్చేప్రయత్నాలు జరుగుతాయి. మధ్యతరగతి జీవితంతో పట్టణ నగర ప్రాంతాల్లో స్త్రీలు ఇతర స్నేహితుల అండదండలతో పెళ్లి లేకుండా జీవించడం సాధ్యపడుతుంది.

## పెళ్లిలేకుండా జీవిస్తే కోల్పోతున్నదేమిటి?

1970 దశకం నుండి మనదేశంలో కూడా పెళ్లి లేకుండా స్త్రీ పురుషులు కలిసి జీవించడం జరుగుతున్నది. వాళ్లు పెళ్లి చేసుకున్నామని చెప్పరు. భార్యాభర్తలం అనే పదాలు వాడరు. కలిసి వుంటున్నాం అంటారు. సహజీవనం చేస్తున్నాం అంటారు. ఎంతకాలం ఇలా వుంటారని ఎవరైనా అమాయకంగా అడిగితే మాకు ఇష్టమున్నంతకాలం కలిసి ఉంటాం. ఎవరికి ఇష్టం లేకపోయినా విడిపోతాం. విడిగా ఉంటాం. విడాకులు తీసుకోవాల్సిన బాదర బందీ ఉండదు అని అంటారు. పిల్లలు పుడితే ఎలా అని అడిగితే కలుసున్నప్పుడు ఇద్దరం సమానంగా బాధ్యత వహిస్తాం. విడిపోయినప్పుడు పిల్లలు ఎవరి వద్ద ఉండాలనుకుంటే వాళ్ల వద్ద ఉంటారు. చిన్నపిల్లలైతే తల్లి వద్దే ఉంటారు. విడిపోయాక పెంచి పోషించడం వీలుకాకపోతే హాస్టళ్లలో చేర్చుతాం అంటారు. పిల్లలకు తండ్రి ప్రేమ లేదా తల్లి ప్రేమ అక్కరలేదా అని అడిగితే ఇష్టమైనపుడు పిల్లలు ఇష్టపడితే చూసిపోవచ్చు అని అంటారు. అప్పుడు మళ్లీ కోపాలు పోయి ఇష్టాలు పెరిగితే ఎలా అని అడిగితే మంచిదేగదా, మళ్లీ కలిసుంటాం అని జవాబిస్తారు. ఈ పద్ధతి కుటుంబ జీవితం అధిక ఆదాయం గల పట్టణ నగర మధ్యతరగతి స్త్రీ పురుషుల్లో కనపడుతుంది. వీరి సంఖ్య వేల నుండి లక్షలకు పెరిగి ఇంకా విస్తరిస్తున్నది.

## తల్లిదండ్రుల పెంపకంలో పుట్టిన వాళ్లే కుటుంబం వద్దంటున్నారా?

ఇలా ఒక స్త్రీ, ఒక పురుషుడు ఇష్టమైనంతకాలం కలిసి జీవించడానికి పూర్వం వాళ్లు ఏదో ఒక కుటుంబంలో పుట్టినవాళ్లే. ఆ కుటుంబ సంబంధాలను, బాధ్యతలను స్వీకరిస్తే స్వీకరిస్తారు. వదిలేస్తే వదిలేస్తారు. సాధారణంగా వదిలేయడానికి మొగ్గుచూపుతారు. ఏమంటే బరువు బాధ్యతలు, కట్టుబాట్లు వద్దనుకునే కదా పెళ్లి లేకుండా సహజీవనం చేస్తున్నది. అందువల్ల ఇలాంటివాళ్లను పెంచి పోషించిన తల్లిదండ్రులు వీరిపై ఆధారపడడం, అధికారం చలాయించడం సాధ్యం కాదు.



## ఫ్రీ సెక్స్ కోసమా ఫెమినిజం?

కొందరు పెద్ద పట్టణాల్లో, మహానగరాల్లో ఫ్రీ సెక్స్ థియరీని ప్రాక్టీస్ చేస్తున్నారు. పాత భాషలో వీరిని తిరుగుబోతులు అని పిలుస్తుంటారు. వీళ్లు రకరకాల సంఘాల్లో పనిచేస్తుంటారు. పెళ్లి అయిన స్త్రీలను లేదా పురుషులను కూడా ముగ్గులోకి లాగడం తమ జన్మహక్కు అనుకుంటారు. ఒకాయన 'నీ పెళ్లాన్ని లేపుకపోతారా' అని కవితనో, నినాదాన్నో రాసాడు. ఇలాంటివాళ్లు వామపక్షాల సంబంధాల్లో వుంటూ వుంటారు. వారి వల్ల సంస్థకు చెడ్డపేరు వస్తుందికదా వారిని ఎందుకు బహిష్కరించరు అని అడిగితే అలా చేస్తే వారికి బయట రక్షణ ఉంటుందా? వారితో తిరిగినదానివి మాతో వస్తే ఏమిటి అంటూ ఎత్తుకపోయి వాళ్ల ఇష్టాయిష్టాలకు వ్యతిరేకంగా రేప్‌లు చేయవచ్చుకదా! ఈ మానవత దృష్టితో అలాంటివారిని అది వారి వ్యక్తిగత జీవితం అని పట్టించుకోవడంలేదు అని అన్నారు ఒకాయన.

## తిరిగి సామాజిక పద్ధతి కోసం కుటుంబ వ్యవస్థను ఆశ్రయిస్తున్న దేశాలు

ఇటీవల యూరప్, అమెరికా, రష్యా దేశాల్లో కొత్త ధోరణి, కొత్త అవగాహన ప్రాచుర్యంలోకి వస్తున్నది. స్త్రీలు తమకు ఇష్టం వచ్చినవాళ్లతో ఉండడం వల్ల అలుసై, చులకనైపోతున్నాం అనే భావన పెరుగుతున్నది. తనను ప్రేమించిన వారితో ఉండడమే మంచిది అనే భావనకు చేరుకుంటున్నారు. అనగా ప్రేమించి కలిసి జీవించే క్రమంలో పెళ్లి చేసుకుని కుటుంబ వ్యవస్థలో భాగంగా జీవించే భార్యాభర్తల మధ్య కలిగే పొరపొచ్చాలే పెళ్లి లేకుండా జీవిస్తున్నప్పుడు కూడా కలుగుతున్నాయని అర్థం. ఇలా వయస్సు, అనుభవాలు, జీవితం పెరుగుతున్నకొద్దీ కుటుంబ జీవితం పట్ల తిరిగి ఆలోచనలు వేగం పుంజుకున్నాయి. అయితే ఈ కొత్త కుటుంబం సాంప్రదాయిక కుటుంబంగా ఉండదు. ఒకరిమీద ఒకరికి హక్కులు ఉన్నప్పటికీ సమాన గౌరవంతో ఇంటిపని, పిల్లల పని, సమానంగా చేస్తూ స్వేచ్ఛా సమానత్వాలు సమానంగా పొందుతూ నిత్యం కొత్త స్నేహితుల్లా, పాత స్నేహితుల్లా కలిసి జీవించే కుటుంబం.

## నేటి స్త్రీవాదాలు యూరప్, అమెరికా దేశాల ఆధిపత్యాన్ని కొనసాగించేవే

"ప్రతి సామాజిక ఉద్యమానికి, ప్రతి భావజాల ఉద్యమానికి సార్వజనీన, విశ్వజనీన తత్వంతో పాటు ప్రాంతీయ స్పృహ, ప్రాంతీయ తత్వం, ప్రాంతీయ సంస్కృతి కూడ వుంటుంది. ఒకటి – నిర్దిష్టత, మరొకటి – సార్వజనీనత అని పిలుస్తారు.

## ప్రతి విశ్వజనీన భావజాలానికి ప్రాంతీయతే పునాది

"విశ్వజనీన భావజాలం విస్తరించటంలో వారి ప్రాంతీయ, భావజాల ఆధిపత్యం కూడా ఉంటుంది. ఉదాత్త ఆశయాలతో ప్రారంభమయ్యే సార్వజనీన, సామాజిక భావజాల ఉద్యమాలకు అవి పుట్టిన ప్రాంతంలోని, భాషలోని, సంస్కృతిలోని, సమాజంలోని సామాజిక పరిణామాలు, సంస్కృతి భావజాలాలు పునాదిగా ఉంటాయి. వాటి నుంచే అవి ఆవిర్భవించి ఉదాత్తతను, సార్వజనీనతను, విశ్వజనీనతను సాధించుకుంటాయి. అందువల్ల వాటి పుట్టుక, పెరుగుదల, వ్యాప్తి విస్తరణలో వాటి తాలూకు స్థల కాలాల దృష్టి, ఆధిపత్యం కూడా కలిసే వుంటుంది. దీన్నే మరోమాటలో చెప్పాలంటే వాటిలోని విశ్వజనీనతలో అవి పుట్టి పెరిగిన ప్రాంతాల, సమాజాల, భాషల

ప్రాంతీయ స్పృహ, ప్రాంతీయ తత్వం, ప్రాంతీయ నాయకత్వం, ఆధిపత్యం కూడా అంతర్లీనంగా కొనసాగుతుంది.

"స్త్రీవాదం, దళిత వాదాలకు కూడా ఇలాగే అవి పుట్టి పెరిగిన ప్రాంతాల ప్రాంతీయ తత్వాన్ని, సామాజిక తత్వాన్ని ఆయా ప్రాంతాల ఆధిపత్య వాదాన్ని ఆయా వాదాల వ్యాప్తి విస్తరణ రూపంలో కొనసాగిస్తుంటాయి. యూరప్, అమెరికా దేశాల్లోని సామాజిక పరిణామాల్లో భాగంగా పుట్టిన స్త్రీవాదాలు భారతీయ, చైనా తదితర దేశాలు ముఖ్యంగా ఆసియా దేశాల సంస్కృతి, సామాజిక పరిణామాలకు భిన్నమైన ప్రత్యేక పరిస్థితుల్లో పుట్టాయి. అవి యధాతథంగా స్వీకరించడం అంటే యూరప్, అమెరికా దేశాల ఆధిపత్యాన్ని అంగీకరిస్తూ జీవించడమే. అంతేకాదు, తద్వారా యూరప్, అమెరికాల్లాగే వారి ఆధిపత్యాన్ని అంగీకరిస్తూ వారికనుకూలంగా సామాజిక పరిణామాలు సాగాలని కోరుకునే వాళ్ళ కోరికను నెరవేర్చినవారవుతారు... అందువల్ల తెలంగాణ రాష్ట్రంలోని స్త్రీవాదులు, దళితవాదులు తమ దేశీయ స్పృహను పెంచుకొని స్వతంత్ర నాయకులుగా ఎదగడం ఈనాటి అవసరం." (తెలంగాణ రాష్ట్రం నడుస్తున్న చరిత్ర పేజి 13-15)

**ప్రేమను రోజుకు నాలుగైదుసార్లు మాటల్లో వ్యక్తం చేస్తేనే ప్రేమ ఉన్నట్టా?**

కొన్ని అభివృద్ధి చెందిన దేశాల్లో రోజుకు నాలుగైదుసార్లు సారీ, థాంక్స్ చెప్పినట్టు భార్యకు, సహచరికి 'ఐ లవ్ యూ' అని చెప్తుంటారు. అలా చెప్పకపోతే అలుగుతారు. కొద్దిరోజులు చూసి విడాకులు కూడా తీసుకుంటారు. ప్రేమను, స్నేహాన్ని ఇంతగా ప్రదర్శనను కోరుకునే సంస్కృతిలో నిజంగా ప్రేమ, స్నేహం ఉన్నట్టేనా? అని ప్రాచ్య దేశాలవాళ్లు ఆశ్చర్యపోతుంటారు. ప్రాచ్య దేశాలవాళ్లు ప్రేమను, స్నేహాన్ని దాచుకోవాల్సిన వస్తువుగా హృదయంలో అపురూపంగా దాచుకుంటారు. దాన్ని వ్యక్తం చేయడంవల్ల కూడా ప్రేమ ఖర్చు అయి తరిగిపోతుందని భావిస్తారు. ఆచరణలో ప్రేమను చూపిస్తారు.

**ఫెమినిస్టుల వల్ల సమాజానికి ఎంతో మేలు జరిగింది.**

ఫెమినిస్టుల వల్ల సమాజానికి ఎంతో మేలు జరిగింది. ఇంటికి, వంటగదికి పరిమితమైన స్త్రీలు పిల్లల పెంపకంలో అదే సంకుచిత మనస్తత్వంతో అమాయకత్వంతో పెంచేవారు. వృత్తి, ఉద్యోగాలు చేయడం వల్ల స్త్రీల అవగాహన పెరిగింది. వేరొకచోట చెప్పినట్టు పదవులు, హోదాలు స్త్రీ లాలిత్యాన్ని, అమ్మతనాన్ని, ఆర్ధ్రతను అలవర్చుకొన్నాయి. ఫెమినిజం వల్ల స్త్రీలకు విద్య ఉద్యోగ రంగాల్లో, స్థానిక సంస్థల్లో మూడో వంతు రిజర్వేషన్లు వచ్చాయి.

నేడు మగవాళ్ళు కూడా మారాలి. మగవాళ్ళు కూడా ఇల్లు ఊడవాలి. అలుకు చల్లాలి. ముగ్గులు వేయాలి. పిల్లలకు స్నానాలు చేయించాలి. వారి ముడ్లు కడగాలి. వంట చేయాలి. భార్య బట్టలు భర్త ఉతకాలి. పిల్లల బట్టలు కూడా ఉతకాలి. భార్య స్నేహితులు వస్తే భర్త వారికి ఛాయ్, టిఫిన్లు అందించాలి. భార్య మీటింగ్‌కి వెళితే భర్త పిల్లల్ని పట్టుకొని ఇంటిపట్టున చూస్తూ వుండాలి. ఇలా ఇప్పుడు మగవాళ్ళు కుటుంబంలో పొందుతున్న సౌకర్యాలన్నీ స్త్రీలు కూడా పొందడమే ఫెమినిజం.

మగవాడు కేవలం భర్తగా కాకుండా స్నేహితునిలా, తమ్మునిలా భార్యకు అన్ని సేవలు చేయాలి. స్వేచ్ఛ, సమానత్వం, కరుణ, ప్రేమ, దయార్ద్ర హృదయంతో



సహకరించాలి. భార్య అనే గుర్తింపుతో వుండడం కాదు భార్య, భర్తలకు ఎవరి గుర్తింపు వారికి వుండాలి.

ఆధునిక యువతీ యువకులు, ఆధునిక జీవితం జీవిస్తున్నప్పుడు ఫెమినిజం కోరుతున్న సమానత్వాన్ని ఆచరించడం వల్ల కుటుంబాలు ఆనందదాయకం అవుతాయి. ఇతరుల కోసం వంట చేయడంలో స్త్రీలు ఇంతకాలం అనుభవిస్తున్న ఆనందం, పురుషులు వంట చేసినప్పుడు కూడా అనుభవంలోకి వస్తుంది. భార్య, పిల్లల బట్టలు ఉతకడంలో వారి పట్ల ప్రేమ ఇనుమడిస్తుంది. మొదట కష్టమనిపించినా తరువాత ఈ పనులు చేస్తున్నప్పుడు కలిగే ఆనందం వల్ల జీవితంలో ఆత్మీయత ఇంతకాలమూ ఎలా పోగొట్టుకున్నామా అని పురుషులు బాధపడతారు. ధ్యానం, ధ్యాన శిక్షణ తరగతులు, ఫెమినిజం సాధించిన గొప్ప విజయమిది. అహాన్ని తొలగించుకోవడం ద్వారా పెరిగేది ఆనందమే అని ఫెమినిజం మరో కోణంలో అర్థం చేయిస్తుంది.

## ప్రశ్నలు

1. ఫెమినిజం అంటే ఏమిటి?
2. ఫెమినిజం ప్రపంచ ఆలోచనా విధానంలో తెచ్చిన మార్పులేమిటి?
3. అమెరికా, యూరప్ ఫెమినిజంలో కొనసాగుతున్న వైవిధ్యం ఏమిటి?
4. భారతీయ ఫెమినిజం ఎన్ని దశలుగా, రకాలుగా కొనసాగుతున్నదో వివరించండి.
5. పట్టణ అగ్రకుల ఫెమినిజానికి, గ్రామీణ ఫెమినిజానికి మధ్య పోలికలు, తేడాలు ఏమిటి?
6. గ్రామీణ మగవాళ్ళ దృక్పథానికి పీడిత కుల గ్రామీణ స్త్రీవాదానికి మధ్య తేడాలు ఏమిటి?
7. ప్రపంచంలో ఫెమినిజం సాధించిన ఘనమైన, మౌలికమైన విజయాలు ఏమిటి?
8. ఏ సామాజిక పరిణామాల్లో ఫెమినిజం పుట్టింది?
9. ఫెమినిజానికి, ప్రాంతీయ, దేశీయ, ఆధిపత్యవాద స్వభావం ఎలా ఉంటుందో వివరించండి.

10. పెళ్లి లేకుండా జీవించడం ఏ మేరకు సాధ్యం?
11. పెళ్లి లేకుండా జీవిస్తే కోల్పోతున్నదేమిటి?
12. ప్రపంచంలో తిరిగి కుటుంబ వ్యవస్థ పట్ల ఆసక్తి పెరగడానికి కారణాలేమిటి?
13. పెళ్లిలో వుండే దృక్పథమేమిటి? దీనిపట్ల మీ అవగాహన కూడా వివరించండి.

### జిడ్డు కృష్ణమూర్తి భావాలు

మతం అని మనం యిప్పుడు అంటున్నది మతం కానే కాదు. దేవుడంటే మనకు నమ్మకం వున్నదా, నమ్మకం లేదా అన్నది మన నిబద్ధీకరణం మీద ఆధారపడి వుంటుంది. మీకు దేవుడంటే నమ్మకం వుంటుంది, కమ్యూనిస్టుకి దేవుడు లేడు అనే దాంట్లో నమ్మకం వుంటుంది. ఈ రెంటి మధ్యన ఏం భేదం వుంది? వీరిద్దరిలో ఏ మాత్రం వ్యత్యాసం లేదు. ఎందుకంటే మీరు నమ్మటంలో శిక్షణ పొందారు. అతనికి నమ్మకుండా వుండటంలో తర్ఫీదు యిచ్చారు. కాబట్టి నిజంగా తరచి శోధించాలనుకునేవారు ఆ పద్ధతులన్నీ సంపూర్ణంగా తిరస్కరించాలి.

భద్రతాలేమి వల్ల, భయపడుతుండటం వల్ల, అంతర్గతమైన వెలితి వల్ల ఒక దేశంతోనో, ఒక సిద్ధాంతవాదంతోనో, దేవుని మీద విశ్వాసంతోనో మనం పూర్తిగా ఐక్యమైపోతాం. దీనివల్ల ఏం జరుగుతున్నదో ప్రపంచమంతటా కనిపిస్తూనే వుంది. మతాలన్నీ ప్రేమనీ, సహోదరభావాన్నీ, యింకా అటువంటివాటినీ ఒక ప్రక్కన ప్రవచిస్తూనే మనిషిని మనిషినుండి విడదీస్తున్నాయి. మీరు సిక్కులు, నేను హిందువుని, అతడు ముస్లిం, మరొకడు బౌద్ధులు. ఈ గందరగోళం, యీ విభజనలు, యివన్నీ చూసినప్పుడు మరో కొత్త రకమైన ఆలోచనాసరళి వుండితీరాలని మనం గ్రహిస్తాం. అయితే మనం హిందువులుగానో, క్రైస్తవులుగానో, యింకా రకరకాలుగానో వుండిపోయినంతవరకు కొత్త రకంగా ఆలోచించడమన్నది జరగదు.



# కుటుంబ వ్యవస్థ గురించి ఎందుకీ ఆరాటం?

పాశ్చాత్య దేశాల్లో చెప్పే స్త్రీ, పురుషుల లైంగిక స్వేచ్ఛ, ప్రాచ్య దేశాల్లో వేల ఏళ్లుగా కొనసాగుతూనే ఉంది. భార్య ఉండగా బయట తిరగడం, భర్త ఉండగా ఇతరులతో తిరగడం, ఉంచుకోవడం, దేవదాసీ, జోగిని విధానాలు స్త్రీలతో లైంగిక సంబంధాల కోసమే. రాజులు ఎంతోమందిని పెళ్లి చేసుకునేవారు. ముందే చెప్పినట్టు శ్రీకృష్ణుడు ఎనిమిదిమంది భార్యలుండగా మరో పదహారువేలమందితో సయ్యాటలాడాడు. దశరథుడికి ముగ్గురు భార్యలు. ద్రౌపదికి ఐదుగురు భర్తలు. శివుడికి, విష్ణువుకు, తిరుపతి వెంకటేశ్వరుడికి, వినాయకుడికి, సూర్యుడికి ఇద్దరేసి భార్యలు. అలాగే రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ మొదలైనవాళ్లు ఎంతమంది 'పుణ్యాత్ములకు' ఆనందాన్ని అందించారో!

జిడ్డు కృష్ణమూర్తి ఇలా ప్రశ్నిస్తాడు "మీ జీవితంలో సెక్స్ యింత ప్రధానమైన సమస్యగా ఎందుకు తయారయింది? లైంగిక చర్య ఆ భావన తనని తాను మరిచిపోవడానికి ఒక మార్గం కాదూ? నేను అంటున్నదేమిటో మీకు అర్థం అవుతున్నదా? ఆ చర్యలో యిద్దరూ సంపూర్ణంగా ఐక్యం కావడం జరుగుతుంది. ఆ క్షణంలో సంఘర్షణలన్నీ పూర్తిగా ఆగిపోతాయి. అపారమైన సంతోషం కలుగుతుంది. ఎందుకంటే ఒక ప్రత్యేకమైన అస్థిత్వంతో వుండవలసిన అవసరం అప్పుడు మీకు వుండదు. పైగా ఎప్పుడూ మిమ్మల్ని నమిలివేస్తూ వుండే భయం కూడా అప్పుడు వుండదు. అంటే అర్థం, ఒక క్షణంసేపు స్వీయ స్పృహ మాయమవుతుంది. మిమ్మల్ని మీరు మర్చిపోవడంలో వుండే నిర్మలత్వం, స్వార్థాన్ని తోసివేయడంలో వుండే ఆనందం మీకు తెలుస్తాయి. సెక్స్ చాలా ప్రాధాన్యాన్ని సంతరించుకుంటుంది, ఎందుకంటే జీవితంలో ఏ వైపు చూసినా సంఘర్షణలతోను, అహాన్ని పెంచుకోవడంలోను, నిరాశానిస్పృహలలోను మీరు గడుపుతుంటారు కాబట్టి" అని అతని అభిప్రాయం.

**భారతీయ సాహిత్యంలో వైవాహికేతర లైంగిక సంబంధాలకు కొదవలేదు**

వైవాహికేతర, లైంగిక సంబంధాల గురించి భారతదేశంలో సాహిత్యానికి కొదవ లేదు. అయితే అవన్నీ పెళ్లిని, కుటుంబ వ్యవస్థను గౌరవిస్తూ ప్రైవేటు ఎఫైర్‌గా నడుపుకొచ్చినట్టుగా కనపడుతుంది. ఇప్పటి స్త్రీవాదులు, కుటుంబ సంబంధాలు

మారాలని కోరేవాళ్ళు, పెళ్లి లేకుండా సహజీవనం చేసేవాళ్ళు సమాజం అంగీకరించాలంటున్నారు. అలాగే స్త్రీలకు స్త్రీలు, పురుషులకు పురుషులు జతలుగా కలిసి ఉండే సంబంధాలను సమాజం అంగీకరించాలని కోరుతున్నారు. కొన్ని దేశాల్లో ఇద్దరు స్త్రీలు, ఇద్దరు పురుషులు పెళ్లి చేసుకోవడాన్ని చట్టబద్ధం చేసారు. భార్యాభర్తల్లాగే వీరికి అన్ని హక్కులూ, సామాజిక గౌరవాలు లభిస్తాయి.

**రాజుల కాలంలో వ్యభిచారం ఒక పరిశ్రమగా వర్ధిల్లింది**

కాకతీయుల కాలంలో, విజయనగర రాజుల కాలంలో వేశ్యావాటికలు చాలా పెద్ద ఎత్తున ఉండేవి. నేటి కమర్షియల్ టాక్స్ కన్నా ఎక్కువగా వారి నుండి పన్నులు వసూలు చేసేవారు. ఒక కవి ఓరుగల్లులో లక్ష మంది వేశ్యలు వున్నారని వర్ణించాడు. శైవం, వైష్ణవం, దేవదాసి, బసవి, జోగిని, కృష్ణ పేర్లతో దేవాలయాల్లో వ్యభిచారాన్ని వ్యవస్థీకృతం చేశారు. అందువల్ల కుటుంబ వ్యవస్థకు సమాంతరంగా ఇతర సంబంధాలు కూడా కొనసాగుతున్నాయని స్పష్టమవుతున్నది.

**శైవ, వైష్ణవ ఉద్యమాల్లో వ్యభిచారం ఒక పరిశ్రమగా మారింది**

బౌద్ధం తెచ్చిన సామాజిక విప్లవం ఇంతా అంతా కాదు. చాలా మంది బౌద్ధ భిక్షువులుగా, సన్యాసులుగా మారిపోయారు. దాంతో పునరుత్పత్తి లేక జనాభా తగ్గిపోయింది. యుద్ధాల్లో, వరదల్లో, కరువుల్లో జనాభా నశించిపోయింది. తిరిగి యుద్ధాలకు జనాభా అవసరం ఏర్పడింది. దాంతో లైంగిక, శృంగార ప్రక్రియల పట్ల విపరీతమైన మోజును పెంచే సాహిత్యాన్ని, కళలను సృష్టించారు. శిల్పాలను చెక్కించారు. శైవ, వైష్ణవ ఉద్యమాలు వ్యభిచారాన్ని వ్యవస్థీకరించడం కూడా ఈ కోణంలో చూడవలసి ఉంది.

**కామశాస్త్రాలు, కామసూత్రాలకు, ప్రేమ సాక్ష్యాలకు ఇండియాలో కొదవలేదు**

శృంగార శాస్త్రం గురించి వాత్స్యాయన కామసూత్రాలువంటి గ్రంథాలు రాసారు. ఖజురహో శిల్పాలు చెక్కారు. ప్రేమ గురించి తాజ్‌మహల్ కట్టారు. కులీకుతుబ్‌షా భాగ్యనగర్ లేదా హైదరాబాద్ అనే నగరాన్ని నిర్మించాడు. ఇప్పటి ప్రేమలు క్షణికాలు. చూడు పాశ్చాత్య దేశాల్లో ఎంత తొందరగా విడిపోతున్నారో! నిజంగా ప్రేమ ఉంటే ఇలా చేస్తారా? కష్టాల్లో ఆదుకునేవారే నిజమైన స్నేహితులు అంటారు. తుమ్మితే ఊడిపోయే ముక్కు వంటివి నిజంగా ప్రేమలంటారా? వ్యామోహాలంటారా? ఆకర్షణ అంటారా? అని ప్రాచ్య దేశాల సాంప్రదాయికులు విమర్శిస్తుంటారు.

**నీ పార్ట్‌నర్‌నైనా క్షమించకపోతే, మార్చుకపోతే నీ సామాజిక జీవితంలో ఇంకెవ్వరితోనైనా కలిసుండడం సాధ్యమా?**

ఇంకా వాళ్లు ఇలా అంటారు. నువ్వు ఎన్నుకున్న నీ పార్ట్‌నర్‌నైనా నువ్వు క్షమించలేకపోతే, మార్చుకోలేకపోతే, కాలం గాయాలను మాన్పుతుందని నిరీక్షించకపోతే నీ ప్రేమలోని స్నేహం నిజంగా స్నేహం అవుతుందా? కేవలం నీ ఇష్టాయిష్టాలకు, కోపతాపాలకు ఎదుటివారు కూడా నీ కనుకూలంగా స్పందించాలని అనుకుంటే వాళ్లు



కూడా నాకు అనుకూలంగా స్పందించాలని నీ గురించి ఆశిస్తారు. ఇద్దరూ ఎదుటి వ్యక్తి రాజీపడాలని కోరుకోవడం తప్ప పరస్పరం రాజీ పడాలి. చిన్నపిల్లల్లా ఎప్పటికప్పుడు పోట్లాటలు మరిచి తిరిగి హాయిగా కలిసి ఉండాలి. 'భార్యాభర్తల పోట్లాట అద్దం మీది ఆవగింజ' అది ఎంతోసేపు నిలవదు. తిరిగి కలుస్తారు. వాళ్ల మధ్య తగువు తీర్చడానికి మనం పోతే ఇద్దరికీ మనమే చెడ్డవాళ్లం అవుతాం. వారు మాత్రం బాగానే వుంటారు అనేది ప్రాచ్య దేశాల పెళ్లి, కుటుంబ సంస్కృతిని ఆకాశానికి ఎత్తేస్తుంటారు.

**వ్యక్తిగత కుటుంబ వ్యవస్థ తెచ్చిన కష్టాలు, నష్టాలు**

అయితే అందులో కొంత నిజం లేకపోలేదు. అంతకుమించిన నిజాలు లేకపోలేదు. భర్త తన సంపాదనతో తాగుడు, జూదం, దురలవాట్లు మొదలైనవాటికి ఖర్చు చేస్తూ భార్యను తిడుతూ కొడుతూ పిల్లల అతీగతీ పట్టించుకోనివాళ్లు తక్కువేమీ లేరు. భార్య కూలినాలి పనులు, పాచిపనులు, ఇతర వృత్తులు చేసి పిల్లల్ని పెంచి పోషించుకోవడం అనేది తక్కువేమీ లేదు. నీ ఇష్టం ఉంటే ఉండు, పోతే పో! నీ దిక్కున్నకాడ చెప్పుకపో! అని అనడం తక్కువేమీ లేదు. ఇదంతా పెళ్లిని, కుటుంబ వ్యవస్థని, పాతివ్రత్యాన్ని అతిగా ఆదర్శీకరించడంవల్లనే జరుగుతున్నది. ఏకపత్నీవ్రతం గురించి తక్కువ మాట్లాడడం, పాతివ్రత్యం గురించి ఎక్కువ మాట్లాడడం మగపెత్తనంలో భాగమే. పెళ్లి, సంసారం, కుటుంబం అనేది స్త్రీ పురుషులకు, పిల్లలకు సమానంగా స్వేచ్ఛను, బాధ్యతలను అందించాలి.

**ఆత్మనిగ్రహంతో లైంగిక అవసరాలు అంతరించిన తీరు**

ఇవన్నీ విన్న ఒక ప్రాచ్య తత్వవేత్త సెక్స్ మీద ఇంత ఆరాటం ఎందుకు? ప్రకృతిపరమైన సెక్స్ పట్ల ఇంత భయమెందుకు? నీలోని సృజనాత్మకత శక్తులను వెలికితీసి సమాజానికి మేలు చేయరాదా? నిగ్రహం సాధ్యం కాదా? బ్రహ్మచర్యం ఒక ఆదర్శ జీవితం కాదా! బౌద్ధ బిక్షువులు ఆత్మనిగ్రహంతో జీవించలేదా? అని ప్రశ్నించారు.

**ఓషో రజనీష్ ఆత్మనిగ్రహాన్ని ప్రశ్నించిన తీరు**

అయితే ఓషో రజనీష్ ఆత్మనిగ్రహాన్ని ప్రశ్నించారు. కొందరు బౌద్ధ బిక్షువులు స్వలింగ సంపర్కంలోకి వెళ్లిపోయారని అన్నారు. నిజమైన ప్రేమ గురించి జిడ్డు కృష్ణమూర్తి, ఓషో రజనీష్, మహర్షి మహేష్ యోగి మొదలైనవాళ్లు యోగ, ధ్యానం ద్వారా వివరించారు. ధ్యానం ఇలాంటి తాత్కాలిక ప్రేమలను, వ్యామోహాలను సరైన చూపుతో చూసే దృష్టి కలగడానికి దోహదపడుతుందని అన్నారు.

**యుద్ధానికి, టెన్షన్స్‌కి, ప్రేమకు, సెక్స్‌కు మధ్య వున్న లింకు**

సామాజిక సంక్షోభంలోని, సంక్లిష్టతలోని టెన్షన్స్ ఒత్తిడులే సెక్స్ రూపంలో బయటపడుతున్నాయని కొందరు అంటారు. వాళ్ల ప్రకారం పాశ్చాత్య దేశాల్లో ఇంతగా లైంగిక స్వేచ్ఛను కుటుంబం నుండి స్వేచ్ఛను పొందినప్పటికీ మానసిక రోగాలు ఎందుకు పెరుగుతున్నాయి? మానసిక ఒత్తిడి వల్ల వచ్చే రోగాలు ఎందుకు వస్తున్నాయి? ఇవన్నీ కేవలం వ్యక్తిగతమైనవి కావు. వ్యక్తిపరమైనవి కావు. ఇవి అక్కడి కన్స్యూమరిస్టు సమాజం సృష్టిస్తున్న సమస్యలు ఇవి అంటారు. ప్రతిదీ ఇంకా ఇంకా అంటూ ఎందులోనూ తృప్తిలేని

తనాన్ని, తృప్తి కోసం ఏవేవో వస్తువులను, సరుకులను, క్లబ్బులను, సంబంధాలను ఆశ్రయించడం జరుగుతున్నది. అందుకే అసలు ఆ సరుకు వినిమయ ఒత్తిడిని తగ్గించాలి.

### అన్ని సుఖాలు భౌతికమైనవి కావు

సుఖాలు కేవలం భౌతికపరమైనవి కావు. సుఖాలన్నీ మనస్సుకు సంబంధించినవి. మనస్సును స్వాధీనం చేసుకోవాలి. మనస్సు నీ ఆధీనంలో ఉండాలి. అందుకు ధ్యానం, యోగం ఎంతో ఉపకరిస్తుంది. అందుకే పాశ్చాత్య దేశాల్లో ధ్యాన యోగాలు బాగా ప్రాచుర్యం పొందాయి. వాటి గురువులు, సంస్థలు వేల కోట్ల సంపద గల సంస్థలుగా ఎదిగాయి అంటారు. మనదేశంలో కూడా ఈ ఒత్తిడులనుండి స్వేచ్ఛ కోసం ధ్యాన ప్రక్రియలు ప్రాచుర్యం పొందుతున్నవి. రేపు అందరూ యోగ, ధ్యానాలకు మళ్లవలసినదే. మందులు లేకుండా సహజసిద్ధంగా మనిషిని మనిషిగా నిలబెట్టే శక్తి వీటికే ఉంది. బుద్ధుడు ధ్యానాన్ని గొప్పగా ప్రాచుర్యంలో తెచ్చాడు. పతంజలి మహర్షి, పతంజలి యోగ గ్రంథాన్ని రాసాడు. తిరిగి ప్రకృతిలో జీవించండి, సహజంగా జీవించండి. అన్ని సమస్యలకు పరిష్కారం సులువవుతుంది అని వాళ్లు అంటారు.

### ఓషో చెప్పిన ధ్యానం సెక్స్ నిర్వచనాలు

అయితే ఓషో రజనీష్ లాంటివాళ్లు ధ్యానాన్ని గురించి చెప్తూనే సెక్స్ ఒక ఆట అని ఇరుపక్షాలు దాన్ని ఉత్సాహంగా ఆడాలని అంటారు. కోరికలను అణచిపెట్టడం ద్వారా విభిన్న రూపాల్లో పర్యవసానాలు ఉంటాయని అంటారు. స్త్రీ పురుష సంబంధాలు మానవీయంగా ఉన్నత స్థితిలో కొనసాగాలని అందుకు కుటుంబ వ్యవస్థ కానక్కరలేదని నిజానికి కుటుంబంలోని భార్యాభర్తలు నిరంతరం కీచులాడుకుంటూనే ఉంటారని ప్రపంచమంతటా పెళ్లి తెచ్చిన తంటా ఇది అని అంటారు. ఓషో రజనీష్ ప్రాచ్య, పాశ్చాత్య దేశాల జీవన విధానాలను, సంస్కృతులను, ఆలోచనలను సమ్మేళనం చేసి ఆధునిక భావాలను ఎప్పటికప్పుడు గమనిస్తూ, స్వీకరిస్తూ, సరిచేస్తూ తనదైన శైలిని స్థాపించారు. జిడ్డు కృష్ణమూర్తి కూడా ఇలాగే తనదైన శైలిని స్థాపించారు. ఇద్దరికీ ప్రాచ్య తత్వశాస్త్రాలే మూలమైనప్పటికీ పాశ్చాత్య తత్వశాస్త్రాలను వాటిలోని అభివృద్ధిని, కోణాలను గమనించి తమదైన పరిభాషలోకి మార్చి తమ భావాలను వెల్లడించారు.

### ఓషో చెప్పిన ఆదర్శ సోషలిజం నమూనా

ఓషో రజనీష్ కులమతాలు లేని పెళ్లి, కుటుంబం వగైరా బంధనాలు లేని మానవీయ సమాజంగా ఎదగాలని ఆశించారు. కొన్ని ప్రయోగాలు చేసారు. అతను నిర్మించిన సంస్కృతి స్త్రీ స్వేచ్ఛ పాశ్చాత్య దేశాల స్త్రీ వాద స్వేచ్ఛకు కాస్త భిన్నమైనది. ఇది మనిషిని, మానవాళిని మొత్తాన్ని ప్రేమించే దృష్టిలో భాగంగా ప్రతిపాదించిన స్త్రీ స్వేచ్ఛ. అది స్త్రీ పురుషులకు భారతీయ, సాంస్కృతిక విలువల్లో భాగంగా ఆదర్శవంతమైన కుటుంబాన్ని తీర్చిదిద్దుకోవడం ఎలానో అర్థం చేయిస్తూ పిల్లలకు, స్త్రీ పురుషులకు స్వేచ్ఛ, సమానత్వం, సమాన గౌరవం, ప్రేమ, కరుణతో, స్నేహంతో అందరూ కలిసి జీవించడం నేర్పుతాయి. నిజానికి నేర్పుతాయి అనడంకన్నా తమకు తామే నేర్చుకుంటారు అనడం సరైనది. ఓషో రజనీష్ అభివృద్ధి పరచిన ఈ ఆచరణాత్మక శిక్షణా తరగతులను ప్రపంచవ్యాప్తంగా ఎందరో తమకు తామే గురువులుగా ఎదిగి



తమదైన పద్ధతుల్లోకి మార్చుకుని శిక్షణ ఇస్తున్నారు. అవి చక్కని ఫలితాలు ఇస్తున్నాయని, ఆ శిక్షణ పొందినవారు భావిస్తున్నారు.

### పాతకాలం నుంచి కొత్త జీవితంలోకి

ఇలాంటి ప్రాచీన, ఆధునిక విజ్ఞానాన్ని కలిపి కొత్త సూత్రాలు, కొత్త రూపంలో కుటుంబాలు రూపుదిద్దుకుంటున్నాయి. బౌద్ధ, హిందూ తాత్వికతల మధ్య పాశ్చాత్య దేశాల్లో ఆయుర్వేదంతో పాటు ధ్యానం, యోగం అనేవి కూడా ప్రత్యేక తత్వశాస్త్రాలుగా సమాంతరంగా ఎదిగాయి. హిందూ మతం ధ్యానాన్ని పూజలోకి అనువర్తితం చేసి ఆచరిస్తున్నది. ఇస్లాం నమాజులో యోగ ధ్యాన రీతులను గమనించవచ్చు. క్రైస్తవ చర్చిలలో ప్రార్థనలలో ఫాదర్‌కు అన్ని విషయాలు నివేదించడంలో యోగ, ధ్యాన రీతులను గమనించవచ్చు. నాట్యంలో, ఆటలో, సెక్స్ క్రీడలో, ఒత్తిడులు విడుదలై శారీరక, మానసిక ఆరోగ్యాలు బాగుంటాయని వారు భావిస్తుంటారు. శరీరానికి, మనస్సుకు మధ్య సంబంధం, సమన్వయం లోపించినప్పుడు టెన్షన్స్ రకరకాల రుగ్మతలు ఏర్పడతాయని అంటారు. శ్వాస ప్రక్రియ సరిగ్గా సాగితే చాలా సమస్యలు పరిష్కారం అవుతాయి. పంచ కోశ శుద్ధి మనిషి శరీరాన్ని, మనస్సును శుద్ధి చేస్తుందని ధ్యానం అంటే మనస్సుకు స్నానం అని అంటారు.

### సంసారం ఒక సాగరం
### నమ్మకురా జీవా! ఈ ఆలుపిల్లలను

బౌద్ధ బిక్షువులను తయారుచేసుకోవడంలో భాగంగా 'సంసారం ఒక సాగరం' అన్నారు. మరికొందరు అచల తత్వవేత్తలు 'నమ్మకురా జీవా! ఈ ఆలు పిల్లలు, నమ్మకురా జీవా!' అని వైరాగ్యాన్ని కుటుంబ సంబంధాల పట్ల గల మార్మిక మాయా ప్రేమలను పటాపంచలు చేస్తూ వాస్తవిక, సామాజిక దృష్టితో నిన్ను నీవు తెలుసుకుని బతుకు అని చెప్పారు. గ్రామీణ ప్రాంతాల్లో ఈ వైరాగ్య అచల తత్వ గీతాలు బాగా ప్రాచుర్యంలో ఉన్నాయి. అందరినీ సమానంగా చూడాలని చెప్పే ఈ దృష్టి పితృస్వామిక పరిమితులకు లోనైంది. అయినప్పటికీ స్వేచ్ఛా సమానత్వం గురించి చెప్పినమేరకు ఆదర్శపూరిత కుటుంబ వ్యవస్థను తీర్చిదిద్దే ప్రయత్నం చేసింది.

### కుల వ్యవస్థ పరిష్కారాన్ని జెండర్ స్వేచ్ఛతో సమన్వయించాలి

సరే, భారతీయ తత్వశాస్త్రాల పరిభాష అలా వుంచుదాం. ప్రస్తుతం వాడుకలో వున్న పదాలతో చర్చిద్దాం. ఈ దేశంలో కులం పోవాలి, కుటుంబంలోని నేతృత్వం, పురుషాధిపత్యం పోవాలి. అయితే జెండర్ స్వేచ్ఛ ద్వారా కులం పోతుందా? జెండర్ స్వేచ్ఛ కుటుంబ వ్యవస్థలో భాగంగా అందరూ ఆమోదించినప్పటికీ కులం పోతుందా? కులం ప్రత్యేకంగా అస్తిత్వంలో ఉన్నదంటేనే అది పోవడానికి ప్రత్యేకంగా పరిష్కారం కూడా ఉందని అర్థం. అంతేగానీ జెండర్ స్వేచ్ఛ వల్ల గానీ, ఆర్థిక స్వేచ్ఛ, సమానత్వం వల్ల గానీ కులం పోతుంది, కుటుంబం పోతుంది అనుకోవడం తప్పుడు సిద్ధాంతాలు.

మన కుటుంబ వ్యవస్థలో ప్రజాస్వామ్యం తక్కువ. యూరప్ కుటుంబంలో ప్రజాస్వామ్యం ఎక్కువ. మన దగ్గర తల్లిదండ్రులు చెప్పినట్టే పిల్లలు వినాలి అనే తత్వం ఎక్కువ. నా పెత్తనం పిల్లలమీద సాగాలని మేం పెంచి పోషించామని హక్కుగా

ఫీలవుతారు. ఇది ఓటుహక్కు సమాజంలో, ఎవరి సంపాదన వారిది అయిన కాలంలో సాగుతుందా? మునుపు అత్తలకు కోడండ్లు భయపడేవారు. ఇప్పుడు కోడండ్లకు అత్తలు భయపడుతున్నారు. కాలం మారింది. పిల్లలు చెప్పినట్టు కూడా వినాలి.

**కుటుంబ వ్యవస్థ రూపురేఖలు మారుతాయి**
**సారం కొనసాగుతుంది**

వసుధైక కుటుంబం అని, గ్లోబల్ విలేజ్ అని అంటుంటాము. అంటే మొత్తం ప్రపంచమంతా ఒక కుటుంబ వ్యవస్థగా మారాలని అర్థం. అనగా కుటుంబ వ్యవస్థ మొత్తం ప్రపంచానికి ఆదర్శవంతమైనదని చెప్పకనే చెబుతున్నారు. సోషలిజం, కమ్యూనిజం కూడా కుటుంబ వ్యవస్థ వంటిదిగా మొత్తం సమాజం ఆత్మీయంగా మార్పు చెందాలని అభిలషిస్తుంది. అందుకు కుటుంబ వ్యవస్థ అడ్డంకిగా ఉంటే దాన్ని మార్చాలనుకుంటుంది. ఇలా ఎవరు ఏం చేప్పినా ప్రజల జీవితంలో అనుభవంలో ఉన్నదాన్ని అనుసరించి ఊహించేదాన్ని చెబుతున్నారు.

**కుటుంబ వ్యవస్థ ప్రజాస్వామికంగా మారాలి**

కుటుంబ వ్యవస్థ రూపురేఖలు మారుతాయి. కానీ కొందరు ఊహించినట్టు కుటుంబ వ్యవస్థ రద్దు కాదు. సమాజం ఎన్ని ఇచ్చినా కుటుంబంలో ఉండే అమ్మప్రేమ తల్లిదండ్రుల పిల్లల ఆత్మీయతలు, అనుబంధాలు, నా వాళ్లు అనే స్వంతం చేసుకునే భావన కుటుంబం బయట దొరకవు. అందువల్లే పాశ్చాత్య దేశాల్లో కుటుంబం విచ్ఛిన్నమయ్యాక ఎంత స్వేచ్ఛ ఉన్నప్పటికీ మానసికంగా సిక్ అవుతున్నారు. 24 గంటలూ ఏళ్ల తరబడి కష్టసుఖాలు, వెతలు కలిసి పంచుకునే కుటుంబ వ్యవస్థలోని అవకాశం స్నేహసంబంధాలు తీర్చలేవు. అమెరికా సిక్ సమాజంగా మారిపోయి క్రైం రేటు, చైల్డ్ సెక్స్ పెళ్లికాని తల్లుల సంఖ్య మొదలైన సామాజిక రుగ్మతలు పెరుగుతున్నాయి.

**ఏకపక్ష సిద్ధాంతాలు, దృక్పథాలు ఎలా ఉంటాయంటే...**

ఒక మరాఠీ రచయిత్రి 25 ఏళ్లు సంసారం చేసాక భర్తతో విడిపోయింది. విడిపోయిన తర్వాత తన భర్త ఎంత దుర్మార్గుడో వివరిస్తూ నవల రాసింది. ఆ నవల చదివిన ఒక యువ జర్నలిస్టు అమాయకంగా ఒక మాట అడిగాడు. "మేడం! ఇంత నీచునితో, దుర్మార్గునితో మీరు 25 ఏళ్లు సంసారం ఎలా చేయగలిగారు? 4, 5 ఏళ్లకే ఎందుకు విడాకులు తీసుకోలేదు?" ఆ మాటతో ఆమె అవాక్కయింది. తాను నవలలో తప్పు చేసానని చెప్పింది. అతనిలోని మంచితనమే ఇన్నేళ్లు అతనితో సంసారం చేయడానికి అతని తప్పులను క్షమిస్తూ కలిసి జీవించడానికి కారణం అని చెప్పింది. అనగా తేలిందేమిటి? దీన్నే రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు అవుతాయి అని పల్లెల్లో చాలా సులువుగా తాత్వీకరిస్తారు.

**వెనుకటి స్కూళ్ళు ఇప్పుడు మారిపోయాయి**

స్కూళ్లల్లో ఇప్పుడు పిల్లల్ని ఎంతో ప్రేమగా చూస్తున్నారు. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు మునుపు పిల్లల్ని బాగా కొట్టేవాళ్లు. ఇప్పుడు ఇది బాగా తగ్గిపోయింది.



దెబ్బలుతిన్న విద్యార్థులు పెద్ద పెరిగాక మా సార్ ఎట్లా కొడుతుండే అంటే అని చెప్పుకుంటూ నవ్వుకుంటారు. ఒకనాటి కష్టాలు ఇలా మరొకనాటికి ఆనందాలవుతాయి. ఇవి మనిషి తత్వంలో ఇమిడివున్న అంశం. దీన్ని సాహిత్య అలంకార శాస్త్రాలు విరివిగా చర్చించాయి. విషాదాలను ఆనందాలుగా ఎలా మానవ సమాజం మార్చుకుంటూ వస్తున్నదో అవి నిర్ధారించి చూపాయి. ఒకనాటి బానిస సంకెళ్లు, తలుగు, ఇవ్వాళ మట్టెలు, మంగళసూత్రంగా అలంకారప్రాయమైనవి. అలాగే ఒకనాటి భార్యాభర్తల పోట్లాట మరోనాటికి గుర్తుచేసుకొని ఆనందించే విషయంగా మారిపోతుంది. యుద్ధంలోని ఇరుపక్షాల రక్తపాతం విజయం అనే ఆనందంగా పర్యవసిస్తుంది. అందువల్ల కుటుంబంలోని కలతలను విడాకులతో కాకుండా ఓపికతో, రాజీతో, స్వేచ్ఛ సమానత్వంతో, సహృదయతతో పరిష్కరించుకోవడం అవసరం.

**ప్రతి సమస్యకు పరిష్కారం ఉంటుంది**

ప్రతి సమస్యకు పరిష్కారం ఉంటుంది. పరిష్కారం తోచకపోవడం వల్ల దాన్ని సమస్య అంటుంటారు. అంతేకాని అది సామాజిక క్రమాలకు సంబంధించినదే. సమస్యలోనే పరిష్కారం దాగి ఉంటుంది. పాత భావాలు దాన్ని కనుక్కోడాన్ని క్లిష్టం చేస్తున్నాయి. సమస్యలో దాగి వున్న పరిష్కారాన్ని కనుక్కోవాలి. జెండర్ స్వేచ్ఛ, ఆర్థిక సమానత్వం, ఇతర దేశాల్లో జాతుల సమస్యను పరిష్కరించలేకపోయింది. మత సమస్యను కూడా పరిష్కరించలేకపోయింది. అలాంటప్పుడు జాతుల సమస్యకన్నా స్థిరంగా వేల ఏళ్లుగా కొనసాగుతున్న కులాన్ని ఇవి ఎలా పరిష్కరిస్తాయి?

**కులానికి భౌతిక పునాది జీవితమే**

కొందరు కులానికి భౌతిక పునాది లేదనుకుంటున్నారు. పెళ్లి సంబంధాలు, మానవ సంబంధాలకు మించిన మానసిక ఐక్యతకు మించిన భౌతిక పునాది ఏం వుంటుంది? సరుకుల ఉత్పత్తి సంబంధాలు తాత్కాలికమైనవి. అవి ఇటీవలివి. ఇవి నిరంతరమైనవి. సరుకుల ఉత్పత్తి సంబంధాల నుండి పుట్టే వర్గం భౌతిక పునాది కలదంటూ పుట్టుకతోనే భౌతిక పునాది గల కులానికి భౌతిక పునాది లేదనుకోవడం హాస్యాస్పదం. వర్గానికే ఉన్న ఆ కాస్త భౌతిక పునాదిని పలు రకాలుగా తమ ట్రేడ్ యూనియన్‌లోకి చీల్చడం ద్వారా అదృశ్యం చేస్తున్నారు. మరోవేపు జాతి, ప్రాంతం, దేశం, భాష దృక్పథాలు వర్గ దృక్పథానికి గల భౌతిక పునాదిని అదృశ్యం చేస్తున్నాయి.

**వర్గం అనేది ఒక మానసిక ఐక్యత**

వర్గం అనేది ఒక మానసిక ఐక్యత. దానికి కొంత భౌతిక పునాది కూడా ఉత్పత్తిలో కలిసి ఉన్నంతకాలం ఉంటుంది. ఆ మానసిక ఐక్యతను కూడా వామపక్షాలు, ఇతర పార్టీలు తలా ఒక స్వంత దుకాణం పెట్టి ట్రేడ్ యూనియన్స్‌ను నిర్వహించి దెబ్బతీసాయి. కానీ, ఎన్ని పార్టీల్లో ఉన్నా, ఎన్ని వర్గాల్లో ఉన్నా, ఆర్థికంగా ఎంత అసమానతల్లో ఉన్నా కులం యొక్క భౌతిక పునాదిగానీ, మానసిక ఐక్యత గానీ కొనసాగుతూనే ఉంది. ఎందువల్ల? కులం అనేది ఒక కుటుంబం వంటిది. ఒక కుటుంబంలో పెరిగిన పిల్లలు ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాల్లో విభిన్న శ్రేణుల్లో ఎదిగినప్పటికీ రెండు మూడు తరాల దాకా వారి మధ్య సంబంధాలు కొనసాగుతూనే ఉంటాయి. వీలైతే, సహృదయత

ఉంటే ఎదిగినవాళ్లు వెనకబడిపోయినవాళ్లను, వారి పిల్లలను ఎదిగించడంలో సహకరిస్తున్నారు. అలా కొందరు తిరిగి సమానులు కావచ్చు. (వర్గం ఈ పాత్ర నిర్వహించడంలేదు. ఎదిగినవాళ్లు వేరే వర్గంలో చేరుతారు.)

### కుటుంబం నిర్వహిస్తున్న పాత్రలో కులం

కుటుంబం నిర్వహిస్తున్న ఈ పాత్రనే కులం కూడా నిర్వహిస్తున్నది. అగ్రకులాల వాళ్లు తమ కుటుంబంలో ఒక్కరు ఎదిగినా మిగతావారిని తన స్థాయికి ఎదిగించడానికి తన అధికారాన్ని, పలుకుబడిని, ఆర్థిక సాయాన్ని అందించి చేయూతనిస్తారు. అలా ఆ కుటుంబం పది కుటుంబాలుగా విస్తరించినప్పటికీ అందులో కొందరైనా ఒకటి రెండు తరాల్లో మొదట ఎదిగినవారితో సమాన ఎదుగుదలను సాధిస్తారు. అలా ఒక కులానికి కులం ఒక కుటుంబంలాగా ఎదిగే క్రమం తీసుకుంటున్నది.

మొదట ఈ క్రమాన్ని బ్రాహ్మణులు తీసుకున్నారని అంబేద్కర్ నిర్ధారించారు. వేల ఏళ్ల క్రితమే వాళ్లు ఈ పని ప్రారంభించారు. అందులో భాగంగానే బ్రాహ్మణ కులం పుట్టిందని నిర్ధారించారు. ఆ తర్వాత బ్రాహ్మణులు వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను ప్రతిపాదించారని అందరిలో తమను తాము పై స్థాయిలో నిలబెట్టుకున్నారని స్పష్టం చేసారు.

### ఇతరులపై ఆధారపడితే ఇంతే సంగతులు

మరోవైపు ఓషో రజనీష్, జిడ్డుకృష్ణమూర్తి వంటివాళ్ళు ఇలా అంటారు. ఇంకొకరు నీకు క్రమశిక్షణను అందించగలరు అనే మాట అవివేకపూరితం, హాస్యాస్పదం. వాస్తవంలో ఎవరి భవిష్యత్తుకు వారే నిర్మాతలు. నిన్ను నీవు తెలుసుకో. నిన్ను నీవు మార్చుకో. ఇప్పుడు చేతిలో ఉన్నది ఓ క్షణం తర్వాత మీ చేతిలో ఉండదు. ఇప్పుడు లోపల ఉన్న శ్వాస మరోక్షణంలో బయట ఉంటుంది. జీవితం ఓ ప్రవాహం వంటిది. ఈ ప్రవాహంలో నిలకడగా స్థిరంగా ఉండిపోవాలని ఎవరైతే ప్రయత్నించారో వారే గృహస్తులు. ఎవరైతే జీవిత ప్రవాహంలో కొట్టుకుపోయే సామర్థ్యాన్ని కలిగిఉన్నారో, ఎవరైతే ఆ ప్రవాహంలో కొట్టుకుపోతున్నారో సరళంగా సహజంగా ఏ రక్షణ లేకుండా అజ్ఞాతంలో- వారే సన్యాసులు లేదా ధ్యానులు. ఎవరైతే జీవితంలో రక్షణ అనేది లేదనే సత్యాన్ని స్వీకరించి జీవించడం ప్రారంభిస్తారో జీవితంలోని ప్రమాదానికి నేను సిద్ధమే అని ఎవరు అంగీకరిస్తారో వారే సన్యాసులు లేదా ధ్యానులు. ఈ క్షణంలో జీవించు అని అంటారు. బుద్ధుడి అవగాహనను ఆధునిక జీవితాల్లో ఆచరించడం ఎలానో ఓషో, జెకె తమదైన శైలిలో వివరిస్తారు.

### సెంటిమెంట్స్ బలమైనవి. మనిషి సంఘజీవి అనుబంధాలు కోరుతుంటాడు

అమ్మ నాన్న కుటుంబం అనే సెంటిమెంట్స్ బలమైనవి. ఆధునిక సాహిత్యం కుటుంబంలోని ఆత్మీయతలు అనుబంధాలు, అవరోధాలు గురించే సాగుతుండడం చూడవచ్చు. అమ్మ నాన్నలకు సాధారణంగా పిల్లల ఉజ్వల భవిష్యత్తుకు మించిన ఆశయాలు ఏముంటాయి. వారి ఉజ్వల భవిష్యత్‌కోసం అమ్మా నాన్నలు తమ జీవితం ధారపోస్తారు అని అంటారు. అదే నిజమైతే ఎదిగే పిల్లల ఇష్టా ఇష్టాలను గౌరవిస్తూ వారి నిర్ణయాలను ఆమోదిస్తూ వారికి సమాన స్వేచ్ఛ సమానత్వం ప్రేమ కరుణ అందిస్తూ



నిరంతరం ఆత్మీయంగా ముందుకు సాగడంద్వారా కుటుంబం, సమాజం సుసంపన్నం అవుతుందని చెప్పవచ్చు.

జిడ్డు కృష్ణమూర్తి కుటుంబ వ్యవస్థ వున్నా లేకపోయినా భవిష్యత్తు పట్ల చింత లేకుండా బతకాలని భావిస్తాడు. “మానవాళికి భవిష్యత్తులో ఏమున్నదా అని అనిపిస్తూ వుంది. అక్కడ కనబడుతున్న ఆ పిల్లల భవిష్యత్తులో - అరుస్తూ, ఆడుకుంటూ, ఎంతో సంతోషంగా, ఎంతో సౌమ్యంగా, ముద్దుగా వున్న ఆ పిల్లల భవిష్యత్తులో ఏముందో? ఇప్పుడు మనం ఏమిటో అదే మన భవిష్యత్తు. చారిత్రకంగా చూస్తే అనేక వేల సంవత్సరాలుగా జరుగుతున్నది యిదే. బ్రతకడం, చనిపోవడం, జీవించడానికి మనం పడే ప్రయాసా - అంతే. భవిష్యత్తు గురించి మనం అంతగా పట్టించుకున్నట్లు కన్పించదు. పొద్దున లేచిందగ్గర్నుంచీ రాత్రి పడుకునేవరకు అంతులేని వినోదకార్యక్రమాలు మీరు టెలివిజన్‌లో చూస్తూ వుంటారు. ఒకటి రెండు ప్రసారకేంద్రాల్లో మినహాయించి, అవైనా చాలా కొద్దిసేపే వుంటాయి. పైగా అంతగా లోతైన విషయాల గురించీ వుండవు. పిల్లలకు కాలక్షేపం అయిపోతూ వుంటుంది. మీకు చాలా వినోదం కలుగుతున్నదనే విషయాన్ని వ్యాపారప్రకటనలు మరీ మరీ జ్ఞాపకం చేస్తుంటాయి. దాదాపుగా ప్రపంచం అంతటా యిదే జరుగుతున్నది. ఈ పిల్లలందరూ భవిష్యత్తులో ఏమైపోతారు? క్రీడారంగానికి సంబంధించిన కార్యక్రమాలుంటాయి - కొద్దిమంది ఆడుతుంటే ముప్పయి, నలభై వేల మంది ప్రేక్షకులు చూస్తుంటారు. గొంతులు చించుకొని అరుస్తుంటారు. ఒక గొప్ప చర్చిలో జరుగుతున్న పూజా కాండని కూడా మీరు చూస్తుంటారు. అదీ ఒక రకమైన వినోద కాలక్షేపమే”

కుటుంబ సంబంధాలు ఆత్మీయంగా వుండాలి. పిల్లలను వాత్సల్యంగా ప్రేమతో పెంచేదిగా వుండాలి. పిల్లల శ్రేయస్సును, అభివృద్ధిని అందించేదిగా వుండాలి. భార్యాభర్తలను అనుబంధాలతో కట్టిపడేసేదిగా వుండాలి. ఒకరిని విడిచి ఒకరు ఉండలేనిదిగా వుండాలి. తల్లిదండ్రులను, అత్తమామలను గౌరవించేదిగా వుండాలి. బంధుమిత్రుల మధ్య సంబంధాలు ప్రేమపూరితంగా వుండాలి. వాత్సల్యపూరితంగా వుండాలి. సమానత్వం ప్రాతిపదికన వుండాలి. ఆత్మ విశ్వాసాన్ని పెంచేవిగా ఉండాలి. అభివృద్ధిని ఆకాంక్షించేదిగా వుండాలి. కుటుంబం వృద్ధులకు రక్షణ ఇచ్చేదిగా వుండాలి. నానమ్మ, తాతయ్యలను గౌరవించేదిగా వుండాలి. వృద్ధాశ్రమాలు అవసరం లేనిదిగా కుటుంబ వ్యవస్థ ఉండాలి.

పిల్లులు, కుక్కలు తమ పిల్లలకు శిక్షణనిస్తాయి. ఉత్తుత్తి పోట్లాటలతో అరుస్తాయి, కరుస్తాయి, పరుగెత్తిస్తాయి. ఇల్లు, కుటుంబం, స్కూలు, కాలేజీ కూడా ఇలాంటివే. సమాజాన్ని దాని తీరుతెన్నుల్ని ఇవి నేర్పుతాయి.

## ప్రశ్నలు

1. కుటుంబ వ్యవస్థ పట్ల ఇంత ఆరాటం ఎందుకు?
2. భారతీయ సమాజంలో వైవాహికేతర లైంగిక సంబంధాలు ఎలా కొనసాగేవి వివరించండి.
3. మీ జీవనభాగస్వామిని క్షమించకపోతే, మార్చకపోతే ఇతరులతో మాత్రం కలిసి ఉండడం ఎలా సాధ్యం? వివరించండి.
4. వ్యక్తిగత కుటుంబాలు తెచ్చిన కష్టాలు, నష్టాలు ఏమిటి?
5. కులవ్యవస్థ పరిష్కారాన్ని జెండర్ స్వేచ్ఛతో ఎలా సమన్వయించాలి? ఎందుకు?
6. కుటుంబ వ్యవస్థ ప్రజాస్వామికంగా ఎలా, ఎందుకు మారాలి?
7. భద్రత వల్ల రక్షణ వల్ల అది అలవాటుగా, బానిసత్వంగా మారుతుందా? చర్చించండి.



# జీవితానికి ఒక సామాజిక దృక్పథం ఎందుకు అవసరం

## సామాజిక భౌతికవాదం అంటే ఏమిటి?

జీవితానికి ఒక దృక్పథం అవసరం. దేనికి ఎంత ఖర్చు పెట్టాలి అనేది నీ దృక్పథం నిర్ణయిస్తుంది. ఏ పని చేయాలి? దేనికి ఎంత ప్రాధాన్యనివ్వాలి? అనేది నీ దృక్పథం నిర్ణయిస్తుంది. అందువల్ల దృక్పథాల యొక్క పూర్వాపరాలు దృక్పథాల మధ్య వైవిధ్యం, వైరుధ్యం భిన్న భిన్న దృక్పథాలను తెలుసుకోవడం అవసరం.

ఈ అధ్యయనం లేకపోతే మొదటి అధ్యాయంలో చెప్పినట్టు నీ జీవితాన్ని, నీ సంపాదనను, నీ ఇష్టాయిష్టాలను, నీ స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని ఇతరులు నిర్దేశిస్తుంటారు. ఇతరులు నీపై ఆధిపత్యం చెలాయిస్తారు. నీవు వారికి అనుచరుడిగా, సాదుకున్న కోడిగా, పశువుగా మారిపోతావు. సాదుకున్న కోడిని ఎప్పుడైనా కోసుకుని తినవచ్చు. నీవు ఎప్పుడైనా బలి అయిపోవచ్చు. అందువల్ల సామాజిక శాస్త్రాలను ప్రాపంచిక దృక్పథాన్ని తెలుసుకోవడం అవసరం. అప్పుడే ఎవరు ఏ మాట చెప్తున్నారో, ఎందుకు చెప్తున్నారో దానివెనుక వున్న అసలు సారాంశం ఏమిటో తెలుసుకోవడం సులువవుతుంది.

### ఒకే కంపెనీ, ఒకే బోనస్ ఉద్యోగుల్లో సృష్టించిన భిన్న క్రమాలు

ఒక కంపెనీలో తలా పదివేల రూపాయలు బోనస్ ఇచ్చాడు. ఒకరు దాంతో టీవీ కొన్నాడు. మరొకరు వంద గజాల స్థలం కొన్నాడు. ఇంకొకరు భార్యకు బంగారు గొలుసు కొన్నాడు. ఒకాయన కథల పుస్తకం వేసుకున్నాడు. మరొకాయన పుట్టినరోజు పేరుతో పార్టీలు చేసుకుని తాగిపడేశాడు. ఇంకొకాయన బ్యాంకులో వేసుకున్నాడు. వేరొకాయన డ్రెస్సులు కుట్టించుకున్నాడు. ఒక భక్తుడు తిరుపతికి వెళ్లివచ్చాడు. ఇలా ఎవరి దృక్పథాన్ని అనుసరించి వాళ్లు ఖర్చు పెట్టారు. ఎవరి ప్రాధాన్యత ననుసరించి వాళ్లు ఖర్చు పెట్టారు.

అందరికీ పదివేలే ఇచ్చారు. ఒకే కంపెనీ ఇచ్చింది. కాని వారి దృక్పథం వల్ల ఆ డబ్బు వారి జీవితాల్లో అనేక పరిణామాలను సృష్టించింది. టీవీ కొన్నాయన టీవీ కోసం టైం కేటాయించాడు. జాగ కొన్నాయనకు ధర పెరిగి లక్ష అయింది. కథల పుస్తకం వేసుకున్న రచయితకు సాహిత్య పురస్కారాలు లభించాయి. గొప్ప కీర్తి వచ్చింది. తిరుపతికి వెళ్లినాయనకు పుణ్యంతో పాటు బోడిగుండు కూడా వచ్చింది.

అందువల్ల డబ్బు ఒకటే అయినా, అవకాశం ఒకటే అయినా దృక్పథాలు అనుసరించి వారి జీవితాలు కొనసాగుతుంటాయి. ఉదాత్తమైన, ఉన్నతమైన ఆశయాలు, లక్ష్యాలు నిర్ణయించుకున్నప్పుడు అందుకు పట్టుదల, కృషి తోడైనప్పుడు వాళ్లు వారి వారి దృక్పథాల్లో, రంగాల్లో ముందుకు ఎదుగుతుంటారు. మీ ఎదుగుదలకు, మీకొక దృక్పథం అవసరం. ఆ దృక్పథమే మిమ్మల్ని మీ లక్ష్యంవైపు నడిపిస్తుంది. మీ లక్ష్యమే దృక్పథాలను కూడా నిర్దేశిస్తుంది. ఎమ్మెల్యే కావాలనుకుంటే ఏ పార్టీలో చేరాలో, ఏం చేయాలో నిర్ణయించు కుంటావు. అందుకనువుగా పనిచేస్తూ వెళ్తావు. లెక్చరర్ కావాలనుకుంటే క్వాలిఫికేషన్స్‌తో పాటు ఎంట్రెన్స్‌లు పాస్ కావడం ఇంటర్వ్యూ విజయవంతంగా పూర్తిచేయడం కోసం కృషి చేస్తావు. పారిశ్రామికవేత్త కావాలనుకుంటే అప్పులు ఎక్కడ దొరుకుతాయో, మార్కెటింగ్ ఎలా వుంటుందో మొదలైనవి విశ్లేషిస్తుంటావు. అందువల్ల లక్ష్యం కోసమైనా, దృక్పథం కోసమైనా సామాజిక స్థితిగతులను అధ్యయనం చేయడం అవసరం. అందులో భాగంగా ఈ అధ్యాయంలో సామాజిక దృక్పథం అంటే ఏమిటో తెలుసుకోవడానికి కొన్ని ప్రశ్నలు వేసుకుందాం.

### సామాజిక దృక్పథం అంటే ఏమిటి?

సామాజిక దృక్పథం అంటే ఏమిటి? సమాజంలో దానికి గల ప్రాధాన్యత ఏమిటి? మనం ఎవరికోసం బ్రతుకుతున్నాం? మన కోసమా? ఇతర్లకోసమా? మనం ఎందుకోసం జీవిస్తున్నాం? మనం జీవించడం అవసరమా? బ్రతుకుడెట్లా? ఏంచేసి బ్రతుకుడు? "నేను" ఎవరు? నేను యొక్క ఆచరణను నిర్ణయించేదే ప్రాపంచిక దృక్పథం. నీ అవసరం నీవు స్థల కాలాలు కుల వర్గాలు నీ ఆచరణను నిర్ణయించే తీరు, నీ చైతన్యం నీ ఆచరణను నిర్ణయించే తీరు, ఈ రెంటిమధ్య వైరుధ్యాన్ని పరిష్కరించే తీరును వ్యక్తిత్వం అని పిలుస్తాం, నీ ఆచరణలో భావవాదం, భౌతికవాదం రెండూ ఏకకాలంలో ఎందుకు కొనసాగుతాయి?

### సామాజిక దృక్పథం పరిధి

మొదటి అధ్యాయం 'సామాజిక దర్శనం'లో దీన్ని తడిమిన విషయం ఇక్కడ గుర్తు చేసుకుందాం. సామాజిక దర్శనంలో ప్రాపంచిక దృక్పథంలో రెండు రకాల ప్రధాన వర్గీకరణలున్నాయి.

1. భావవాద ప్రాపంచిక దృక్పథం. 2. భౌతికవాద ప్రాపంచిక దృక్పథం. ఇవి మళ్ళీ రెండు రకాలని మొదటి అధ్యాయంలో చూశాం. 1. భావవాదంలో వ్యక్తివాదం, 2. భావవాదంలో సామాజిక వాదం. 1. భౌతికవాదంలో వ్యక్తివాదం, భౌతికవాదంలో సామాజిక వాదం.

ఈ వర్గీకరణకు ప్రాతిపదిక ఏమిటి? దేవుడు ఆత్మకర్మ పునర్జన్మ స్వర్గం నరకం మొదలుకొని చైతన్యం, భావం ప్రాథమికం అని, పదార్థం, ఈ భూలోక ప్రపంచం సెకండరీ అని చెప్పేవాళ్లని భావవాదులు అంటారు.

మనిషి ముఖ్యం అని, సమాజం ముఖ్యం అని ఇహలోక జీవితమే ముఖ్యం అని స్వర్గం నరకం లేవని దేవుడు దయ్యాలు లేవని పునర్జన్మ లేదని, పదార్థం యొక్క వ్యక్తీకరణే చైతన్యం అనీ, చైతన్యం యొక్క రూపమే పదార్థమని చెప్పేవాళ్లని భౌతికవాద ప్రాపంచిక



దృక్పథం గల వాళ్ళు అని అంటారు.

ఈ రెండు దృక్పథాల మధ్య ఒక సన్నని గీత ఈ రెంటిని వేరు చేస్తుంది. కొన్ని సమయాలలో ఈ విభజన రేఖ మనం గుర్తించలేనంత సున్నితంగా ఉంటుంది. అయితే స్పష్టత కోసం ఇలా రెండుగా వర్గీకరిస్తుంటాము. చాలాకాలం నుంచీ ఈ రెండు దృక్పథాలను చెప్పడం జరుగుతున్నది.

### వ్యక్తి, సమాజం

కానీ అసలు విషయం ఏంటంటే సమాజం గురించి ఆలోచిస్తున్నాడా వ్యక్తి గురించి ఆలోచిస్తున్నాడా అనేది ముఖ్యమైన వర్గీకరణ. దేవున్ని నమ్మేవాళ్లలో కబీర్, గురునానక్, రవిదాసు వంటి భక్త కవులంతా మానవసేవే మాధవ సేవ అని మానవసేవకు ప్రాధాన్యతనిచ్చారు.

దాన్ని సామాజిక దృష్టితో చూసినపుడు భౌతికవాద దృక్పథం అవుతుంది. తాత్విక దృష్టితో చూసినపుడు భావవాదం అవుతుంది. తత్వం కూడా సమాజంనుంచే పుడుతుంది కాబట్టి సామాజిక దృక్పథమే తత్వశాస్త్రాన్ని నిర్దేశించాలి. అందువల్ల సమాజాన్ని గురించి పట్టించుకునేదంతా భౌతికవాద దృక్పథమే.

అందువల్ల కబీరు, రవిదాసు, నారాయణగురు, జ్యోతిబాఫులే, జాషువా మొదలైనవాళ్ళు దేవుని నమ్ముతారు. కానీ వారు సమాజం కోసం జీవితాంతం కృషి చేసారు. అందువల్ల వారు భౌతికవాద ప్రాపంచిక దృక్పథం కలవాళ్ళే. భౌతికవాద దృక్పథంలో భావవాద దృక్పథం ఉంటుంది. భావవాద దృక్పథంలో భౌతికవాద దృష్టి ఉంటుంది.

### భావవాదం, భౌతికవాదం రెంటికి భౌతిక పునాది ఉంది

భౌతికవాదం అనేది ఒక వాదం కాదు. భావవాదం అనేది ఒక వాదం కాదు. రకరకాల స్కూల్స్ ఆఫ్ థాట్స్ ఈ రెంటిలోనూ ఉన్నాయి. ఆ వివరాలన్నీ తత్వశాస్త్ర పరిధిలోకి వస్తాయి. అందువల్ల ఇక్కడ వదిలేద్దాం.

భావవాదం కూడా ఆచరణలో వుండడం ద్వారానే ఒక దృక్పథంగా కొనసాగుతూ వస్తున్నది. అది ఆచరణలోనే వున్నది. భౌతికంగానే కొనసాగుతున్నది. కనుక భావ దృక్పథం అంతిమంగా భౌతికవాద దృక్పథంగానే కొనసాగుతూ ఆచరణలో వున్నది. అది భావవాదమైనా, విశ్వాసమైనా దాన్ని ఆచరిస్తున్నాం కనక తప్పనిసరిగా భౌతికవాదమే అవుతున్నది.

ఒక స్పష్టత రీత్యా మాత్రమే భావవాద, భౌతికవాద విభజన చేయడం జరుగుతున్నది. ప్రపంచంలో వున్నదల్లా ఒకటే దృక్పథం. అది భౌతికవాద దృక్పథం.

భావవాదం కూడా భౌతికవాద దృక్పథంలో భాగమే. అది పాలకవర్గాల, దోపిడి కులాల స్వార్థ పూరిత అవసరాల్ని, ప్రయోజనాల్ని నెరవేర్చడం కోసం తమకనువుగా ప్రజలకు అది తప్పుడు చైతన్యాన్ని అందిస్తుంది. ముందుకు వస్తున్నది. అందువ భావవాద దృక్పథాన్ని విమర్శిస్తుంటాము.

ప్రతిదానికి భౌతిక పునాది ఉంటుందని భౌతికవాదులంటారు. భావవాదానికి కూడా భౌతిక పునాది ఉంటుంది. అందువల్ల భౌతిక పునాది లేనిదంటూ ఏదీ ఉండదు.

అందువల్ల భావవాదం అనేది భౌతికవాదం నిర్వచనంరీత్యా సాధ్యపడదు. భావవాదం ఉందని అంగీకరిస్తే భౌతిక పునాదులేని భావాలు, చైతన్యం ఉంటుందని భౌతికవాదులే అంగీకరించనట్టు అవుతుంది. అపుడు భౌతికవాదులు కూడా భావవాదులే అవుతారు. భౌతికవాద దృక్పథంలో కూడా పాలకవర్గాల్లో అగ్రకులాల, పితృస్వామిక ఆధిపత్యవాదుల ప్రయోజనాలను నెరవేర్చడంకోసం రకరకాల రూపాల్లో చర్చలద్వారా ఆచరణలద్వారా ముందుకు వస్తుంది.

### భావవాదం కూడా భౌతికవాదంలో భాగమే

భౌతికవాద దృక్పథంలో భాగంగానే భావవాద దృక్పథం కొనసాగుతున్నదనే విషయాన్ని చూద్దాం. ప్రధానంగా భౌతికవాద దృక్పథం అంటే పాత పదాల్లో చెప్పుకోవాలంటే లోక సంబంధ విషయాలపట్ల పరిష్కారాలపట్ల ఆలోచించేందుకు కృషి చేయడం.

భావవాద దృక్పథం ఇది మాత్రమే కాకుండా పరలోక సమస్యల్ని అంటే పైవాళ్ళ స్వర్గం, నరకం, పునర్జన్మ, అమరత్వం మొ॥వి ప్రధాన పాత్ర వహిస్తాయి. అవే ప్రధానం అని ఇహలోక సమస్యలు, సుఖాలు అప్రధానం అని అన్నపుడే దాన్ని పూర్తిస్థాయి భావవాదం అని పిలువవచ్చు.

భౌతికవాద దృక్పథం ఇహలోక సమస్యల్ని, ప్రస్తుత భౌతిక ప్రాపంచిక సమస్యల్ని ప్రధానం చేస్తూ వాటిని ఎట్లా పరిష్కరించుకోవాలి? ఈ జీవితాన్ని మరింత సుఖమయం మరింత ఎక్కువ మందికి అనుకూలంగా మార్చుకోవాలనే దాన్ని ప్రధానం చేస్తుంది.

భావవాద, భౌతికవాద దృక్పథాల్లో పునర్జన్మ, భావం అభావం కావడం అనేవి రెంటి విభజనకు స్పష్టతనిస్తాయి. పునర్జన్మ గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. అది భావవాద దృక్పథం. అభావం, అభావం కావడం అనే సూత్రం భౌతికవాద దృక్పథం నుంచి ఏర్పడ్డ సూత్రం.

ఈ పునర్జన్మ దృష్టినుంచే, అభావం అభావం కావడం అనే సూత్రాన్ని తయారు చేసికోవడం జరిగింది. పుట్టిందే విత్తనం నుండి యధాతథంగా పునర్జన్మించడం జరుగదు. మొదటిది తల్లి అయితే తర్వాతది కూతురవుతుంది. రెండు క్రమాల మధ్య అభివృద్ధి క్రమం, కాలం, మట్టితో ప్రకృతితో కొత్త సంబంధాలు, కొత్త జీవితం ఉంటుందంటుంది భౌతికవాదం. ఇలా భావవాదంలో వుండే పునర్జన్మను, మంచిని తీసుకుని అభివృద్ధి పరచడం అనేది కూడా అనాదిగా సాగుతూనే వున్నది. అలాగే ఇటునుండి అటు మార్చడం.

### అన్నిట్లో ప్రాపంచిక దృక్పథం పాత్ర

వ్యక్తిలో వర్గ, కుల, జాతి, మత, జెండర్, సంస్కృతి, సంబంధాలు రూపుదిద్దుకోవడంలో ప్రాపంచిక దృక్పథం ప్రముఖపాత్ర వహిస్తుంది. శాస్త్ర విజ్ఞానం, కళలు, సంస్కృతి, ఆలోచనా శాస్త్రాలు, ప్రాపంచిక దృక్పథం రూపుదిద్దుకోవడంలో నాయకపాత్ర వహిస్తాయి. వ్యక్తి స్వార్థం ఈ నాయక పాత్రను తోసివేసి తనకిష్టమైనట్టు ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించుకుంటుంది. అందువల్ల సమాజ గమనానికి, వ్యక్తి స్వార్థానికి మధ్య నిరంతరం పోరాటం సాగుతుంది.



### తత్వశాస్త్రానికి–సామాజిక దృక్పథానికి మధ్య తేడా

తత్వశాస్త్రానికి–సామాజిక దృక్పథానికి మధ్య తేడా ఉంటుంది. తత్వశాస్త్రం ఆచరణ శాస్త్రంగా మారిన తర్వాత తత్వశాస్త్రం తన ఉనికిని కోల్పోతుందని అపుడు సామాజిక దృక్పథమే తత్వశాస్త్రం అవసరాన్ని తీరుస్తుందని అంటారు.

ఏ వాదానికైనా పరోపకారమే, నిస్వార్థమే సామాజిక ప్రగతియే గీటురాయి. తొంభయి శాతం ప్రజలకు లేదా మొత్తం సమాజ శ్రేయస్సుకు అనుకూలంగా మార్చితే అది భౌతికవాదమైనా, భావవాదమైనా సమాజానికి అనుకూలంగా ప్రజాస్వామీకరణ చెందుతుంది. తద్వారా అది ఆ వాదన రూపంలో ప్రజా రాశుల్లో మరింత వ్యాప్తి ఎక్కువ కాలం నిలబడుతుంది. అందువల్ల ప్రతి స్వార్థపూరిత దృక్పథం కూడా అందరి శ్రేయస్సు కోసమే అంటూ ప్రచారంతో ముందుకు వస్తుంది. అప్పుడు నిజంగా అందరి శ్రేయస్సు కోరే నిస్వార్థ త్యాగపూరిత దృక్పథం ఏదో తెలుసుకోవడానికి స్వంత వివేచనతోపాటు ఆ వాదం గురించి చెప్పేవారి ఆచరణను నిజాయితీని లెక్కలోకి తీసుకోవలసి వస్తుంది. అందుకే చెప్పేది ఆచరించేవారికి గౌరవం ఎక్కువ. ప్రజలపై వారి ప్రభావం ఎక్కువ.

### దృక్పథానికి–చైతన్యానికి మధ్య సంబంధం

దృక్పథానికి–చైతన్యానికి సంబంధం ఉంటుంది. దృక్పథం ఒక చైతన్యపూరిత అవగాహన. ప్రాపంచిక దృక్పథం అంటే మన ఆచరణను రూపొందించుకునే లోకజ్ఞానం. ప్రాపంచిక అంటే ఈ ప్రపంచానికి సంబంధించిన, దృక్పథం అంటే దృష్టి. అంటే ఈ ప్రపంచాన్ని చూసే తీరు, అర్థం చేసుకొనే తీరు అలాగే మనం ఈ ప్రపంచంలో ఆచరించే తీరు.

ఒక వ్యక్తి యొక్క చైతన్యాన్ని అనుసరించి, అతని వ్యక్తిత్వాన్ని అనుసరించి, సమాజంలో అతనున్న స్థల కాలాలను అనుసరించి అతని ప్రాపంచిక దృక్పథం రూపొందుతుంది.

### ఒకే యింట్లో, ఒకే వర్గంలో, ఒకే కులంలో అనేక దృక్పథాలు

ఒక యింట్లో, ఒకే వీధిలో, ఒకే తెగలో, ఒకే కులంలో, ఒకే వర్గంలో, ఒకే జాతిలో, ఒకే దేశంలో, ఒకే లింగంలో, ఒకే సమాజంలో ప్రాపంచిక దృక్పథాలు భిన్నస్థాయిలో విభిన్న తీరుల్లో కొనసాగడం చూస్తుంటాం. మనం క్లాసులో చెప్పే పాఠం ఒకటే. అది విని కొందరు విద్యార్థులు ఎక్కువ మార్కులు తెచ్చుకుంటారు. కొందరు ఫేలవుతారు. మనం చెప్పింది ఒకటే అయినా దాన్ని స్వీకరించేవాళ్ళు విభిన్న చైతన్యస్థాయిలకు చెందినవారు. దానివల్ల వారి స్వీకరణశక్తిని అనుసరించి వారి ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించుకుంటారు. చైతన్యానికి, దృక్పథానికి గల సంబంధం యిది.

### స్వార్థానికి–చైతన్యానికి మధ్య తేడా ఏమిటి?

స్వార్థానికి–చైతన్యానికి మధ్య వైరుధ్యం వుంటుంది. చైతన్యం ఎంత ఉన్నతమైనదైనా అది వ్యక్తి స్వార్థానికి కుదించుకుపోతే మనం గౌరవించం. సమాజం

బాగుకోసం ఏదో చేయాలనే చిత్తశుద్ధి, కార్యదీక్ష గల చైతన్యం ఎంత వెనుకబడిందైనా గౌరవిస్తాం. నక్సలైట్ల చైతన్యం ఎంత వెనుకబడినదైనా వారి చిత్తశుద్ధి, కర్తవ్యదీక్ష ననుసరించి గౌరవిస్తాం. పాలకవర్గాల, బ్రాహ్మణీయ, మార్క్సిస్టుల అగ్రకులాల చైతన్యం ఎంత ఉన్నతమైనదైనా అది వ్యక్తి స్వార్థంలో భాగంగా కొనసాగితే దాన్ని గౌరవించం. అలాగే పిల్లల చైతన్యం ఎంత ప్రాథమిక స్థాయిలో ఉన్నా వారి నిర్మల హృదయం, చిత్తశుద్ధి కారణంగా గౌరవిస్తూ ప్రోత్సహిస్తాం, ఆశీస్సులందిస్తాం. సమాజ ద్రోహికి ఎంత చైతన్యం ఉన్నా నీచంగా చూస్తాం.

**బోలెడు ఆదర్శాలు, గురివిందగింజ ఆచరణ**

తత్వశాస్త్రం చర్చలో బోలెడు ఆదర్శాలు చెప్పి ఎదుటివారిది భావవాదమనో, మూఢ విశ్వాసమనో దబాయించే అవకాశం ఉన్నట్టు సామాజిక వాదం చర్చలో ఉండదు. అది ఏ వాదమైనా ఎవరికి ఎంత ఉపయోగపడుతుందని, దాని గురించి చెప్పేవాళ్ళ నిజాయితీ, చిత్తశుద్ధి, ఆచరణ ఎంత అనేదే ప్రాపంచిక దృక్పథంలో ముఖ్యాంశం.

సాధారణంగా చైతన్యం అనే పదాన్ని సమాజంకోసం చైతన్యం, సమాజంలో భాగంగా చైతన్యం అనే అర్థంలోనే వాడుకుంటాం. వ్యక్తి స్వార్థంకోసం ఉపయోగించే చైతన్యాన్ని వ్యక్తి స్వార్థంగానే పేర్కొంటాం. అందువల్ల వ్యక్తి స్వార్థపరులు తమ ఆచరణ కూడా సమాజం బాగుకోసమే అని నమ్మిస్తారు. నమ్మినంతకాలం అది చైతన్యంగా కనబడుతుంది. నమ్మకపోతే అది స్వార్థంగా కనబడుతుంది. చరిత్రలో బ్రాహ్మణవాదులు తమ వ్యక్తి స్వార్థాన్ని ఇతరుల రెక్కల కష్టంపై ఆధారపడే తమ కులస్వార్థాన్ని సమాజంలో ఆచరించాల్సిన చైతన్యం ధర్మం, మతం అని నమ్మబలికాయి.

**దృక్పథం ఒక విశ్వాసమే తప్ప వాస్తవం కాదు**

దృక్పథానికి-విశ్వాసానికి సంబంధం వుంది. దృక్పథం ఒక విశ్వాసమే. విశ్వాసం దృక్పథంలో ఒక భాగం. ఎన్ని తర్కాలైనా తాము చెప్పేదాన్ని విశ్వసించడానికే ఉపయోగిస్తారు. అందువల్ల తర్కం ఒక విషయాన్ని ఒక విశ్వాసంగా ఏర్పరచడంతో దాని పని తీరిపోతుంది. తర్కం ద్వారా దృష్టిని, విశ్వాసాల్ని, విలువల్ని మార్చడానికి ప్రయత్నిస్తారు. తద్వారా ఒక దృక్పథం ఏర్పడ్డాక అది మనలో ఒక విశ్వాసంగా కొనసాగుతుంది.

కొత్త జ్ఞానం తెల్సుకున్న స్థాయిననుసరించి దృక్పథం-విశ్వాసాలు మారుతుంటాయి. మారకపోతే కరుడుగట్టుకు పోతాయి. దాన్నే ఛాందసం అంటాం.

ఛాందసం అంటే పాతబడిపోయిన విశ్వాసాలు లేదా పాతబడిపోయిన ప్రాపంచిక దృక్పథం, మూఢవిశ్వాసాలంటే మూఢంగా ఆచరించే ప్రాపంచిక దృక్పథం. తత్వశాస్త్రాలు "ఆలోచన" గురించి, సమాజం గురించి చర్చ చేస్తాయి. వాటిలో ఏవి స్వీకరిస్తామో అవి మన విశ్వాసాలవుతాయి. అదే మన దృక్పథం అవుతుంది. తత్వశాస్త్రం "ఆలోచన"ను గురించి ఆలోచించే దశ. దృక్పథం ఆ "ఆలోచన"ను ఆచరించే దశ.



**సత్యానికి-నమ్మకానికి మధ్య సమన్వయం ఉండాలి**

సత్యానికి-విశ్వాసానికి మధ్య అంతర్గత సంబంధం వుంది. సత్యం అని విశ్వసిస్తే గానీ మనం చాలావాటిని ఆచరించం. అందువల్ల మనచేత ఆచరింపచేసేవన్నీ సత్యాలు అని విశ్వసింపచేస్తాయి తత్వశాస్త్రాలు. కానైతే బుద్ధుడు ఎవరో చెప్పారని సత్యంగా భావించకు, నీకు నీవు సత్యం తెలుసుకొన్నాకే విశ్వసించు అనే ప్రాపంచిక దృక్పథాన్ని చెప్పాడు. అతడు శుష్క పండిత చర్చను నిరసించి ప్రాపంచిక దృక్పథానికి ప్రాధాన్యత యిచ్చాడు. తత్వశాస్త్రం చర్చ, ఆలోచన ద్వారా సత్యాన్ని రుజువు పరుస్తుంది.

ప్రాపంచిక దృక్పథం సత్యాన్ని విశ్వాసంగా మార్చుతుంది. బుద్ధునికి పూర్వం చార్వాకులు సత్యంకోసం గొప్ప చర్చలు చేశారు. భౌతికవాద ప్రాపంచిక దృక్పథాన్ని ఎంతో చక్కగా రూపొందించారు. చార్వాకులు హేతుబద్ధతతో ప్రాపంచిక దృక్పథాన్ని ప్రచారం చేశారు. చార్వాకులను తత్వవేత్తలు అనడంకన్నా భౌతికవాద ప్రాపంచిక దృక్పథ నిర్మాతలు అనడం సబబు. మార్క్సు, ఎంగెల్సులను, జ్యోతిబాఫూలే, అంబేడ్కర్, పెరియార్ రామస్వామి గారలను తత్వవేత్తలు అనడంకన్నా సామాజిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథం నిర్మాతలు అనడం సరియైనది.

ఏమంటే ఆచరణను ఉద్దేశించే తత్వశాస్త్రం ప్రాపంచిక దృక్పథంలో భాగమవుతుంది. ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందిస్తుంది. ప్రాపంచిక దృక్పథంగా రూపొందలేని తత్వశాస్త్రం అంత లోతైనదీ, సమగ్రమైనదీ కాదు.

కొన్ని "ఆలోచనలు" కూడా తత్వశాస్త్రంగా రూపుదాల్చవచ్చు. కాని జీవితంలోని అన్ని కోణాల్లో, ఆలోచనలను, ప్రసరింపచేసే ఒక సమగ్రతను సంతరించుకునే తత్వశాస్త్రాలే ప్రాపంచిక దృక్పథంగా రూపొందడం సాధ్యమవుతుంది.

**నమ్మకానికి-మతానికి మధ్య సంబంధం, సంస్కృతి**

విశ్వాసానికి-మతానికి మధ్య సంబంధం వుంది. విశ్వాసమే స్థిరపడి దృక్పథంగా, సంస్కృతిగా మారే క్రమంలో మతం రూపొందుతుంది. అనుభవాల నుండి, హేతుస్థాయిననుసరించి, భ్రమల నుంచి, సత్యాలనుండి విశ్వాసాలు రూపొందుతాయి. విశ్వాసాలు స్థిరపడడం ఛాందసత్వం. విశ్వాసాల వ్యవస్థీకృత ఆచరణ మతం. మతం-విశ్వాసాలను ఆచరించే వ్యవస్థను రూపొందిస్తుంది. ఈ విశ్వాసాలు ప్రపంచాన్ని గురించినవే. ప్రాపంచిక దృక్పథానికి సంబంధించినవే. ఆచరణకోసమే. అందువల్ల మతం అనేది ఒక ప్రాపంచిక దృక్పథాన్ని ఆచరించుకునేందుకు రూపొందించుకున్న వ్యవస్థే. అనగా ఇలాంటి వ్యవస్థను ఏర్పరచుకునే ప్రతి ప్రాపంచిక దృక్పథం 'మతం'గా కొనసాగుతుంది.

**నేను, నా కుటుంబం అనే పరిమిత దృష్టి అన్ని సమస్యలను పరిష్కరించలేదు**

జీవితంపట్ల నేను, నా కుటుంబం అనే వ్యక్తిగత స్థాయి ఆలోచన విధానం చాలామందిలో చూడవచ్చు. వారి సామాజిక అవగాహన అదే పద్ధతిలో కొనసాగుతుంది.

వ్యక్తి శ్రేయస్సుకు, సమాజ శ్రేయస్సుకు మధ్యనున్న సంబంధం వుంది. కానీ చాలామంది సమాజశ్రేయస్సు గురించి పట్టించుకోరు. అది ఏ కొందరో, నాయకులో, పార్టీలో, ప్రభుత్వాలో పట్టించుకోవాల్సిన విషయం అనుకుంటారు.

సమాజం ప్రమేయం లేకుండా వ్యక్తిగత స్థాయిలో సమస్యలు పరిష్కారం అవుతాయా? నేను నా భార్యా, పిల్లలు, బాధ్యతలు, వీటికి ప్రాధాన్యతనిచ్చి వదిలించుకుంటే బాగుంటుంది అనుకుంటారు.

మరికొందరు కొంతకాలం పని చేస్తే చాలు. సరిపోతుంది. ఇంకా పిల్లలు కానటువంటి యువకులు ఈ ఉద్యమంలో పనిచేస్తే బాగుంటుంది. మాలాంటి ముసలివాళ్ళకి అంతగా వీలు పడదు అనే భావన చూడవచ్చు. ఈ భావన ఇప్పుడే కాదు, నిన్ననే కాదు, రేపు రాబోయే సమాజంలో కూడా ఉంటుంది.

ఇది వ్యక్తి శ్రేయస్సుకు సమాజ ప్రయోజనానికి సంబంధం తెలియక అనుకోవడం. వ్యక్తులు లేకుండా సమాజం లేదు. సమాజం లేకుండా సామాజిక వ్యక్తులుగా ఉండడం సాధ్యం కాదు. వ్యక్తికి సమాజానికి మధ్య ఈ రెంటి అవసరాల మధ్య ఉండే అంతరాన్ని నిరంతరంగా పరిష్కరించుకుంటూ పోవడమే సమాజం యొక్క అభివృద్ధి.

**పలాయనవాదం ఎలా ఉంటుందంటే...**

నిన్న ఏదో స్టూడెంట్ లైఫ్ బై అప్పుడు ఏదో చేసాను. ఇప్పుడు జీవితంలో స్థిరపడ్డాను. ఇక అవన్నీ పట్టించుకోవాల్సింది నాయకులో, ప్రభుత్వాలో, పౌరహక్కుల సంఘాలో, దళిత మహాసభలో ట్రేడ్ యూనియన్ వాళ్లో అనుకుంటున్నారు. ప్రజలు బాధ్యతను వదిలేస్తే వాటిని నిర్వహించే పేరిట ప్రభుత్వాలకు అధికారాలు పెరిగి బలపడి ప్రజలపై పెత్తనం పెంచుకుంటాయి.

వరకట్నం చావుల్లో, చంపారంటేనో, ఆత్మహత్య చేసుకున్నారంటేనో, 50 కోట్ల జనం దారిద్ర్య రేఖకు దిగువ జీవిస్తున్నారంటేనో, పట్టించుకోవడానికి కృషి చేయడానికి మనకు తీరిక ఎక్కడిది అంటారు.

ఈ అవగాహనలో చాలా అశాస్త్రీయమైన పలాయనవాదమైన స్వార్థపూరిత మైన ప్రాపంచిక దృక్పథం ఉంది. ఇది వ్యక్తిగత భౌతికవాద ప్రాపంచిక దృక్పథం. ఇది సమాజంలోని ఒక వ్యక్తిగా కాకుండా సమాజానికి సంబంధంలేని వ్యక్తిగా బ్రతకాలనుకునే వ్యక్తిగత భౌతికవాద ప్రాపంచిక దృక్పథం.

తన కుటుంబ అవసరాలరీత్యా తన వ్యక్తిగత అవసరాలరీత్యా ఆ పరిధికి మించి సమాజాన్ని గురించి ఆలోచించని అతి సంకుచితమైన ప్రాపంచిక దృక్పథం ఇది. అట్లా చేసినంత మాత్రాన ఆ సమస్య పరిష్కారం అవుతున్నదా? కావట్లేదు. అయ్యే అవకాశం ఉన్నదా? లేదని మనకు తెలుసు.

**సామాజికంగానే పరిష్కారమయ్యే వ్యక్తిగత సమస్యలు**

వ్యక్తిగత స్థాయిలో సమస్యలు పరిష్కారం అయ్యే అవకాశమే ఉంటే జీవన ప్రమాణాలు పెంచుకోవడం సాధ్యపడితే సంస్థలు సామాజిక ఉద్యమాలు రాజకీయ ప్రభుత్వాలు, పార్టీలు, విప్లవాలు, దేవుళ్లు, ట్రేడ్ యూనియన్‌లు అవసరమే లేదు. ఎందుకంటే ఒక వ్యక్తి యొక్క సమస్యలు ఆ వ్యక్తికే పరిమితమైనవి కావు.

పూర్వం అందరూ చెరువు నుంచో కాలువ నుంచో మంచినీళ్ళు తెచ్చుకొనే వారు. చెరువులోనో, కాలువలోనో బట్టలు ఉతుక్కునే వారు. ఊరు వెలుపలికి కాలకృత్యాలకు కలిసి వెళ్ళే వారు. ప్రయాణాలు కలిసి చేసే వారు. వడ్లు, జొన్నలు,



మక్కలు కలిసి దంచుకొనే వారు. పండుగ అప్పాలు కలిసి చేసుకునే వారు. ఆపదల్లో ప్రసూతి మొదలైన సందర్భాల్లో అందరూ పరస్పరం సహకరించుకునే వారు. పొలం పనుల్లో ఒకరి పొలానికి మరొకరు వంతుల ప్రకారం పనికి వెళ్ళేవారు. గ్రామంలోని ఆయా కులవృత్తులు చేసే వాళ్ళు వారి వృత్తులను, సేవలను అందరికీ అందించే వారు. వారికి ధాన్య రూపంలో ప్రతిఫలం ముట్టేది. ఇలా వెనకబడిన జీవితం అని పిలిచే గ్రామీణ వ్యవస్థలో అనేక అవసరాలు, కార్యక్రమాలు సామాజికంగానే కొనసాగేవి. రక్తసంబంధాలు, సంతానాన్ని పెంచడం మాత్రమే వ్యక్తిగత జీవితంగా ఉండేవి.

ఆధునిక సమాజంలో ఇవన్నీ విడిపోయాయి. వ్యక్తిగతంగా వాటిని తీర్చుకోవాల్సి వస్తున్నది. వడ్లు పట్టించుకోవడం వ్యక్తిగతం అయిపోయింది. పండగలకు అప్పాలు చేసుకోవడం వ్యక్తిగతం అయిపోయింది. బట్టలు ఉతుక్కోవడం వ్యక్తిగతం అయిపోయింది. మంచినీళ్ళు, నల్లా నీళ్ళు ఇంటికి రావడం వల్ల వ్యక్తిగతం అయిపోయింది. ఎవరి పొలం వారిది అయిపోయి దాని పనులు వ్యక్తిగతం అయి కూలీలు కట్టిచ్చే సంబంధాలుగా మారిపోయాయి. పూర్వం ఇళ్ళల్లో దీపాలు పెట్టుకొనే వారు. ఇప్పుడు కరంటు వచ్చింది. పూర్వం పొయ్యిల కట్టెలతో వంట చేసే వారు. ఇప్పుడు గ్యాస్ వచ్చింది. ఇలా గ్రామాల్లో వ్యక్తిగతంగా పరిష్కరించుకొనే అవసరాలు సామాజిక సమస్యలయ్యాయి. సామాజికంగా పరిష్కరించుకునేవి కొన్ని వ్యక్తిగత సమస్యలుగా మారిపోయాయి. అందువల్ల ఏ సమస్య విడిగా వుండదు.

అవి సమాజ అభివృద్ధితో ముడిపడి ఉంటాయి. ఆ సామాజిక సమస్యలు పరిష్కారం కానంతవరకు వ్యక్తి జీవితంలో అవి కొనసాగుతూ ఉంటాయి. ప్రపంచంలో వ్యక్తిగత సమస్యలు అంటూ ఉండవు. ప్రతిది సామాజికమైనది, రాజకీయమైనది. ప్రతిది వ్యక్తిగతస్థాయిలో సామాజిక స్థాయిలో ఏకకాలంలో పరిష్కరించబడాలి. సమాజం యొక్క సమస్యలంటే అవి వ్యక్తిగత సమస్యల యొక్క సగటు సమస్యలే. వ్యక్తిగత సమస్యల సార్వజనీనమైన రూపాల్నే సామాజిక సమస్యలని పిలుస్తుంటాము.

**అందరి వ్యక్తిగత సమస్యే సామాజిక సమస్య అని పిలవబడుతుంది**

వ్యక్తిగతంగా అందరికుండే సమస్యే సామాజిక సమస్య. అయితే మనం వ్యక్తిగత స్థాయిలో ఆలోచిస్తుంటే వాటిపట్ల మన కర్తవ్యాన్ని నిర్దేశించుకోవడం కోసం ముందుకెళ్ళాల్సిన స్థితి ఏర్పడినపుడు మనం చేస్తున్న పని ఏమిటంటే అవి ఆ సమస్యలు నిజ జీవితంలో లేవనే అభిప్రాయంతో, దృక్పథంతో కొనసాగుతున్నాం.

నిజానికి అట్లా ఉంటుందా? ఉదాహరణకి ఒక స్త్రీని, పురుషుడిని తీసుకుందాం. వరకట్న సమస్యని తీసుకుందాం. పేదరికం, నిరక్షరాస్యత సమస్య తీసుకుందాం. కులసమస్య, వర్గసమస్య, తీసుకుందాం. ఇవి పోవాలని అందరూ అంటుంటారు. అలా అనే వాళ్ళంతా ఆచరిస్తే ఇవి ఎప్పుడో పరిష్కారం అయి ఉండేవి.

ఇలా వ్యక్తికి సమాజానికి లేదా వ్యక్తికి సంస్థకి లేదా సాధారణతకు పర్టీక్యులారిటీకి మధ్య ఉండే వైరుధ్యాన్ని పరిష్కరించే క్రమంలో పర్టిక్యులారిటీకి మాత్రమే అంటే వ్యక్తిగత సమస్యలకు మాత్రమే.

**విడివిడిగా సమస్యల గురించి ఆలోచిస్తే ఏర్పడే పరిణామాలు**

విడి సమస్యల పట్ల మాత్రమే స్పందిస్తూ వ్యక్తిగా కుటుంబ శ్రేయస్సు పరిమితిని ఆలోచించినప్పుడు, ఆచరించినపుడు అది తప్పనిసరిగా ఎంతో కొంత సమాజం నుండి పలాయనం చిత్తగించేవారిగా సమాజం గురించి పట్టించుకోకుండా ఎంతో కొంత స్వతంత్ర్యంగా, సుఖంగా, బతుకడానికి సంబంధించిన ప్రాపంచిక దృక్పథం.

అలా గడిపే జీవితం ఏ యే పద్ధతులలో సాగవచ్చు?

అట్లా (అలైట్) శిష్టవర్గంగానే నాకు సంబంధించిన కొద్ది సర్కిల్ మాత్రమే నా వాడ, నా ఊరు, నా కులం నా కుటుంబం అందులోనే జీవిస్తాను. మిగతా ప్రపంచం గురించి పెద్దగా అవసరం లేదు. నాకు ఏ మేరకు ఈ ప్రపంచం ఉపయోగపడుతున్నది అని ఆ మేరకు ఆలోచిస్తాను. అంతేతప్ప నా వ్యక్తిగత జీవితానికి అవసరం లేని అంశాలను సమస్యలను సమాజాన్ని పట్టించుకోనవసరం లేదనే స్థాయిలో అచరణ సాగినపుడు వారి జీవితం ఎలా కొనసాగుతున్నది.

**సామాజిక జీవితంలో శవాలుగా బతుకీడ్చేవారు**

దీనికి మనం ఎంత మందినైనా ఉదాహరణగా తీసుకోవచ్చు. మెజారిటి ప్రజలు ఇలాగే అనుకుంటున్నారు. కర్మసిద్ధాంతం దీనికి తోడైంది. మనం జీవితంలో ఉద్యోగంలోకి ఎక్కగానే గతమంతా స్టూడెంట్ లైఫ్‌బై అనే భావం ఎవరైతే చెబుతున్నారో నిజానికి వాళ్ళంతా సామాజిక జీవితంలో చచ్చిపోయినవాళ్ళే. కేవలం వ్యక్తిగత జీవితం జీవించేవాళ్లు సామాజికంగా శవాలుగా నడుస్తున్నవాళ్లే. వారు నిరుద్యోగులుగా ఉన్న కాలంలో వాళ్లకి సమస్యలు ఉన్నపుడు మాత్రమే వాళ్లలో చైతన్యం, ఉత్సాహం సామాజిక కదలిక మొదలైనవి ముందుకు కొనసాగాయి. ఇపుడు స్థిరపడ్డాక తనకు సమస్య వచ్చినపుడు లోకమంతా దద్దరిల్లాలని గావుకేకలు పెడుతారు.

**స్వార్థం, నాయకత్వం, ఆధిపత్యం కోసం చేసేవాళ్ళు ఎలా ఉంటారంటే...**

నిజానికి ఇలాంటి వారు చేసే ఆచరణ యువకునిగా ఉన్నపుడు చేసినది కూడా వ్యక్తిగత స్వార్థం కోసమో, పదిమందిలో గుర్తింపు తెచ్చుకోవడం కోసమో చేసిన వ్యక్తిగత స్వార్థంతో కూడిన ఉద్యమ ఆచరణే కావచ్చు.

ఉద్యోగమో, సద్యోగమో దొరికిన తరువాత జీవితంలో స్థిరపడిన తరువాత తన కాళ్ళపై తాను నిలబడిన తర్వాత నిజమైన సామాజిక జీవితం, నిజమైన వ్యక్తిగత జీవితం సరియైన అర్థంలో ప్రారంభమవుతున్నది. ఎందుకంటే అంతకుముందు తల్లిదండ్రులమీదో ఇతరులమీదో ఆధారపడే బతుకులనుండి ఇపుడు ఒక ఉద్యోగ భద్రత గానీ, ఆర్థిక భద్రత గానీ, స్థిరమైన కుటుంబ జీవితంగానీ ఏర్పడిన తర్వాత వ్యక్తిగా సమాజంలో అతని జీవితం ప్రారంభమవుతున్నది.

**జీవితంలో స్థిరపడిన తరువాత సామాజిక కర్తవ్యాలు మరింత పెరగాలి**

అందువల్ల రాజకీయ ఆర్థిక సామాజిక స్వాతంత్ర్యం గల ఒక వ్యక్తిగా, ఒక పౌరుడిగా సమాజంపట్ల నిర్వర్తించాల్సిన బాధ్యత తన కాళ్లమీద తాను నిలబడినపుడే ప్రారంభమవుతున్నది. ఈ విషయాన్ని అర్థం చేసుకుంటే ఆచరిస్తే అదే సాంఘిక లేదా



సామాజిక భౌతికవాద ప్రాపంచిక దృక్పథం.

సమాజానికి ప్రాధాన్యతనిస్తే సోషలిజం అని వ్యక్తికి ప్రాధాన్యతనిస్తే ప్రజాస్వామ్యమని కొందరు నిర్వచిస్తున్నారు. ఇది సరియైన నిర్వచనం కాదు. రెంటిలో రెంటి లక్షణాలు ఉన్నాయి.

నేను ఏ మేరకు సమాజం కోసం చేయగలను, నేను ఏ సమాజంలో బతుకుతున్నాను? నాకున్న పరిసరాలేమిటి నాకున్న అవకాశాలేమిటి? నాకు నేనుగా ఎలాంటి అవకాశాలు సృష్టించుకోవాలి? వీటిలో నేను వ్యక్తిగా సమాజంలో భాగంగా సమాజాన్ని ముందుకు కొనసాగించే ఒక బాధ్యత గల పౌరుడిగా నా కర్తవ్యాలేమిటి? అని ఆలోచించినపుడు ఈ రెండు విధానాల్లోను ముందుకు సాగడం సాధ్యమే. ఆ ఆచరణ వ్యక్తియొక్క సామాజిక జీవితం అవుతుంది.

**అవకాశవాదం-డబ్బు సంస్కృతి-అహంకార వాదం**

నేను వ్యక్తిగత మాత్రుడిని. నాకు సమాజంతో పని ఏమిటి నేను ప్రతి వస్తువుని సేవను డబ్బులిచ్చి కొనుక్కొంటాను. ఇంతకుమించి నాకు సమాజంతో సంబంధం లేదు. అనే వ్యక్తిగత దృక్పథంతో ముందుకు వెళ్ళినపుడు ఆ సమాజం రెండు వ్యవస్థల్లోను వ్యక్తి స్వార్థమౌతుంది.

సామాజిక అభివృద్ధి దేనివల్ల సాధ్యమవుతుంది? సైన్సువల్ల అది దేనివల్ల అందరికి అందుతుంది? ప్రభుత్వాలవల్ల, సంస్థలవల్ల, ఉద్యమాలవల్ల అది ప్రజలకి అందుతుంది.

**ఏ దృక్పథం లేకుండా బతికేయడం యథాతథవాదమే**

ఏ ప్రాపంచిక దృక్పథం లేకుండా బతుకడమనేది చాలా మందిలో చాలాచోట్ల చూడవచ్చు. దీంట్లో పేదరికం నిరక్షరాస్యత వర్గం కులం మతం స్త్రీ పురుష జాతి అనే భేదాలతో నిమిత్తం లేకుండా అన్ని రంగాలవాళ్లు ఉన్నారు. ఇది గాలివాటంగా బతుకుడు. ఇది యథాతథ వాదాన్ని సమర్థిస్తుంది.

ఇట్లా కాకుండా ఈ సమాజాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళాలి అనే ఆలోచన ఉండడంవల్లే సాహిత్యంలో రాజకీయ రంగంలో కళా సాంస్కృతిక రంగాల్లో, సైన్సులో నాయకత్వం వహించడం సమాజాన్ని నడిపించడం సాధ్యపడుతుంది.

**వ్యక్తి శక్తిగా, సమాజంగా, సైన్సుగా ఎదిగే తీరు**

తన స్వంత వ్యక్తిగత అవసరాల్ని త్యాగం చేసుకుని సామాజిక దృక్పథంతో వ్యక్తులు ఉద్యమాల్లో పని చేసినపుడు, వ్యక్తులే ఉద్యమాలుగా పని చేసినపుడు, వారి త్యాగాల కారణంగా సమాజం, సైన్సు ముందుకు వెళ్లడం సాధ్యమవుతుంది. ఇది సామాజిక ప్రాపంచిక దృక్పథమవుతుంది.

సామాజిక దృక్పథం ఉన్న వ్యక్తిగా, మనం మనకోసమే బతికేస్తున్నామా? లేదా ఇతరులకోసం బతుకుతున్నామా? అన్న ప్రశ్న ముఖ్యమైంది.

**సమాజం కోసం బ్రతకడం అంటే ఏమిటి?**

చాలామంది నాయకులు, సన్యాసులు, నేను సమాజంకోసమే బతుకుతున్నాను అని అనుకోవడం జరుగుతుంది. సమాజంకోసం ఎంతో త్యాగం చేస్తున్నాను అని కూడా

అనుకుంటారు. ఇది తత్వశాస్త్రరీత్యా లేదా ప్రాపంచిక దృక్పథంరీత్యా నిర్ధారించుకోవడం అంత సులువైన విషయం కాదు.

శరీర మాధ్యం ఖలుధర్మ సాధనం అన్నాడు కాళిదాసు. మనిషి తనకోసం తాను బతుకుతూనే సమాజంలో భాగంగా సమాజానికి ఉపయోగపడే పని చేయడం సాధ్యం అని అంటాడు.

ఈ శరీరం ఉంటేనే కదా మనం బతికితేనే కదా ఇతరులకోసం పనిచేయగలిగేది? అందువల్ల ఇతరులకోసం త్యాగం చేస్తున్నామనే భావన అహంకారాన్ని తెలుపుతుందే తప్ప త్యాగాన్ని కాదు అని అంటారు.

బుద్ధుడు సామాజిక భౌతికవాదాన్ని ఆచరించి చూపాడు. నాటికి అభివృద్ధి చెందిన పాడి పరిశ్రమ, వ్యవసాయం, ఇనుము, రాజ్య వ్యవస్థలననుసరించి, బౌద్ధ ప్రాపంచిక దృక్పథం ఏర్పడింది. ఇలా బౌద్ధ గతితర్కాన్ని జ్ఞాన సిద్ధాంతాన్ని స్వీకరించడంవల్ల అది ప్రపంచంలో ఆనాటికి అత్యంత ఆధునిక ప్రాపంచిక దృక్పథం అయింది. అది ప్రపంచంలో బాగా విస్తరించిన తొలి సోషలిస్టు దృక్పథం.

## ప్రజలే నిజమైన చరిత్ర నిర్మాతలు

ప్రజలు నిజమైన చరిత్రను నిర్మించుకుంటే తమదైన సామాజిక దృక్పథాన్ని ఏర్పరచుకుంటే దాన్ని తమ ఆధిక్యతకు దోపిడికి అనువుగా మార్చుకోవడానికి బ్రాహ్మణవాదులు, పాలకవర్గాలు నిరంతరం కృషి చేస్తూనే వస్తున్నాయి. అందులో భాగంగానే జ్యోతిబాపులే ప్రజలు నిర్మించుకున్న ఈ దేశ సమాజ చరిత్రను, సంబంధాలను వెలికితీసిన నిర్మించిన భారతీయ చారిత్రక భౌతికవాద సూత్రాలను బ్రాహ్మణవాద కమ్యూనిస్టులు నిర్మూలించే ప్రయత్నంలో భాగంగానే యూరపు కమ్యూనిస్టు సూత్రాలను ఇక్కడి చరిత్ర మీద రుద్దారు. ఇందుకు వారికి ఉపయోగపడింది వర్గం అనే పదం.

## ఏకకాలంలో ఇండియా, యూరప్‌లలో ఎదిగిన దృక్పథాల వైవిధ్యం

ఏకకాలంలో ఇండియా, యూరప్‌లలో ఎదిగిన దృక్పథాల్లో వైవిధ్యానికి ఆయా స్థల కాలాలు, పరిణామాలు ప్రత్యేకంగా, వేరుగా ఉండడం కారణం. సామాజిక శాస్త్రంగా, ప్రాపంచిక దృక్పథంగా అటు యూరపులోను, యిటు భారతదేశంలోను ఏకకాలంలో ఆయా దేశాల భౌతికవాదాలు ఆవిర్భవించాయి. 'సత్యశోధక' అనే సామాజిక దృక్పథం సామాజిక జీవితంలోని విభిన్న అంశాలను కూడా పరిశీలించింది. మద్యానికి వ్యతిరేకంగా పులే కృషి చేశారు. కార్మిక చట్టాల కోసం సత్యశోధక ఉద్యమం చేసిన కృషి ఎనలేనిది. దీనిని ప్రపంచ కార్మిక చరిత్రలో మహోజ్వలంగా వ్రాయాల్సింది పోయి అసలుకే లేవదీసారు.

పూలే ఇతిహాసాల్లో మన వారెవరు పరాయివారెవరు? అనే చర్చను ప్రవేశపెట్టారు. అలా పూలే బలి చక్రవర్తిని సొంతం చేసుకుని వామనాది బ్రాహ్మణుల కుటిలత్వాన్ని ఎంగడట్టారు. విధవలయ్యాక కన్న పిల్లలకోసం ఆశ్రమం నెలకొల్పారు. చావు తర్వాత జరిపే కర్మలను నిరసించి తన తండ్రి సంస్మరణార్థం పిల్లలకు పలుకలు కొన్న ఆచరణశీలి జ్యోతిబాపూలే. పెట్టుబడిదారీ స్వరూప శాస్త్రాలను ఈ దేశ నిర్దిష్టతలకనువుగా



జ్యోతిబాపూలే యిలా సృజనాత్మకంగా అన్వయించాయి.

## ఫ్రాయిడ్ సిద్ధాంతాల తర్వాత సమాజం మారిన తీరు

ప్రాపంచిక దృక్పథాన్ని అభివృద్ధి చేసే సామాజిక శాస్త్రాన్ని తీసికొంటే ఫ్రాయిడ్ మరియు అతని తదనంతరం వెలికితీసి నిర్మించిన మనస్తత్వశాస్త్రం ప్రపంచంలోని సమస్త శాస్త్రాలను సాహిత్యం, కళలను ఎన్నో మార్పులకు గురిచేసింది. పాత ప్రాపంచిక దృక్పథాలు ఎన్నో మార్చుకోవాల్సి వచ్చింది.

## ధ్యానం, భక్తి సామాజిక దృష్టిగా కొనసాగుతున్న తీరు

బౌద్ధంలో చెప్పే ధ్యానం, మనస్సు, అష్టాంగమార్గం-భక్తి ఉద్యమాల్లో చెప్పే ధ్యానం, యోగం అనేవి మనస్సు, మనస్తత్వం యొక్క ప్రాధాన్యతని గుర్తించి ఏర్పరుచుకున్న సామాజిక భౌతికవాదాలు.

మార్క్సిజం వంటివి ఆలోచన, ఆచరణ విషయాల్లో వ్యక్తి పాత్ర గురించి బౌద్ధం కన్నా రెండున్నర వేల ఏళ్ళు వెనకబడిపోయాయి. అనగా భారతదేశం మొదటినుంచి వ్యక్తిని, సమాజాన్ని, మనస్సును ఏకకాలంలో పట్టించుకొని చర్చించాయి. వ్యక్తిత్వం గురించి, ధర్మం గురించి రెండు స్థాయిల్లో పట్టించుకున్నాయి.

ఫ్రాయిడ్ సిద్ధాంతాలొచ్చాక ఏ సామాజిక శాస్త్రం, ఏ కళ కూడా ఫ్రాయిడ్ తీసికొచ్చిన అంశాల్ని నిరాకరించడం కాని, స్వీకరించడం గాని చేశాయి. ఉదా॥కు పిల్లల పెంపకం, విద్యాబోధన, విద్యాశాస్త్రం, కుటుంబ సంబంధాలు, మానసిక సమస్యలకు ఆరోగ్యానికి గల సంబంధం మొ॥ ఫ్రాయిడ్ తెచ్చిన మనస్తత్వ శాస్త్రం ఎంతో ఉపయోగపడ్డాయి. ఇవన్నీ సామాజిక శాస్త్రాల్లో భాగం కావడం ద్వారా తిరిగి ప్రాపంచిక దృక్పథంలో భాగంగా మారాయి.

## నిర్బంధం నుండి స్వేచ్ఛ సమాజానికి...

ఉదా॥కు నా చిన్నతనంలో పిల్లల్ని కొట్టేవాళ్లు. ఈరోజు పిల్లల్ని కొట్టకూడదని వారి సృజనాత్మకత నశిస్తుందని, మనకు తెలుసు. రైలుబడి అనే పుస్తకం మనస్సు యొక్క ఆసక్తి కనువుగా జరగాల్సినవేవో విశదపరుస్తుంది. ఆసక్తిని రేకెత్తించడం ద్వారా విద్యా జ్ఞానం అలవరుచుకోవడం సామాజిక స్థాయికి ఎదగడం అర్థం అయ్యాయి.

అయితే కొన్ని సామాజిక దృక్పథాల్లో యిప్పటికీ ఆసక్తికన్నా అనివార్యత నిర్బంధం జ్ఞాన సిద్ధాంతంగా వున్నాయి. ఉదా॥కు నాలుగు తంతే నిజాన్ని వాడే చెప్తాడు. అనేది పోలీసు ప్రాపంచిక దృక్పథం.

అలాగే నిర్బంధం అనే అనివార్యత వల్ల ప్రతిఘటన అనే జ్ఞానానికి దారి తీస్తుందనే సూత్రీకరణ. ఈ సూత్రీకరణ, మనస్తత్వశాస్త్రం తెచ్చిన అభివృద్ధికి ఎంతో వెనకబడిపోయింది. ఉదా: ప్రగతిశీల విద్యార్థుల్ని ఎవరూ కొట్టలేదు. వారే ఆసక్తితో, బాధ్యతతో, సమాజంలో వ్యక్తిగా గుర్తింపు పొందాలనే తపనతో ఏదో చేయాలని ముందుకు వచ్చారు.

బలవంతంగా ఎవరినీ విప్లవకారుడిగా మార్చలేం. బలవంతంగా ఎవ్వరినీ రచయితగా, కళాకారుడిగా మార్చలేం. అయినప్పటికీ నిర్బంధం ప్రతిఘటనకు దారి

తీస్తుందనే సూత్రీకరణను మార్చలేకపోయారు కొందరు.

**అభివృద్ధి చెందిన మేనేజిమెంట్ స్కిల్స్**

టీచర్ ట్రైనింగ్‌లో గానీ, బిజినెస్ మేనేజ్‌మెంట్, పరిపాలన శాస్త్రం, రాజకీయ తత్వశాస్త్రం మొ॥వన్నీ మనస్తత్వశాస్త్రంలోని అభివృద్ధి ననుసరించి ప్రాపంచిక దృక్పథాన్ని అభివృద్ధి పరుచుకున్నాయి. అందువలన సామాజిక శాస్త్రాలలో జరిగే అభివృద్ధి తొలిదశలో పాలకవర్గాలకు, దోపిడి కులాలకు, పురుషులకు, ఉపయోగపడే అవకాశాలే ఎక్కువగా ఉంటాయి.

**కులవృత్తుల నిపుణులే ఎదిగితే ఎలా ఉండేది?**

పెట్టుబడిదారీ విప్లవం భారతదేశంలో శూద్రకులాల చేతివృత్తి నిపుణులు పారిశ్రామికవేత్తలుగా, కార్మికులుగా మార్చాల్సి ఉండింది. కులవృత్తి ఉత్పత్తులే చేతితో కాకుండా యంత్రాల ద్వారా తయారుచేయడం మొదలైంది. అందువల్ల అవి బీసీ, ఎస్సీ, ఎస్టీ కుల వృత్తుల వారికే చెందాల్సి ఉండింది. అలా ఒకే కులం నుండి యజమానులు, కార్మికులు అనే పరిణామం జరగవలసి ఉండింది. కానీ ఇలా జరగలేదు. దీనికి భిన్నంగా అగ్రకులాలు యజమానులై శూద్రకులాలు కార్మికులుగా మారాల్సి వచ్చింది.

**స్త్రీల చేతుల్లోనే వ్యవసాయం...**

ఇంకా చరిత్ర పూర్వంలోకి వెళ్తే స్త్రీలు కనుకున్న వ్యవసాయం పురుషుల ఆధిపత్యానికి బాట వేసింది. అట్లా భౌతికవాద దృక్పథం దోపిడి కులాలకు, దోపిడి వర్గాలకు, రాజులకు, అనుకూలంగా మారే అవకాశాలే ఎక్కువగా ఉంటాయి. అపుడు అశేష ప్రజానీకం పీడిత వర్గాలు, శూద్రకులాలు వాటిని తమకనుకూలంగా మార్చుకోవడం కోసం కృషి చేస్తాయి.

**ఆధిపత్యవాదులు-పీడితులు, రెండు శిబిరాలు-రెండు వాదాలు**

అందులో భాగంగా భౌతికవాదాన్ని ఓడించడానికి భావవాదాన్ని ఆశ్రయించవచ్చు. ఉదా: ఒక అన్యాయం చేసిన వ్యక్తిని ఎదిరించడానికి శక్తి చాలకపోతే దేవుడే వీనికి తగిన శిక్ష వేస్తాడు. నా ఉసురు తగలకపోదు అని భావించవచ్చు.

పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు భౌతికవాదాన్ని ఆశ్రయిస్తే అది వారి లాభాల్ని పెంచడానికే గానీ, ప్రజలకు ఉపయోగపడేది కాదు కదా? అలాగే అగ్రవర్ణాలు పాలకవర్గాలు భౌతికవాదాన్ని ఆశ్రయిస్తే పీడిత కులాలు భావవాదాన్ని ఆశ్రయించి ఓడించే ప్రయత్నం చేస్తాయి.

ఉదా॥ మన దేశంలో అగ్రవర్ణాలు నాస్తికవాదం ప్రచారం చేస్తే పీడిత కులాలు క్రైస్తవం, ఇస్లాం వంటి మతాలు స్వీకరించి, హిందు మతతత్వ భౌతికవాదం తాలూకు సామాజిక అణచివేతను ఓడించే ప్రయత్నం చేసాయి.

నాస్తిక హేతువాదాల్ని ఆశ్రయించిన కమ్మలు, రెడ్లు, బ్రాహ్మలు కొత్తరూపాల్లో దోపిడినీ సామాజిక అణచివేతను ఆధిక్యతను కొనసాగించడం చూస్తూనే ఉన్నాము. నిన్నటి కమ్మ, నాస్తికత త్రిపురనేని ఉద్యమం నేటి కమ్మలను ఆస్తికులుగా ఎంతగా



స్వార్థపూరితం చేసిందో చూస్తూనే ఉన్నాము.

**సామాజిక దృష్టి, ఆచరణ ముఖ్యం**

మొదటే చెప్పినట్లు భావవాద దృక్పథం, భౌతికవాద దృక్పథం అని వర్గీకరించి అదే ప్రధానం అనడం అశాస్త్రీయం. అసలు విషయం ఏమంటే వ్యక్తికీ, సమాజానికి మధ్య ఉండే సంబంధాల్లో కేవలం తన గురించే ఆలోచిస్తున్నాడా? సమాజంలోని ఇతరుల గురించి కూడా ఆలోచిస్తున్నాడా? అనే వర్గీకరణే సరైనది శాస్త్రీయమైనది.

కనుక ఎవరినైనా సరే అంచనా వేసేటపుడు అతడు ప్రజలపట్ల, తనపట్ల ఎట్లా ఆలోచిస్తున్నాడు? ఎట్లా ఆచరిస్తున్నాడు? అనేదే గీటురాయి అవుతోంది. ఉదా: భౌతికవాద దృక్పథం కలిగి పిల్లికి భిక్షం వేయని కమ్యూనిస్టులను, నక్సలైట్లను నేను ఎందర్నో చూసాను అంటారు. అలాగే అందరు దేవుని బిడ్డలే. అందరు హిందువులే, అందరు సమానమే అనేవాళ్లను ఎందరినో చూసాను. వాళ్ళు సామాజిక శ్రేయస్సు గురించి మాట్లాడ్డం ఎంతో విన్నాను. వారికి వారి స్వార్థం, వారికి బంగాళాలు, స్కూటర్లు, కీర్తి ప్రతిష్టలు, వారి పుస్తక ప్రచురణలు, వాళ్ల నాయకత్వం తప్ప మరేవీ పట్టవు అని అంటారు. డెబ్భైఏళ్ల కమ్యూనిస్టుల హిందూవాద ఉద్యమం అగ్రకుల తత్వాన్ని పెంచి పోషించాయి. దీనివలన మిగతా సమాజం నిర్వీర్యమైపోయింది.

**పాపం-పుణ్యం దృష్టితో పరోపకారం కూడా మంచిదే**

ఇలాంటి వాళ్లకన్నా "పాపం పుణ్యం" అంటూ తోటి ప్రజలకు తోడ్పడుతూ ఏ కథలు చెప్పకుండ పరోపకారం చేసే ఆస్తికుడు ఎంతో గొప్పవాడు. ఇందులో నిజమైన భౌతికవాది ఆస్తికుడే! భౌతికవాది భావజాలరీత్యా భౌతికవాది అయ్యాడు. సిద్ధాంతాలు చెప్పినవాళ్లు ఆచరణరీత్యా పచ్చి సుఖవాదులయ్యారు. కాగా ఈ ఆస్తికుడు ఆచరణరీత్యా భౌతికవాది అయ్యాడు. అందువలన ఆస్తిక భావాలున్నంత మాత్రానా ఎవర్నీ అసహ్యించుకోవలసిన పనిలేదు. గౌరవించాల్సిన పనిలేదు. అలాగే భౌతికవాద దృక్పథం సమాజంపట్ల వారికి గల ఆచరణే వారు నిజంగా భౌతికవాదులో, ప్రజా శ్రేయోభిలాషులు అవునో కాదో నిర్ణయిస్తారు.

**ఎవరికైనా గీటురాయి పరోపకారమే**

ఎవరికైనా గీటురాయి పరులమేలు కోరడమే. బుద్ధుని బోధనలు మనకీ విషయాన్ని అంతకుముందు ఎవరూ చెప్పనంత స్పష్టంగా స్పష్టం చేసాయి.

వర్గ దృక్పథంలో పరోపకారమనే సమస్యే లేదు. మావో అనే చైనా దేశ నాయకుడు క్లాస్ ఫర్ ఇట్ సెల్ఫ్ అనేదే ఉంటుందన్నాడు. క్లాస్ ఫర్ అదర్స్ అనేది ఉండదన్నాడు. మార్క్సు, ఎంగెల్స్, లెనిన్ అనేవాళ్ళు కూడా దీనినే నొక్కి చెప్పారు. అందువల్ల యూరపులో పుట్టిన మార్క్సు వాదాలకి పరోపకారం అనే విషయం అర్థమయ్యే అవకాశం లేదు.

కాంట్ నుండి జరిగిన చర్చలో క్లాస్ ఫర్ అదర్స్, బియింగ్ ఫర్ అదర్స్ అనే పదబంధం ఆవిర్భవించలేకపోయింది. జీన్‌పాల్‌సాత్రే బీయింగ్ ఫర్ అదర్స్ అనే అంశాన్ని చర్చించాడు. కానీ అది నీచమైందిగా చెప్పాడే కానీ ఒక ఉన్నతాదర్శంగా తన తాత్విక గ్రంథంలో చర్చించలేకపోయాడు.

## కర్మ సిద్ధాంతం

మనదేశంలోను, ప్రపంచవ్యాప్తంగానూ కర్మ సిద్ధాంతం అనే ప్రాపంచిక దృక్పథం అత్యంత ప్రాచుర్యంలో ఉంది. కర్మసిద్ధాంతాన్ని మొదట బుద్ధుడు ప్రతిపాదించాడు. అతడు ఇతరులకోసం, సమాజంకోసం చేసే సామాజిక ఆచరణ అనే అర్థంలో కర్మ చేయాలని ప్రతిపాదించాడు.

బుద్ధుడు నీవు చేసే పనుల పర్యవసానాలకు నీవే బాధ్యుడవు. నీవే అనుభవిస్తావు అనే అర్థం కర్మ గురించి చెప్పాడు. అతడు పరులకోసం మనిషి పాటుపడాలని పరులకోసం వర్గం పాటు పడాలని ఉన్నత ఆదర్శాలను సిద్ధాంతంలో ఆదర్శీకరించాడు.

బ్రాహ్మణవాదులు జైనం, బౌద్ధం చెప్పిన ఈ ఉన్నత ఆదర్శాలను వక్రీకరించారు. వాళ్లు కర్మ అనే పదం యొక్క అర్థాన్ని మార్చివేసారు. దాన్ని ఆచరణ అనే అర్థం నుంచి గత జన్మలో చేసిన పుణ్య పాపాలకు బదిలీ చేసారు.

## భగవద్గీత ఎప్పుడు రాయబడింది?

బుద్ధుని తర్వాత 500 ఏళ్ళకు రాయబడినది అని చెప్పబడుతున్న లేదా అంబేద్కర్ ప్రకారం రాహుల్ సాంకృత్యాయన్ ప్రకారం హర్షవర్ధనుని కాలంలో తుది రూపం తీసుకున్న భగవద్గీత బుద్ధుని కర్మ సిద్ధాంతాన్ని పూర్తి స్థాయిలో పునర్జన్మ తాలూకు కర్మ సిద్ధాంతంగా మార్చిపడేసింది. కులాలకు కట్టిపడేసి దోపిడి కులాలకు సేవచేయడానికి అనువుగా కర్మసిద్ధాంతాన్ని అర్థం మార్చివేశారు.

తోటివారికి తోడ్పడవోయి అనే బుద్ధుని కర్మ సిద్ధాంతం దేవుని పరం చేయబడింది. అన్ని దేవుడే చూసుకుంటాడు మాధవసేవే మానవసేవ అన్నారు. నీకు నిర్ణయించిన కుల కర్మ నీవు చేయి, ఫలితం దేవునికి వదిలేయి అని ప్రతిపాదించారు.

అదే సమయంలో 9వ శతాబ్దం నుంచి బహుజన కులాల నుంచి వచ్చిన భక్త కవులు తత్వవేత్తలు, మానవసేవే మాధవసేవ అని అన్నారు.

## బుద్ధుని కర్మ సిద్ధాంతాన్ని ఖర్మ సిద్ధాంతంగా మార్చిన తీరు

పరోపకారం చేయాలనే బుద్ధుని కర్మ సిద్ధాంతాన్ని ఆసరా చేసుకొని పూర్వ జన్మలో నీవు పాపం చేశావు, వాళ్ళు పుణ్యంచేశారు కనుక వారికి సేవచేయడమే నీ కర్తవ్యం అని వర్ణ, కుల వ్యవస్థకు సైద్ధాంతిక ప్రతిపాదికనిచ్చి శూద్రకులాలు ఇతరులకు సేవ చేయాలని తప్పుడు చైతన్యం కలిగించారు. అయితే ఈ జన్మలోని పుణ్యాత్ములు, బ్రాహ్మణులు, పూర్వజన్మలో పంచములు, శూద్రులు పుణ్యం చేసుకోవడం వల్ల ఈ జన్మ ఎత్తిన శూద్రులు అని చెప్పడం లేదు. వర్ణ ధర్మాన్ని, కుల ధర్మాన్ని పాటించడం తొలినాళ్లలో తోటివారికి తోడ్పడవోయి, అనే బౌద్ధ బోధనలో భాగంగా సాగింది.

## శూద్రులు నిర్వహించిన సామాజిక పాత్ర

ఒక డాక్టరుగా, ఇంజనీరుగా, ఉపాధ్యాయునిగా, ఇపుడు చేస్తున్న సేవలే వెనుకట శూద్రులే తమ రంగాల నైపుణ్యాన్ని ఇతరులకి అందించారు. 11వ శతాబ్దం దాకా బౌద్ధం బలంగా ఉన్నప్పటికి వర్ణవ్యవస్త కులవ్యవస్థ కొనసాగడం ఇందులో భాగమే. అనగా పరస్పరం సహజీవనం అంటిపెట్టుకునే విధంగా పురికొల్పాయి. కులాల



అసమానతను తొలగించి కులాతీత పెళ్ళిళ్ళు జరుపగలిగినపుడు ఈ సహజీవనం మరింత అద్భుతంగా ముందుకు కొనసాగుతుంది. ఎదుటివారిని గౌరవించలేని కుసంస్కారం, నేను నాకులం గొప్ప అనే అభిజాత్యం దీన్ని అడ్డగిస్తున్నది.

కర్మ సిద్ధాంతంలో చొచ్చిన బ్రాహ్మణిజం పొరుగువారికి తోడ్పడు అనే అంశాన్ని రాజుల యుద్ధాలకు సైనికులకు, బ్రాహ్మణులకు దానమిచ్చేవారిగా వారిని పూజించేవారిగా, వైశ్యులకి సహకరించేవారిగా మార్చివేసారు. అందుకు దేవుడిని పునర్జన్మ కర్మసిద్ధాంతం తాలూకు ప్రాపంచిక దృక్పథంలో తెచ్చి కలిపారు. ఆ భ్రమలో నుండి బయటపడటం శూద్రులకు, అతిశూద్రులకు ఆనాడు ఈనాడు సాధ్యపడకపోగా ఈరోజు కూడా వాటి ఆకర్షణలోంచి బయటకి రాలేకపోతున్నారు.

దృశ్యమానే వినాశేచ! ప్రత్యక్షే లోక సాక్షికే!<br>
ఆగమత్ పరమస్తితి! బ్రువన్నది పరాజితః

మరణించిన వ్యక్తిని లోకంలో అంతా చూస్తూనే ఉంటారు. ఆత్మ అనేది ఏదీ సచ్చి వ్యక్తి శరీరం నుంచి బయటకి వెళ్తున్నట్టు ఎవరూ గమనించలేదు.

అనాత్మా మ్యాత్మనే మృత్యుః! క్లేశో మృత్యుర్జంరామయః!<br>
ఆత్మనం మన్యతే మోహత్! తదసమ్యకి పరమంమళం !!

వ్యక్తి మరణించడంతోపాటే శరీరాన్ని అంటిపెట్టుకున్న చైతన్యం కూడా నశిస్తుంది. చైతన్యాన్నే భావవాదులు ఆత్మ అని అంటారు. శరీరాన్ని అలుముకున్న రోగం విచారం వంటివి మరణానికి దారి తీస్తాయి. శరీరానికి భిన్నంగా ఆత్మ అనేది ఉంటుందనేది అవాస్తవమైనది.

ప్రత్యక్షం హ్యేత యోర్ములనం! కృతాంతై ఆహ్యే యోరపి!<br>
ప్రత్యక్షణాగోమభిన్నః! కృతాంతోవామనో కించనా!!

ప్రత్యక్షమే జ్ఞానానికి పరమావధి. ఎన్ని ప్రమాణాలున్నా చివరికి ప్రత్యక్ష ప్రమాణ అనుమతికి లొంగక తప్పదు. మత ప్రమాణ గ్రంధాలన్ని అనుభవానికి భిన్నంగా ఉంటాయి. కాబట్టి ఇవి ప్రత్యక్ష ప్రమాణానికి నిలవవు. రుజువుకు పనికిరావు. అందుకే అవి అశాస్త్రీయ గ్రంథాలు.

అభిమతం, సమ్మతం రెండూ కలబోసిన ప్రాపంచిక దృక్పథాన్ని మతం అనవచ్చు. ఆదిమ కాలంలోని తల్లి వ్యవస్థ (మాతృస్వామ్య వ్యవస్థ) లో మతం లేదు. తత్వశాస్త్రం లేదు. వారి ఆలోచన డైరెక్టుగా ప్రాపంచిక దృక్పథంగానే కొనసాగేది. ఆదిమ, గిరిజన తెగల జీవితంలో గల పలు పండుగలు, విశ్వాసాలు మతం కాదు. అవి వారి సంస్కృతిలో భాగం. వారి ప్రాపంచిక దృక్పథంలో భాగంగా సంస్కృతి రూపొందింది.

## మతానికి-సంస్కృతికి గల సంబంధం

సంస్కృతికి-మతానికి మధ్య సన్నిహిత సంబంధం ఉంది. అలవాటుగా అనుకరణ ద్వారా ఆచరించే ప్రాపంచిక దృక్పథమే సంస్కృతి. స్వయంగా ఏర్పరచుకుంటూ ప్రాపంచిక దృక్పథం (ఏళ్ళ తరబడి) అనూచానంగా ఆచరిస్తూవస్తే సంస్కృతి,

ఛాందసత్వానికి, సంస్కృతికి తేడా వుంది. ఛాందసత్వంలో మొండి మూర్ఖత్వం కూడా ఉంటుంది. సంస్కృతిలో అది బాల్యం తాలూకు అమాయకత్వం రూపంలో ఉంటుంది. సంస్కృతి అంటే స్థూలంగా అలవాటు. అలవాటునే సంస్కృతి అంటారు.

**సంస్కృతి లేకుండా మతం కొనసాగదు...**

సంస్కృతిలేని మతం ఉండదు. సంస్కృతి లేకుండా మతం ఆచరణలో కొనసాగదు. సంస్కృతి ద్వారానే మతం ఆచరణలో కొనసాగుతుంది. ఎందువల్ల? మతం అనుకరణలో భాగంగా కొనసాగుతుంది. అనుకరణను స్వయంగా ఆచరించడమే సంస్కృతి. విశ్వాసం అనుకరణగా ఉన్నప్పుడే తరం నుండి తరానికి చేరుతూ ఉంటుంది. అందువల్ల విశ్వాసాలను అనుకరణగా మార్చే సంస్కృతిలో భాగంగా మతం ప్రజానీకంలో కొనసాగడం సాధ్యపడుతుంది.

**మతం లేకుండా కూడా సంస్కృతి ఉంటుంది**

మతంలేని సంస్కృతి ఉంటుంది. చార్వాకులకు మతం లేదు. వారికి కూడా ఒక సంస్కారం, సాంప్రదాయం, సంస్కృతి ఉంది. బుద్ధునికి మతం లేదు-సంస్కృతి ఉంది. మార్క్సిస్టులకు, నక్సలైట్లకు మతం లేదు. సంస్కృతి ఉంది. అంటే నిత్యజీవితంలో ఆచరించే విలువలు, ఆచారాలు, అలవాట్లు.

మాతృస్వామ్య, జనపదాల, గిరిజన తెగల సంస్కృతి-ప్రాపంచిక దృక్పథం అనువంశికంగా (ఇక్కడ ఈ పదం సరైంది కాదు. ఏమంటే ఆనాటికి "వంశం" అనే అంశమే పుట్టలేదు) అనూచానంగా అనుకరణతో కొనసాగేది. పితృస్వామ్య దృక్పథం వాటిలో ప్రవేశించింది. వాటిని క్రమంగా తమకనువుగా మార్చుకుంటూ మతరహిత సంస్కృతి రూపాన్ని పురుషాధిపత్యం అనే మతం రూపంలోకి మార్చింది.

**పితృస్వామ్య సంస్కృతి**

అలా పితృస్వామ్య వ్యవస్థ, సంస్కృతి రూపొందింది. ప్రపంచంలోని మొట్టమొదటి ప్రాపంచిక దృక్పథం పితృస్వామ్యం (తండ్రి వ్యవస్థ), తల్లివ్యవస్థ (మాతృస్వామ్య వ్యవస్థ)ను గానీ స్త్రీస్వామ్య వ్యవస్థను గానీ ప్రాపంచిక దృక్పథం అనం. ఎందుకంటే అవి ప్రయత్నపూర్వకమైనవి కావు. అవి ప్రకృతి సహజక్రమంలో రూపుదిద్దుకున్నవి.

**సంస్కృతికి-దృక్పథానికి మధ్య తేడా ఏమిటి?**

సులభంగా చెప్పాలంటే చైతన్యపూరితంగా ఏర్పరచుకుంటే దృక్పథం అంటారు. సమాజ అస్తిత్వ ప్రభావంలో భాగంగా అనుకరణ శీలతతో ఆచరిస్తే సంస్కృతి. అందువల్ల అందరికి ప్రాపంచిక దృక్పథం ఉంటుందనుకోలేం. చైతన్యవంతులైన ప్రజల్లోనే దృక్పథం ఉంటుంది. సరిగ్గా దాన్నే ఆచరించినా అనుకరణ ద్వారా సాగేదంతా సంస్కృతి అవుతుంది.

తండ్రి వ్యవస్థ-తల్లి సంస్కృతిపై ప్రయత్నపూర్వకంగా ఆధిపత్యం సాధించింది. అందుకు ఎంతో "ఆలోచన"ను, క్రూరత్వాన్ని ఉద్దేశపూర్వకంగా ఆచరించింది. అందువల్ల పితృస్వామికం ప్రపంచంలోని మొట్టమొదటి ప్రాపంచిక దృక్పథం అయింది. దీనిపై



తిరుగుబాటు చేసిన మేరకు మాతృస్వామికం ఒక ప్రాపంచిక దృక్పథంగా రూపుదిద్దుకోవడం మొదలైంది.

ఎల్లమ్మ, పోచమ్మ, కట్టమైసమ్మ, గంగానమ్మ, పోలేరమ్మ మొదలైన సింధు నాగరికత కాలానికన్నా పూర్వపు దేవతలు మాతృస్వామికాన్ని ఒక ప్రాపంచిక దృక్పథంగా రూపొందించిన వీరమాతలు. పితృస్వామిక దృక్పథాన్ని ఎదిరించి మాతృస్వామ్య దృక్పథాన్ని, దానితోపాటు వారి ఉనికి మనదాకా చేరడానికి వీరు చైతన్యవంతంగా ఎంతో కృషి చేసారు. అలా మాతృస్వామికం ప్రపంచంలోని రెండో ప్రాపంచిక దృక్పథం అయింది.

**సంస్కృతిరీత్యా మాతృస్వామ్యం ప్రపంచంలో మొదటిది**

సంస్కృతిరీత్యా ప్రపంచంలో మాతృస్వామికం మొదటిది. పితృస్వామికం రెండవది. తెగ, జనపదాల సంస్కృతి మూడవది. ఆహార సేకరణ దశ నుండి పోడు వ్యవసాయ సంస్కృతి పరివర్తన దశ రెండవదాన్లో కొంత మూడోదాన్లో కొంత చేరుతుంది.

వ్యవసాయంవల్ల మానవ సమాజం యొక్క జీవితం స్థిరపడింది. భూమిని, నీటి వనరులను, పచ్చిక బయళ్లను, పశుపోషణను చూసుకుంటూ ఏదో ఒక చోట ఎంతో కొంతకాలం స్థిర నివాసం ఏర్పర్చుకోవలసి వచ్చింది. తద్వారా కొంత స్థిరసంస్కృతి రూపొందింది. పితృస్వామికం తన ప్రాపంచిక దృక్పథంతో తనకనువుగా విశ్వాసాలు రూపొందించి, మతంగా, సంస్కృతిగా ఆచరింపచేసింది. వ్యవసాయం పితృస్వామికం మతానికి కన్నతల్లులు, మతాల ప్రాభవం మతరహిత సంస్కృతిని తినేస్తాయి. అందువల్ల మతరహిత సంస్కృతి రూపరాహిత్యానికి లోనైంది.

**సంప్రదాయక బౌద్ధులు, అంబేద్కరిస్ట్ నవ బౌద్ధుల మధ్య తేడా ఒకటి సంస్కృతి, రెండవది దృక్పథం**

సంప్రదాయిక బౌద్ధులు బౌద్ధ అని మతంగా, సంస్కృతిగా ఆచరిస్తారు. అంబేద్కర్ బౌద్ధాన్ని తన సామాజిక దృక్పథంలో భాగంగా స్వీకరించాడు. దాంతో బౌద్ధంలో గొప్పశక్తి ప్రవేశించింది. సంస్కృతి రిజర్వులో ఉన్న శక్తి ఎపుడు దృక్పథం అనే మీటనొక్కితే అపుడు అది చైతన్యయుతం అవుతుంది.

రామజన్మభూమి వాదం ఒక సామాజిక దృక్పథం. బ్రాహ్మణీయ అగ్రకుల సంస్కృతిలో అది ప్రవేశించి పోరాట రూపాలు యిచ్చింది. దాంతో మొత్తం బ్రాహ్మణీయ సంస్కృతి ఒక ప్రాపంచిక దృక్పథంగా మారింది. బిజెపి గెలుపు హిందూ సంస్కృతియొక్క గెలుపు కాదు. అది హిందూ ప్రాపంచిక దృక్పథం యొక్క గెలుపు. హిందూ సంస్కృతిని చైతన్యవంతం చేయడంద్వారా కలిగిన గెలుపు అది.

**సంస్కృతిలో భాగంగా కొనసాగుతున్న కులం**

కులాన్ని దళితులు వేల ఏళ్ళు సంస్కృతిలో భాగంగా ఆచరించారు. బుద్ధుడు కులాన్ని సామాజిక దృక్పథంలో భాగంచేసి కులరహిత సంస్కృతి నిర్మాణంకోసం కృషి చేశాడు. మహాత్మా జ్యోతిరావు ఫూలే శ్రామికుల కుల సంస్కృతి నించి శ్రామికుల

ప్రాపంచిక దృక్పథాన్ని రూపొందించాడు. అది గొప్ప వెలుగైంది.

### సంస్కృతి ప్రాధాన్యత

నిరంతరాయతకు సంస్కృతి ఒక గొప్ప మార్గం. దృక్పథం సంస్కృతిలోని సుప్త చైతన్యాన్ని తట్టి లేపడంతో శక్తివంతమవుతోంది. మత రహిత సంస్కృతి కూడా ఉంటుంది. మతాతీత సంస్కృతి మత రూపంలో కొనసాగినపుడు మత నిర్మూలన, మత సంస్కరణల రూపంలోనే దాని సంస్కృతి, దృక్పథాన్ని మార్చడం సాధ్యపడుతుంది.

నాస్తికత్వం మతాన్ని, మత సంస్కృతిని, దృక్పథాన్ని నిరాకరించే దృక్పథం. నాస్తికత్వానికి, హేతువాదానికి సంస్కృతిగా ఎదిగే అవకాశం లేదు. ఏమంటే అవి విశ్వాసాల మీద కాకుండా సత్యం మీద ఆధారపడుతాయి.

అవి దృక్పథాన్ని విశ్వాసంగా ఆచరించినా హేతుత్వ ప్రదర్శన ఉన్నంతకాలం అవి సంస్కృతిగా విస్తరించలేవు. అందువల్ల అవి హేతుత్వ-వాద వివాద ప్రదర్శన లేని విశ్వాసాలను, ఆచరణను రూపొందించుకొన్నప్పుడు సంస్కృతిగా ప్రజల్లో విస్తరిస్తాయి.

### మతాలు, సంస్కృతి పునాదుల మీద ఆధారపడ్డాయి

బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం, మతాలు తర్కం ద్వారా విశ్వాసాల్ని అలవాట్లను సంస్కృతిని రూపొందించాయి. ఆ తర్వాత వాటిని ఆచరిస్తూ సాగారు. నాస్తిక హేతువాదులకు ఇలాంటి సంస్కృతి లేదు. నేటి ప్రజాస్వామ్య సహజీవన సంస్కృతే వారి సంస్కృతి. అనగా సాంఘిక విలువల సంస్కృతే తప్ప మతంలాగా, వ్యక్తిగత సంస్కృతి, విశ్వాసాలు నాస్తిక హేతువాదాలకు ఉండే అవకాశం తక్కువ. కబీరు, రవిదాసు, పోతులూరి వంటి భక్త కవులు, శ్రామికుల సంస్కృతిలో భాగంగా ప్రాపంచిక దృక్పథాన్ని ప్రచారం చేశారు. అందువల్ల ఆనాటి సమాజాలను ఎంతో ప్రభావితం చేయగలిగారు.

### ప్రాపంచిక దృక్పథం అంటే ఏమిటి?

మానవ సంబంధాలు ఎలా వున్నాయో, ఎలా ఉండాలో, అందుకు ఎలా ఆచరించాలో చెప్పేది ప్రాపంచిక దృక్పథం. నిర్దిష్ట స్తలకాల సగటు చైతన్యాన్ని, దృక్పథాన్ని, సంస్కృతిని, కళలను, శాస్త్రాలను కలిపి ఒక వ్యవస్థ అంటాం. మాతృస్వామ్యం, పితృస్వామ్యం, బానిస వ్యవస్థ, ఫ్యూడల్ వ్యవస్థ, పెట్టుబడిదారీ వ్యవస్థ, వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ మొదలైన పేర్లన్నీ ఆయా స్థలకాలాల ప్రాపంచిక దృక్పథాలను తెలిపే పేర్లే.

సాధారణంగా చరిత్ర అనేది సంస్కృతిగా కొనసాగుతుంది. చరిత్రలో ఒక కొత్త దృక్పథం ప్రవేశించినపుడు చరిత్ర సజీవమవుతూ, వర్తమాన రాజకీయంలో భాగమవుతుంది. జ్యోతిబాఫూలే, అంబేద్కర్, పెరియార్ రామస్వామి వర్ణ, కుల, సమాజ చరిత్రను తమ దృక్పథాల్తో మీటారు. గొప్ప విద్యుత్తు ప్రవహించింది. యథాతథవాదులు చరిత్రను ఒక సంస్కృతిగా రూపొందిస్తారు.

### ధర్మం-సంస్కృతి అంటే ఏమిటి?

సామాజికం, రాజకీయం అని పిలిచేదాన్నే మతవాదులు "ధర్మం-సంస్కృతి" అని పిలుస్తారు. మనం సంస్కృతి అని పిలిచేదాన్నే వాళ్ళు మతం అని పిలుస్తారు.



సాధారణ అంగీకృత విషయాలే సంస్కృతి. అంగీకృత విషయాలుగానే మతం ప్రతిదాన్నీ ప్రబోధిస్తుంది. దాన్ని ప్రశ్నించడం మత వ్యతిరేకం అనీ, ధర్మ వ్యతిరేకం అని తాత్వీకరిస్తుంది. ప్రశ్నించి మార్చడానికి, కొత్తది ఆచరించడానికి పూనుకుంటే మతాన్ని, సంస్కృతిని రాజకీయం చేస్తున్నారని మతవాదులు ప్రచారం చేస్తారు.

వేదాలను అంగీకరిస్తే మన సంస్కృతి, చరిత్ర అని సగర్వంగా ప్రకటిస్తారు. వాటిని ప్రశ్నించిన వేద కాలంనాటి చార్వాక లోకాయతులను గూర్చి మనం చెపితే రాజకీయం చేస్తున్నారని అంటారు. చార్వాక లోకాయతులది మన సంస్కృతిగా, మన చరిత్రగా వారు సగర్వంగా ప్రకటించలేరు.

### దృక్పథం-చైతన్యం-సంస్కృతి-కళలు-తత్వశాస్త్రాల మధ్య సంబంధం

పాలకులకు, వర్ణాధిక్యతావాదులకు ఒక దృక్పథం ఉంటుంది. దాన్ని వారు చైతన్యయుతంగా ఆచరిస్తూ సంస్కృతిని నిర్మిస్తారు. ఆ సంస్కృతిని చైతన్యంతో పనిలేకుండా ప్రజలు తమ సంస్కృతిగా అనుకరించి, ఆచరించేందుకు కృషి చేస్తారు. కళల్ని, తత్వశాస్త్రాల్ని అందుకనువుగా అభివృద్ధిపరుస్తారు.

శ్రామికులు తమ జీవన అవసరాల నుండి తమ దృక్పథాన్ని రూపొందించుకుంటారు. పెద్ద పెద్ద ఆశలుండవు. వారి దృక్పథాన్ని పాలకులు రుద్దే దృక్పథానికి, సంస్కృతికి అనువుగా మార్చుకుంటారు, కుదించుకుంటారు. పాలకుల దృక్పథాన్ని శ్రామికులు వ్యతిరేకించినపుడు అది నూతన సంస్కృతికి, దృక్పథానికి బాటలు వేస్తుంది. అది ఎదిగి ప్రభావితం చేసే మేరకు పాలకవర్గాలు, పాలక కులాలు దాన్ని తమలో కలిపేసుకుంటాయి. వర్ణాధిక్యతా వాదుల్లో, పాలకవర్గాల్లో కనబడే అభివృద్ధికరమైన అంశాలు సాధారణంగా శ్రామిక కులాల నుండి ఎత్తిపోసుకున్నవే.

### అభివృద్ధికరమైన అంశాలను స్వీకరించే క్రమాలు

పాలకవర్గాలు ప్రజల్లోని అభివృద్ధికరమైన అంశాల్ని మూడు దశల్లో స్వీకరిస్తారు. ప్రజల దృక్పథాన్ని, సంస్కృతిని దత్తత తీసుకుంటారు. ప్రజలకు నాయకులుగా వలస వస్తారు. ప్రజల సంస్కృతిని, నాయకత్వాన్ని కో-అప్ట చేసికొంటారు. ఈ మూడు మార్గాల ద్వారా పాలకులు ప్రజల్ని అనుసరిస్తూనే వారికి నాయకులుగా, ముందు నడుస్తున్నవారిగా కనబడుతారు.

### ప్రజలే ముందు నడుస్తారు

సాధారణంగా ప్రజలు ముందు నడుస్తారు. పాలకులు, అగ్రవర్ణాలు వెనక నడుస్తారు. ప్రజలు, శ్రామిక కులాలు ప్రారంభిస్తూ, నిర్మిస్తూ సాగుతారు. పాలకులు, అగ్రవర్ణాలు వాటిని క్రోడీకరిస్తూ, సమన్వయపరుస్తూ, కేంద్రీకృతం చేస్తూ తమకనువుగా కంటిన్యూటీ (నిరంతరాయత) దెబ్బ తినకుండా చూస్తారు. పర్యవసానంగా ప్రజలు నిర్మించే చరిత్ర, సంస్కృతి-పాలకులు, అగ్రవర్ణాలు నిర్మించే చరిత్ర, సంస్కృతిగా ప్రాచుర్యంలోకి వస్తుంది.

### భాషలో దృక్పథం ఉంటుంది

భాషలో దృక్పథం ఉంటుంది. ప్రతిపదం యొక్క అర్థం దృక్పథం యొక్క

వివరణే. దృక్పథాన్ని తాత్వీకరించడం నుండి పదాలు అర్థాన్ని సంతరించుకుంటాయి. సంస్కృత పదాలు బ్రాహ్మణీయ దృక్పథాన్ని తాత్వీకరించడం నుండే వాటి అర్థాన్ని సంతరించుకున్నాయి. కాలక్రమంలో వాటిని మనం తెలియకుండానే వాడేస్తాం. "తాపత్రయం" అనే పదంలో మూడు తాపాలున్నాయి. ఈ మూడు "తాపాలు" ఏవి! బహుశా, మనసా, వాచా, కర్మేణ అనే మూడు తాపాలు కలిసి "తాపత్రయం" అయింది.

"దయ్యాలు వేదాలు వల్లించినట్టు" అనే వ్యక్తీకరణలో బ్రాహ్మణవాద దృక్పథం ఉంది. వేదాల్ని బ్రాహ్మణులే వల్లించాలి. దయ్యాలు కాదు అని యిందులో ఉంది. బ్రాహ్మణులు గొప్పవారు అనే దృక్పథం యిందులో ఉంది. దీన్ని మార్క్సిస్టులు కూడా యదేచ్ఛగా వాడుతారు. వారి దృక్పథంలో బ్రాహ్మణిజం ఉంది. "దయ్యాల్లా బ్రాహ్మణులు వేదాలు వల్లిస్తారు"లో ఒక దృక్పథం ఉంది. అది చార్వాకుల దృక్పథం.

"అదేం బ్రహ్మ విద్యనా! రాకపోవడానికి" అని అనడం వింటుంటాం. బ్రహ్మ విద్య, బ్రహ్మ జ్ఞానం గొప్పది అనే దృక్పథాన్ని వాళ్ళు తెలియకుండానే ప్రచారం చేస్తున్నారు. "బ్రహ్మ విద్య అబ్బ ఎంత చెత్త-అదేం శూద్రవిద్యనా ప్రజలకు ఉపయోగపడడానికి" అనడంలో శూద్ర దృక్పథం ఉంది.

పోకడ పోయేవారిని "నాగరీకం పోతున్నడు" అని యీసడించడంలో గ్రామీణ దృక్పథం ఉంది. "అమ్మలక్కల తీరు ముచ్చట్లు పెడుతడు" అనడంలో పురుషాధిపత్య దృక్పథం ఉంది. "వాడు దొరల తీరు పోకడ పోతడు" అనడంలో పోకడ పోవడం కొన్ని కులాల హక్కు అని, శూద్రులు తలవంచుకుని పనిచేసుకుని పోవాలి అనే దృక్పథం ఉంది. "కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయి" లో శ్రామిక దృక్పథం ఉంది.

**దృక్పథం సార్వత్రికమైనది - నిర్దిష్టమైనది**

సాధారణంగా దృక్పథం సార్వత్రికమైనది. మనిషి జీవితంలో కొన్ని సార్వత్రిక అంశాలు, కొన్ని నిర్దిష్ట అంశాలు ఉంటాయి. ఆ రెండిటిని చూసే చూపును ప్రాపంచిక దృక్పథం అందిస్తుంది. అందువల్ల దృక్పథం సాధారణంగా సార్వత్రిక (యూనివర్సల్)మైనది.

నిర్దిష్ట (పర్టిక్యులర్) అంశాన్ని ఒక సార్వత్రికలో సమగ్రతలో భాగంగా పరిశీలించడాన్ని దృక్పథం నేర్పుతుంది. సమస్త నిర్దిష్టతల యొక్క ఒక సగటు ఉజ్జాయింపే దృక్పథంగా రూపు దిద్దుకుంటుంది. కిరాణా షాపులోని సరుకులు నిర్దిష్టతలైతే వాటిని ఒక సమన్వయంలో వండిన కూర. ప్రాపంచిక దృక్పథం, దృక్పథం మరింత బాగుండడానికి నిర్దిష్ట సరుకులు, వాటి పాళ్ళు, నాణ్యత, వండే తీరు, తినే నాలిక రుచికోరే స్వభావం మరింత నాణ్యంగా ఉండాలి. ఆహారం తినే తీరు ననుసరించి ఏఏ వంటలు ఎలా వండించుకోవాలో నిర్ణయించుకుంటాం. దృక్పథం తీరు ననుసరించి ఆయా నిర్దిష్ట రంగాల్లో, అంశాల్లో సంస్కృతి ఎలా ఉండాలో నిర్ణయించుకుంటాం.

**ఆచరణలేని దృక్పథం మనజాలదు**

ఆచరించే పద్ధతి లేని మరియు రూపంలేని దృక్పథం మనజాలదు. అది కేవలం ఆలోచనగా మిగిలిపోతుంది. అందువల్ల దృక్పథం స్వభావాన్ని మార్చుతుంది. పాలితుల



సంస్కృతి, శ్రామిక కులాల సంస్కృతి తనను తాను కించపరుచుకునేదిగా ఉండవచ్చు.

దృక్పథం విలువల్ని మార్చుతుంది, రూపొందిస్తుంది. తద్వారా ఒక వస్తువు యొక్క రూపం, సారం ఎలా వున్నది అలా ఉండగానే దాని విలువ, స్వభావం మార్చబడుతుంది. నువ్వెత్తుకున్నపుడు నీ పిల్లలు నీపై ఉచ్చపోస్తే నీకు ఆనందమే. మరొకరి పిల్లలు పోస్తే నీకు చిరాకు. నా పిల్లలు, పరాయిపిల్లలు అనే వివక్షతే ఒకే రూపాన్ని, స్వభావాన్ని రెండు రకాలుగా చూడ్డం నేర్పింది.

**సైన్సు ఆవిష్కరణలు దృక్పథాలను మార్చుతాయి**

సైన్సు దృక్పథాన్ని ఎదిగిస్తుంది, ప్రాచీన సంస్కృతి అవగాహనను మార్చుకోవడానికి ఉపకరిస్తుంది. సంస్కృతిలో సైన్సు దృక్పథం ప్రవేశించడాన్ని పాలకవర్గాలు, అగ్రవర్ణాలు, పురుషాధిపత్యవాదులు వ్యతిరేకిస్తారు. తమకు వ్యతిరేకమైనదాన్ని వ్యతిరేకిస్తారు. అలా సంస్కృతి మార్పుకు లోనుకాకుండా చూస్తారు. అందుకు ప్రాచీన సంస్కృతి గొప్పది అని ప్రచారం చేస్తారు. తద్వారా తమ స్వార్థ వర్గకుల లింగ ప్రయోజనాలను కాపాడుకుంటారు. వాళ్ళు ప్రాచీన సంస్కృతిలోని చార్వాకుల్ని, మాతృస్వామికాన్ని గొప్ప అని అనరు.

సైన్సు సామాజిక శాస్త్రాల్ని మార్చే మేరకు అది ఒక ప్రాపంచిక దృక్పథంగా ఎదుగుతుంది. అలా మార్చనిమేరకు అది ఒక వినియోగ వస్తువుగా మిగిలిపోతుంది. అపుడు వెనుకబడిపోయిన సంస్కృతికి, దృక్పథానికి సైన్సు ఒక సాధనంగా మారుతుంది. ఉదా॥కు బస్సు, రైలు, విమానం సైన్సు వంటి ఆసరాతో గుళ్ళు గోపురాలు వగైరా దర్శించడం పాత సంస్కృతికి సైన్సు ఒక సాధనం కావడాన్ని తెలుపుతుంది. వెనుకబడిన సామాజిక దృక్పథం సైన్సును అడ్డగిస్తుంది. కొన్ని మతాలు చాలాకాలం సైన్సును అడ్డుకున్నాయి.

పాత రాతియుగంలోని సామాజిక శాస్త్రాలు పాత రాతియుగం స్థాయిలో ఉంటాయి. సైన్సు అభివృద్ధిని అనుసరించి సామాజిక శాస్త్రాలు, కళలు, సంస్కృతి అభివృద్ధి చెందుతుంటాయి. సైన్సుకు, సామాజిక శాస్త్రాలకు అండ బీజ సంబంధం ఉంటుంది. స్త్రీ, పురుషుల కలయికతో నూతన సృష్టి జరిగినట్టుగా సైన్సు సామాజిక శాస్త్రాల సమన్వయం ద్వారా నూతన దృక్పథం, సంస్కృతి, కళలు రూపుదిద్దు కుంటాయి. వేల సంస్కృతిలో 3 వేల ఏళ్ళ నాటి వెనకబడిన సైన్సు సంస్కృతి ఉంటుంది.

సైన్సు అభివృద్ధిని అధిగమించి పురుషాధిపత్యం కొనసాగుతున్నది. పితృస్వామికం కొనసాగడానికి సైన్సులో పురుషాధిపత్య దృక్పథం కొంత ఉండడం కొంత కారణం. అంతకన్నా ప్రధానంగా పురుషాధిపత్య దృక్పథానికనువుగా సైన్సును ఒక వినియోగ వస్తువుగా మార్చివేసింది పితృస్వామికం. స్త్రీ వాదులు ఆ స్థితిని మార్చే క్రమంలో ఉన్నారు.

**సామాజిక దృక్పథం రూపొందే తీరు**

ఇలా ఒక వ్యక్తి (లేదా సామాజిక గ్రూపు, వర్గం, కులం, లింగం) లేదా ఒక జాతి, మతం, సమాజం యొక్క ఆలోచనా ధోరణిని, ప్రవర్తనను నిర్దేశించే స్థిరవిశ్వాసాల సూత్రాల విధానం తాలూకు ఒక మొత్తం, సామాజిక చైతన్యానికి సంబంధించిన సమస్త

రూపాల మూలకాలతో సామాజిక దృక్పథం రూపు దిద్దుకుంటుంది. ఇది తాత్విక, రాజకీయ, నైతిక అలంకార శాస్త్ర మరియు సైన్సు పరమైన (మరియు వర్గ, కుల, లింగ, జాతి, ప్రాంత, మత దేశ, వయస్సు, భాషాపరమైన, సంస్కృతిపరమైన) అభిప్రాయాలను తనలో యిముడ్చుకొని ఉంటుంది. ఇది ఒక మనిషికి (లేదా ఒక వర్గానికి, కులానికి, వ్యవస్థకు మొ॥ వాటికి) తమ చుట్టూ గల సామాజికపరమైన, ప్రకృతిపరమైన వాస్తవాల పట్ల ప్రత్యక్ష ఆచరణ తీరును తెలుపుతుంది.

తాత్విక అభిప్రాయాలు, స్థిర విశ్వాసాలు (కన్విక్షన్) మొ॥వి ప్రాపంచిక దృక్పథానికి పునాదిని ఏర్పరుస్తాయి. ఇది శాస్త్రజ్ఞానాన్ని (సైన్సును) ఆచరణను వ్యాఖ్యానించే ఒక తత్వశాస్త్రంగా, ప్రవర్తనా శాస్త్రంగా ఉంటూ వాటిని వస్తుగతంగా చారిత్రకంగా నిర్దేశితమైన చిత్రాన్ని వ్యక్తం చేస్తుంది.

ప్రాపంచిక దృక్పథం యొక్క కేంద్రకం తత్వశాస్త్రమే. "ఆలోచనే" వాస్తవాలపట్ల ఉండే ఆచరణను, పరిష్కారాలను బట్టి భావవాదం, భౌతికవాదంగా, సోషలిజంగా, వ్యక్తివాదం, పితృస్వామ్యంగా (మొ॥గా) వర్గీకరిస్తారు.

### ప్రశ్నలు

1. జీవితానికి ఒక సామాజిక దృక్పథం ఎందుకు అవసరం?
2. సామాజిక భౌతికవాదం అంటే ఏమిటి?
3. ఒకే ఇంట్లో అనేక దృక్పథాలు ఎలా కొనసాగుతుంటాయి? మీ కుటుంబంలో ఇవి ఎలా కొనసాగుతున్నాయి? రాయండి.
4. నేను, నా కుటుంబం అనే దృష్టి అన్ని సమస్యలను పరిష్కరిస్తుందా?
5. సామాజిక సమస్యలన్నీ వ్యక్తిగత సమస్యలే. చర్చించండి.
6. జీవితంలో స్థిరపడ్డాక సామాజిక కర్తవ్యాలు మరింత ఎందుకు పెరగాలి?
7. సమాజం కోసం బతకడం అంటే ఏమిటి?
8. సంస్కృతికి, దృక్పథానికి, మతానికి మధ్య పోలికలేమిటి? తేడాలేమిటి?



# ఆసక్తి, అవసరం, సైన్సు, కళలు ఎలా పుడతాయి?

**అన్వేషణకు అవశ్యకత తల్లి అయితే ఆసక్తి తండ్రి**

ఆవశ్యకత అన్వేషణకు తల్లి అంటారు. ఆవశ్యకత ఆసక్తిలో అనేక ఊహలు చేయిస్తుంది. ఆసక్తి నుండే సైన్సు అభివృద్ధి చెందుతుంది. దానిని అందుకోవడం ఇతరులకు అనివార్యమవుతుంది. గిరిజనులు ఈ సైన్సుపట్ల విముఖత చూపితే వారు అదే స్థాయిలో ఉంటారు. తమదైన సైన్సును ఈ సైన్సు స్థాయికి అభివృద్ధి చెందించినపుడే వారు మన స్థాయికి వస్తారు. అంతదాకా వారి యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా సైన్సు వారి జీవితంలో ప్రవేశించడం అనివార్యమవుతుంది.

ప్రఖ్యాత రచయిత మార్గింగోర్కీ ఒక డబల్ రొట్టెల బేకరీలో బాల కార్మికుడు. బేకరీ కార్మికులందరూ గోర్కీలు కాలేదు. అందరివీ ఒకే విధమైన అనివార్య పరిస్థితులు. ఆసక్తి గోర్కీని రచయితను చేసింది. ఆసక్తి ననుసరించి ఒకరు క్రీడాకారులుగా, ఒకరు తత్వవేత్తగా మారవచ్చు. ఆసక్తి, పట్టుదలల్తో దేన్నైనా సాధించవచ్చు. అందుకనువుగా పరిస్థితుల్ని సమాజం కూర్చడం, తాను సమకూర్చుకోవడం అనే దశలు కొనసాగినపుడే ఇది సాధ్యం.

దృక్పథం తనకనువైన అవకాశాలకోసం చూస్తుంది. అవకాశాలను ఏర్పరచుకునే ప్రయత్నం చేస్తుంది. స్థలకాల పరిమితులకు లోబడి దృక్పథం ఐచ్ఛికమైనది. నిర్బంధంలో సైతం తన ఆసక్తిననుసరించి కార్యక్రమాల్ని రూపొందించుకుంటారు. జైల్లో సైతం ఒకరు ముచ్చట్లు పెడితే ఒకరు పుస్తకం చదువుకుంటారు. మరొకరు క్యారమ్సు ఆడుతారు.

**సృజనాత్మకత పాత్ర**

అవకాశాలు అందరికీ సమానంగా ఉన్నప్పటికీ కొందరికే ఆసక్తి పెరగడానికి కారణం వారిలోని ఆలోచన-సృజనాత్మకత. సోషలిజం అందరికీ సమాన అవకాశాలు కల్పిస్తుంది. కాని అందరూ రచయితలు కారు. అందరూ సైంటిస్టులు కారు. వారివారి ఆసక్తి ననుసరించి ఆయా అవకాశాలను సద్వినియోగం చేసికొంటారు. అవకాశం తీగలో ప్రవహించే విద్యుత్తు. ఆసక్తి దాన్ని వాడుకునే స్విచ్చు-బల్బు.

## ఐచ్ఛికత స్థానం ఏమిటి?

ఐచ్ఛికత (ఇష్టాఇష్టాలు) ఏ దృక్పథాన్ని ఎన్నుకోవాలో నిర్ణయిస్తుంది. దృక్పథం యిష్టాయిష్టాలను నిర్దేశిస్తుంది. సిగరెట్, మద్యం తాగనేర్చేవారు అవి మంచివనుకుంటారు. ఆ అలవాటును మానేయాలనుకునేవారు వాటిని చెడ్డవి అనుకుంటారు. ఒకటే విషయం వాళ్ళ ఇష్టం అయిష్టం అనుసరించి ఇలా అనిపిస్తుంది. ఇష్టాయిష్టాలు వ్యక్తి తానున్న స్థలకాలాల్లో తన స్థానాన్ని అనుసరించి ఏర్పరచుకుంటాడు. నిర్దిష్ట స్థలకాల సామాజిక పరిమితులు వారి యిష్టాయిష్టాలకు ఆశలకు, ఆశయాలకు సరిహద్దులను ఏర్పరుస్తాయి. ఉన్నతాశయాలు, సంకల్పబలం మనిషి ఎదుగుదలకు ఉపకరిస్తాయి. అందుకే చాలామంది మహనీయులు వాస్తవాల గురించి కాకుండా ఆదర్శాల గురించి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు.

సామాజిక అస్తిత్వంలో భాగంగా వ్యక్తి చైతన్యం, యిష్టాయిష్టాలు రూపుదిద్దుకుంటాయి. వ్యక్తి చైతన్యం యిష్టాయిష్టాలు సామాజిక అస్తిత్వాన్ని మార్చుతూ అభివృద్ధి పరుస్తూ కొనసాగిస్తూ ఉంటుంది.

## సామాజిక అస్తిత్వం ఒక్కటే వ్యక్తి చైతన్యాన్ని నిర్ణయించదు ఇంకా అనేక అంశాలున్నాయి

సామాజిక అస్తిత్వం ఒక్కటే వ్యక్తి చైతన్యాన్ని నిర్ణయిస్తే అది అనివార్యత అవుతుంది. అగ్రకులం అనే సామాజిక అస్తిత్వం వారిలో అగ్రకుల చైతన్యాన్ని ఇస్తుంది. ఈ అనివార్యత సంస్కృతి రూపంలో, అనుకరణ స్థాయిలో ఉంటుంది. అనివార్యత తెచ్చే సంస్కృతిలో యిష్టాయిష్టాల ప్రమేయం గానీ, స్వీయ చైతన్యం గానీ తక్కువగా ఉంటుంది. అనివార్యస్థితి కనిష్టస్థాయి చైతన్యాన్ని అనివార్యం చేస్తుంది. అనివార్య స్థితిలో ఆసక్తి ప్రవేశిస్తే ఆ చైతన్యం ఉన్నత శిఖరాలనందుకుంటుంది. వంట వండాల్సి రావడం వంట చేయాలనే ఆసక్తి రెండూ వేర్వేరు. ఇష్టం లేని వంట ఏడుస్తూ చేస్తారు. వంట చేయడం యిష్టమైతే ఆనందంగా చేస్తారు.

## ఆసక్తిననుసరించి, అవసరాన్ని అనుసరించి దృక్పథాలు ఎంచుకొంటారు

నీ ఆసక్తి ననుసరించి నీవు ఏ దృక్పథాన్నైనా ఎన్నుకోవచ్చు. సైన్సు యుగంలో ఉంటూ వెయ్యేళ్ళనాటి బ్రాహ్మణీయ దృక్పథాన్ని ఆర్.ఎస్.ఎస్. పరివార సభ్యులు కొనసాగించే ఆసక్తితో ఉన్నారు. ఆర్.ఎస్.ఎస్. పరివారంలో కార్మికవర్గం, ఉపాధ్యాయ, ఉద్యోగ, విద్యార్థి, యువజన వర్గాలు శ్రేణులు, అగ్రవర్ణాలు, శ్రామిక కులాల వాళ్ళు మొ॥ ఎందరో ఉన్నారు. వారి సామాజిక అస్తిత్వం, మన సామాజిక అస్తిత్వం ఒకటిగా ఉన్నప్పటిగా వారా దృక్పథాన్ని స్వీకరించడంలో పనిచేసింది. (వారున్న స్థలకాలాల్తోపాటు) వారి ఆసక్తే. ఒకరు తన ఆసక్తి ననుసరించి రచయిత కావచ్చు, కళాకారుడు కావచ్చు. కళల్లో ప్రావీణ్యత ఆసక్తి ననుసరించే ఒనగూడుతుంది. ఆసక్తి ఉన్నప్పుడు అందుకు అనువైన పరిస్థితుల్ని వాతావరణాన్ని ఏర్పరచుకుంటారు.

## కళలు, సాహిత్యం అనివార్యత కాదు – ఆసక్తిలో భాగమే

కళలు విషయాన్ని ఆసక్తికరంగా చెప్తాయి. చెప్పదల్చుకున్న విషయం పట్ల ఆసక్తిని కలిగిస్తాయి. ఆసక్తి లేనివాళ్ళు సైతం అది చూసి, విని ఆసక్తిని పెంచుకోవచ్చు.



కుల వ్యవస్థ కొన్ని కులాలకు ఎన్నో అవకాశాలిచ్చి ఎన్నో శ్రామిక కులాలకు వాటిని నిరాకరించింది. అవకాశం లేక శ్రామిక కులాల ఆసక్తి భౌతిక రూపం దాల్చకుండా పోయింది. అవకాశం ఉన్న కళల్లో ఎంతో ఆసక్తితో ఉన్నతంగా ఎదిగాయి. శ్రామిక కులాలు, మనువు, బ్రాహ్మణీయ వ్యవస్థ, అగ్రవర్ణ, అగ్రవర్ణ స్త్రీలతో కలుపుకొని తొంభయిశాతం ప్రజలకు ఎన్నో అవకాశాల్ని నిరాకరించింది.

అగ్రవర్ణాలు ప్రజల మురికి బట్టలు ఉతికే అవకాశం ఉంది. లెట్రిన్‌లో బాగుచేసే అవకాశం ఉంది. మురికి కాల్వలు తీసే అవకాశం ఉంది. వారికి ఉత్పత్తుల పట్ల ఆసక్తి లేదు. ఇలాంటి సేవలపట్ల వాళ్లు అమ్మంత గొప్ప వాళ్ళని వారిలో వీటిపట్ల ఆసక్తి కలిగింప చేయాలి. అందుకు అవకాశాలతోపాటు అనివార్యతను సృష్టించాలి. ఆసక్తి పెంచడంలో విలువల మార్పు ప్రముఖపాత్ర వహిస్తుంది.

## దృక్పథం స్వయంగా స్వీకరించేదే

ఎవరైనా ఏ వర్గ దృక్పథమైనా కలిగి ఉండవచ్చు. పీడితవర్గంలో, కార్మికవర్గంలో పీడితవర్గ సంస్కృతి ఉంటుంది. సంస్కృతి ఉంటుంది. సంస్కృతి రూపంలో వారి ప్రాపంచిక దృక్పథం కొనసాగుతుంది. ప్రాపంచిక దృక్పథం స్వీయచైతన్యమైనది. అందువల్ల వర్గ దృక్పథం ఎవరైనా సరే ప్రయత్నపూర్వకంగా అలవరచుకునేదే అవుతుంది.

పీడితవర్గ దృక్పథాన్ని అలవరచుకోవడం పీడిత వర్గాలకు ఎంతో సులువు. ఏమంటే వారి జీవితానుభవాలే ఆ దృక్పథంలోని సత్యత్వాన్ని తెలియచేస్తాయి. పీడిత వర్గేతరుల్లో పీడిత వర్గ దృక్పథం వారి "ఆలోచన"లో భాగంగా రూపుదిద్దుకుంటుంది. వీరు పీడిత వర్గంగా పరివర్తన చెందే కాలంలో వీరి సంస్కృతి పీడిత వర్గమైనదిగాను, దృక్పథం పీడితపరమైనది గాను కొనసాగుతుంది. వీరు ఏ కాస్త ఏమరుపాటున ఉన్నా వారిలోని పీడితవర్గేతర అగ్రవర్ణ సంస్కృతే, పీడితవర్గ దృక్పథంగా ఆచరణలోకొస్తూ ఉంటుంది. పీడిత కులాల పీడితవర్గ వాదులపై అగ్రకులాలు రకరకాలుగా చేసే వ్యతిరేక చర్చలన్నీ వారి అగ్రకుల స్వార్థాన్ని తెలుపుతాయి.

పీడితవర్గాలు ఆరెసెస్ పరివారం వంటి పాలకవర్గాల, దోపిడీ కులాల దృక్పథం స్వీకరించినా పరివర్తన కాలంలో వారి సంస్కృతి పీడితవర్గ సంస్కృతిగానే ఉంటుంది. ఆ పీడిత వర్గ సంస్కృతి ఎపుడైనా తిరిగి పీడిత వర్గ దృక్పథంగా పరివర్తన తీసుకునే అవకాశం ఉంటుంది. అనగా ఆరెసెస్‌లోని దళితులు తిరిగి ఎపుడైనా దళితులుగా ఆలోచించే అవకాశం ఉంటుంది.

## పీడితవర్గ దృక్పథం ఎవరైనా సొంతం చేసుకోవచ్చు

పీడితవర్గ దృక్పథంలాగా పీడితకుల దృక్పథాన్ని ఎవరైనా సొంతం చేసికోవచ్చు. [illegible]త కులాల్లో ఎందరో తమ పీడితకుల దృక్పథాన్ని వదిలివేయవచ్చు. అయితే వారిలో [illegible]కుల దృక్పథం-శ్రామిక కుల సంస్కృతిలో భాగంగా స్వీకరించడం అంటే శ్రామిక కుల సంస్కృతిని కూడా స్వీకరించడం, శ్రామిక కులాలతో చైతన్యయుతంగా రక్త సంబంధాలు ఏర్పరచుకోవడం.

పీడితవర్గ దృక్పథంలో భాగంగా ఎందరో కులాంతర వివాహాలు చేసికొన్నారు. అగ్ర కులస్తులు శ్రామిక కులస్తులను పెళ్ళి చేసికొన్నారు. ఇది వారి శ్రామిక కుల దృక్పథం

అవుతుందా? కాదు.

వర్గ దృక్పథంతో చేసికొనే కులాంతర వివాహాలు వర్గ దృక్పథం నిర్మించే సంస్కృతిలో భాగంగా జరుగుతాయి. అవి శ్రామికవర్గ సంస్కృతిలో భాగం. దళిత దృక్పథంతో చేసికొనే కులాంతర వివాహాలు దళిత సంస్కృతిగా మారడం అంటే కులం అదృశ్యమైపోవడమే. అనుకరణ స్థాయిలో మెజారిటీ ప్రజలు తమ సంస్కృతిలో భాగంగా కులాంతర వివాహాలు చేసికొన్నపుడే అది దళిత సంస్కృతి నిర్మాణం అవుతుంది.

### కులాతీత వివాహాలు ఎలా సుళువు?

పీడిత వర్గ దృక్పథంలో భాగంగా కులాంతర వివాహాలు సుళువు. ఆ దృక్పథం పీడితులందరు ఒకటే అని చెప్తుంది. దళిత దృక్పథం శ్రామిక కులాలన్నీ ఒకటే అని చెప్పినా విడివిడి కులాల స్థితిని మార్చడానికి అంతకన్నా ఉన్నతమైన ఏకీకృత అంగీకృత అంశాన్ని తీసికోవాల్సి ఉంటుంది. అది పీడితవర్గ దృక్పథం కులాన్ని అదృశ్యం చేయదు. కుల నిర్మూలన దాని ప్రాపంచిక దృక్పథం కాదు. అది పీడితవర్గ సంస్కృతిలో భాగంగా కులాంతర వివాహాల సంస్కృతిని నిర్మిస్తుంది. (అది చైతన్యయుత ఆచరణ కాదు. అది ప్రేమ పెళ్ళి కావచ్చు. పార్టీ పెళ్ళి కావచ్చు)

అందువల్ల చైతన్యయుతమైన దళిత దృక్పథంతో పీడితవర్గ సంస్కృతిలో భాగంగా పెళ్ళి జరిగినపుడు దళితవర్గ ప్రాపంచిక దృక్పథం- సంస్కృతి ఒక సమగ్రతలో వికసిస్తుంది. స్త్రీ వాదులు చెప్పే "స్వయంవరం" (జెండర్‌ను ఎన్నుకునే స్వేచ్ఛ) పీడితవర్గ, దళితవర్గ దృక్పథాల్ని తమ ప్రాపంచిక దృక్పథంలో భాగంగా ఆచరించినపుడు పీడితవర్గ, దళితవర్గ, స్త్రీవర్గ ప్రాపంచిక దృక్పథం ఒకే ఒకటిగా సమన్వయం పొందుతుంది.

### జెండర్‌ను ఎన్నుకొనే స్త్రీవాద స్వేచ్ఛ

స్త్రీవాదం జెండర్‌ను ఎన్నుకునే ప్రాపంచిక దృక్పథంలో భాగంగా కులాంతర వివాహాల సంస్కృతిని నిర్మించవచ్చు. కాని అది వారిలో ఒక ప్రాపంచిక దృక్పథంగా లేనంతకాలం అందుకు గ్యారంటీ ఏమీ ఉండదు. అందువల్ల స్త్రీవాదం దళితవర్గ దృక్పథాన్ని స్వీకరించినపుడది దళితవర్గ స్త్రీవాద దృక్పథం అవుతుంది.

వర్గం అనేది ఒక ప్రాపంచిక దృక్పథం. కులం అనేది ఒక ప్రాపంచిక దృక్పథం. లింగం అనేది ఒక ప్రాపంచిక దృక్పథం. మనం సోషలిస్టు, కమ్యూనిస్టు, ప్రజాస్వామ్య ప్రాపంచిక దృక్పథాల నుండి యింకా ముందుకు సాగుతున్నాం. అయినప్పటికీ నేటికి గిరిజన ప్రాపంచిక దృక్పథం కొనసాగుతోంది. అలా వెనుకబడిపోయిన ఎన్నో ప్రాపంచిక దృక్పథాలు వర్తమానంలో కొనసాగడం మనం చూస్తూనే ఉన్నాం.

ఈజిప్టు, చైనా, గ్రీకు, బాబిలోనియా, సింధు, సుమేరియా నాగరికతలు ఆనాటి మానవ సంబంధాలను, ప్రాపంచిక దృక్పథాలను తెలుపుతాయి. చార్వా లోకాయతులు మహోన్నత భౌతికవాద ప్రాపంచిక దృక్పథాన్ని ప్రచారం చేసారు. వీరి తర్వాత నాలుగైదు వందల ఏళ్ళకు గ్రీకులోని గణరాజ్యాల్లో, బానిస సమాజాల్లో భౌతికవాద ప్రాపంచిక దృక్పథం గలవాళ్ళు ఆవిర్భవించడం మొదలైంది. ప్రాచీన గ్రీకు భౌతికవాదులు బుద్ధుని తర్వాతివారు బుద్ధుడు ఒక గొప్ప భౌతికవాది. బుద్ధుడు తన తత్వశాస్త్రాన్ని ప్రాపంచిక దృక్పథంగా మలిచాడు. ఆచరణను ప్రాథమికం చేసాడు. తద్వారా అది సంస్కృతిగా



రూపుదిద్దుకుంది.

### దృక్పథం-సంస్కృతి అన్నిట్లో కొనసాగుతున్న తీరు

మనం తినే తిండిలో, వంట వండే తీరులో, ప్రాపంచిక దృక్పథం సంస్కృతిలో భాగంగా కొనసాగుతుంది. మనం తిట్టే తిట్లలో మనకు వచ్చే కోపంలో, మనకు కలిగే ఆనందంలో, విషాదంలో, మనం మాట్లాడే తీరులో, మన నడక తీరుల్లో, మనం వేసుకునే బట్టల్లో, చేసుకునే అలంకరణల్లో, తీసుకునే వైద్యంలో, మనం నేర్చే విద్యల్లో ప్రాపంచిక దృక్పథం ఉంది. ఇలా దృక్పథం జీవితంలోని అన్ని రంగాల్లో, అన్ని శాస్త్రాల్లో, అన్ని కళల్లో ప్రవేశిస్తుంది. భిన్న దృక్పథాలు విభిన్న ఆచరణలను రేకెత్తిస్తాయి. అన్నిటా అవి తమ స్థానాన్ని ఏర్పరుచుకునే ప్రయత్నం చేస్తాయి. అపుడు ఆయా దృక్పథాలు పరస్పరం సంఘర్షిస్తాయి. కలుస్తాయి. ఒక నూతన దృక్పథం అందులోంచి ఎదిగిరావచ్చు. పాతది అలాగే కొనసాగవచ్చు.

### దృక్పథాలు కలిసినా, సంఘర్షించినా ఎంతో అభివృద్ధి...

దృక్పథాలు కల్సిపోయినపుడు, సంఘర్షించినపుడు తత్వశాస్త్రాలు "ఆలోచన" ఎంతో వేగంగా అభివృద్ధి చెందుతాయి. దానివల్ల సమస్త కళలు, శాస్త్రాలు, సంస్కృతి ఎంతో అభివృద్ధి చెందుతాయి.

దృక్పథంలో, జీవితంలో, జీవించే విధానంలో సమూలమైన, మౌలికమైన మార్పులు రావడం విప్లవం. వాటిని స్థిరీకరించి ఆచరిస్తూ పోవడం సంస్కృతి. విప్లవం కోసం నిర్మించే సంస్కృతి-విప్లవ సంస్కృతి. విప్లవ సంస్కృతి నిర్మాణం ద్వారానే విప్లవం పూర్తి అవుతుంది. సంస్కృతి నిర్మాణం లేని విప్లవం దృక్పథానికి పరిమితమైపోతుంది. అది ఆలోచనగా మిగిలిపోయి ఆచరణ శూన్యమవుతుంది. సంస్కృతి ఒక ఆచరణ. దృక్పథాన్ని ఒక అలవాటుగా ఆచరించడం సంస్కృతి.

1. సామాజిక అస్తిత్వంలో వ్యక్తి చైతన్యం వికసించడంలో ఎన్ని అంశాలు ప్రాధాన్యత వహిస్తాయి? అందులో ఆసక్తి, అవసరం, లక్ష్యాల పాత్ర ఎంత? వివరించండి.
2. కళలు, సాహిత్యం, సైన్సు, ఆసక్తిలో భాగంగా ఎలా ముందుకు సాగుతాయో వివరించండి?
3. కులాతీత వివాహాలు ఎలా సులభమో మీ అనుభవం నుండి వివరించండి.
4. దృక్పథం, సంస్కృతి అన్నిట్లల్లో ఎలా కొనసాగుతుందో మీ అనుభవాలను వివరించండి.

## మనసులోని మాట

నా ఆవేదన సిద్ధాంతాల గురించి కాదు. సిద్ధాంతాలు ఎన్నో వస్తుంటాయి. పోతుంటాయి. నా ఆవేదన మనిషి గురించి. ఒక మనిషి పుట్టి, పెరిగి, ఎదగడానికి ఇరవై, ముప్పయేళ్ళు కావాలి. అలా సమాజ సంపదతో, తల్లిదండ్రుల త్యాగాలతో ఎదిగి చైతన్యవంతులైన కార్యకర్తలు, నాయకులు, మనుషులు చనిపోవడం గురించే నా ఆవేదన.

వాళ్ళు బతికుంటే సమాజానికి ఎంతో సేవ చేస్తారు. సాయుధ పోరాట పంథాలో వెళ్ళాక వాళ్ళు బతుకుతున్న సగటు వయస్సు అయిదు నుండి ఏడేళ్ళే. కొందరు ఏడాదిలోపే చనిపోతున్నారు. కొందరు డెబ్బయ్యేళ్ళ దాకా జీవిస్తున్నారు. అందరిది కలిపి సగటు వయస్సు 5-7 సంవత్సరాలే. వీళ్ళంతా డబ్బయ్యేళ్ళ దాకా బతికితే ఒక్కొక్కరే 5×14=70 మంది ఎంత పని చేస్తారో అంత పని చేస్తారు. వారి అనుభవాలు 70 రెట్లు పెరుగుతాయి. ఇలా ఒకరు చనిపోవడం 70 మంది సామాజిక కార్యకర్తలు చనిపోవడంతో సమానం. శాంతియుత పద్ధతిలోపని చేస్తే పదివేల మంది కార్యకర్తలు తమ జీవిత కాలంలో ఏడు లక్షలమంది విప్లవ కార్యకర్తలంత పని చేస్తారు. ఆరెసెస్ కార్యకర్తలు ఇలానే శాంతియుత పంథాలో విస్తరిస్తున్నారు. మనుషులు ముందు బతకాలి. బతికి సాధించాలి. మీ పుట్టుక, పెరుగుదల సమాజం యొక్క పెట్టుబడే. సమాజానికి మీపై హక్కు ఉంది.

కొనకపోతే కన్స్యూమరిజం, పారిశ్రామిక వ్యవస్థ సంక్షోభంలో పడి అన్ని పరిశ్రమలు మూతపడతాయి. ఏడాదిలో అవుటవుతాయి. కనుక వస్తువుల వాడకం తగ్గించాలి. ప్రకృతిలో ఆనందం పొందాలి. నగరాల్లో జనాభా కేంద్రీకరణ తగ్గాలి. చిన్న పట్టణాలను అభివృద్ధి పరచాలి. పల్లెలను అభివృద్ధి పరచాలి. ఈనాటి పల్లెలు నగరానికి కాలనీల వంటివే.

పని జరగాలంటే ఎన్నో మార్గాలున్నాయి. సమాజం మారాలంటే ఎన్నో మార్గాలున్నాయి. ఉద్యమాలు అందులో ఒక మార్గం మాత్రమే. ఫైళ్ళలా పేరుకుపోయిన సమస్యలే ఉద్యమాలుగా రావచ్చు. ఫైళ్ళలా పేరుకుపోకుండా పరిష్కరించడమే మార్గం. ఉద్యమం కూడా తిరిగి ఒప్పందాల కోసమే. సంస్థకు, ఉద్యోగులకు ఒప్పందాలు. ఒప్పందాలకు ఉద్యమాలే కానక్కర్లేదు. చర్చలు కూడా మార్గమే. యాజమాన్యం మైండ్‌సెట్ మార్చడం కూడా మార్గం. ప్రభుత్వ చట్టాలు తేవడం కూడా మార్గమే. చట్టాలు తయారు చేసే వారు, అమలు జరిపే వారు మారితే సమాజాన్ని కూడా మార్చడం సాధ్యమే. అందువల్ల ఉద్యమాలే ముఖ్యం కాదు. భావాలు కూడా మనుషులను మార్చుతాయి. భావాలు ఎందరికి చేరాయి అనేది ఒక్కటే ముఖ్యం కాదు. ఎవరికి చేరాయి అనేది కూడా ముఖ్యమే. అవి ఎన్ని రకాల పరిష్కారాలను, ఫలితాలను సాధించాయి అనేది కూడా ముఖ్యం. చట్టాలు చేసే వారు, అమలు జరిపేవారు, ఉద్యమాలు నడిపే వారు స్వీకరిస్తే భావాలు ఉద్యమాలు లేకుండానే అవి సమాజాన్ని ఎంతగానో మార్చుతాయి.



# రాజ్యం అంటే ఏమిటి?

## విప్లవం అంటే సమస్త అంశాలను మౌలికంగా మార్చడమే

**రాజకీయ విప్లవం సామాజిక ఆచరణలో ఒక అంశం మాత్రమే**

రాజకీయ విప్లవం సామాజిక జీవనంలోని ఒక ఆచరణను తెలుపుతుంది. రాజకీయ శాస్త్రవేత్తలు సామాజిక ఆచరణ కేంద్రకం రాజకీయంలో ఉంటుందంటారు. సమస్త సామాజిక, సాంస్కృతిక విషయాల కేంద్రీకృత అంశమే రాజకీయం అంటారు వారు. కొందరు "రాజ్యం" కేంద్రీకృత అంశం అని వ్యవహరిస్తారు. వ్యవస్థీకృత నిర్మాణ రూపాల సమస్తాన్ని వాటి విస్తరణను, ప్రవర్తనను కార్యకలాపాలను, స్వభావాలను అన్నిటినీ కలిపి వారు రాజ్యం అని వ్యవహరిస్తారు.

వ్యవస్థీకృత నిర్మాణ రూపాలు, సమాజం, రాజ్యం యొక్క విభిన్న ఆచరణ రూపాలే. "రాజ్యాధికారం" హస్తగతం చేసికోవడం అంటే తమదైన దృక్పథంతో వ్యవస్థీకృత నిర్మాణ రూపాలను, సిద్ధాంతాలను నిర్మించుకొని ఆచరించడం.

ప్రజాస్వామిక వ్యవస్థలు ఏర్పడిన తరువాత ఓటు హక్కుతో ప్రజాప్రతినిధులను ఎన్నుకొనే క్రమం స్థిరపడిన తరువాత ఆధునిక రాజ్యాల నిర్వచనం ఆధునిక అవసరాల కనుగుణంగా రూపొందించుకోవడం జరిగింది. రాజ్యం అంటే ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సమానత్వం, మైత్రీ భావన, సంక్షేమం, అభివృద్ధి, మానవ సంబంధాలను మరింత మానవీయం చేయడం.

**ఆధునిక పౌరశాస్త్రంలో రాజ్యం అంటే**

ఆధునిక పౌరశాస్త్రంలో రాజ్యం అంటే 1. సార్వభౌమత్వం, 2. ప్రజలు, 3. ప్రదేశం, 4. ప్రభుత్వం, పరిపాలన, 5. మానసిక ఐక్యత అని పేర్కొన్నారు. ఇటీవల స్వతంత్ర ప్రదేశం, సార్వభౌమత్వం లేకపోయినప్పటికి కూడా ఆయా వర్గాలను, ప్రజలను, సమాజాలను రాజ్యంగా కూడా పేర్కొంటున్నారు. సొంత ప్రదేశం లేని పాలస్తీనాను రాజ్యంగా గుర్తించారు. పార్టీల వ్యవస్థను, విధానాన్ని కూడా చివరకు అన్ని సంస్థలను నిర్మాణాలను సైతం రాజ్యంగా గుర్తించారు. అలా వర్ణ, కుల వ్యవస్థలను కూడా రాజ్యంగా పేర్కొంటున్నారు. మతాన్ని కూడా రాజ్యంగా గుర్తిస్తున్నారు.

రాజ్యాన్ని అనేకమంది, అనేక రకాలుగా నిర్వచించారు. ఆక్టోవస్ లాగా, అమీబాలాగా రాజ్యం నిర్వచనాలు, స్వభావాలు, కార్యక్రమాలు కొనసాగుతున్నాయి.

అరాచకంలో కూడా కొనసాగేది రాజ్యమే. అది అరాచకం రూపంలో వుంటుంది.

**జ్ఞానం వ్యక్తిగత ఆస్తే, అది ఒక శక్తి, రాజ్యం కూడా**

జ్ఞానం వ్యక్తిగత ఆస్తిగా మారడం నుండి రాజ్యం రూపుదిద్దుకున్నది. శక్తియొక్క అత్యున్నత రూపమే జ్ఞానం. పితృస్వామికం రాజ్యం ఆవిర్భావాన్ని అనివార్యం చేసింది.

**విప్లవం అంటే ఏమిటి?**

విప్లవం అంటే రాజ్యం యొక్క సమస్త అంశాల్ని, రాజ్యాధికార నిర్మాణ రూపాల సారాన్ని, రూపాన్ని, సంస్కృతిని సమూలంగా మౌలికంగా మార్చడం. నూతన సంస్కృతిని అలవాటుగా ఆచరించడం. రాజ్యాధికారం చేజిక్కించుకోవడం ఒక్కటే విప్లవం కాదు. గణతెగల, జనపదాల, ప్రజాస్వామికం, బానిస వ్యవస్థలు కల్సి కులవ్యవస్థగా రూపొందించుకుంటూ పోవడం ఒక విప్లవం. పాత నిర్మాణ రూపాల రూపంలో సారంలో, పూసల్లో దారంలా మౌలికమైన మార్పును సమన్వయ పరచడం ద్వారా కులవ్యవస్థ రూపొందింది. ప్లేటో ప్రతిపాదించిన ఆదర్శ రాజ్యభావన భారతీయ సన్యాసుల, కులాల వ్యవస్థను అనుసరించి చెప్పిందే అని కొందరి అభిప్రాయం.

**సామాజిక వ్యవస్థను అనుసరించి రాజ్యం రూపొందుతుంది**

సామాజిక వ్యవస్థను అనుసరించి రాజ్యం రూపొందుతుంది. సామాజిక స్థాయిని అనుసరించి, సామాజిక చైతన్యం అనుసరించి రాజ్యం పుట్టి పెరిగి కొనసాగుతుంది. సమాజం మారితే రాజ్యం, రాజ్య స్వభావం మారుతుంది. సమాజం నిరంతరం కొనసాగుతున్నట్టుగానే రాజ్యం కొనసాగుతూ వుంటుంది. సమాజం నిరంతరం పరిణామం చెందుతున్నట్టుగానే రాజ్యం నిరంతరం పరిణామం చెందుతూ వుంటుంది.

**రాజ్యం పుట్టుక, పెరుగుదల, అదృశ్యం ఎలా జరుగుతుంది?**

సమాజం పుట్టి పెరిగి గిట్టుతుంది. రాజ్యం కూడా అందులో భాగంగా పుట్టి పెరిగి గిట్టుతుంది. రాజ్యం ఇంగితజ్ఞానం రూపంలో, సంస్కృతి రూపంలో, సంస్కారం రూపంలో ఆయా సమాజాల్లో స్వచ్ఛందంగా ఆచరించేదిగా కొనసాగుతుంది. చట్టాలు, విధి నిషేధాలు కూడా సమాజం కోరుకున్న పద్ధతిలో జీవించడానికే.

**రాజ్యంలో స్వప్రయోజనం ప్రవేశించే తీరు**

రాజ్యాధికారాన్ని అందిపుచ్చుకున్న వర్గాలు తమ స్వప్రయోజనాల కోసం కూడా, తమ స్థిరత్వం కోసం కూడా సమాజానికి అవసరం లేని వాటిని కూడా అవసరం అనే భావాలను, చట్టాలను, సంస్కృతిని, విధినిషేధాలను, శిక్షలను సృష్టిస్తుంది, పెంచిపోషిస్తుంది. అయితే మౌలికంగా రాజ్యం సమాజం మీద ఆధారపడి బతుకుతుంది.

**రాజ్యం, సమాజం, రాజ్యాధికార వాదుల మధ్య త్రికోణం**

సమాజం మీద రాజ్యం అధికారాన్ని చెలాయిస్తుంది. రాజ్యం సమాజానికి సేవ చేస్తుంది. సమాజాన్ని నడిపిస్తుంది. సమాజాన్ని రాజ్యం యొక్క ప్రయోజనాలకు అడ్డంకిగా వుండే అంశాల్లో అడ్డగిస్తుంది. రాజ్యాధికారంలో వుండేవారి స్వప్రయోజనాలకు భిన్నంగా వుంటే రాజ్యం అభివృద్ధిని, సైన్సును కూడా అడ్డగించే ప్రయత్నం చేస్తుంది. ఇలా



రాజ్యానికి, రాజ్యంలో అధికారంలో వుండే వర్గాలకు, సమాజానికి మధ్య త్రికోణ వైరుధ్యం, సమన్వయం, ఘర్షణ, మైత్రీ, పోరాటం, పరస్పర ఆధారిత స్థితి, పరస్పరం ప్రభావితం చేసుకొనే స్థితి కొనసాగుతుంది.

**రాజ్యస్వభావాలు**

రాజ్యానికి అనేక అంగాలున్నాయి. స్వభావాలున్నాయి. రాజ్యం అడవి వంటిది. అన్ని రకాల చెట్లు, పక్షులు, జంతువులు ఆ అడవిలో జీవిస్తూ ఉంటాయి. సామాజిక వర్గాలు, దృక్పథాలు, మనస్తత్వాలు ఎన్ని రకాలో అన్ని రకాల స్వభావాలు రాజ్యంలో ఏదో ఒక స్థాయిలో కొనసాగుతూ వుంటాయి.

రాజుపోయినా రాజరికం పోదు. రాజరికం పోయినా రాజ్యం పోదు. రాజ్యం పోయినా సమాజం పోదు. సమాజం పోయినా అది సృష్టించిన జ్ఞానం పోదు. అయితే సమాజం కొనసాగుతునే ఉంటుంది. సంస్కృతి, సంస్కారం, ఇంగితజ్ఞానం, వివేచన రూపంలో మానవులు స్వచ్ఛందంగా ఆచరిస్తూ వెళితే రాజ్యం అదృశ్యమవుతూ వుంటుంది. ప్రేమ, కరుణ, స్వేచ్ఛ, సమానత్వం, మైత్రి, దృక్పథంతో కొనసాగితే రాజ్యం ఆవశ్యకత తీరిపోతూ ఉంటుంది.

**సంస్కృతి విస్తరిస్తే రాజ్యం అంతరిస్తుంది**

ఉదాహరణకు ట్రాఫిక్ రూల్స్ పాటిస్తూ వెళితే ట్రాఫిక్ పోలీస్ అవసరం పెద్దగా ఉండదు. కేవలం అతడు దిక్కులు చూపించే వాడిగా సిగ్నల్ లైట్స్ లాగా పని చేయడానికి పరిమితమవుతాడు. దొంగతనం చేసే స్వభావం అంతరిస్తే తాళాల యొక్క అవసరం తీరిపోతుంది. పల్లెల్లో వ్యవసాయం పనికి వెళ్ళినప్పుడు గొళ్ళెం పెట్టి వెళతారు. తాళాలు వేయరు. గొళ్ళెం పెట్టడం కూడా మనుషుల కోసం కాదు. కుక్కలు, మేకలు, పిల్లులు వచ్చి ఇంట్లో గిన్నెల్ని, కుండల్ని పాడుచేస్తాయని, పగులకొడతాయని ఉద్దేశించే. ఇలా పల్లెల్లో తాళం అవసరం లేదు. రాజ్యం అదృశ్యమైంది.

స్కూలుకు ఆనందంగా వెళితే పిల్లలను ఉపాధ్యాయులు, తల్లిదండ్రులు ప్రోత్సహిస్తారు. పేదల పట్ల కరుణ, ప్రేమ, సమానత్వంతో ఆలోచిస్తూ వారి అభ్యున్నతికి కృషి చేస్తే అందరూ హర్షిస్తారు. సాహిత్యం, కళలు, రాజ్యం యొక్క అవసరాలను తీరుస్తుంటాయి. చట్టం విధినిషేధాలు, శిక్షలు బదులుగా స్వచ్ఛందంగా, ఆనందంగా ఆచరించటానికి కళలు, సాహిత్యం మానవ స్వభావాల్ని మలుపుతాయి.

**తాళం అవసరం ఎప్పుడు తీరుతుందో**
**రాజ్యం అవసరం అప్పుడే అదృశ్యమవుతుంది**

పట్టణాల్లో, నగరాల్లో తాళం అవసరం పెరిగింది. ఇంట్లో పెట్టుకున్న సూట్‌కేస్‌కు, బొట్టుపెట్టెకు, నగల పెట్టెకు కూడా తాళం వేసుకుంటారు. అందరూ ఉండగానే ఎవరి బీరువాకు వాళ్ళు తాళం వేసుకుంటారు. ఎవరి కంప్యూటర్‌కు వాళ్ళు పాస్‌వర్డ్‌తో తాళం వేసుకుంటారు. తాళం యొక్క అవసరం, రాజ్యం యొక్క అవసరాన్ని తెలుపుతుంది. తాళం రాజ్యానికి దాని ఉనికికి ఒక ప్రతీక. పాస్‌వర్డ్‌తో కంప్యూటర్‌కు తాళం వేసుకున్నంత మాత్రాన మిగతా కుటుంబ సభ్యుల పట్ల అపనమ్మకం ఉన్నట్టు కాదు. అందులోని డేటా పరిరక్షణ కోసం తాళం వేసుకోవడం అవసరమవుతుంది.

అమాయకత్వంతో నాలుగు స్విచ్‌లు వేస్తే డేటా మొత్తం అదృశ్యమవుతుంది. అందువల్ల పాస్‌వర్డ్‌తో తాళం వేసుకుంటారు.

ఉట్టిమీద గిన్నెలు పెట్టుకోవడం ఇంట్లో వాళ్ళకు అందకూడదని కాదు. పిల్లులు, కుక్కలు ముట్టకూడదని. అయినా ఉట్టి ఆధారంగా చీమలు చేరుతునే వుంటాయి. ఉట్టిలో పెట్టుకోవడం వంటిదే రాజ్యం. తాళం వంటిదే రాజ్యం. ట్రాఫిక్ రూల్స్ వంటిదే రాజ్యం. విద్యుత్తును సక్రమంగా వాడుకోవడం వంటిదే రాజ్యం. అజాగ్రత్తగా వుంటే విద్యుత్తు షాక్ కొట్టి చనిపోవచ్చు. సామాజిక విలువలను, సంస్కృతిని పాటించకపోతే మరణశిక్ష విధించారు. ఇలా సమాజ పరిణామాలను అనుసరించి, దృక్పథాలను అనుసరించి, సంస్కృతిని అనుసరించి రాజ్యం పుడుతుంది, పెరుగుతుంది, అదృశ్యమవుతుంది.

**అది, నేను, నేనుత్వం, నేనురాహిత్యంల మధ్య రాజ్యం**

నేను, నేనుత్వం, అహం అనేవి రాజ్యం యొక్క తొలి స్వరూపాలు. అది నేనుల మధ్య వుండే సంబంధంలో, ఐక్యతలో మైత్రీ, ఘర్షణ, రాజ్యం ఏకకాలంలో కొనసాగుతుంటాయి. రాజ్యాధికార వ్యవస్థ గుండెకాయ అయితే రాజ్యం యొక్క స్వభావము, విస్తరణ శరీరంలోని సిరలు, ధమనుల నరాల వ్యవస్థ వంటిది. రాజ్యం సమాజం అంతటా శరీరంలో అనువనువులో రక్తప్రసారం సాగుతూ నరాల వ్యవస్థ హృదయానికి, మెదడుకు చేరుతున్నట్టుగా సమాజ శరీరం అంతటా ప్రవహిస్తూ వుంటుంది. భగవద్గీతలోని అన్నీ నేనే, అన్నిట్లో నేనే, నేనే అన్నీ అయి వున్నాను అనే మాటలు రాజ్యానికి వర్తిస్తాయి.

**యోగా, ధ్యానం, నేనురాహిత్యం, రాజ్యం అదృశ్యం**

నేను అనేది యోగా ధ్యానం ద్వారా నేను రాహిత్యానికి చేరుకోవడం ద్వారా రాజ్యం అదృశ్యమవుతుంది. నేనుత్వంతో వున్న వారు నేను రాహిత్యాన్ని సాధించిన వారి పట్ల రాజ్యంగా కొనసాగుతారు. తద్వారా నేనురాహిత్యం కూడా తిరిగి నేనుత్వాన్ని సంతరించుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. ఇలా చర్య, ప్రతిచర్యల్లో ప్రతిచర్యకు అతీతంగా చర్య జరిపే క్రమం సాధ్యం కానప్పుడు అనుక్షణం ప్రేమ, కరుణ, మైత్రీ, సమానత్వం స్థానంలో రాజ్యం యొక్క ఆధిపత్యం నేను రూపంలో ఉనికిలోకి రావడం అనివార్యమవుతున్నది. అందువల్ల మనస్తత్వ శాస్త్రం, మానవ స్వభావ శాస్త్రం, సామాజిక శాస్త్రాలు రాజ్యం, రాజనీతి శాస్త్రాలు, రాజకీయాలు, సాహిత్యం, కళలు, సంస్కృతి ఒక సమన్వయంలో, సంశ్లేషణలో ఒక్కటి కావల్సిన అవసరం ప్రతి సామాజిక దశలో ఉత్పన్నమవుతూ వుంటుంది. దీనిని సాధించినప్పుడు ఘర్షణ పోరాటం స్థానంలో మైత్రీ, కరుణ, ప్రేమ స్వేచ్ఛ, సమానత్వం సహజీవనతత్వం, సామాజిక విలువలుగా, సంస్కృతిగా కొనసాగుతుంటాయి.

**రాజ్యం తన అస్తిత్వాన్ని తాను సృష్టించుకునే తీరు**

సమాజానికి రాజ్యం అవసరం లేదు. కాని రాజ్యానికి సమాజం అవసరం. తన అధికారాన్ని, సేవను కొనసాగించడానికి సమాజం మీద ఆధారపడుతుంది రాజ్యం. రాజ్యం తన అవసరాల కోసం పన్నులను విధిస్తుంది. చట్టాలను చేస్తుంది. సంస్కృతిని, కళలను, సైన్సును నిర్దేశిస్తుంది. పన్నులు, రద్దు చేయాలా అని అడిగితే ప్రజలందరూ



అవునని చేతులెత్తుతారు. పన్నులు లేకపోతే ప్రభుత్వ యంత్రాంగం సాగదు. రాజ్యం నడవదు. అందువల్ల రాజ్యం పన్నులను తప్పకుండా వసూలు చేస్తుంది. ఇలాగే అన్ని రంగాల్లో రాజ్యం తన అస్తిత్వాన్ని సమాజంలో తనకు తాను సృష్టించుకుంటుంది.

ఇలా సమాజంలో రాజ్యం యొక్క అవసరాన్ని రాజ్యం తనకు తానుగా సృష్టించుకుంటుంది. రాజ్యం లేకపోతే ఎలా బతకగలం అనే భయాన్ని, ఆందోళనను సృష్టిస్తుంది రాజ్యం. భద్రతను ఇచ్చే పేరిట ఆ రాజ్యం అభద్రతను సృష్టిస్తూ భద్రతను హామీ ఇస్తుంది, ఆ హామీని నెరవేర్చుతుంది.

రాజ్యం ద్వారా చెలాయించే అధికారం తన ఖర్చుల కోసం పన్నులు వసూలు చేస్తుంది. సైన్యాన్ని ఏర్పర్చుకుంటుంది. మంత్రాంగాన్ని ఏర్పర్చుకుంటుంది. తన భద్రత కోసం గూఢచార వ్యవస్థను ఏర్పర్చుకుంటుంది. ప్రజల కోసం చెరువులను నిర్మిస్తుంది. కాలువలను తవ్విస్తుంది. పంటలో భాగాన్ని పన్నుగా తీసుకుంటుంది. లోహాలను వెలికి తీయడంలో ప్రోత్సహిస్తుంది. కుటీర పరిశ్రమ ఉత్పత్తులను, అంగాలలో, ఇతర రాజ్యాలలో అమ్ముకోడానికి ప్రోత్సాహాన్ని, రక్షణను కల్పిస్తుంది.

సమాజం ఎంత ఎదిగితే రాజ్యం దాని అధికారం, అవసరం అంతగా పెరుగుతుంది. రాజ్యం ఎంత కేంద్రీకృతమైతే సమాజం సామ్రాజ్యంగా ఒకే గొడుగు కిందకి వస్తుంది.

వ్యాపారం విస్తరించి రాజ్యాల మధ్య రాకపోకలు స్థిరపడ్డాయి. దారులు ఏర్పడ్డాయి. సంస్కృతుల మధ్య అవగాహన, ఆదాన్ ప్రదాన్ ఇచ్చి పుచ్చుకోవడం పెరిగింది. ఇండియా చైనా మధ్య సిల్క్‌వే, పట్టుదారి ఏర్పడింది. బౌద్ధం చెప్పిన శాంతి అహింస, కరుణ, మైత్రి, స్వేచ్ఛ సమానత్వం వల్ల గణాలు, తెగలు, జనపదాలు ఒక సమాఖ్యగా, సహజీవనంగా ఏర్పడ్డానికి మనుషుల మధ్య అపోహలు తొలగి పరస్పరం ఆత్మీయత, నమ్మకాలు పెరగడానికి ఉపయోగపడింది. ఆ క్రమంలో దారి దోపిడీల భయం తగ్గింది. రాజులు, రహదారులు వేశారు. దారుల వెంట చెట్లు నాటించారు. బావులు తవ్వించారు. విహారాలు కట్టించారు. విద్య నేర్పించారు.

**కుటుంబ వ్యవస్థ, వేశ్యా వ్యవస్థ సమాంతరంగా కొనసాగాయి**

గణతెగ వ్రాత, జనపద సమాజాలు రక్తసంబంధాలను, నాటి కుటుంబ వ్యవస్థను నిర్మించుకున్నారు. గణపెద్దలు వీటికి సారథ్యం వహించారు. రాజ్యం, రాజరికాలు వీటిలో పెద్దగా జోక్యం చేసుకోలేదు. కానీ తనకు నచ్చిన స్త్రీలను రాజభవనాల్లో రాణులుగా, ఉంపుడుకత్తెలుగా చేర్చుకున్నారు. రాజరికాల్లో రాజ్యం, సామ్రాజ్యం విస్తరణ పెరిగి, రాజధాని పెరుగుతున్న కొద్దీ స్త్రీలకు స్వేచ్ఛ కూడా పెరిగి వ్యభిచారం, వేశ్యా వ్యవస్థ పెరిగింది. రాజులు వేశ్యలపై పన్నులు వసూలు చేసుకొని వారికి రక్షణ కల్పించారు. ఆమ్రపాలి అనే వేశ్య గొప్ప సంపన్నురాలు. ఆమె బౌద్ధాన్ని స్వీకరించి తన ఆస్తినంతటిని బౌద్ధ ఆరామాలకు, విహారాలకు ఇచ్చివేసింది.

ఇలా రాజరికాల్లో వేశ్యా వ్యవస్థ, కుటుంబ వ్యవస్థ ఏకకాలంలో కొనసాగాయి. రాజులు వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను ప్రజలందరూ ఆచరించే కట్టడి చేయాలని కొన్ని వర్గాలు వత్తిడి చేశాయి. అందుకు అనేక సిద్ధాంతాలు చేశాయి. వాటి కోసం కొందరు

రాజులు వత్తిడి చేసే కట్టడి, చట్టాలు చేశారు. కొందరు చేయలేదు.

### గ్రామం ఒక స్వతంత్ర రాజ్యంగా కొనసాగిన తీరు

గ్రామీణ సమాజం తమ రక్తసంబంధాలను, కులవృత్తులను నిర్మించుకొని వాటి పరిమితుల్లో బతకడానికి నిర్మించుకుంది. దాన్ని వ్యతిరేకించిన వారిని గ్రామ సమాజమే కట్టడి చేసింది. రాజరికం కూడా అందుకు మద్దతు ఇచ్చింది. అలా రాజ్యం ద్వారా వర్ణ వ్యవస్థ కులాలు, కుల వృత్తులు, గ్రామీణ స్వయం పోషక ఆర్థిక వ్యవస్థ స్థిరపడింది. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ స్వయం సంపూర్ణంగా కొనసాగడంతో ఏ రాజు వచ్చినా, ఏ రాజు పోయినా వారికంత పట్టింపు ఉండేది కాదు. అనగా రాజ్యం గ్రామ సమాజంలో పుట్టి స్వతంత్రంగా పెరిగి గ్రామానికే పరిమితమై కొనసాగింది. గ్రామంలోని రాజ్య వ్యవస్థ రాజరికం చెలాయించే రాజ్యాల స్వభావానికి, అవసరాలకు అతీతంగా, స్వతంత్రంగా కొనసాగింది. దాంతో రాజరికాలు గ్రామీణ సహకారం పూర్తి స్థాయిలో అందక యుద్ధాల్లో ఓడిపోతుండేవి. విదేశీ దండయాత్రలకు ఓడిపోవడానికి గ్రామీణ స్వయం సంపూర్ణ స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ ప్రధాన కారణం అని చరిత్రకారుల అభిప్రాయం. ఇవాళ కుటుంబం కూడా కుటుంబ పరిధిలో వ్యక్తిగతంగా అలసించే తీరును పెంచుతున్నది.

### ప్రజాస్వామ్య వ్యవస్థలో మౌలికంగా మారిన రాజ్యం

పరిపాలన ప్రజాస్వామ్య పద్ధతిలోకి మారాక వేలాది మంది ప్రజాప్రతినిధులు రూపొందారు. ఇందులో గత సమాజాల్లోని అన్ని రకాల వాళ్లు వున్నారు. ప్రజలు అన్ని సమస్యల పరిష్కారానికి ప్రభుత్వం పూనుకోవాలని కోరుకోవడంతో ప్రభుత్వ శాఖలు విస్తరించాయి. అన్ని రంగాల్లో ప్రభుత్వ అజమాయిషి, రాజ్యస్వభావం చొచ్చుకు పోయింది. రాజ్యం యొక్క అధికారం కేంద్రీకృతమైంది. పూర్వం చెరువులోంచి స్వేచ్ఛగా నీళ్లు తెచ్చుకునే వారు. ఇంట్లో దీపం పెట్టుకునే వారు. ఈ రెంటినీ రాజు అడ్డుకోలేదు. ఆపలేదు. కాని ఇప్పుడు నల్లా నీళ్ళు, విద్యుత్ నియంత్రణ ద్వారా గ్యాస్ సిలిండర్ల సప్లయ్ నియంత్రణ ద్వారా రాజ్యం నీ ఇంటిలోని నీళ్ళను దీపాన్ని వంటను నిర్దేశిస్తున్నాయి. ఇంటిలోకి అలా మునుపు ఎన్నడూ లేని విధంగా రాజ్యం ప్రవేశించింది.

### రాజ్యం సమాజానికి ఒక శరీరం

ఇలా రాజ్యం రాజరికం సమాజం యొక్క రాజధాని కేంద్రంగా, పరిపాలనా కేంద్రంగా రూపుదిద్దుకుంది. శరీరంలో తల భాగంగా, హృదయంగా శరీరంలోని అణువణువులో విస్తరించే ప్రాణశక్తిగా, రక్తంగా మారింది. కేంద్ర, రాష్ట్ర ప్రణాళికా సంఘాలు ప్రభుత్వ శాఖలు, వివిధ పథకాలు పరిపాలన ద్వారా ప్రజలు కోరుకొనేవి పరిపాలకులు, ఇతర సామాజిక వర్గాలు కోరుకొనేవి అన్నీ అన్ని రకాలుగా ఏకకాలంగా కొనసాగుతున్నాయి. ఇలా రాజరిక రాజ్యం ప్రజా రాజ్యంగా రూపొందింది. ప్రజాస్వామిక పరిపాలనగా సామాజిక సంక్షేమం ధ్యేయంగా సామాజిక అభివృద్ధి లక్ష్యంగా ప్రకటించుకుంటూ ముందుకు సాగుతున్నది.

### రాజ్యాధికార వాదంలో ఎన్ని రకాల వాళ్ళున్నారు?

రాజ్యాధికారంలోకి రావాలి దాన్ని చేజిక్కించుకోవాలి అనే శక్తులు సమాజంలో



ఎన్నో వున్నాయి. వ్యాపార, పారిశ్రామిక వర్గాలు, భూస్వాములు, పాతరాజులు, జమిందార్లు, వర్ణ వ్యవస్థ ఆధిక్యతా వాదులు, సంపన్నులు, కాంట్రాక్టర్‌లు, పరిపాలనా అధికారులు, గూండాలు, బ్లాక్‌మార్కెటీర్‌లు, మాఫియాలు అండర్‌గ్రౌండ్ డాన్‌లు, మహిళలు, బిసి, ఎస్సీ, ఎస్టీలు, మైనార్టీలు, కార్మికులు, వృత్తిరాజకీయ వాదులు మొదలైన ఎన్నో రకాల వాళ్ళు ఈ గోదాలో వున్నారు. రాజకీయ అధికారం చేజిక్కించుకునే గోదాలో వున్న వారందరినీ చూసి కొందరు వారి పట్ల వ్యాఖ్యానాలు అభిప్రాయాలు తెలియజేస్తుంటారు. సూచనలు ఇస్తుంటారు. దీన్నే మేధోరంగం అంటారు. ఈ రాజకీయాలను ప్రభావితం చేసే వారిలో మీడియా, ఎలక్ట్రానిక్ మీడియా, సాహిత్యం, కళలు కూడా వున్నాయి.

### అన్ని తాళాలను తెరిచే తాళం చెవి రాజ్యాధికారం అన్న అంబేద్కర్

రాజ్యాధికారం ద్వారా అన్ని సమస్యల తాళాలను తెరిచే తాళం చెవి లభిస్తుంది అన్నారు అంబేద్కర్. అందుకని డబ్బున్న వాళ్ళు డబ్బులు వెదజల్లి ఓట్లను కొని అధికారంలోకి వస్తుంటారు. పారిశ్రామిక వేత్తలు, కాంట్రాక్టర్లు, వ్యాపారస్తులు తమ ప్రయోజనాల కోసం తాము నిలబడడమో, ఇతరులకు మద్దతిచ్చి గెలిపించడమో చేస్తుంటారు. మతవాదులు అధికారానికి వీటన్నితోపాటు మతతత్వాన్ని కూడా ఉపయోగించు కొని ఓట్లను వేయించుకుంటారు. కులం ఆధారంగా ఓట్లు వేయించుకోడానికి మరికొన్ని వర్గాలు కృషి చేస్తుంటాయి. ప్రాంతీయ వాదులు ప్రాంతీయ సమస్యలను ముందుకు తెచ్చి ఓట్లు వేయించుకుంటారు. రాజకీయ పరిపాలనా వాదులు ఓట్ల రాజకీయాల్లో పాల్గొనకుండా ప్రభుత్వ ఉద్యోగాల ద్వారా ఉద్యోగ సంఘాల ద్వారా ప్రభావితం చేస్తుంటారు. అధికారం చెలాయిస్తుంటారు. వామపక్షాలు కార్యకర్తలు, సిద్ధాంతాలతో పాటు మిగతా వాటిని కూడా ఉపయోగించి అధికారంలోకి రావాలని చూస్తుంటారు.

విప్లవవాదులు వర్తమాన, రాజకీయ పరిపాలన వ్యవస్థలో పాల్గొనకుండా విడిగా ఉండిపోతున్నారు. వీరికి రాజకీయ అధికారం ద్వారా పరిపాలన చేయాలనే లక్ష్యం వర్తమానంలో లేదు. ప్రజల్లో తమ నిర్మాణం పెంచుకోవడానికి పరిమితం. ఇలాంటి పార్టీలు పరిపాలన తాలూకు రాజ్యం కోసం ప్రయత్నించడం లేదు. అందువల్ల వారి అవగాహన, కార్యక్రమాలు చర్యలు ఎంత సమాజానికి సంబంధించినవైనప్పటికీ రాజకీయాలుగా కాకుండా శాంతిభద్రతల చర్చగా కుదించుకుపోతున్నాయని కొందరి అభిప్రాయం. వాళ్ళు రేపయినా ప్రజల్ని తమ నిర్మాణంలోకి తెచ్చుకున్నాక కూడా ప్రజల ఓట్లతో గెలుపొంది అధికారంలోకి రావల్సిందే. ఆ విశ్వాసం కోల్పోతే అధికారం కోల్పోతారు. రష్యాలో వామపక్షాలను ఓడించి ఇతరులను గెలిపించుకున్నారు.

### రాజ్యం పోయినా దాని అనుభవం కొనసాగుతుంది

రాజ్యం పోయినా సమాజం పోదు. సమాజం పోయినా అది సాధించిన అనుభవం గడచిన దశలు, జ్ఞానం పోదు. కనీసం వాటి ఆనవాళ్ళయినా మిగిలి ఉంటాయి. పిరమిడ్లు, సింధునాగరికత, బౌద్ధ ఆరామాలు, బౌద్ధ విహారాలు ఒకనాటి సామాజిక దశలను, జ్ఞానానికి ఆనవాళ్ళను తెలుపుతాయి. రష్యా విప్లవ సమాజం పోయినా దాని

అనుభవం, జ్ఞానం కొనసాగుతూనే ఉంటుంది. ఏ నియంతృత్వమైనా మంచిది కాదని వదిలించుకొని సోవియట్‌యూనియన్ ప్రజలు 13 దేశాలుగా విడిపోయి ప్రజాస్వామ్యానికి, స్వేచ్ఛకు సమానత్వానికి చేరుకున్నారు. ఇలా గడిచివచ్చిన సామాజిక దశల్లో కొనసాగిన రాజ్యం తీరుతెన్నులను, వ్యవస్థలను సంక్షిప్తంగా పరిశీలిద్దాం.

### ఆయా కాలాల్లో కొనసాగిన సోషలిజం వ్యవస్థలు

గణతెగలు, జనపదాల్లో ఒక స్థాయి ప్రజాస్వామ్యం, సోషలిజం ఉండేది. బానిస వ్యవస్థల్లో బానిస, యజమానుల మధ్య మాత్రమే ప్రజాస్వామ్యం ఉండేది. నేడు రుషులుగా పేర్కొనే చాలామంది బానిస యజమానులే అని మరో మాటలో చెప్పాలంటే బానిస యజమానులను మన దేశంలో రుషులని అంటారని రాహుల్ సాంకృత్యాయన్ అన్నారు.

### ఋషులను ఎలా అర్థం చేసుకోవాలి?

రుషులు వర్ణవ్యవస్థ అని పిలిచే వ్యవస్థలో అత్యున్నత స్థాయి బానిస యజమానులని అతని భావం. వీరు తత్వవేత్తలు, ప్రాపంచిక దృక్పథ నిర్మాతలు, అదే సమయంలో బానిస యజమానులు, అంతకుముందు వీరు గణపెద్దలు. ఆచరణతో, బ్రహ్మజ్ఞానంతో ఎవరైనా బ్రాహ్మణులు కావచ్చు. అంటే ఎవరైనా గణపెద్దలుగా, రుషులుగా మారవచ్చు. బానిస యజమానులు కావచ్చు అని అర్థం. వేదాల్లో, పురాణాల్లో ఇలాంటి కథలు ఎన్నో దొరుకుతాయి. జన్మన జాయతే శూద్ర, పుట్టుకతో అందరూ శూద్రులే. చేసే కర్మతో ఇతర వర్ణాలుగా మారతారు అని ఒక శ్లోకం ఉంది. అలా వర్ణ వ్యవస్థ ఏర్పడింది. అన్ని తెగల వాళ్ళు, అన్ని రకాల వాళ్ళు ఈ నాలుగు వర్ణాల వ్యవస్థలోకి మార్చడానికి పుట్టకతో అందరూ శూద్రులే అనే సిద్ధాంతం పుట్టింది.

బానిస యజమానులయ్యే అవకాశం క్షత్రియులకు కూడా ఉంటుంది. వ్యవసాయం చేసే వైశ్యులు వ్యాపారులుగా మారే క్రమంలో వారు కూడా బానిస యజమానులయ్యారు. గణతెగల, జనపదాల నిర్మాణంలోని రక్తసంబంధాలు, సంస్కృతి, వ్యవస్థ నిర్మాణ రూపాలను పై మూడు వర్ణాల బానిస యజమానుల వ్యవస్థ తాలూకు ఇంజనుకు రైలు డబ్బాలల్లా అతికించారు. కులవ్యవస్థ యిలా సమన్వయంలో రూపొందింది. తద్వారా పాత నిర్మాణ రూపాలు, సంస్కృతి స్వభావాలు మౌలిక మార్పులకు లోనై వర్ణవ్యవస్థ అని పిలిచే బానిస వ్యవస్థ కులవ్యవస్థగా పరిణామం చెందింది.

### రాజ్యంగా స్థిరపడి ఏకు మేకైన వర్ణ కుల వ్యవస్థలు

ఏకు మేకై భారతీయ సామాజిక వ్యవస్థలో వర్ణం, కులం, వ్యవస్థలు రాజ్యంగా స్థిరపడ్డాయి. గణ, తెగలు, జనపదాల మధ్య కలిసి మెలిసి బతికే సమాజంగా పొందిక కుదర్చడానికి, ఎదగడానికి వర్ణ వ్యవస్థ సిద్ధాంతాన్ని కొందరు రూపొందించారు. తరువాత రక్తసంబంధాలను పరిమితం చేసుకోవడం ద్వారా, కుల వృత్తులను పరిమితం చేసుకోవడం ద్వారా వర్ణ కుల వ్యవస్థలో ప్రాచీన రాజ్య వ్యవస్థలుగా స్థిరపడి కొనసాగుతున్నాయి.



### గణతెగలు, జనపదాల నుండి రాజరికాలు ఏర్పడిన తీరు

గణతెగలు, జనపదాలు రాజరికంగా రూపుదిద్దుకునే క్రమానికి చెంఘిజ్‌ఖాన్ చరిత్ర తాజా ఉదాహరణ. అంతకన్నా తాజా చరిత్ర ఏమంటే మన దేశంలో గోండు గిరిజన గణతెగలు, జనపదాలు రాజరికంగా రూపొంది చంద్రపూర్, నాగపూర్ రాజధానులుగా మూడు వందల ఏళ్ళు రాజ్యం ఏలారు. గోండు రాజరికాన్ని, రాజవంశాల్ని స్థాపించారు.

మాతంగులు (మాదిగలు) హర్షవర్ధనుని కాలందాకా దేశమంతటా రాజ్యాలు ఏలి రాజరికాల్ని, రాజవంశాల్ని స్థాపించారు. ఏనుగుల్ని మచ్చిక చేసికొని రవాణాకు, యుద్ధాలకు ఉపయోగించారు. వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ నిర్ణాణాలను వ్యతిరేకిస్తూ వీరు బౌద్ధం స్వీకరించి మనుషులంతా ఒక్కటే అందరూ సమానులే అని ఆచరించారు. వీరి ప్రాపంచిక దృక్పథాన్ని ఓడించడానికి వర్ణవాదులు బౌద్ధులు అవర్ణులన్నారు. వర్ణ సిద్ధాంతాన్ని అంగీకరించక పోవడంతో బౌద్ధుల్ని అవర్ణులుగా పిలిచారు.

మాల మాదిగలు, మరికొన్ని గిరిజన గణతెగల జనపదాలు, శూద్రకులాలు వర్ణవ్యవస్థ దృక్పథాన్ని వ్యతిరేకించారు. వారు సర్వస్వతంత్ర దృక్పథంతో ప్రజాస్వామిక సంస్కృతిని నిర్మించారు. దాంతో వారు నిర్మించిన రాజరికాలు గొప్ప ప్రతిష్టను పొందాయి. ఎన్నో కులాలను కలిపి నేడు శూద్రులు, హరిజనులు, దళితులు అని పిలుస్తున్నట్టుగా నాడు వారందర్ని కలిపి పంచమ వర్ణంగా పిలిచారు.

భారతం గణతెగలు జనపదాల్లోని ప్రజలు, రాజరికంలోకి కొందరు, శూద్ర కులాల్లోకి కొందరు పోలరైజేషన్ జరిగే క్రమాన్ని వర్ణ, కుల దృక్పథాల ద్వారా పోలరైజేషన్ చేసే క్రమాన్ని స్పష్టం చేస్తుంది. భీష్ముని కాలంనాటికి అంత బలంగాలేని వర్ణకుల వ్యవస్థ కర్ణుని కాలంనాటికే స్థిరీకరణ పొందడం ఆశ్చర్యకరం. మరోవైపు భీముడు, అర్జునుడు, కృష్ణుడు గిరిజన తెగల స్త్రీలను వివాహం చేసుకోవడం ద్వారా వర్ణవ్యవస్థ రూపొందని క్రమమూ కన్పిస్తుంది.

### వర్ణకుల వ్యవస్థలు రాజరిక, సామ్రాజ్యాల అవసరాలను తీర్చడం కోసం ఏర్పడ్డాయి

మొదట వర్ణకుల వ్యవస్థలు తమ వెలుపలి వారిని సామదాన భేద దండ, ఐక్య పంచవిధ ఉపాయాల ద్వారా తమ పరిధిలోకి తెచ్చుకునే ప్రయత్నం చేసాయి. వాటికి వెలుపలే ఉండి తమదైన బౌద్ధ ప్రాపంచిక దృక్పథంతో ప్రతిష్ట సాధించుకున్న రాజరికాలవల్ల పంచమ వర్ణానికి ఎంతో గౌరవం లభించింది. బౌద్ధమే అవర్ణం, అవర్ణులు బౌద్ధులు. అందువల్ల గిరిజన, గణతెగల్ని వర్ణ దృక్పథం అవర్ణులని వర్గీకరించలేకపోయింది. గణతెగలు, జనపదాలు, ఒకే వర్గంగా, ఒకే కులంగా చాలాకాలం కొనసాగాయి. చాలాచోట్ల యిప్పటికీ కొనసాగుతున్నాయి. వర్ణకుల వ్యవస్థలు రాజరిక, సామ్రాజ్యాల అవసరాలను తీర్చడం కోసం ఏర్పడ్డాయి. రాజ్యంగా స్థిరపడ్డాయి.

గణతెగల జనపదాల రాచరిక వ్యవస్థల్లో అన్ని తెగల, గణాల, కులాల పెద్దలు తెగశ్రేష్టులుగా, కులశ్రేష్టులుగా పరిగణించబడిన కాలంలో క్రమంగా వారు శ్రేష్టిగా శెట్టిగా, సేటుగా, వైశ్యులుగా, వ్యాపారులుగా కూడ రూపుదిద్దుకున్నారు. తామున్న

పరిసరాల్లో ఉండే ప్రకృతి జంతు వనరుల ననుసరించి కొందరు ఏనుగుల్ని మచ్చిక చేయగలిగారు. కొందరు మేకల్ని మచ్చిక చేయగలిగారు, కొందరు పందుల్ని, గాడిదల్ని, కోళ్లను మచ్చిక చేయగలిగారు. కొందరు గొర్లను మచ్చిక చేయగలిగారు, కొందరు జింకల్ని మచ్చిక చేయగలిగారు. కొందరు తేనె తీయడం, కాయలేరడం ద్వారా ఉత్పత్తుల్ని సేకరించగలిగారు.

ఇలా విస్తరించిన తెగల కులాల ప్రత్యేక నైపుణ్యాన్ని, వారు సేకరించిన ఉత్పత్తుల్ని, మచ్చిక చేసిన జంతువుల్ని, పక్షుల్ని, స్వయంగా చేసిన ఉత్పత్తుల్ని, కులవృత్తుల ఉత్పత్తుల్ని, యితర ఉత్పత్తులతో ఇతర కులాల తెగల్తో వస్తు మారకం చేసుకొనే చొరవ, అధికారం, ధర నిర్ణయంకోసం కులపెద్దలు ట్రేడ్ యూనియన్ నాయకులుగా, పరిశ్రమ యాజ మాన్యంగా ఏకకాలంలో పనిచేయడం నుండి వైశ్యవర్ణంగా రూపుదిద్దుకోవడం జరిగింది.

## గణపెద్దలుగా రుషులు

రుషులు తొలిదశలో గణ పెద్దలుగా ఉండేవారు. అన్ని గణాల గణ పెద్దల నుండి రుషులుగా, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య అనే మూడు వర్ణాలుగా బానిస యజమానులుగా రూపుదిద్దుకోవడం ప్రారంభమైందని డి.డి. కోశాంబి, శరద్‌పాటిల్ పరిశోధనలు వేదపురాణ గాథలతోపాటు తెలుపుతున్నాయి.

జైనం నుండి మారి శైవం స్వీకరించినవారు కోమట్లయ్యారని, బౌద్ధంలోనే ఉండిపోయినవారు దళితులుగా మిగిలిపోయారని కొందరి విశ్వాసం. ఇందుకు వాళ్ళు దళితుల, వైశ్యుల ఆంత్రోపాలజి పోలికల్ని చూపుతుంటారు. దీన్ని విశ్వసించడం కష్టం.

ఆ క్రమంలో కులవ్యవస్థ నిర్మించిన సంస్కృతి, ప్రాపంచిక దృక్పథాలకు భిన్నంగా చరిత్రలో ఎందరో గిరిజనులు, శూద్రులు వైశ్యులయ్యారు. రాజులయ్యారు. రాజరికాలు స్థాపించారు. తర్వాత క్షత్రియులుగా ముద్రలు వేయించుకున్నారు. లేదా ముద్రలు వేయబడ్డారు. గిరిజనుల్నుంచి, శూద్రుల్నుంచి, అతిశూద్రులనుంచి ఎందరో రాజులు వచ్చారు. ఎన్నో రాజరికాలు, రాజవంశాలు వెలిశాయి. క్షత్రియులుగా ముద్రవేయించుకున్న గిరిజనులు మరో పైమెట్టు అయిన బ్రాహ్మణులుగా ముద్ర వేయించుకోవడం కోసం జరిగిన ప్రయత్నమే రాజర్షి అయిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షిగా గుర్తింపు పొందడంలో ఉంది.

## వర్ణ కుల వ్యవస్థ స్థిరపడిపోయి...

అయితే రాజరికాలు, రాజవంశాలు ఎన్ని కులాల నుండి, ఎన్ని తెగల నుండి వచ్చినా రాజ్య స్వభావం మౌలికంగా కులవ్యవస్థ దృక్పథం నుండి నిర్మితమైందిగానే కొనసాగింది. తామూ క్షత్రియులమనే ముద్రలు వేయించుకునే ప్రయత్నం అందులో భాగమే.

విశ్వామిత్రుడు రాచరిక రుషినుండి బ్రహ్మర్షిగా మారడంకోసం చేసిన ప్రయత్నం మౌలిక విప్లవం కాదు వర్ణవ్యవస్థ నిర్మించిన సాంస్కృతిక విలువలు తానూ పొందాలని చేసిన ప్రయత్నం. ఆ విలువల దృక్పథాన్ని మార్చి బ్రహ్మర్షికంటే రాజర్షే గొప్పవాడు అనే దృక్పథాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చి ఉంటే అతడు విప్లవకారుడని పిలువబడి ఉండేవాడు.



బుద్ధుడి దృక్పథం, సంస్కృతి బలహీనపడే క్రమంలో గుప్త రాజుల కాలంనుండి మొదలైన అంటరానితనాన్ని వ్యతిరేకిస్తూ మాదిగలు మరో విప్లవ దృక్పథానికి నాంది పలికారు.

వర్ణవాదులు బ్రాహ్మణులు ఉన్నతులంటే, బుద్ధ, వర్ధమానులు ఎవరూ గొప్ప కాదు అందరూ సమానులన్నారు. బ్రాహ్మణులు గొప్ప కాదు. మేం మాదిగల శూద్రులమే గొప్ప అని చరిత్రలో మొదటిసారిగా శ్రామికవర్గ దృక్పథాన్ని ప్రవేశపెట్టారు మాదిగలు. దాన్ని "జాంబవంతుల కథ" అనే యితిహాస కళారూపంలో చిందుమాదిగలు వందల ఏళ్ళుగా నేటికీ ప్రదర్శిస్తున్నారు.

## పరశురామున్ని ఎలా అర్థం చేసుకోవాలి?

పరశురాముడు రాజ్యాధికారాన్ని కోరలేదు. అతను బ్రాహ్మణరుషి. అతను రాజు కాదు. వర్ణవ్యవస్థలోని బ్రాహ్మణ బానిస యజమానుల కుండే అత్యున్నత గౌరవం కరిగిపోవడాన్ని సహించలేకపోయాడు.

విభిన్న శూద్రకులాల నుండి తెగల నుండి వచ్చి రాజులై, రాజరికాలు నెరపుతున్న క్రమంలో ఒక పరిణామం సంభవించింది. ఆ క్రమంలో వీరి సంస్కృతిలో ఆయా కులాల తెగల దృక్పథం బీజప్రాయంగా ఉండేది. రాజరికంలో ఉన్నారు గనుక బ్రాహ్మణులు చెప్పిన వర్ణదృక్పథాన్ని ప్రాపంచిక దృక్పథంగా ఆచరించేవారు. తద్వారా రాజుల ప్రాపంచిక దృక్పథానికి వారు ఆచరించే రాజరిక దళిత సంస్కృతికి మధ్య వైరుధ్యం ఏర్పడింది.

ఈ వైరుధ్యాన్ని వర్ణవాదాని కనువుగా బ్రాహ్మణులు సరిచేసే (మార్చే) ప్రయత్నం చేసినపుడల్లా ఆయా రాజులు తిరగబడేవారు. దాంతో రాజులందర్నీ హతమార్చి వర్ణవాద రాజకీయ దృక్పథం-సంస్కృతి నిర్మాణం చేయాలని పరశురాముడు భావించాడు. 21 సార్లు దండయాత్రలు చేసి సంహరించాడా లేదా అనేది వేరు విషయం. ఆ కథ ఏ దృక్పథం కోసం ప్రాచుర్యంలోకి వచ్చిందో అదే ప్రస్తుత అంశం.

వీరిద్దరు వర్ణవాద దృక్పథాన్ని సమూలంగా మార్చిన విప్లవకారులు. ఎవరైనా బ్రాహ్మణుడు కావచ్చు అనే దృక్పథాన్ని తిరగేసి అసలు బ్రాహ్మణుడు కావడం ఎందుకు? బ్రాహ్మణుడు గొప్పవాడేమీ కాదు. అందరూ సమానులే అని జనపదాల నుండి, గణతెగల నుండి తీసుకున్న దృక్పథంతో నూతన ప్రాపంచిక దృక్పథాల్ని సంస్కృతిని నూతన సమాజాన్ని నిర్మించే కృషి చేశారువారు. ఈ ప్రయత్నం సైద్ధాంతికంగా ఎంత బలంగా ఉందో అశ్వఘోషుని "వజ్రసూచి"లో చూడవచ్చు.

## రాజ్యం-సమగ్ర సామాజిక విప్లవం యొక్క నూతన నిర్వచనం

రాజకీయ అధికారం చేపట్టడం అనేది ఒక రంగంలో అధికారం సాధించి, ఇతర రంగాల్లో దాన్ని విస్తరింప చేయడానికి సంబంధించింది. కాని జరగవల్సింది ఏమంటే సమస్త రంగాల్లో ఏకకాలంలో పరిణామాలు, మార్పులు జరగడం. అందువల్ల అన్ని రంగాల్లోఏకకాలంలో వికాసం, ఉద్యమం, పరిణామం, విప్లవం కొనసాగాలి. ఇదే సమగ్ర సామాజిక విప్లవం. సమాజంలో భాగంగా విస్తరిస్తున్న రాజ్యం అనే మహావృక్షం స్వేచ్ఛ, సమానత్వం, మానవత, ప్రేమ, కరుణ, మైత్రి అనే శాఖోపశాఖలుగా విస్తరించాలి.

కాలం తీరిన రాజ్యవ్యవస్థలైన వర్ణ, కుల, మతాలకు అతీతంగా వర్గవిభేదాలకు అతీతంగా సమస్త వర్ణ, వర్గ, కుల, మత, ప్రాంత, భాష, జాతి, దేశ వివక్షతలకు అసమానతలకు అతీతంగా మానవాళి శ్రేయస్సు అంతిమ లక్ష్యంగా అన్ని రంగాల్లో ఏకకాలంలో ముందుకు సాగడమే. వికాసం పొందడమే సమగ్ర సామాజిక విప్లవం.

1. రాజ్యం అంటే ఏమిటి?
2. ఆధునిక పౌరశాస్త్రం రాజ్యానికి ఇచ్చిన నిర్వచనం ఏమిటి?
3. ఆధునిక సమాజంలో రాజ్యానికున్న అనేక నిర్వచనాలను, స్వభావాలను పేర్కొనండి.
4. వర్ణ, కుల వ్యవస్థలు, మతం కూడా ఎలా రాజ్యంగా కొనసాగుతున్నాయో వివరించండి?
5. వర్ణ వ్యవస్థ ఎలా ఏర్పడింది? ఎందుకు ఏర్పడింది?
6. విశ్వామిత్రుడు, పరశురాముడు వర్ణ వ్యవస్థలో చేసిన పనులను ఎలా అర్థం చేసుకోవాలి?
7. తాళం అదృశ్యమవుతుందా? రాజ్యం అదృశ్యం అవుతుందా?
8. సంస్కృతి, కళలు, రాజ్యం ఆవశ్యకతను ఎలా అదృశ్యం చేస్తాయి? వివరించండి.
9. గ్రామీణ స్వయం పోషక ఆర్థిక వ్యవస్థ స్వతంత్ర రాజ్యంగా ఎలా కొనసాగింది?
10. సామ్రాజ్యాల అవసరాలను వర్ణ కులవ్యవస్థలో ఎలా నెరవేర్చాయి?
11. కుటుంబం, వేశ్య వ్యవస్థ సమాంతరంగా ఎలా కొనసాగాయి? దీన్ని ఎలా అర్థం చేసుకోవాలి?
12. ప్రజాస్వామిక రాజ్యాలు ఎలా ఉండాలి? వాటి స్వభావం ఏమిటి?
13. రాజకీయ రంగంలో మాత్రమే కృషి చేస్తే అది విప్లవం అవుతుందా? దీన్ని సమర్థిస్తూ లేదా ఖండిస్తూ వివరించండి.
14. రాజ్యం సమగ్ర, సామాజిక విప్లవం అంటే ఏమిటి?



# ఒక దృక్పథంగా కరుణ ప్రేమ స్వేచ్ఛ

**ప్రేమ, కరుణ ఒక చైతన్య రూపం**

మానవత, ప్రేమ, కరుణ ఒక చైతన్య రూపం, ఒక ఆచరణ రూపం. ద్వేషరహిత ప్రేమతత్వమే ఒక ప్రాపంచిక దృక్పథంగా నిలబడడం సాధ్యం. మానవీయ ప్రేమకు ద్వేషం వ్యతిరేకపదం కాదు. ప్రేమకు వ్యతిరేక పదం లేదు. ఏమంటే ప్రేమ ఆచరణకు సంబంధించినది. ఎరుకకు సంబంధించినది. మంచికి చెడు వ్యతిరేక పదం కాదు.

వ్యక్తి శ్రేయస్సు, సమాజ శ్రేయస్సు కోసం సామాజిక దృష్టితో సమాజాన్ని పరిశీలించాలి. అందుకు విశ్వమానవ ప్రేమతత్వం పునాది కావాలి. ఇది కులాతీతమైనది, మతాతీతమైనది. జాతి, దేశ సరిహద్దులు లేనిది. ఇలా మానవత, ప్రేమ, కరుణ ఒక ప్రాపంచిక దృక్పథం. మానవీయ విలువలను ప్రేమ, కరుణ, పరోపకారం మొదలైన రూపాల్లో చూడవచ్చు. ప్రేమ, కరుణ, మానవత పర్యాయపదాలు. మానవ సమాజం మానవీయ సమాజంగా ఎదగడంకోసం ప్రతి తరం అన్వేషిస్తూనే వస్తున్నది.

ఏది ప్రేమో తెల్సుకునే ప్రయత్నంలో మానవీయ ప్రేమ అదృశ్యమై శుష్క తర్కం మిగిలిపోవచ్చు. ప్రపంచంలో చాలామంది ఈ పనిచేశారు. భార్యాభర్తల మధ్య తల్లిదండ్రులు పిల్లలకు మధ్య, స్నేహితుల మధ్య, పార్టీ సభ్యులమధ్య, ప్రభుత్వానికి ప్రజలకుమధ్య, నన్ను ప్రేమిస్తే ఇలాగేనా ప్రవర్తించేది అనే చర్చ జరగడాన్ని గమనిస్తే ఒక విషయం స్పష్టం అవుతుంది. వారు ప్రేమను ఒక అనుభూతిగా, స్పందనగా, అనుభవంగానే కాకుండా తమ పట్ల దాన్నొక దృక్పథంగా ఆచరించాలని ఆశిస్తున్నారు.

**ప్రేమించే వారు ద్వేషించలేరు**

వర్గ కసితో పాలక వర్గాలను, అగ్రకులాలను ద్వేషించేవారే ప్రజల్ని ప్రేమించగలరు అనుకోవడం తప్పు. అగ్రకులాల్ని, ఇతర మతాల్ని, ద్వేషించేవారు బహుజనుల్ని, తమ మతస్థుల్ని ప్రేమిస్తున్నారనుకోవడం పొరపాటు. వారు తమ పెత్తనాన్ని ప్రేమించడం తప్ప అది ప్రజలను ప్రేమించడం కాదు. ఇతరులను ఉపకరణంగా వాడుకోవాలనుకునేవారే ప్రేమ స్థానంలో ద్వేషాన్ని కూడా ప్రదర్శించడం సాధ్యమవుతుంది.

**ప్రశ్నించడం, ద్వేషించడం రెండూ ఒకటికాదు**

ప్రశ్నించడం, ద్వేషించడం రెండూ ఒకటి కాదు. ద్వేషించడం అనేది ప్రశ్నించడం కాదు. నిరాకరించడం వ్యతిరేకించడం అనేవి తరువాయి క్రమంలో ద్వేషించడంగా పరిణమిస్తాయి. ద్వేషించడంద్వారా తెల్సుకునే జ్ఞానం ఏమీలేదు. అలాగే కోపంద్వారా తెల్సుకునే జ్ఞానం ఏమీ లేదు, ఇవి చర్యలు కావు. అదివరకే ఉన్న జ్ఞానం యొక్క ప్రతి చర్యలు.

**తెలుసుకోవడం ఒక చర్య**

తెలుసుకోవడం అనేది ఒక చర్య. మానవత అనేది ఒక చర్య. మానవత అనేది ప్రతి చర్యకాదు.

ప్రతిదాన్ని ప్రశ్నించాలి. ప్రశ్నించడంద్వారా ఎన్నో విషయాలు తెలుస్తాయి. అదివరకే ఉన్న ఎరుకస్థాయి ననుసరించి ప్రశ్నలు రూపొందు తాయి. ప్రశ్నించడం ద్వారా తెలిసిన దాన్ననుసరించి, తెలియనిదాన్ని తెల్సుకునే ప్రక్రియ సాగుతుంది.

**ఎరుక స్థాయి ననుసరించి ప్రశ్న రూపొందుతుంది**

ఎరుకస్థాయి ననుసరించి ప్రశ్న రూపొందుతూ ఉంటుంది. గనక ప్రశ్నను బట్టి ప్రశ్నించినవారి ఎరుకస్థాయి తెలుస్తుంది. ప్రశ్నలోని ఎరుకస్థాయికన్నా దిగువ స్థాయిలో జవాబీయాల్సిన వారి చైతన్యం ఉండిపోయినప్పుడు ప్రశ్న ఆధిపత్యం వహిస్తుంది. ప్రశ్నించినవారి ఆధిపత్యం పెరుగుతుంది. అంతదాకా పైస్థాయిలో ఉన్న వారి ఆధిపత్యం బలహీనమవుతుంది.

ఈ స్థితిలో ప్రశ్నించడాన్నే ద్వేషించడంగా, వ్యతిరేకించడంగా అధికారంలో గలవాళ్ళు భావిస్తారు, ప్రచారం చేస్తారు, పాలకవర్గాలను, దోపిడీకులాలను, మతాధిపత్యాలను, తల్లిదండ్రులను, గురువులను, నాయకులను, వివిధ భావజాలాలను, సంస్థలను, ఉద్యమాలను, విప్లవాలను, పార్టీలను, రకరకాల విశ్వాసాలను, దృక్పథాలను, సంస్కృతులను, రాజకీయాలను అసమ్మతివాదంగా భావిస్తారు. వారు తమ పెత్తనం నిలుపుకోవడానికి చేసే యుద్ధమే ద్వేష ప్రచారం.

**మారడానికి సిద్ధంగా లేకపోతే సత్యాలు తెలిసినా కోపం, ద్వేషం పెరుగుతుంది**

మారడానికి సిద్ధంగా లేకపోవడం నుండి, సత్యాన్ని, తెల్సుకోవడానికి సిద్ధంగా లేకపోవడం నుండి అయిష్టం, కోపం, ద్వేషం ఉత్పన్నమవుతాయి. ఆ స్థితిలో వారు ప్రశ్నించడాన్నే ద్వేషించడంగా వ్యతిరేకించడంగా ప్రచారం చేసి తమ పట్టును సుస్థిరం చేసుకోవడాన్కి ప్రయత్నిస్తారు. అందువల్ల ద్వేషించడం, ప్రేమించడానికి షరతు కాదు. ప్రశ్నించినపుడు అసహనం, కోపం, వ్యతిరేకత కలిగితే అది ప్రేమ కాదు. నిస్సహాయత, భద్రత లేనితనం, లేదా ప్రశ్నించినవారిపట్ల చిన్నచూపు ఉందని అర్థం. ప్రేమ ప్రశ్నను ఆహ్వానిస్తుంది.

**హృదయ సంస్కారం పెరిగితే ప్రేమ ఉత్పన్నమవుతుంది**

మానవ హృదయం సాధించుకున్న హృదయ సంస్కారం కరుణగా, వాత్సల్యంగా, స్నేహంగా, హృదయ స్పందనగా అంతటా అన్ని వేళలా ఆచరిస్తూ జీవించడం ప్రేమ.



దీనికి తర్కంతో పనిలేదు. ఎదుటివారి మెప్పుతో గుర్తింపుతో పనిలేదు. ఒక పువ్వు ఎవరో ప్రశంసిస్తారని పూయదు. పువ్వుగా పూయడం దాని స్వభావం. సహజ స్వభావమైన ప్రేమ గురించి ప్రేమ యొక్క శక్తి సామర్థ్యాల గురించి, స్వార్థపరులు దాన్ని వాడుకునే తీరు గురించి తెల్సుకోవడం అవసరం.

**నీ నిస్వార్థం ఇతరుల్లో స్వార్థాన్ని బలోపేతం చేస్తే**
**నీవు నీ ఆచరణను తిరిగి సరి చేసుకోవాలి**

నీ నిస్వార్థం ఇతరుల్లో స్వార్థాన్నే బలోపేతం చేస్తే నీవు పరికరంగా, వాడుకోబడ్డావేమో! లేదా నీది నిస్వార్థమైనా కాకపోవాలి. నీ నిస్వార్థత ఎదుటివారిలో నిస్వార్థతతను పెంచకపోతే అదేం నిస్వార్థత? ఆలోచించు. మంచితనం అనేది మెటీరియలైజ్ కాకపోతే అది మంచి ఎలా అవుతుంది. ఒక వ్యక్తిని అందరూ గౌరవిస్తూ నమస్కరిస్తూనే ఆ వ్యక్తి అవసరానికి సాయపడకపోతే అది మంచితనం, గౌరవించడం అవుతుందా? దీన్ని పరిష్కరించుకోలేకపోవడం వల్లనే చెడ్డవాడని తెలిసీ ఒక రాజకీయ నాయకుడిని ఎన్నుకోవడం, మంచివాడని తెలిసీ ఎన్నుకోలేకపోవడం జరుగుతున్నది.

**వాడుకోవడానికి, స్వార్థానికి, మానవత్వానికి మధ్య తేడా తెలుసుకోవాలి**

స్వార్థపరత్వానికి మానవత్వానికి మధ్య, ఆధిపత్యవాదానికి మానవత్వానికి మధ్య, వాడుకోవడానికి ప్రేమించడానికి మధ్య, తేడా తెలియనీయని చెత్త సాహిత్యం, సినిమాలు పార్టీ సాహిత్యం కుప్పతెప్పలుగా వస్తోంది. సినిమా, టీవీ సంస్కృతిలో కూరుకుపోయి యువతరం తమ స్వార్థ అవసరాలను తీర్చే కన్సూమరిజం సంస్కృతినే ప్రేమ అని అభిప్రాయపడుతున్నారు. పార్టీలు, ఉద్యమాలు, ప్రభుత్వాలు, తాము చెప్పింది విని తమ పెత్తనాన్ని అంగీకరించి అనుసరించడమే ప్రజలపట్ల, పార్టీలపట్ల, ఉద్యమాలపట్ల, ఆయా ప్రభుత్వాలసట్ల మానవీయ ప్రేమగా వక్రీకరిస్తున్నారు.

**పశువుల్ని ప్రేమించి, మనుషుల్ని నీచంగా చూసే వాళ్ళు మనుషులేనా?**

కొందరు ప్రకృతిని పశుపక్ష్యాదుల్ని ప్రేమిస్తారు. సాటి మనుషుల్ని జంతువులకన్నా హీనంగా చూస్తారు. లేదా పట్టించుకోరు. ఇది నిజంగా ప్రేమేనా? ప్రకృతిని పశు పక్ష్యాదుల్ని ప్రేమిస్తూ మనుషుల్ని ద్వేషిస్తూ వీరు నా కన్నా తక్కువ కులం, తక్కువ జాతి, తక్కువ తెలివికలవాడు, పేదవారు అని నీచంగా చూడ్డం ప్రేమ కాదు. అది తన ఆధిక్యతను ప్రేమించుకోవడానికి, స్వీయ అనుభూతికి పరిమితమైన ప్రేమ. దానికి ప్రకృతి ప్రేమ అని ముద్దు పేరు పెడుతున్నారు. మనుషుల్ని ప్రేమించేవారు ప్రకృతిని కూడా ప్రేమిస్తారు. కాని ప్రకృతిని ప్రేమించేవారు మనుషుల్ని ప్రేమించకపోవచ్చు.

ఒక సేవాసంస్థ పేదవారికి దుప్పట్లు పంచాలనుకుంది. దుప్పట్లి స్తామంటే చాలామంది తామే ఎక్కువ పేదవాళ్ళం అని ముందుకు రావచ్చు. అందరికి సరిపడా కొనేంత స్తోమతేమీ లేదు. ఒక స్వయం సేవక్ ఇలా సూచించాడు. అందరూ నిద్రపోయాక నిశ్శబ్దంగా నడుద్దాం. ఏ చెట్టుకిందో, రోడ్డుపక్కనో, మురికివాడలోనో కప్పుకోవడానికి లేకుండా పడుకున్నవారికి ఒక్కొక్క దుప్పటి కప్పుకుంటూ వెళ్దాం అన్నాడు. అది నిజమైన మానవీయ ప్రేమ. కాని ఆ సంస్థ అధ్యక్ష కార్యదర్శులకా సూచన రుచించలేదు. వేదికలెక్కి వార్తల్లో, ఫోటోల్లో ప్రాచుర్యం పొందాలనుకున్నారు. దుప్పట్ల ధరకన్నా ఈ

ఖర్చువెక్కువైంది. ఆ వార్తల్ని వ్యాపార ప్రకటనలుగా లెక్కిస్తే దుప్పట్ల ధరకు పదింతలు ఇతరత్రా ఖర్చయింది. ఇది గుర్తింపు సమస్యే గాని ప్రజల్ని ప్రేమించడానికి సంబంధించినది కాదు.

**ప్రేమ ఎలా కలుగుతుంది?**

మనుషుల సంబంధంలో ప్రేమ కలుగుతుంది. అటాచ్‌మెంట్‌లో ప్రేమ కలుగుతుంది. పట్టించుకోవడంలో ప్రేమ కలుగుతుంది. కష్టాల్లో తోడుండంలో అనుబంధం కలుగుతుంది. జీవితాలు, స్వభావాలు పరస్పరం ప్రభావం వేసుకున్నప్పుడు ప్రేమ కలుగుతుంది. సాన్నిహిత్యం వల్ల ప్రేమ కలుగుతుంది. కలసి జీవించడంలో, పయనించడంలో, కలసి నేర్చుకోవడంలో, కలిసి పనిచేయడంలో ప్రేమ కలుగుతుంది.

నీవు సృష్టించినవాటిపై, నీవు కష్టపడ్డవాటిపై ప్రేమ కలుగుతుంది. నీవు కనే పిల్లల్ని, పంటల్నీ, సరుకుల్నీ, ఇళ్ళనీ, భావాలనీ, కళలనీ, నీవు ప్రేమిస్తావు. కష్టపడి సృష్టించినవారే వాటిని నిర్మూలించడం అంత సులభం కాదు. తన భావాలు మారినా, రచయిత కళాకారులు, తన పాత రచనల్నీ, కళలనీ, తన పిల్లల్లా ప్రేమిస్తూనే ఉంటారు. సైంటిస్టులు, తత్వవేత్తలూ, జ్ఞానమెంత అభివృద్ధి చెందినా, తమ పాత భావాలనే ప్రేమించవచ్చు. చాలామంది తమ బాల్యాన్ని ప్రేమిస్తారు.

**అభిరుచి, ఆసక్తి వల్ల ప్రేమ కలిగే తీరు...**

అభిరుచి వల్ల ప్రేమ కలుగుతుంది. స్నేహం వల్ల ప్రేమ కలుగుతుంది. ఆసక్తివల్ల ప్రేమ కలుగుతుంది. ఇష్టంవల్ల ప్రేమ కలుగుతుంది. ఆకర్షణవల్ల ప్రేమ కలుగుతుంది. హృదయం కరగడంవల్ల ప్రేమ కలుగుతుంది. అవసరం వల్ల ప్రేమ కలుగుతుంది. అనివార్యతవల్ల ప్రేమ కలుగుతుంది.

కళలు, సాహిత్యంపట్ల అభిరుచి ఆసక్తి వల్ల కళాకారులపట్ల కలుగుతుంది. కల్లు, సారా, సిగరెట్, పాన్ మొదలైనవి అభిరుచి, ఆసక్తితో మొదలై అవసరంగా వ్యసనంగా మారవచ్చు. వాళ్ళు వాటిని ప్రేమించవచ్చు.

ఆరాధనవల్ల ప్రేమ కలుగుతుంది. భక్తివల్ల ప్రేమ కలుగుతుంది. గౌరవంవల్ల ప్రేమ కలుగుతుంది. ఆకర్షణలో భావాల కలయిక, అభిరుచుల కలయిక, అవసరాల కలయిక అందం, గుణం, స్వభావం, వ్యక్తిత్వం పట్ల ఆకర్షణ ఉంటుంది. అతని మేధస్సుపట్ల, కళలపట్ల, నిస్వార్థంపట్ల, ప్రేమపట్ల, కరుణపట్ల, కండబలంపట్ల, త్యాగంపట్ల ఆకర్షణ ఉంటుంది. తాను అందుకోవాల్సిన ఆదర్శాల్ని, ఆశయాల్ని, అందుకుంటున్నవారిపట్ల ఆకర్షణ ఆరాధన.

స్పర్శ, లైంగిక సహజాతాలు రుచికి ఆకర్షణకు పోలిక ఉంది. రుచికరంగా లేకపోయినా అందులోని పోషకాహార విలువలు తగ్గవు. కాని గొప్ప రుచినే అభిలషిస్తాం. ఆకర్షణ లేకపోయినా అందులోనివేవీ తగ్గవు. కానీ ఆకర్షణీయంగా ఉండడాన్నే అభిలషిస్తాం.

**అనివార్యతలో, అవసరాల్లో కలిగే ప్రేమ, స్నేహం**

"అనివార్యత"లో భాగంగా మానవీయ స్నేహం కలిగే సందర్భాలుంటాయి. రైలు,



బస్సు, కాలినడక ప్రయాణంలో ప్రయాణీకుల మధ్య, క్లాసుమేట్సు మధ్య ఒకేచోట పనిచేసే కూలీలమధ్య, కార్మికుల మధ్య, కుటుంబ సభ్యుల మధ్య ప్రేమలు అనివార్యతలో భాగంగా కలిగే ప్రేమలు. అభిరుచి, ఆసక్తి, అవసరం నుండి క్రమంగా ప్రేమ ఎదుగుతుంది. వీటికి చర్మం వంటిది ప్రేమ.

**గురువులకు, నాయకులకు మధ్య తేడా ఏమిటి?**

ఎవరు గురువులు? ఎవరు నాయకులు? తన పిల్లలు తనకన్నా ఎదగాలను కోవడం గురువు ప్రేమ. ఇది తల్లి స్వభావం. ఏ రంగంలో, ఏ పార్టీలో, ఏ భావ జాలంతో ఎదిగినా వాళ్ళు నా శిష్యులు తెల్సా! అని గర్వపడడం గురువు ప్రేమ.

తన అవసరాల్ని తీర్చేవారిని ప్రేమించడం, తల్లిని, తండ్రిని, గురువును, నాయకుడిని, భార్యను, భర్తను కుటుంబ సభ్యులను ప్రేమించడం.

ఒకరి వికాసానికి ఏది ప్రేరణ, పునాది ఉత్తేజం అవుతుందో దాన్ని ప్రేమిస్తారు. దాన్ని ప్రేమించడం సహజంగా జరిగిపోతుంది. ఉదహరణకు నీ కన్నతల్లి, నీ ఇల్లు, కుటుంబసభ్యులు, నీ ఊరువాడ, భాష, గురువు, నీకు తొలినాళ్ళల్లో సహకరించిన వాళ్ళు, ప్రభావితం చేసినవాళ్ళు వాళ్ళను ప్రేమించడం సహజం.

**ప్రేమలో ఇమిడి వుండే అంశాలు**

ప్రేమలో ఆకర్షణ, ఇష్టం, సహృదయత, స్నేహం, సాన్నిహిత్యం, అనుబంధం, ఆత్మీయత, ఆరాధన, ఇది నాది, వాళ్ళు నావాళ్ళు అనే భావన, సంబంధం, ఐక్యత (ఘర్షణ ప్రాథమికం కాదు), ఆనందం, శక్తి, ఉత్తేజం, శక్తి మార్పిడి, నీ అస్తిత్వం, ఆత్మవిశ్వాసం, ఆసక్తి, అభిరుచి, ఎరుక క్రమం ఉన్నాయి.

ప్రేమతో నేర్పడం, నేర్చుకోవడం సులభం. ఆసక్తి, అభిరుచి ఉన్నపుడు ఇష్టంగా నేర్పడం, నేర్చుకోవడం సులభం. విద్యాతత్వం దీనిమీదే నిర్మితమైంది.

మొదటి అధ్యాయాల్లో చెప్పినట్టు ఆరోగ్యంగా ఉండడంలో రెండు దశలుంటాయి. రోగాలు రాకుండా చూసు కోవడం, రోగాలు వచ్చాక నయం చేసుకోవడం. పెద్ద రోగాలున్నపుడే గొప్ప డాక్టర్లు అవసరం. ఎంత పెద్ద రోగాలుగా ఎదిగితే డాక్టర్లు నయం చేయడం ద్వారా అంత గొప్ప డాక్టర్లవుతారు. అలా ఈ సామాజిక, మానసిక రోగాలు రాకుండా నివారిస్తుంది ప్రేమ. అది లెక్కలకు అందదు. రోగమూ, దాన్ని నయం చేసిన తీరూ లెక్కలకు అందుతుంది. అందువల్ల అది చరిత్రగా రికార్డవుతుంది. ప్రేమ సాధించే ఆరోగ్యం, శక్తి, రోగం యొక్క తీవ్రతనూ, దాన్ని నయం చేసిన డాక్టరు యొక్క గొప్పతనం యొక్క అవసరం లేకుండానే చేస్తుందా.

అనగా సమాజంలోని చలన సూత్రాలు, వ్యతిరేక దశలోకి మారి, వర్గపోరాటాలుగా, కుల వ్యతిరేక పోరాటాలుగా పరిణమించే అవసరమే లేకుండా పోతుంది. వర్గ పోరాటాల చరిత్ర ప్రేమ రాహిత్య చరిత్రే తప్ప ప్రేమ చరిత్ర కాదు. ప్రేమ చరిత్ర కళల్లో, సాహిత్యంలో, సంస్కృతిలో లభిస్తుంది. కాంప్లికేషన్స్ రూపొందకముందే పరిష్కరించడం మానవత. వైరుధ్యంగా బద్ధలైనతర్వాత అది సమస్య అని గుర్తించడం పరిష్కరించడం ప్రేమ దృక్పథం కాదు దాన్ని రాజకీయం అంటారు. ప్రేమ, కరుణ దృక్పథంతో మానవీయ సమాజాన్ని నిర్మాణాన్ని కోరాడు బుద్ధుడు. బుద్ధుడు

చెప్పిన ప్రేమ, కరుణ, మంచిమాట, మంచి బాట, మంచి మనస్సు, మంచి పని మొదలైన అష్టాంగ మార్గానికి సంబంధించిన అర్థంలో మానవత, ప్రేమ అనే పదాన్ని స్వీకరించడం జరిగింది.

**జ్ఞాపకశక్తికి, ఆసక్తికి, ప్రేమకు మధ్య సమన్వయం వుంది**

తెల్సుకోవడం, అభిరుచులు, ఆసక్తి, ఇష్టం, జ్ఞాపకశక్తి, ప్రేమలమధ్య సంబంధం ఉంది. ఆసక్తి ఉన్నదే తెల్సుకొంటారు. కొందరికి చెడు విషయాలే బాగా జ్ఞాపకం ఉంటాయి. వారికి చెడు తెల్సుకోవడం పట్లనే ఆసక్తి మెండు. హంస పాలను తాగి నీళ్ళను వదిలేస్తే వీళ్ళు చెడును తాగి మంచిని వదిలేస్తారు. ఉదహరణకు: వార్తాపత్రికలు, రాజకీయాలు, విమర్శలు, ఓర్వలేనితనం.

నీకు ఒక విషయం జ్ఞాపకం లేదంటే దానిమీద నీకు ఆసక్తి లేదని అర్థం. ఎన్నిసార్లు చదివినా పాఠం నీకు జ్ఞాపకం ఉండడం లేదంటే ఆ పాఠంపట్ల, దాన్ని చెప్పేవారిపట్ల, నేర్చుకొమ్మని కోరినవారిపట్ల లోలోపల వ్యతిరేకత ఉందని అర్థం. ఆ అయిష్టతను తొలగించుకోగలిగితే పాఠం త్వరగా జ్ఞాపకం ఉంటుంది. ఇష్టానికి, జ్ఞాపకశక్తికీ మధ్య గట్టి సంబంధం ఉంది. ఇష్టం ఏర్పడితే ప్రేమ కలుగు తుంది. ప్రేమ కలిగినపుడు భట్టీ పట్టకపోయినా విషయం అవగాహన అయి జ్ఞాపకం ఉంటుంది.

ఇష్టంలేని పని అయిష్టంగా ఉంటుంది. ఇష్టంలేని పని విసుగ్గా వుంటుంది. కష్టంగా ఉంటుంది. ఇష్టమైన పని ఎంతో ఉత్సాహంగా ఉంటుంది. ప్రేమలేనిచోట కాలం బరువెక్కుతుంది. క్షణాలు గంటల్లా భారం అన్పిస్తాయి. ప్రేమ ఉన్నచోట గంటలు క్షణాల్లా గడుస్తాయి. నీకు యిష్టమైన కోర్సుగానీ, ఉద్యోగం గానీ, భార్యగానీ, భర్తగానీ, ఇల్లుగానీ దొరక్కపోతే, అదొక జీవితకాల హింసగా ఉంటుంది. ఆ హింసను జయించడం సుళువు. నీకు దొరికిందాన్నే నీకిష్టమైనదిగా నీవు మార్చుకోగలిగితే వృత్తిలో, కోర్సులో సంసారంలో అందులో తృప్తి ఉంటుంది. సంకల్పంతో కృషిచేస్తే అద్భుతాలు కూడా సాధిస్తావు.

**అవసరం ఇష్టాయిష్టాలను మార్చేస్తుంది. ఆసక్తిని పెంచుతుంది**

ఒకాయనకు ఉపన్యాసాలీయాలంటే అసలే ఇష్టంలేదు. కానీ ఎన్నో అవసరాలరీత్యా యివ్వక తప్పలేదు. కొంత కాలానికి రాష్ట్రంలో గొప్ప వక్తగా పేరొందాడు. ఒకాయనకు జైల్లో ఉండడం అసలే యిష్టంలేదు. ఉండక తప్పలేదు. రోజూ పుస్తకాలు చదివి చర్చించి, డిగ్రీలు సంపాదించాడు. గొప్ప అవగాహన సాధించాడు. జైల్లోనే గొప్ప పుస్తకాలు రాశాడు. ఒకాయన లెక్చరర్ కావాలనుకుంటే వీలుకాలేదు. రైతయ్యాడు. చక్కని పంటలు తీసి ఇతరులకు ఆదర్శమయ్యాడు. ఒక ఇద్దరికి ఎంతో చదువుకోవాలని ఉండేది. వాళ్ళ తల్లిదండ్రులకు గడవక చదువు మాన్పి జీతం ఉంచారు. ఒకతను జీతం ఉండి, ఉండి, యిరవై ఏళ్ళల్లో తానే ఒక పెద్ద వ్యాపారవేత్తగా ఎదిగాడు. మరొకతను గొప్ప విప్లవకారుడుగా ఎదిగాడు. అలాంటి ఇంకొకతను మండలాధ్యక్షుడయ్యాడు. ఉన్న జీవితాన్ని తిట్టుకుంటూ కూర్చుంటే నిరాశే మిగులుతుంది. ఇలా పట్టుదలతో దాని అంతుచూస్తే అక్కడి నుంచి కూడా ఉన్నత శిఖరాలకు ఎదుగుతారు.



**ప్రేమకు, జ్ఞాపకానికి మధ్య లింకు తెగిపోతే ఎంత ప్రమాదమంటే...**

నీ చెల్లెలు చెప్పిందో, నీ కూతురు చెప్పిందో, భార్య చెప్పిందో తీసుకురావడం మరిచిపోయి, ఇంటికొచ్చాక అయ్యో మరిచిపోయానే అని అంటే బాధపడేది నీవు మరిచిపోయినందుకు కాదు. ప్రేమ లేకపోవడంవల్లనే మర్చిపోయావని వాళ్లు బాధపడ్డారు. ప్రేమ ఉంటే తప్పక గుర్తుంటుంది.

ప్రేమ ఉంటే నీవు చాలా వాటిని క్షమించేస్తావు. ప్రేమ లేకపోతే తప్పులు పడుతావు. తప్పులు పట్టడం, ప్రశ్నించడం రెండూ ఒకటి కాదు. తప్పులు పట్టడంలో ఎరుక క్రమం ఉండకపోవచ్చు. క్షమాగుణం లేనప్పుడే తప్పులు పట్టడం మొదలవవచ్చు.

**ప్రేమించాల్సిన వాటినే ప్రేమించాలి**

**ద్వేషించాల్సిన వాటిని ద్వేషించే రూపంలో ప్రేమించకూడదు**

ఆరెసెస్ వారు నాస్తికులను అందరికన్నా ఎక్కువ దైవభక్తులుగా భావిస్తుంటారు. చెప్తుంటారు. ఎందుకంటే వాళ్ళు నిత్యం దేవున్ని లేడు అంటూ స్మరిస్తుంటారు. లేడు అనే రూపంలో దేవున్ని స్మరించడం చేస్తున్నారు. ఇతర భక్తుల కన్నా వాళ్ళే ఎక్కువ దేవున్ని గుర్తు చేసుకుంటారు. అందువల్ల వాళ్లే దైవ భక్తుల కన్నా ఎక్కువ దైవభక్తులు అని అంటుంటారు. ద్వేషించే రూపంలో ప్రేమించడం కొనసాగడాన్ని విష్ణువు దగ్గర వున్న ద్వారపాలకులు జయవిజయులు మూడు అవతరాలను కోరుకోవడం కథ కూడా స్పష్టం చేస్తుంది. అందని ద్రాక్షపండ్లు పుల్లన అని ద్వేషిస్తుంటారు. అందువల్ల ద్వేషంలో అది అందలేదని కసి, అసూయ, ప్రేమ అంతర్గతంగా కొనసాగుతుంది.

నీవు ప్రేమించాల్సిన సమాజాన్ని, విలువల్ని, సంస్కృతి, సాహిత్యాన్ని, ప్రజల్ని, ప్రేమించడంలోకన్నా ద్వేషించాల్సిన వాటిని, ద్వేషించడంలో, నెగెటివ్ చేయడంలో తొందరగా ప్రాచుర్యం లభించవచ్చు. అది ప్రజలపట్ల ప్రేమ ఆచరణ కాదు. అది ద్వేష ఆచరణ, నెగెటివ్ ఆచరణ, ద్వేషించే ఆచరణ కోపతాపాలకు, ద్వేషానికి, తప్పులు పట్టడానికి పరిమితమవుతుంది. కల్సి పని చేయడాన్కి కలసి బతకడాన్ని దూరం చేస్తుంది. ద్వేషం-ద్వేషం ద్వారా, కోపం-కోపంద్వారా, పగ-పగద్వారా ఎద్దేవా- ఎద్దేవా ద్వారా పరిష్కారం కావు. కరుణ, ప్రేమ ద్వారా కల్సి బతకడం, కల్సి పనిచేయడం ద్వారానే పరిష్కారం అవుతాయి.

**అందరికి సమాన హక్కు ప్రేమకు చక్కని ప్రాతిపదిక వేసింది**

ప్రతి మనిషికి ఒకే విలువ ఒకే ఓటు అనే తాత్విక దృక్పథం ఒక ప్రాపంచిక దృక్పథంగా ప్రేమ ఎదగడానికి చక్కని ప్రాతిపదికలు వేసింది.

నీ పిల్లల్ని చూస్తే నీకెంతో ముద్దు. వారి కాలు కందిపోతే నీ చెంప కందిపోయినంత బాధపడ్తావు. నీ తల్లిదండ్రులు కూడా నిన్ను అంతగా ప్రేమించి పెద్దచేసినవారే. రచయిత అయిన తండ్రికి రచయితగా ఎదగాలనే జీవిత లక్ష్యం ఉండవచ్చు. కళాకారునిగా, నాయకునిగా ఎదగదల్చుకున్నవారికి అదే జీవిత లక్ష్యమై తమ పిల్లల్ని కుటుంబాల్ని సరిగ్గా చూడలేకపోవచ్చు. కానీ అలాంటి ఏ లౌక్యం లేక చాలామంది తల్లిదండ్రులు జీవితమంతా తమ పిల్లల అభివృద్ధికోసమే ధారపోస్తారు. నాలుగు మంచి ముచ్చట్లు చెప్పి నీకోసం కృషి చేసినవారిని విప్లవకారులనో,

ప్రాణస్నేహితులనో, మరొకటనో ప్రేమిస్తున్నావు. గొప్ప త్యాగం అని కీర్తిస్తూ హృదయాలు అర్పిస్తున్నావు.

**తల్లిదండ్రులు పిల్లల కోసం చేసే త్యాగాలు పిల్లలకు గుర్తున్నాయా?**

నీ కోసమే జీవితాన్ని త్యాగం చేసి ధారపోసిన తల్లిదండ్రులను ప్రేమించక, గౌరవించక, వృద్ధాప్యంలో ఆదరించకపోతే నీది ప్రేమవుతుందా? నీవు నీ పిల్లలపై చూపేది కూడా నీ ఆధిక్యతా ప్రదర్శనే అవుతుంది తప్ప ప్రేమ కాదు. తనువిచ్చి మనసిచ్చి, జీవిత సర్వస్వాన్నిచ్చి, తల్లిదండ్రుల్ని వదిలి నీకు తోడై నిలిచిన నీ భార్య కూర సరిగా వండలేదని కసురుకుంటే ప్రేమవుతుందా? నీ స్వార్థ ఆధిక్యతా ప్రదర్శన అవుతుందా? ఆలోచించు. నేను చెప్పినట్టే నీవు వినాలి అనడంలో బానిసత్వ ముందా? ప్రేముందా? నీలాగే మీ ఆవిడ కూడా మా ఆయన నేను చెప్పినట్టే వినాలి. ఎందుకంటే నేను తల్లిదండ్రుల్ని వదిలివచ్చిన దాన్ని అనుకుంటుంది. అప్పుడు ప్రేమ కనుమరుగై ద్వేషించే చోటు చేసుకుంటే నీది ప్రేమ అవుతుందా?

**మానవత, కరుణ ఒక సామాజిక అవసరం**

మానవుల్ని ప్రేమించడం ఎందుకు? మానవత, ప్రేమ, కరుణ ఒక సామాజిక అవసరం. మనుషులు పరస్పర సంబంధంలో కల్సి జీవించడంలో సహజీవనంలో ఒక కొత్త శక్తి, పరస్పర ఆకర్షణ, ఆనందం ఉత్పన్నం చేయడానికి ప్రేమ అనివార్యమవుతుంది. అందువల్ల ప్రేమ, కరుణ సామాజికమైనది. ఏకాకి మనుషులకు ప్రేమతో పనిలేదు. ప్రకృతిలో లీనమయ్యే మనుషులది తనలో తాను తాదాత్మ్యం చెందే ప్రేమే కానీ ఇతరులను ప్రేమించడానికి సంబంధించింది కాదు. బావిలో కప్పలా బతికేవారికి బావి అంత వెడల్పు ప్రేమే. ప్రేమ ప్రపంచంగా కనపడుతుంది. మిగతా ప్రపంచాన్ని ప్రేమించాల్సిన అవసరం వారికి కనపడదు. నా భార్య, నా పిల్లలు బాగుంటే చాలనుకునేది స్వార్థానికి పరిమితమైన ప్రేమ. పిల్లలు పెరిగి అదే స్వార్థాన్ని అలవరచుకొని తల్లిదండ్రుల్ని గాలికి వదిలివేసి తన పిల్లల్ని ప్రేమిస్తారు. అది కూడా ప్రేమ కాదు తన ఆధిక్యతే.

**స్వార్థానికి పరోపకారం పేరు పెడితే...**

ఒకాయన రకరకాల సంఘాల్లో సమాజసేవ కోసం పనిచేశాడు. తన వృత్తి వ్యాపారాలూ బాగానే సాగించాడు. అతని సంతానమే అతను ఆత్మహత్య చేసుకోవడానికి ప్రేరణ అయ్యారు. వారిలో స్వార్థమే పెరిగింది. యాభయి ఏళ్ళనీ సామాజిక జీవితంలో నీ నుండి స్ఫూర్తి పొందింది స్వార్థాన్నే. యాభయి ఏళ్ళ సమాజసేవ స్వార్థ ప్రయోజనాలకు పైశాలువాగా ఉపయోగించుకోవడంవల్లనే నీనుండి నీ కుటుంబంలో స్వార్థమే నేర్చుకున్నారు. ఈ మాట కాస్త ముందుగా తెల్సి ఉంటే మారనైనా మారి ఉండేవాడు. లేదా నా ఆత్మహత్యకు నా స్వార్థమే కారణం అని గ్రహించి ఉండేవాడు.

**సైన్సు, టెక్నాలజీ డిపెండెన్సీని పెంచింది**

మానవ సమాజంలో సైన్సు, టెక్నాలజీ, కళలు అభివృద్ధి చెందుతున్నకొద్దీ మనుషులు ఒకరిపై ఒకరు ఆధారపడ్డం పెరుగుతున్నది. మానవ సంబంధాల కేంద్రీకరణ



పెరుగుతున్నది. ఆటవిక సమాజం పాలు మరిచిన దశనుండే పనిచేస్తూ తల్లిదండ్రులతోపాటు సంపాదించడంలో పాల్గొంటారు. నాగరిక దశలో ఇరవై అయిదేళ్ళదాకా ఆ పిల్లలు తల్లిదండ్రులపై సమాజంపై ఆధారపడి బతకాల్సి వస్తున్నది.

మానవ సమాజం సాధించిన అభివృద్ధి సొంతం చేసుకోవడానికి పాతికేళ్ళు అధ్యయనానికే వ్యయమయ్యేలా సగం జీవితం కరిగిపోయేలా సమాజానికి భారంగా పరిణమించింది సైన్సు టెక్నాలజీ. ముప్పయి ఏళ్ళు సాదాల్సిన బాధ్యత ప్రేమ లేకుండా కొనసాగించడం ఎలా సాధ్యం? అందువల్ల ఆటవిక సమాజంలోకన్నా ఎన్నో రెట్లు ప్రేమ దృక్పథం ఆధునిక సమాజంలో అవసరమవుతున్నది. ఆటవిక గణతెగ సమాజాల్లో తెగలమధ్య ఘర్షణ ఉండేది. ఇపుడా తెగల స్థాయి పోయి అన్ని కులాలూ, మతాలూ, ప్రాంతాలూ, భావాలూ కల్సి జీవించే జీవన విధానంతో బృహత్తర సమాజం ఎదిగింది.

**ఆటవిక సమాజం నుండి అన్ని రంగాల్లోకి విస్తరించిన ప్రేమ**

ఆటవిక సమాజంలో తెగ మధ్య ఉండే ప్రేమ కులం మధ్య ఉండే ప్రేమగా ఒకవైపు, రాజకీయాలకు మనిషికి మధ్య ఉండే సంబంధంగా ఒకవైపు విస్తరించింది. రాజకీయాలకు ప్రేమకు సంబంధం ఉంది. మానవ సంబంధాలను ఎలా నిర్వహించుకోవాలో నాడు తెగ, గణం నిర్ణయిస్తే ఇపుడు రాజకీయాలు నిర్వహిస్తున్నాయి. మానవ సంబంధాల వ్యవహారాలను నిర్వహించడం రాజకీయం. అందువల్ల రాజకీయం ప్రేమతో పరస్పర సంబంధమైనవి. ఎందరో బౌద్ధులు, కమ్యూనిస్టులు, ప్రజలపై ప్రేమతో సమాజాన్ని రాజకీయ వ్యవస్థను ప్రేమవంతం చేయడం కోసం ఎన్నో త్యాగాలు చేశారు.

సమాజాన్ని, రాజకీయాలను ప్రేమవంతం చేయడం కోసమే బుద్ధిజం, మార్క్సిజం, సోషలిజం, అంబేద్కరిజం పుట్టాయి. రాజకీయాలను చర్చించని ప్రేమ, కరుణ, సమాజ సంబంధాలకు దూరంగా ఏకాకితనంలో జీవించే వ్యక్తికి సబంధించినవి. అందువల్లనే బుద్ధుడు మొదలుకొని మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, మావో, రస్సెల్, ప్రేంచంద్, టాల్‌స్టాయ్, గోర్కీ, సార్త్రేలు, సమకాలీన రాజకీయాలను పట్టించుకున్నారు.

స్త్రీవాదులు ప్రతి వ్యక్తిగత విషయం కూడా రాజకీయమైనదే అని నిర్ధారించారు. అనగా ప్రతి వ్యక్తిగత విషయం కూడా సామాజికమైనదే. ఇక్కడికి ఆగితే పాశ్చాత్యతత్వం. అయితే ప్రతి సామాజిక విషయం వ్యక్తిగత విషయం కూడా. సమాజం అనే పదం, చెట్టు అనే పదం వంటిది. అడవి అనే పదం వంటిది. చెట్టు స్వభావం మార్చాలంటే ప్రతి చెట్టునూ సంకరం చేయడం వగైరా ద్వారానే సాధ్యం. సమాజం మారాలంటే ప్రతి వ్యక్తీ మారడం ద్వారానే వగైరా సాధ్యం. ఇది ప్రాచ్యతత్వం. వ్యక్తిగత విషయాలే సమూహంలో సామాజిక విషయాలుగా వ్యక్తమవుతాయి. కాలకృత్యాలు తీర్చుకోవడం వ్యక్తిగత విషయం. ప్రతి యింటికి మరుగుదొడ్లు, స్నానాల గదులు ఉండేలా చూస్తే మనుషులు, పరిసరాలు పరిశుభ్రంగా ఆరోగ్యంగా ఉంటాయి. ఇది సామాజిక విషయం. రక్షిత మంచినీరు వ్యక్తిగత విషయం. అందుకోసం వాటర్ టాంకునల్లా కట్టడం సామాజిక విషయం.

**ప్రేమ, కరుణ ఎన్ని సంబంధాల్లో కొనసాగుతుంది?**

కుటుంబం ఇరుగు పొరుగు కులం, మతం, వర్గం, పార్టీ, ప్రాంతం, దేశం,

వ్యక్తి, వ్యక్తి స్వేచ్ఛ, సామాజిక స్వేచ్ఛ మొదలైనవి కూడా మానవ సంబంధాల్లోని ప్రేమ, కరుణ, దుఃఖం, దోపిడి, అమానుషాల తీరు తెన్నుల్ని వర్గీకరించే పదాలే. ప్రతి పదం నీ ఆచరణకన్నా ఎన్నోవేల రెట్లు శక్తివంతమైనది. వేల ఏళ్ళ తరతరాల ఆచరణ తాలూకు భావాన్ని ఆ పదం ద్వారా చెప్పడంవల్ల నీ ఆచరణకన్నా పదంలోని భావం వేల రెట్లు పాతది, శక్తివంతమైనది. వేల ఏళ్ళ ఆచరణలో, భూమిపై పొర సారవంతమైనట్లుగా ప్రేమ అనే పదం మొత్తం వేల ఏళ్ళ మానవాళి ఆచరణ తాలూకు అంతస్సారాన్ని నిరంతరం పెంచుకుంటూ వస్తున్న పదం. ఆ అంతస్సారాన్ని అవగతం చేసికొంటూ అభివృద్ధి పరుచుకుంటూ ఆచరించడమే ప్రేమ దృక్పథం.

**పదాలకు అర్థాలు ఎలా ఏర్పడ్డాయి?**

పదాలకు స్వతహాగా అర్థాలుండవు. ఒక ధ్వనికి పదరూపం కల్పించి ఉద్దేశించిన అర్థంలో వాడుతూ ఆచరించే క్రమంలో పదాలు ఆయా అనుభవాల తాలూకు భావాలకు ప్రతీకలవుతాయి. అనుభవం హృదయంలో ఉంటుంది. పదం దాని వెలుపల ఉండే స్విచ్చి. ఒక పదం వినగానే దానికనువుగా స్పందించడం ఆ పదానికున్న అర్థం తెల్సినపుడే సాధ్యం.

ఒక భాషలోని పదాలద్వారా చెప్పే భావం భాష తెలియని వారికి అందదు. పద ధ్వనులు వారిలో స్పందన కల్గించలేక పోవడానికి కారణం వారి పదాల ఉద్దేశించిన భావాలు తెలియక పోవడమే. నీవు అమ్మ అనే పదం వినడంతోనే స్పందించడం నీకు మీ అమ్మపట్ల గల ప్రేమతోనే. అందర్నీ అమ్మలుగా, అక్కలుగా, చెల్లెళ్ళుగా చూడాలి అంటే నీవారిపట్ల ప్రేమతోనే యితరులపట్ల కూడా ప్రవర్తించాలి. అమ్మపట్ల గల భావాలు స్పందనలు "అమ్మ" అనే పదంతో ఏకం అవుతాయి. తద్వారా అమ్మ అనే పదం పలకగానే అమ్మ గురించిన స్పందనలు కలుగుతాయి. అవి లేనివారికి ఆ భాష తెలియనివారికి కలగవు. అలానే ప్రేమ, ధ్యానం, సమస్థితి, కాలాతీత ప్రేమ, నిర్మల హృదయం అనే పదాల అర్థాలు అనుభవంలో లేకపోతే స్పందనలు కలుగవు.

**పదాల ద్వారా ఉద్దేశించిన భావాలు అవి విన్న వారిలో ఉన్నప్పుడే అర్థమవుతాయి**

పదాల ద్వారా ఉద్దేశించిన స్పందనలు, భావాలు అనుభవాలు, ఆచరణలో సజీవంగా, నిత్యనూతనంగా ఉత్పన్నమవుతూ కొనసాగుతున్నంతకాలం పదాలు వాటికి స్విచ్చులుగా పనిచేస్తాయి. అమ్మ, నాన్న, గురువు, ప్రేమ, విద్య, జ్ఞానం, కరుణ, త్యాగం, కొడుకు, కూతురు, అన్నాచెల్లి, అక్క మొదలగుపదాలు వేలేళ్లుగా వాడుతూ వస్తున్నాము. ఈ పదాలు ఆయా రకాల బాధ్యతలకు ప్రేమకు సంకేత పదాలైనాయి. ఉదహరణకు అమ్మ కాకుండా అత్త కాలేదు. అమ్మే అత్త. కాని అమ్మ అన్నపుడు కలిగే స్పందన వేరు. అత్త అన్నపుడు గుర్తొచ్చే స్వభావం వేరు. వేల ఏళ్ళ అనుభవాలు మానవ సమాజ ఆచరణవల్ల ఆ పదాలు నీ అనుభవాలకన్నా కొన్ని వేల రెట్లు అర్థ గాఢతతో, అర్థం వివరిస్తూ వస్తున్నాయి. భావంలో ఉన్న శక్తే పదం యొక్క శక్తి. అందువల్ల పదం వినపడగానే ఆ పదం తాలూకు భావం, స్వభావం స్పందనకు రాకుండా, పదమే రిపీట్ అయినట్లు కనపడితే పదానికున్న భావం, స్వభావం, అనుభవం స్పందన, అనుభూతికి తెచ్చుకునే శక్తి, అనుభవం తక్కువ అని అర్థం చేసుకోవలసి ఉంది.



**వ్యక్తం కాని ప్రేమ అర్థం కాదు, ప్రతిస్పందన రాదు**

వ్యక్తంకాని ప్రేమగానీ, ఆచరణగానీ మనస్సు గానీ యితరులకు అర్థం కాదు. అర్థం కానపుడు నీవు కోరుకున్న ప్రతిస్పందనలు ఉత్పన్నం కావు. ప్రేమ వ్యక్తం కావాలి. ఆచరణలో కనపడాలి. నీవు ప్రేమిస్తున్న విషయం నీవు ప్రేమిస్తున్న వినయం పేరిట చొరవ కోల్పోయి తనలో తాను ప్రేమిస్తూ ఆనందిస్తే అది ఆత్మానందం. దానికి సామాజిక ప్రాధాన్యత ఏమీ లేదు, వ్యక్తిగత స్థాయిలో తప్ప. ఇలాంటివారు అల్పత్వ భావనతోనో, అహంకారంతోనో కూరుకు పోయారని ఎదుటివారు భావిస్తారు. నీ ప్రేమను నిర్భయంగా వెల్లడించు. భయాన్ని, బిడియాన్ని పారద్రోలి నిర్భయంగా ప్రేమను వ్యక్తీకరించే శక్తి సంతరించుకో!

**లైంగిక ప్రేమ పరిమితి చిన్నది-వ్యక్తిగతమైనది**

లైంగిక ప్రేమ సహజాతాలకు సంబంధించినది. మానసిక ఉద్రేక ఉద్వేగాలకు సంబంధించినది. తోటి మనుషులపట్ల ప్రేమ ఉద్రేకానికి, ఉద్వేగాలకు సంబంధించినది కాదు. అది వివేచనకు, అవగాహనకు సంబంధించినది. సమాజ నిర్మాణానికి, నిర్వహణకు సంబంధించినది. బుద్ధుడు మొదలుకొని మార్క్స్, జిడ్డు కృష్ణమూర్తిదాకా ఎందరో ప్రేమ గురించి తాత్వికంగా చర్చించారు. బుద్ధుడి స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం, ప్రజ్ఞ, కరుణాత్మక ప్రేమతత్వమే ప్రేమపూరిత ప్రాపంచిక దృక్పథం.

**గర్వం ఎందుకు కలుగుతుంది?**

గర్వం అహంకారం ఎదుటివారికి నీ పట్లగల ప్రేమను చంపుతుంది. అల్ప సంతోషిత్వం నుండి, ఇంకా ఎదగలేనితనం నుండి అహంకారం ఏర్పడుతుంది. నా అర్హతకు మించింది సాధించాను అనే భావన ఉంటే గర్వం కలగదు. పాలకవర్గాలు, దోపిడీ కులాలు, మగవాళ్లు తాము తమ అర్హతకు మించి పొందుతున్నారు. అది ఇతరులకు తెలియకూడదనుకోవడం నుంచి స్వార్థం అహంకారం రూపొందుతుంది.

పదవ తరగతి స్కూలుకే ఫస్టు వచ్చిన విద్యార్థిలో గర్వం వుంటే పదో తరగతే గొప్ప చదువు అనుకోవడం. ఒక సర్పంచుకు గర్వం వుంటే అదే గొప్ప అధికారం అనుకోవడం, ఒక గుమాస్తాకు అహంకారం వుంటే ఆ ఉద్యోగమే చాలా గొప్ప ఉద్యోగమని భ్రమిస్తున్నట్లు. పది కథలో, కవితలో రాయగానే గర్వం వచ్చేస్తే ఎదుగుదల ఆగిపోయిందని అర్థం. సాధించినదానితో సంతృప్తి పడడం, సరిపెట్టుకోవడం ఆత్మవిశ్వాసం. అదే గొప్ప అనుకోవడం అహంకారం.

తానే గొప్ప అహంకారం ఇతరులకు లేనిది, నాకున్నది నేనే సాధించాను అనే ఆస్తిహక్కు భావన నుండి కలుగుతుంది. అది ఆస్తి కావచ్చు. రచనాశక్తి కావచ్చు. అందం కావచ్చు. భాషా పటిమ కావచ్చు. నటనా శక్తి కావచ్చు. జ్ఞానం కావచ్చు. అధికారం కావచ్చు. సంస్కృతి కావచ్చు, నాగరికత కావచ్చు, మోసం చేయడంలో కావచ్చు, ఒప్పించడంలో కావచ్చు, కళల్లో కావచ్చు, నిర్వహణలో కావచ్చు.

**గర్వం వల్ల కోల్పోయే శక్తి, సామర్థ్యాలు, ఎదుగుదల**

గర్వం అహంకారం సమాజం నుంచి వినేశక్తి కోల్పోతుంది. నేర్చుకునే శక్తి

నశిస్తుంది. ఎదుటివారి శక్తి గౌరవించే సంస్కారం కనుమరుగవుతుంది. ఎదుటివారిని ప్రమోట్‌చేసే స్వభావం అంతరిస్తుంది. అగౌరవం వున్నచోట నేర్చుకోవడం సాధ్యపడదు. పర్యవసానంగా నీవు దేని గురించి గొప్ప అనుకుంటున్నావో అది 'గొప్ప'గా ఇతరుల మీద ప్రభావం వేయడం ఆగిపోతుంది. వారి హృదయాలను గెలుచుకోవడం నిలిచిపోతుంది. తద్వారా నీ గొప్పను ఎవరూ గుర్తించరు. ఇలా గర్వం అహంకారం నీవు ఏ ఆధిక్యతను కోరు కుంటున్నావో దాన్నే వ్యతిరేకించేవారిని తయారు చేస్తుంది. నిన్ను ఒంటరిగా మార్చుతుంది. సాటి మనుషుల్నుంచి దూరం చేస్తుంది.

### గర్వాన్ని తొలగించుకోవడమెలా?

వినయం, తోటివారిని ప్రేమించడం, గౌరవించడం ద్వారా అహంకారం తొలగిపోతుంది. ఒంటరితనం పోయి అందరి మనిషివవుతావు. నాకన్నా ఎవరు గొప్ప అనుకోవడం అహంకారం. నేను ఎవరికీ తీసిపోను అనుకోవడం ఆత్మవిశ్వాసం. రెంటిలో వున్న భావం ఒకటే. అప్రోచ్‌వేరు.

### గర్వం ఎన్ని రూపాల్లో వుంటుంది?

గర్వం సామాజిక సిద్ధాంతాల చర్చల్లో అనేక రూపాల్లో దర్శనమిస్తుంది. అవి ఆధిక్యత రూపంలో, ఎదుటివారిని కించపరిచే రూపంలో, పూర్వపరిచయం చేసే రూపంలో పరకాయ ప్రవేశం చేస్తుంది. విభేదిస్తూ, సంబంధాల్ని అసంబంధంలోకి మార్చుకుంటూ పోవడం ద్వారా కల్సి పనిచేసేదేమీ చర్చకు రాదు. కల్సి పనిచేయడాన్ని తప్పించుకోవడానికే విభేదాలకు ప్రాధాన్యత యిచ్చి చర్చిస్తారు. విడిపోతారు.

మనిషి మానవ సమాజ వికాసంకోసం ఎన్ని తీరులుగా కల్సి పని చేయగలమో అన్నది ప్రధానమైనపుడు ఏకీభవించే అంశాలచర్చ, ఎజెండా క్రోడీకరణ ప్రధానమవుతుంది. అప్పుడే భిన్నాభిప్రాయాలున్నా కల్సి ఆచరించే ఆచరణకు సమిష్టి నిర్మాణ రూపాలు ఏర్పడుతాయి. ఈ సమాజం భిన్నాభిప్రాయాలున్నా కల్సి ఆచరించే జీవించే సమిష్టి నిర్మాణం. కులం అనేది కూడా భిన్నాభిప్రాయాలున్నా కల్సి జీవించే సమిష్టి నిర్మాణం. రైల్వే ప్రయాణికుల సంఘం కూడా భిన్నాభిప్రాయాలున్నా కల్సి పనిచేసే సమిష్టి నిర్మాణం. ఇలా ఎన్నో ఏర్పరచుకోవచ్చు, ఏర్పరచుకోవాలి.

### ఆచరణలో కలిసి పని చేయడాన్ని నిరాకరించడానికే విమర్శ రూపం తీసుకుంటారు

ఏ ఆచరణ లేకుండా విమర్శ చేయడం ఆచరణలో కలిసి పనిచేసే అవకాశాలను నిరాకరించడానికే. నెగేట్ చేస్తూ, విభేదిస్తూ పోవడంవల్ల జిడ్డు కృష్ణమూర్తి సమిష్టి ఆచరణకు సంబంధించిన కులం, వర్గం, పౌరహక్కుల సమస్య, రాజకీయం అణిచివేత మొదలుకొని సామాజిక ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికాది నిర్దిష్ట నిర్మాణ రూపాలను పట్టించుకోలేకపోయాడు. చాలాసార్లు వాటి ఉనికిని గుర్తించ నిరాకరించాడు. నిర్మాణాత్మక కృషినుండి పలాయనం చిత్తగించాడు.

### బుద్ధుని ప్రత్యేకత - జిడ్డు కృష్ణమూర్తి వ్యతిరేకతా సిద్ధాంతం రెండు వేరు

బుద్ధుడు పాజిటివ్ దృక్పథం ద్వారా సంఘనిర్మాణాన్ని ప్రవేశపెట్టి ఆచరణాత్మక కృషి ప్రారంభించాడు. అదే సమయంలో వ్యక్తి శీలాన్ని ధర్మాన్ని ఆదర్శబద్ధం చేశాడు.



జిడ్డు కృష్ణమూర్తి "నేతి నేతి" (ఇది కాదు-ఇదికాదు) అనే ఒకానొక ఉపనిషత్ చింతనద్వారా బౌద్ధం తాలూకు పాజిటివ్ ఆచరణను, నెగెటివ్ దృక్పథంలోకి మార్చి సమిష్టి ఆచరణ, నిర్మాణం, నిర్వహణ లేని స్థితికి తెచ్చి ఆమూర్తంగా ఊహాత్మంగా చర్చించాడు. తద్వారా పరస్పర నిర్దిష్ట వేనవేల రకాల మానవ సంబంధాల్లో, వాటి నిర్మాణాల్లో కూడా కాలాతీతంగా కొనసాగాల్సిన ప్రేమ గురించి చర్చించడం అతని శక్తికి మించిన పనైపోయింది.

బుద్ధుడూ, జిడ్డు కృష్ణమూర్తి ఒక్కటి కాదు. ఓషో రజనీషూ, అతనినించి చీలిపోయి స్వతంత్ర ప్రభువుల్లా ఎదిగిన ధ్యానకేంద్రాలూ బుద్ధుడూ ఒకటి కాదు. జిడ్డు కృష్ణమూర్తి పోల్చుతూ, విభేదిస్తూ పోతాడు. శబ్దంద్వారా నిశ్శబ్దం గురించి చెప్పడం జిడ్డు ఫరిష్కరించుకోలేకపోయిన వైరుధ్యం. మౌనం యొక్క శక్తి మౌనం ద్వారా అర్థం చేయించలేకపోవడం అతని పరిమితి. ఓషో రజనీష్ క్రియాశీల రాజకీయాల్ని సామాజిక రంగాల్ని పట్టించుకోలేదు. అందువల్ల బుద్ధుడు జె.కె., ఓషో ఒకటి కాదు. బుద్ధుడు సమాజంలోని సమస్త రంగాల్ని పట్టించుకున్నాడు.

### సమాజాన్ని నడిపించే సూత్రం ప్రేమ, కరుణ, మానవత

సమాజాన్ని సామాజిక సంబంధాలను నడిపించే శక్తి ప్రేమ. ప్రతి మానవ సంబంధంలో పరస్పర ఆచరణలో అదనంగా ఉత్పత్తయ్యే అదనపు విలువ ప్రేమ. ప్రతి మానవ సంబంధం అనే శ్రమశక్తి మార్పిడిలో యిరుపక్షాల్లో ఉత్పన్నమయ్యే అదనపు విలువ ప్రేమ. పెట్టుబడి శ్రమశక్తి సరుకు ఉత్పత్తిలో పుట్టే అదనపు విలువ ఒక్కటే. మానవ సంబంధాల పరస్పర శక్తి మార్పిడిలో ఉత్పన్నమయ్యే అదనపు విలువ ప్రేమ రెండు హృదయాల్లో సంచితమవుతుంది. ప్రతి సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక సంబంధంలో ప్రేమ ఉంటుంది.

ప్రేమ వల్లే మనుషులమధ్య సంబంధాలు ఆకర్షణీయం, ఆసక్తికారకం అవుతున్నాయి. మహారచయిత ప్రేమ్‌చంద్ అన్నట్టు ప్రేమ, కరుణ మనుషులను నడిపే జీవశక్తి. అది యవ్వనంలో ఉండే ఆకర్షణ వంటిది. వయస్సు వస్తే వంకలన్నీ తీరుతాయి. ప్రేమ ఉంటే తప్పులన్నీ క్షమించబడతాయి. ఏది ప్రేమ కాదో తెలుసుకుంటూ పోతే తెలిసేది ప్రేమ కాదు. ప్రేమ రాహిత్యం. ఏది ప్రేమో తెల్సుకుంటూ పోతే ప్రేమ తెలుస్తుంది. మమకారంలో నిర్మమకారంగా, నిశ్చయంలో నిష్కామంగా, సంకల్పంలో స్వచ్ఛంగా, ప్రేమలో నిర్మలంగా ఉండడం ప్రేమ. అవి ఆశాపాశాలకు మాయా మోహాలకు అనువుగా కుదించబడ్డం మాయస్వార్థం.

ఆర్థికసంబందాలన్నీ శ్రమశక్తి మార్పిడి సంబంధాలే. ఉత్పత్తులతో పాటు ఉత్పత్తి చేసిన కార్మికులను, సృష్టికర్తలను, వినియోగదారులు ప్రేమించేట్టు చేయడంద్వారా సమాజం సహజస్థితిలో గోచరమవుతుంది.

### ప్రేమ, కరుణ సామాజికమైనది

లైంగిక ప్రేమ వ్యక్తిగతమైనది. సార్వజనీన ప్రేమ, కరుణ వ్యక్తిగతం కాదు. సామాజికమైనది. సాహిత్యం, కళల మౌలికతత్వం ఈ ప్రేమే. అలంకార శాస్త్రాలు ఎరుక క్రమం దీన్ని విస్తారంగా ధ్వని రసాల రూపంలో చర్చించాయి. లైంగిక ప్రేమ,

శృంగారం వ్యక్తిగత సహజాతం, కరుణ, ప్రేమ ఒక్కటే తోటివారిని ప్రేమించడానికి సంబంధించినది. అందువల్ల 'కరుణ' ఒక్కటే రసం అన్నాడు భవభూతి. ఇది బౌద్ధదృష్టి.

### ప్రేమించడంతో పాటు ప్రేమను వ్యక్తం చేయాలి

ప్రేమించడంతోపాటే ప్రేమను వ్యక్తం చేయాలి. ప్రేమను వ్యక్తం చేయకపోతే ఎదుటివారికి తెలిసేదెలా? ఉదా॥కు చిన్నపిల్లలున్న యింటికి నీవు వెళ్తున్నప్పుడు నీ రాక వారికి సంతోషాన్నివ్వాలి. నీవు తీసికెళ్ళే పళ్ళు, ఆటవస్తువులు, నీవు చెప్పే కథలు నిన్ను ప్రేమించేట్టు చేస్తాయి. నీవొక పరాయిమనిషిగా కనపడినపుడు వారి ఇల్లు వారికీ ఇబ్బందిగా నీకూ యిబ్బందిగా మారుతుంది. నీవు చొరవ కోల్పోయావేమో. కల్పిపోలేకపోయావేమో ఆలోచించు. నీ మంచి మనస్సును వ్యక్తం చేసినపుడు ఎదుటివారి క్షేమాన్ని అభిలషించి పాటు పడినపుడు, నిన్ను ప్రేమించేట్టు చేస్తాయి. వారి శ్రేయస్సు గురించి ఆచరణేమీ లేక కబుర్లు చెప్తూపోతే నీ ప్రేమ ప్రేమగా కనపడదు. మాటలు నేర్చిన పక్షి అనుకుంటారు.

అలాగే మంత్రులు, నాయకులు పర్యటనకు వెళ్ళినపుడు పిల్లలకు పళ్ళు తీసికెళ్ళినట్టుగానే తమ రాక సంతోషం కలిగించాలని కొన్ని వరాలు, హామీలు ప్రకటిస్తారు. కాని కొందరు అధికారులు పర్యటనకు వెళ్ళినపుడు వీడు ఎందుకొచ్చాడ్రా మా ప్రాణాలు తీయడానికి అనుకునేట్టు పటాటోపం ప్రదర్శిస్తారు. అధికారుల రాకకూడా అతని సిబ్బందికి, ప్రజలకు సంతోష కరంగా ఉండాలి.

### రాజకీయ నాయకుల్లా ఇతరులు ప్రజల దగ్గరకు వెళ్ళాలి

రాజకీయ నాయకుల్ని అందరు ఆడిపోసుకుంటారు. కాని అయిదేళ్ళ కోసారో, అంతకుముందేనో మళ్ళీ ప్రజలదగ్గరికి వచ్చి వారి అభిమానాన్ని చూరగొని అది ఓటుగా మార్చే కృషి చేసుకోవాల్సిన స్థితిలో వుంటారు. అందువల్ల ప్రజల్లో ఎవరినీ గట్టిగా వ్యతిరేకించలేరు. రాజకీయ నాయకుల్ని మేధావులన బడేవారు ఈసడిస్తుంటారు. కానీ ఈ మేధావి ఉద్యోగులు, ఉపాధ్యాయులు, లెక్చరర్లు పొందిన సర్టిఫికెట్లు, ఉద్యోగాలు అయిదేళ్ళే చెల్లుతాయని, మళ్ళీ కొత్తగా రాసి పాసైతేనే మళ్ళీ ఉద్యోగ అర్హత వస్తుందని ప్రకటిస్తే అంగీకరిస్తారా! అట్లా అయిదేళ్ళకోసారి పరీక్షలు రాసి తిరిగి ఉద్యోగం సంపాదించుకోవడం ఎంత కష్టమో అంత కష్టమైన పనిని రాజకీయ నాయకులు చేస్తున్నారు. అధికారులను దాని సంబంధాల కులను మూడేళ్ళకోసారి ప్రజలు ఎన్నుకుంటేనే తిరిగి కొనసాగించడం అనే పద్ధతి ప్రవేశపెడ్తే అధికారులు మేధావులు కూడా ప్రజలకు తలవంచి వారి ప్రేమను ఓట్ల రూపంలో గెలుచుకోవాల్సి వస్తుంది. ఆ పద్ధతి రావడం ప్రజలకు, అధికారులకు, మేధావులకు మధ్య ప్రేమ పెరగడానికి ఎంతో అవసరం.

### రష్యా, చైనా విప్లవ నాయకులు, ప్రజలు మొత్తం మానవాళిని ప్రేమించారా?

రష్యా, చైనా విప్లవాల అనంతరం అక్కడి ప్రజలు, ప్రభుత్వ నాయకులు మానవాళిని ప్రేమించారా? ఫ్రెంచి విప్లవం తర్వాత ఫ్రాన్సు, ఇంగ్లాండు వాళ్ళు ప్రపంచ ప్రజల్ని ప్రేమించేదైతే వలసల్ని మరో వందేళ్ళు ఎలా కొనసాగించారు? ఆసియా, ఆఫ్రికాదేశాల్ని 300 ఏళ్ళు దోపిడీ చేసిన సంపదతో యూరపులో పారిశ్రామిక విప్లవం



వస్తే మార్క్సు, ఎంగెల్సు ప్రపంచ ప్రజల్ని ప్రేమించేదైతే యూరపు సంపదని ఆసియా, ఆఫ్రికా పేద దేశాలకు యిచ్చేయాలని ఎందుకు సూత్రీకరించలేకపోయారు? అమెరికా నిజంగా ప్రజాస్వామికదేశమైతే డాలర్‌తో, ఆయుధాల్తో ప్రపంచాన్ని గుప్పెటలో పెట్టుకోవడం ఎలా సాధ్యం.

స్వార్థానికి, సేవకు, ప్రేమకు మధ్య తేడాక ఉంది. ఉదాహరణకు ఫ్రెంచి, ఇంగ్లాండు, అమెరికా ప్రజాస్వామ్య విప్లవాలు రష్యా, చైనా సోషలిస్టు విప్లవాలు "తన కొరకు తాను" అనే దశకు సంబంధించినవి. మొత్తం మానవాళిపట్ల ప్రేమ ఉంటే ఆయుధాల పోటీకి, వలసలకు బదులుగా ఆహారోత్పత్తి చేస్తారు. ఉచితంగా ప్రపంచానికి టెక్నాలజీ, సైన్సును అందిస్తారు. ఆయా దేశాలు సంపన్నమైనాయి. అద్దాల్లాంటి రోడ్లు, ఏసి గదులు, సుఖమైన తిండి అన్ని వారి సౌఖ్యాలే. వాటివల్ల ఇతర దేశాల పేదలకు, పేద దేశాలకు ఒరిగిందేమీ లేదు.

ప్రేమ ఉంటే అధిక ఉత్పత్తి ద్వారా, సేవా దృక్పథం ద్వారా భావాలకు అతీతంగా పేద దేశాల్లోని పేదలకు, విద్య, వైద్య, ఆహారం, టెక్నాలజీ ఉచితంగా అందించేవారు. దేశాల ఎల్లలు దాటి బౌద్ధ భిక్షువులు వందల ఏళ్ళు ఈ పనే చేశారు. కాని రష్యా, చైనాలు తమ సంపదలను, మానవ శ్రమ శక్తిని వెనుకబడిన ఇతర దేశాల ప్రజల అవసరాలకోసం వినియోగించలేకపోయాయి. వారి సుఖాలు, సౌఖ్యాలు, సంపద, స్వార్థం పెంచుకుంటూ పోయారు.

### ప్రజాస్వామ్య దేశాలకు, సోషలిస్టు దేశాలకు మధ్య వున్న పోలిక

ప్రజాస్వామ్య దేశాలు, సోషలిస్టు దేశాలు రెండూ ఈపనే చేశాయి. అందువల్ల వారి ప్రజాస్వామిక సిద్ధాంతాలు, సోషలిస్టు సిద్ధాంతాలు, స్వార్థపూరితమైన పరిధికి లోబడి కొనసాగుతున్నాయి. నీకున్న దాన్లోంచి నాకివ్వకపోయాక నిన్ను నేను దేనికి గౌరవించడం, నీవు తింటే నా కడుపు నిండుతుందా? నీ నీతులన్నీ, భావాలన్నీ నీ ఆధిక్యత కొనసాగించడానికే. ఆ సిద్ధాంతాల్ని పట్టుకు వేలాడే వాళ్ళు అందులో భాగమే. తద్వారా వాళ్ళు మన దేశంలో తినేది మగడిసొమ్ము, పాడేది మిండలపాటగా విదేశీ ఏజెంట్లుగా, విభీషణ సంతతిగా కొనసాగుతారు. బ్రాహ్మణవాదం ఆయుర్వేద వైద్యం, జ్ఞానాన్ని ఇతరులకివ్వకుండా పరిమితమై పోయింది. నీకున్న దాంట్లోంచి నాకీయకపోవడం "నీకొరకు నీవు" బతికే స్వార్థానికి పరిమితం. ఇలాంటివారికి జీవితంలోని విలువలు, సంస్కృతి సౌశీల్యాలు, ప్రజలపట్ల ప్రేమ, మానవాళిపట్ల అచంచల ప్రేమ, అర్థరహితంగా తోచవచ్చు. అయినా భావాలకు అతీతంగా మనిషిని మానవత్వాన్ని, మానవాళికి ప్రేమించడమే ప్రేమ దృక్పథం.

### ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం పెంచాలి

ప్రజల జీవన ప్రమాణాలు పెరగాలి. ఆత్మవిశ్వాసం, ఆత్మగౌరవం పెరగాలి. అలా కోరుకునేవారికి అవి అందేట్టు చేయడం ప్రేమ. వారి ఆశల్ని పెట్టుబడిగా చేసికొని ఈ సమాజాన్ని మార్చే బాధ్యత మీదే అని వున్న బరువంతా వారి వీపులమీదికి ఎత్తడం ప్రజలపట్ల ప్రేమ అవుతుందా? సమాజాన్ని మార్చుకోవడం అందరి బాధ్యత. కానీ సమాజానికి వెనకబడి పోయినవారినే ఈ మొత్తం సమాజాన్ని మార్చాలనికోరడం,

కోరుకోవడం త్యాగాలు చేయాలనడం ఏరకం ప్రేమ? ఆ వ్యూహం, ఎత్తుగడల్ని ఏమని పిలవాలి? ఇది ఇవాళటి అభివృద్ధి నాకు రేపటి అభివృద్ధి నీకు అనే పాలకవర్గాల దోపిడి దృక్పథం. కర్మసిద్ధాంతం కూడా రేపటి జన్మస్వర్గ సుఖాల ఆశ చూపి వేల ఏళ్ళుగా యిదే పనిచేసింది. ఇపుడు పదాలు మారాయి. లైంగిక ఆశ చూపి రాత్రంతా మంచం మోయించిందట ఓ స్త్రీ. ఆ తర్వాత తెల్లారిపోయింది.

### సమాజానికి వెనుకబడి పోయిన వారిని ముందు అభివృద్ధి పరచాలి

ఆధునిక, సామాజిక అభివృద్ధికి వెనకబడి పోయినవారిని సమాజస్థాయికి విద్య, వైద్య, సాంఘిక, సాంస్కృతిక, ఆర్థిక తదితర సేవా దృక్పథంతో, ప్రేమతో ఎదిగించడం నిజమైన ప్రేమ. సమాజంలో వెనకబడినవారిని తల్లిదండ్రులు పసిపిల్లల్ని ఎదిగించినట్టుగా ఎదిగించాలి. ఎదగాల్సిన పిల్లలు విప్లవం అనే పనిచేస్తే కూర్చుని తింటాం అనుకునే తల్లిదండ్రులకు పిల్లలపై ప్రేమ ఉన్నట్టా? సమాజానికన్నా వెనకబడిన వారే మొత్తం సమాజాన్ని మార్చాలనుకోవడం ఇలాంటిదే. ఇది పాలకవర్గాల దృక్పథం. విప్లవం వచ్చేదాకా ఎన్నికల ద్వారా వచ్చే అధికారాన్ని పరిశ్రమలను, ఉద్యోగాలను, సినిమా, రేడియో, టివి రంగాలను, పదవులను పాలకవర్గాలకే దోపిడి కులాలకే రిజర్వు చేసే దోపిడి వర్గ దృక్పథంలో భాగంగానే వాటిని బహిష్కరించడం ఉత్పన్నమైది.

### నెగెటివ్ థింకింగ్, ద్వేషం అవసరమా?

పాలకవర్గాలనో, దోపిడీ కులాలనో, ఇతర మతాలనో ద్వేషించాలని చెప్పడంలో తొంభయి శాతంగా గల ప్రజలు తమలో తాము ప్రేమించుకోవడంగానీ, చెప్పేవారు ప్రజల్ని ప్రేమించడం గానీ లేవు. ద్వేషించండి అని నెగేట్ చేయడం ద్వారా ప్రజలపై ఒక భావం ద్వారా తన ఆధిక్యతను నెలకొల్పడమే ఉంది. పది శాతం గల పాలకవర్గాల, పాలక కులాల పట్ల ద్వేషాన్ని పెంచడంకన్నా, తొంభయి శాతం గల ప్రజలమధ్య ప్రేమను పెంచడం ముఖ్యం. ద్వేషించడం ద్వారా ప్రేమ ఆచరణ ఉత్పన్నం కాదు. ప్రేమించడంద్వారా ప్రేమ ఉత్పన్నమవుతుంది. ద్వేషం ద్వేషాచరణను పురికొల్పుతుంది. ద్వేషించాల్సిన వాటినే వెతుక్కోవడం పని అవుతుంది. ద్వేషించాల్సినవి బలహీనపడితే ప్రేమ, ఐక్యత విచ్ఛిన్నమవుతాయి. అందువల్ల ద్వేషించాల్సిన వాటిని మరింత శక్తివంతం చేయడం ద్వారానే ద్వేషించేవారిని ఒక్కటి చేయడం సాధ్యమవుతుంది. తద్వారా ఓడిపోవడమే అంతిమ ఫలితంగా పరిణమిస్తుంది.

కొందరు జీవితంలో రచనల్లో కోపాన్ని, ద్వేషాన్ని, ఈర్ష్యను, విమర్శను వ్యక్తం చేయడం నేర్పినంతగా సహృదయతను, ప్రేమను, కరుణను, త్యాగాన్ని, స్నేహాన్ని, సహనాన్ని, నేర్పలేరు. తద్వారా మాటలు వల్లించి ప్రేమ తాలూకు ఆచరణ నుండి పలాయనం చిత్తగిస్తారు. ఆచరణలో ప్రేమ, కరుణ, త్యాగం, స్నేహం గురించిన ప్రశ్న తనవైపు తిరక్కుండా ఉండేందుకే రాజకీయాలు, కులాలు, వర్గాలు, జాతులు, భాషలు, దేశాలు, దృక్పథాలు పేరిట వాటి నాయకులు ద్వేషం, కోపం, అనుమానం, ఈర్ష్య రగులుకొల్పుతారని అంటారు.

### నిన్ను నీవు అణచివేసుకొనే కార్యక్రమాలు, విశ్వాసాలు వదిలేయాలి

దైవ భావన, పంచాంగం, జ్యోతిష్యం, వాస్తు కూడా నీవు నమ్మడం ద్వారానే



నీవు వాటి ప్రభావానికి లోనై నీకు నీవుగా అణిచివేయబడతావు. వాటిని నమ్మడంవల్ల అవి చెప్పినట్టుగా నడిచేవిధంగా మనస్సు హిప్నటైజ్ అవుతుంది. కనుక అవన్నీ మనమే ఆచరిస్తాము. ఆ తర్వాత అరే వాళ్లు చెప్పినవన్నీ నిజం అయిపోయాయి అని ఆశ్చర్యపోతాము. ఉదాహరణకు చీకట్లో ఒక తాడునుచూసి పాము అనుకుంటే మనలో నిజం పామును చూసినప్పుడు కలిగే భయము కలుగుతుంది. చమటలు పోస్తాయి. చీకట్లో పెద్దపులి మీద పడుతుందని ఎవరైన అనగానే గజగజ ఒణికిపోతారు. ఇలాగే జ్యోతిష్యం, పంచాంగం, వాస్తుకూడా ఇలా జరుగుతుంది అనగానే ఏదో భయం, విశ్వాసం మనలో అలాంటి ఆలోచనల్నే, ఆచరణనే పుట్టిక వస్తుంది. మునుపు కడుపులో బల్ల అయితే లివర్‌వ్యాధి అని తెలువక ఎవరో మందు పెట్టారని అనుమానించి బంధువుల్ని దూరం చేసుకున్నారు. అది ఒక వ్యాధి అని తెలిసిన తరువాత ఆలోచన, ఆచరణ వేరేతీరుగు ఉంది.

### మనం ఎలా ఆలోచిస్తామో అదే జరుగుతుంది

ఇలా మనం ఆలోచిస్తున్నదాని క్రమమే మనం ఉన్న తీరు. మన ఆలోచనలు, విశ్వాసాలు మనను నిర్మిస్తూ నిర్దేశిస్తాయి. అందువల్ల దైవాన్ని, జ్యోతిష్యాన్ని, వాస్తును నమ్మినవారినే అవి మొదట అణిచివేస్తాయి. నీవు ప్రేమించినవారే నిన్ను తిరస్కరించినపుడు నిరాశా, నిస్పృహ ఆవరించి ఆత్మహత్యదాకా ఆలోచిస్తావు. నీకు వారిపై గల విశ్వాసం, గౌరవం తొలగించుకొంటే ఆ నిరాశా, నిస్పృహలు పటాపంచలవుతాయి. కొత్త ఆత్మవిశ్వాసం ఉరకలు వేస్తుంది. దైవం, జ్యోతిష్యం, వాస్తు, ఈ చెప్పినదాన్ని అనుసరించి నిన్ను నీవు మలుచుకోవడంవల్లనే అవి నిజమవుతాయి. నీ ఆచరణ ద్వారానే అవి నిజమవుతాయి తప్ప మరెటువంటి నమ్మకాల వలన కాదు.

### ఎవరి పట్ల గౌరవం, విశ్వాసం లేదో, వాళ్ళు నిన్ను బాధపెట్టలేరు

నీకు ఎవరిపట్ల దేనిపట్ల గౌరవం విశ్వాసం లేదో వారు, అవి నిన్ను మానసికంగా బాధించడం, హింసించడం అసాధ్యం. నీవు దేనిని ప్రేమిస్తున్నావో, గౌరవిస్తున్నావో అదే నిన్ను మానసికంగా బాధించడం సాధ్యం. గౌరవం, విశ్వాసం లేనివారిపట్ల పోరాడుతావు. కాని అవి పెంచుకున్నవారిపట్ల వారి ప్రవర్తన చూసి కుంగిపోతావు. నీవు వారి ప్రభావంలో ఉండడమే నీ బాధకు కారణం. ఆ ప్రభావాన్ని తొలగించుకుంటే వారి ఏ ఒక్క మాటా, నిన్ను బాధించదు. ద్వేషరహితంగా, కరుణతో ఉన్నపుడు వారిపట్ల గౌరవం ద్వేషంగా పరిణమించదు. తిరిగి ఒక కొత్త స్నేహితుడి పరిచయంలా సంబంధాలు ప్రారంభించాలి.

### బాధను బాధగా వ్యక్తం చేయాలి-బాధను కోపంగా వ్యక్తం చేయకూడదు

నీకు కలిగిన బాధను బాధగా వ్యక్తం చేయాలి. బాధను బాధగా వ్యక్తం చేసినపుడే ఎదుటివారిలోనూ సానుభూతి, బాధ కలిగి నీకనువుగా స్పందిస్తారు. బాధను కోపంగా మార్చుకుని వ్యక్తీకరిస్తే అదొక ఆధిక్యతా ప్రదర్శనగా పరిణిమించి ఎదుటివారిలోనే కోపాన్ని తెప్పించవచ్చు. కోపం ఒక ఆధిక్యతా ప్రదర్శన. బాధ, ఆవేదన, కరుణ, ప్రేమ ఒక సహృదయ స్నేహ వ్యక్తీకరణ. నీవు ప్రేమించేవారిని ద్వేషించడం సాధ్యం కాదు. నీవు ప్రేమించేవారు నీవు అనుకున్నదానికన్నా భిన్నంగా ప్రవర్తించి బాధ కలిగిస్తే

బాధపడ్డం నిజమైన ప్రేమ. బాధ కోపంగా మారితే ప్రేమ స్థానంలో ఆధిక్యతా ప్రదర్శన లేదా చిన్నచూపు ఉందని అర్థం.

తన కోపమే తన శత్రువు. తన ద్వేషమే తన శతృవు. నిన్ను నిన్నుగా ప్రేమించుటకు తోడుగ నిలిచేవారే నిజమైన సన్నిహితులు, స్నేహితులు. బాధను కలసి కలబోసుకోవడానికి తోడు ఎవరూ లేని స్థితికన్నా దైన్యం మరొకటి లేదు. అలాంటి స్థితి కలగడానికి నీకు నీవు సృష్టించుకున్నవే కారణాలు. అవసరం లేకపోయినా అప్పులడిగితే నిజంగా యిచ్చి ఆదుకునే వారెవరో తెలుస్తుంది.

### సౌజన్యం, మంచితనం బలహీనతగా భావిస్తే ఏం చేయాలి?

తన స్వార్థమే ఆధిక్యతే పరమావధిగా గలవారికి ఇతరులు చూపే సౌజన్యం, మంచితనంను, బలహీనతగా, అలుసుగా తీసుకుంటారు. పొందిన మేలు మరిచిపోతారు. అలాంటి సందర్భాల్లో మనుషులపట్ల విశ్వాసం నశించి తన సహృదయత ప్రాముఖ్యత లేనిదిగా గుర్తింపు నోచుకోని స్థితి ఏర్పడుతుంది. వారి ఆధిక్యతను ప్రశ్నిస్తూ తొలగిస్తూనే నీ ప్రేమను సౌజన్యాన్ని విడనాడకుండా సాయం చేస్తూ ఉండాలి.

నీ నిజాయితీ అరమరికలు లేనితనం నిన్ను బలహీనునిగా భావించేందుకు కారణం కావచ్చు. ఈ సూటిదనం నిన్ను తలతిక్కగల వాడిగా కొందరు అనుకోవచ్చు. సూటిగా ఉంటూనే సహృదయతతో ప్రేమపూరిత భాషను అలవరుచు కోవాలి. కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడ్తే ప్రేమ నింపడానికి కొత్త కొండలు వెతుక్కోవాల్సి వస్తుంది. అలవాటుగా వాటిని బద్దలు కొడ్తే నిరంతరం పాతమిత్రుల్ని కొత్త శతృవులుగా మార్చుకున్నవాడివవుతావు.

### నీ సూటిదనం ఇతరులను హర్ట్ చేయకూడదు...

నీ సూటిదనం ఇతరులను అగౌరవ పరచడానికి కాదు. వారి హృదయాలను గెలుచుకోవడానికి. నీ భావాలు నీవేనా? నీవు పుట్టకముందు నుండీ వేలేళ్ళుగా కొనసాగుతూ వస్తున్న భావాలేమో. నీకాభావాలు పుట్టుకతో వచ్చాయా? నీవు స్వీకరించడంవల్ల నీ భావాలైనాయి. భావాలకు నీవు అధీనుడవైతే భావాలు నిన్ను ఆడిస్తాయి. నీవు ఆడేవాడిగా ఉండిపోతావు. నీ భావాలు మార్చి తన భావాలకనువుగా నిన్నాడించడమే అనివార్యం చేసికొంటావు. భావాలకు నీవు ఆధీనుడవు కాకూడదు. భావాలే నీ ఆధీనంలో ఉండాలి.

### నీ భావాలే నీవు కాదు - నీ భావాలు మారుతుంటాయి అయినా నువ్వు నువ్వే

నీ భావాలే నీవా? నీకా భావాలు ఏర్పడకముందు నీవు నీవు కాదా? ఇపుడున్న భావాలు రేపు మారుతాయి. అపుడు నీవు లేవా? నీ భావాలు లేకపోయినా నీవు ఉన్నావు. నీ భావాలు సమస్తం మారిపోయినా నీవున్నావు. మనిషి కోసం భావాలు కానీ భావాలకోసం మనిషి కాదు. భావాలకోసం మనుషులు చావటం, చంపటం అనేవి ఆ భావజాలకర్తలు భోక్తలు చేయించే యుద్ధాలే. అనుచరులు లేకుండా ఆ భావజాలకర్తలనే భోక్తలనే ఆ యుద్ధాలు చేసికొమ్మంటే సమస్య పరిష్కారమౌతుంది.



### నోరు మంచిదైతే - ఊరు మంచిదవుతుంది

ఎదుటివారితో విభేదిస్తూ "కాదు" అని చర్చ ప్రారంభించి, ఏకీభవించే అంశాల్తో ముగియడం అహంకారానికి భూస్వామ్య సంబంధాల జీవితం నుండి ఇంకా బయట పడలేదనడానికి నిదర్శనం. ఎదుటివారితో ఏకీభవిస్తూ అవును మీరన్నదాన్లో సత్యం ఉంది. అంటూ తనకు తెల్సిన సత్యాల్నీ కూడా దానికి జత చేయాలని ముందుంచడం ఆధునిక సంస్కృతి.

ఇలా నోరు మంచిదవుతే ఊరు మంచిదవుతుంది. భావాన్ని ప్రేమ పూరితంగా చెప్పగలిగితే హృదయం గెలుచుకోవడం సాధ్యమవు తుంది. ఒక భావం గొప్పదైనంత మాత్రాన అది చెప్పడం వల్ల నీకు గొప్పతనం లభించకపోవచ్చు. నీ జీవిత ఆచరణననుసరించి ఆ భావంపట్ల ఇతరులకు గౌరవమో తిరస్కారమో ఏర్పడుతుంది. నీ నోరుమంచిదై స్వభావం మంచిదైనపుడే ఊరు మంచిదవుతుంది.

### నాది అనే భావనలో ఉండే స్వార్థం-ప్రేమ

ఇది నాది, వీళ్ళు నా వాళ్ళు, ఈ భాష నాది, ఈ సంస్కృతి నాది, ఈ దేశం నాది, ఈ వర్గం నాది, ఈ కులం నాది, ఈ మతం నాది అనుకున్నపుడే వాటిని స్వీకరించడం, ప్రేమించడం అలా ప్రవర్తించడం సాధ్యమవుతుంది. అపుడు కష్టాలన్నీ కూడా యిష్టంగా ప్రేమతో ఎదుర్కొంటావు. ఈ ప్రపంచం నాది, ఈ మనుషులంతా నా వాళ్ళు. ఈ ప్రపంచ సంస్కృతంతా నాది అనుకున్నపుడు ఈ కులం మాత్రమే నాది, ఈ వర్గం మాత్రమే నాది, ఈ సంస్కృతి మాత్రమే నాది అనే సంకుచిత పరిధిని అధిగమిస్తావు. ఏ భావాల్ని స్వీకరిస్తావో అలా ప్రవర్తించడమే చేస్తావు.

ఇది నాది కాదు అనే భావన స్పందనల్ని అరికడుతుంది. అంటరానితనానికి గురి చేస్తుంది. స్పర్శ కోల్పోతుంది. దేకేది నాది కాకపోతే కాశీదాకా దేకమన్నాడట అనే లోకోక్తి దీన్నించే పుట్టింది. ఒక కులాన్ని ఒక భావాన్ని ఒక సమస్యని ఇది నాది కాదు అనుకున్నాక స్పర్శ, స్పందన కోల్పోతావు. ఈ పిల్లలు నా పిల్లలు కారు, ఈ మనుషులు నా మనుషులు కారు అనుకోవడం నుంచే నీ చొరవను, ప్రేమను నీకు నీవే అరికట్టడం మొదలవుతుంది. ఈ ప్రకృతి నీది, ఈ సమాజం నీది, ఈ మనుషులంతా నీవాళ్ళు అనుకోవడం ద్వారానే నీలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది. స్వార్థపరుల్ని అధిగమించడం సాధ్యపడుతుంది.

### స్వార్థం అంటే తాత్వికార్థం ఏమిటి?

నీ వ్యక్తిగత ప్రయోజనానికి పదిమంది ప్రయోజనానికి మధ్య వైరుధ్యంలో నీ ప్రయోజనం చూసుకోవడం స్వార్థం. పదిమంది ప్రయోజనానికనువుగా నిన్ను నీవు మలుచుకోవడం సామాజిక దృష్టి. మానవాళికనువుగా ప్రవర్తించడం మానవతా దృక్పథం. నీ కులం, యూనియన్, పరిమితులకు మానవతను కుదిస్తే అది కుల దృక్పథం, వర్గదృక్పథం, ప్రాంతీయ దృక్పథం. నీ పార్టీ ప్రయోజనానికనువుగా మానవతను కుదిస్తే స్వార్థం.

### ప్రేమలో మూడు దశలు

1. తనలో తాను ప్రేమించడం ఇది అవ్యక్తం. మనస్సులోనే ఉంటుంది.
2. తనకొరకు తాను ప్రేమించడం. తన ఉనికికోసం, జీవితంకోసం అవసరమైన స్థితికి సంబంధించిన ప్రేమ. ఇది వ్యవహారిక ప్రేమ.
3. ఇతరులకొరకు తాను ప్రేమించడం. ఇది మానవాళిపట్ల గల కరుణార్ద్ర, సహృదయ ప్రేమ.

తనకొరకు తాను లేకుండా ఇతరుల కొరకు ఉండడం కూడా సాధ్యం కాదు. కనుక రెండోదానికి ప్రాధాన్యత యిచ్చేవారిది వ్యవహారిక ప్రేమ. మూడోదానికి ప్రాధాన్యత యిచ్చేవారిది ఉదాత్త ప్రేమ.

ప్రేమించడం ద్వారా ఆశించే దానిపై నీవు ఆధారపడితే అది తనకొరకు తాను ప్రేమించడంగా పరిణమిస్తుంది. స్వీయరచన "సదువు" కథ నుండి స్వేచ్ఛానుసరణతో ముగిస్తాను.

### సాధు సన్యాసి తత్వం ఏమిటి? సంసారంలో సన్యాసిగా జీవించాలి

"ఈ లోకం సత్యం. ఈ స్వార్థం, అసూయ భవభావబంధాలు, ఆధిపత్యం రాజకీయం ఇవన్నీ సత్యమే. తన స్వార్థంతో వీటిల్లో కూరుకు పోవడం మాయ. స్వార్థం నుండి విముక్తమై వీటన్నిటా ఉంటూనే సన్యాసిలా జీవించడమే ఈ మాయ నుండి విముక్తం కావడం. అదే నిజమైన స్వేచ్ఛ, స్వచ్ఛమైన ప్రేమ కరుణ. ఏ పని చేయకుండా కొందరిలా బొర్రలు పెంచి మఠాలు ఆశ్రమాలు నడపడం, ఆశ్రమాల ఆస్తుల్ని పెంచుకుంటూ శిష్యుల్ని దోపిడీ చేస్తూ పోవడం స్వార్థం. పనిలో ఆనందమే ప్రేమ. మనుషులమధ్య సంబంధంలోని ఆనందమే ప్రేమ. ప్రేమంటే సృష్టించడంలో, నిర్వహించడంలో పొందే ఆనందం. అది శూద్రుల్లో, చిల్లరకులాల్లో, స్త్రీల్లో ఉంది. సమస్త వస్తువుల్ని, సంపదల్ని సృష్టించేది కింది జాతులవాళ్ళే, స్త్రీలే. అందువల్ల ప్రేమ, బ్రహ్మానందం అంటే వారికి తెలిసినంతగా మరెవరికి తెలియదు".

భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు, అధికారం, పేరు ప్రతిష్ఠలు, కులం, మతం ఈ దేహంతోపాటు నీ భావాలపై కూడా ఇది నాది అనే ఆస్తి హక్కు లేని అభావ స్థితికి చేరుకొని సమాజంకోసం కృషి చేయడమే నిజమైన ప్రేమ. అపుడే నిజమైన స్వేచ్ఛ, స్వచ్ఛమైన ప్రేమ కరుణ, ఆదర్శ ప్రపంచం, నిజమైన సోషలిజం ఆచరణలోకి వస్తుంది".

భావాలకు అతీతంగా మనిషిని, మానవాళిని ప్రేమించడమే మానవీయ ప్రేమ దృక్పథం. స్వార్థానికి అతీతంగా ప్రేమించడమే నిజమైన మానవీయ ప్రేమ.

మానవతా దృక్పథంలో భాగంగా మానవ సమాజాభివృద్ధి కోసం జిజ్ఞాసను, ఎరుకను, జ్ఞానాన్ని, సైన్స్‌ను, మానవ సంబంధాలను నిరంతరం అభివృద్ధి పరచుకోవడం అవసరం.



## ప్రశ్నలు

1. ప్రేమ, కరుణ ఒక చైతన్యరూపం ఎలా అవుతాయి?
2. స్వార్థానికి, వాడుకోవడానికి, నిస్వార్థానికి, మానవత్వానికి తేడా ఏమిటి?
3. ప్రేమలో ఏ యే అంశాలు ఇమిడి వున్నాయి?
4. జ్ఞాపకశక్తికి, ఆసక్తికి, ప్రేమకు మధ్య సంబంధమేమిటి?
5. అవసరం, ఇష్టాయిష్టాలను ఎలా మారేస్తుంది?
6. గర్వం ఎన్ని రూపాల్లో వుంటుంది?
7. మనం ఎలా ఆలోచిస్తామో అదే జరుగుతుంది. మీ అనుభవాలను వివరించండి.
8. సాధు, సన్యాసితత్వం అంటే ఏమిటి?

## మనసులోని మాట

ఊహకు, అనుభవానికి తేడా ఉంటుంది. నేను సభలకు వెళ్ళినప్పుడు ఫొటోలు తీసుకోవచ్చని ఒక కెమెరా ఉంటే బాగుండనుకున్నాను. ఒక యువ మిత్రుడు కానుకగా ఇచ్చాడు. కెమెరా వెంట తీసుకువెళ్ళాను. ఆ కెమెరాలో నేను పాల్గొన్న మీటింగ్‌లను ఫొటోలు తీశాను. అందులో నా ఫొటోయే లేదు. నా ఫొటోల కోసం కెమెరా ఉంటే బాగుంటుంది అనుకున్నది ఊహ. అది చేతికి వచ్చాక నా ఫొటోనే అందులో ఉండదు అనేది అనుభవం.

ఏనుగుకు తినే దంతాలు వేరే, చూపే దంతాలు వేరే. సామాజిక ఉద్యమ భావజాలం, మతాలు, పార్లమెంటరీ పార్టీలు, ఎన్నికల్లో పాల్గొనే వారు తినే దంతాలు వేరే. చూపే దంతాలు వేరే.

మనసులో ఒకటి పెట్టుకొని పైకి ఒకటి మాట్లాడతారు. మాట ఒకటే పరిశీలించడం కాదు. మనసును పరిశీలించాలి, ఆచరణను పరిశీలించాలి. స్వభావాన్ని పరిశీలించాలి. ఆచరణ పరిణామాల్ని, ఫలితాల్ని పరిశీలించాలి. దృక్పథాలన్నిటికి, భావాలన్నిటికి, ఉద్యమాలన్నిటికి ఈ మాట వర్తిస్తుంది. అవి మనసులో ఒకటుంచుకొని పైకి ఒకటి చెప్పడం చేయవచ్చు.

చివరకు మిగిలేది ఏమిటి? చివరకు ఏదీ మిగలదు. మానవ కార్యకలాపాల చరిత్రే మిగులుతుంది. ఆస్తులు, అనుభవాలు సమాజానికి మిగిలిపోతాయి. చివరకు చరిత్ర కూడా సమాజానికి బరువుగా, భారంగా పరిణమిస్తుంది.

మౌనంగా, నిశ్శబ్దంగా ఉండాలనుకునే వారు శబ్దాలు విని వాళ్ళకన్నా ఎక్కువగా ఇదేమి శబ్దం, ఇదేమి అల్లరి అని అరిస్తే వాళ్ళ మౌనం, నిశ్శబ్దం ఏమైనట్టు? జిడ్డు కృష్ణమూర్తి మౌనం గురించి చెప్పడానికి మౌనాన్ని వదిలి మాటను ఆశ్రయించడం ఇంతే కదా!

కార్మికవర్గ రాజ్యమంటే యూరప్ పెట్టుబడిదారుల స్థానంలో యూరప్ కార్మికులు పాలకులు కావడం. సోషలిజం, కమ్యూనిజం అంతిమ సత్యం అని చెప్పడమే మార్క్సిజం ఒక మతంగా మారిపోయిందని అర్థం. మార్క్స్, ఏంగెల్స్‌లు కమ్యూనిస్టు మేనిఫెస్టో రాసే నాటికి వారి వయస్సు పాతికేళ్ళే. వారికి ఏ అనుభవం లేదు. 150 ఏళ్ళ చరిత్ర అనుభవాలు, కోట్లాది ప్రజల అనుభవాలు వారి అనుభవాల కన్నా, ఆచరణ కన్నా ఎన్నో రెట్లు ముందుకు సాగాయి.

ప్రతి చిన్న విషయానికి కొందరు యుద్ధం చేయాలన్నారు. గోర్లతో పోయే దానికి గొడ్డళ్ళతో నరకాలన్నారు. సమస్యల్ని ఉద్యమాల పేరిట పరిష్కరించే బదులు పెంచే, వాయిదా వేసే క్రమం కూడా ఉంటుంది. వీటిని పసికట్టడానికి నైపుణ్యంకావాలి.



# నిత్యజీవితంలో దృక్పథాలు పనిచేసే తీరు

జీవితానికి ఒక దృక్పథం అవసరం అని గత అధ్యాయంలో చూశాం. జీవిత దృక్పథానికి సామాజిక దర్శనం నేపథ్యంగా వుంటుంది. అందువల్ల ఈ అధ్యాయంలో సామాజిక దర్శనాన్ని పరిశీలిద్దాం.

**దృక్పథాలు ఎన్ని రూపాల్లో కొనసాగుతుంటాయి?**

మొదటి భాగంలోని 'జీవితానికి ఒక దృక్పథంలో అవసరం' అనే అధ్యాయంలో దృక్పథం ఎన్ని రూపాల్లో కొనసాగుతుందో చూశాము. నిత్యజీవితంలో సామెతల రూపంలో, విధి నిషేధాల రూపంలో, సూచనల రూపంలో, సంస్కారం రూపంలో, సంస్కృతి రూపంలో, బంధుమిత్రుల వావివరసల రూపంలో, మతాల రూపంలో దృక్పథాలు కొనసాగుతుంటాయి. వీటన్నిటినీ సామాజిక దర్శనంగా చెప్పవచ్చు.

**సామాజిక దృక్పథాన్ని దర్శనాలను అధ్యయనం చేయడం సులభం**

జీవిత దృక్పథాన్ని, సామాజిక దర్శనాన్ని అధ్యయనం చేయడం సులభం. వలవేసి చేపలు పట్టడంలో, చెప్పులు చేయడం, వంట వండటంలో, మేకలు కాయడంలో, బట్టలు నేయడంలో ఒక తాత్వికాంశం ఉంది. వారిలో ఆ యా వస్తుతత్వాల నైపుణ్యం ఉంది. దాన్ని యితర రంగాల్లోకి విస్తరిస్తే తత్వం తెలుసుకున్నవారవుతారు.

పల్లెల్లో యిప్పటికీ తత్వాలు పాడుకుంటారు. వేమన తత్వాలు, వీరబ్రహ్మం తత్వాలు, ఇతర తత్వాలు పాడుకునేవాళ్ళు తత్వం తెలిసినవారే. ముఖ్యంగా వైరాగ్య గీతాల్లో బైరాగి తత్వాల్లో బోలెడు తాత్వికత ఉంటుంది.

మన సామెతల్లో, నుడికారాల్లో, పలుకుబడుల్లో ఎంతో తాత్వికత ఉంటుంది. గురు రవిదాస్, కబీరు దోహాల ద్వారా సామాజిక తాత్వికతను అందించారు. 'పంచతంత్రం' వంటి నీతికథల్లో బోలెడు సామాజికతత్వం దాగిఉంది.

రాజుల పంచన జేరిన తాత్వికులు, యిపుడు విశ్వవిద్యాలయాల పంచన జేరిన తాత్వికులు సులువుగా అర్థమయే తత్వాన్ని ప్రజలకు అర్థంకాని భాషలో, పదబంధాల్లో చర్చించారు.

తత్వశాస్త్రాన్ని ప్రజలకు దూరంచేశారు. ప్రజలకు తత్వం తెలియదు అన్నారు. కాని ప్రజలకు తెల్సిన తత్వం చాలామంది తత్వవేత్తలకు తెలియదు. ఎక్కువ చదివినవాళ్ళు ఎక్కువ కఠినం చేశారు. తేలికగా చెప్పిన వాళ్ళది తత్వమేకాదన్నారు.

వెనకటిరోజుల్లో వైద్యశాస్త్రంలో, వేదాంతంలో చర్చలు విపరీతంగా సాగుతూ ఉండేవి. దేహం ముఖ్యమా? ఆత్మ ముఖ్యమా? సర్వధర్మాలను, అర్థాలను, కామాలను, మోక్షాన్ని సాధించాలంటే దేహం, దాని ఆరోగ్యం చాలా అవసరమని వైద్యులు చెప్పేవారు. అందుకే దేహపతనానంతరమే మోక్షం సిద్ధిస్తుందని వేదాంతులు చెప్పేవారు. ఒకరిది సిద్ధాంతమైతే మరొకరిది పూర్వపక్షం అయ్యేది. అందుకే వైద్యులు వారి వాదాన్ని సమర్థించడానికి కావలసిన తర్కాన్ని, వాదవిద్యను రూపొందించుకోవలసి వచ్చింది. అట్లాగే వైద్యవృత్తిని ఎవరు చేపట్టాలి? వైద్యవిద్యను బోధించే ఆచార్యుని గుణగణాలు ఎట్లా ఉండాలి మొదలగు ప్రశ్నలనువారే వేసుకొని, ఆ ప్రశ్నలకు తగిన సమాధానాలను వారే చెప్పారు. అవన్నీ అగ్ని వేశునిచేత పరిష్కృతమైన 'చరక సంహిత' అనే గ్రంథంలో పొందుపరిచారు. (భారతీయ తత్వశాస్త్రం - సుందరరామయ్య - పేజీ 38)

**పరోపకారానికి మించిన తత్వం ఉందా?**

ప్రతి ఒక్కరికి అర్థమయ్యే సామాజిక తత్వం పరోపకారం. వీలైతే మేలుచేయి. కీడుమాత్రం చేయకు, చెడపకురా చెడదవు, కాకి పిల్ల కాకికి ముద్దు, పొరుగింటి పుల్లకూర రుచి, కూర్చుని తింటే కొండలు కరిగిపోతాయి, చేస్తే కడుపు నిండే - చేయకపోతే కడుపు ఎండె, ఎద్దున్నోనికి బుద్ధిలేదు - బుద్ధి ఉన్నోనికి ఎద్దులేదు, నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది. మొదలగునవన్నీ సామాజిక తత్వశాస్త్ర అంశాలే.

అట్లే రౌతుమెత్తనైతే గుర్రం కుంటినడక నడుస్తుంది అనేమాట పరిపాలన, నిర్వహణకు, రాజనీతి శాస్త్రానికి సంబంధించిన గొప్పమాట. ఇలా నిత్య జీవితంలోని సామెతల్లో, పలుకుబడుల్లో గొప్ప సామాజిక తత్వం ఉంది.

విష్ణుశర్మ రాసిన 'పంచతంత్రం' కథలు గొప్ప సామాజిక దర్శనం. "కాకిపిల్ల కాకికి ముద్దు" అనే మాటగురించి ఒక పుస్తకమే రాయొచ్చు. ఒక పుస్తకం చదివినంత జ్ఞానం ఈ ఒక్క మాటలోనే ఉంది. మనసుంటే మార్గం వుంటుంది అనే మాట ఎంత గొప్ప ఫిలాసఫీ!

"పరోపకారం" అనే మాటకు మించిన గొప్ప తత్వం యింకాపుట్టలేదు. "ఈ చెయ్యి ఆడితే ఆ చెయ్యి ఆడుతుంది" అనే మాట పరస్పర సహకారం తత్వాన్ని తెలుపుతుంది.

"నువ్వు ఎడ్డం అంటే వాడు తెడ్డం అంటాడు" అనే మాట పరస్పర వ్యతిరేకించే గుణాన్ని తెలుపుతుంది.

"వెనకటికి ఎవడో ఊరికి అమానలేదు అన్నడట" అనే మాట తర్కంతో ఎదుటివారి వాదాన్ని తేలగొడ్తూ, అంతా శూన్యం చేసి మాట్లాడేవారిని ఖండిస్తూ ఈ మాట అంటారు.

"చెప్పెటోనికి బుద్ధిలేకపోతే వినెటోనికి బుద్ధి లేదా!", "వాడు చెర్ల దూకమంటే దూకుతావా?" అనే మాట సొంత వివేచన ఉండాలని చెప్పడానికి సంబంధించినది.



"దున్నపోతు ఈనిందంటే దూడను కట్టెయ్యిమన్నాడట వెనకటికెవడో" అని చెప్పడంలో గొప్ప తాత్విక వివేచన వుంది.

**రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు :**

గతం గతః అని పండితులంటారు. "చెరువు నీళ్ళు చెరువెనక వడ్డంక ఏమనుకుంటే ఏమస్తది" అని ప్రజలంటారు.

"మొగడు సచ్చినంక ముండ బుద్ధిమంతురాలైనట్టు" అనేమాట అవకాశాలు అన్నీ కోల్పోయినంక బుద్ధి తెలిస్తే ఏంలాభం అనే తత్వాన్ని తెలుపుతుంది.

"రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు ఏగుతాయి" అనడంలో కొట్లాట, వాదవివాదాలు, తర్కాలు యిరుపక్షాలు కాలుదువ్వినపుడే జరుగుతాయి. చెరికొంత తప్పుంది అని చెప్పే తాత్విక అంశం.

ఇలా ఎన్నైనా చెప్పవచ్చు. సామాజిక తత్వశాస్త్రం అంటే ప్రజల జీవితమంతా పరుచుకొని ఉన్నదే. అందువల్ల సామాజిక తత్వశాస్త్రం అర్థంకావడం సులువు.

**నడిసే ఎద్దునే పొడుస్తరు :**

నడిసే ఎద్దునే పొడుస్తరు - పని చేసినవాన్నే అంటారు. నడిసే ఎద్దునే ఎందుకు పొడుస్తరు? నడవని ఎద్దుకూడా దాంతోపాటు నడుస్తదని. అలాగే పనిచేసిన వాన్నే అంటారు. పండిన చెట్టునే రాళ్ళతోనికొడ్తరు. ఏమైన రాల్తాయని.

నాభికాడ (కడుపులో) సల్లవడితే నవాబుతోటి జవాబీయచ్చు. చాట్లతవుడువోసి కుక్కలకు కొట్లాడవెడ్తరు.

రోట్లో తలపెట్టి రోకండ్లకు భయపడితే ఎట్ల? రోలువోయి మద్దెలకు చెప్పుకుంటే నీకు ఒక పక్కనే వాయిస్తరు, నాకు రెండుపక్కల వాయిస్తరు అన్నదట.

మీ యిల్లుకు మాయిల్లు ఎంతదూరమో, మాయిల్లుకు మీ యిల్లు అంతేదూరం. మీయింటికస్తే ఏంపెడుతవ్, మాయింటికస్తే ఏం తెస్తవ్ అన్నడట ఒకాయన.

ఇలా ప్రజలు సామాజిక తత్వశాస్త్రాన్ని, తర్కశాస్త్రాన్ని నిత్యం వాడుతునే ఉన్నారు.

భిన్నత్వం గురించి పుర్రెకో గుణం జిహ్వాకోరుచి అన్నారు.

భిన్నత్వంలో ఏకత్వం గురించి కోటి విద్యలు కూటికొరకే అన్నారు.

సంపద పెరగగానే అంతదాకా లేని అగ్రకులభావన ఎలా పెరుగుతుందో చెప్పడానికి "కాపు బలిస్తే రెడ్డి" అని అన్నారు.

ఇంత సులభంగా ప్రజలు సామాజిక శాస్త్రాల్లో అర్థశాస్త్రం నిర్వహించే పాత్రను నిర్వచించారు.

వెంట్రుకలున్న కొప్పు ఎటుముడిచినా అందమే. చక్కనమ్మ చిక్కినా అందమే. పులి బక్కవడితే పులిచారలు బక్కవడుతాయా?

ఇవి ఎంతో సామాజిక తత్వాన్ని సులువుగా అందిస్తాయి.

**ఆదర్శాలు-దూరపుకొండలు :**

దూరపుకొండలు నునుపు - ఆదర్శాలన్నీ దూరపుకొండల్లా అందంగా

నునుపుగా ఉంటాయి. దగ్గరికి చేరిచూస్తే వాస్తవాలు తెలుస్తాయి.

ఏం పనిచేయనివాళ్ళు, అసలు ఆచరించనివాళ్ళు ఆదర్శాల్ని అందంగా చూపవచ్చు. అవి దూరపు కొండల నునుపువంటివి. ఎంత సుదూర లక్ష్యం పెడితే అంత అందంగా కనపడవచ్చు.

అందువల్ల కొందరు అసలెన్నడూ ఆచరణసాధ్యంగాని ఆదర్శాల్ని అందంగా తత్వశాస్త్రంలో చెప్తారు. అవి ఎలాంటివంటే ఆ చెట్టు మీద దయ్యం ఉంది అంటే ఎవరికి కనపడలేదట! వాళ్ళ అమ్మ పతివ్రత అయితేనే ఆ దయ్యం కనపపడుతుంది అనగానే దయ్యం కనపడిందని అందరన్నారట.

"కలలు కనాలి, కలలు కనడం రావాలి. కలల్ని వాస్తవాలుగా మార్చాలి. ఆదర్శాలను సృష్టించాలి. అది మీకు చాతకావడం లేదు కాబట్టే మీకు అర్థం కావడం లేదు. వ్యతిరేకిస్తున్నారు" అంటూ ఒప్పిస్తారు కొందరు దార్శనికులు.

**నీ అన్నం నాకు పెట్టు**

**నీకు ఆకలి కాకుండా మందిస్తా అనే వాళ్ళుంటారు జాగ్రత్త**

ఇలాంటివాళ్ళల్లో ఆధునిక అభివృద్ధిని అందుకొని టీచర్లుగా, లెక్చరర్లుగా, అధికారులుగా, నాయకులుగా, రచయితలుగా ఎదిగి పేదలు వారిలాగా ఎదగాలంటే ఆ దారి చూపకుండా సమాజం కోసం త్యాగాలు చేయాలి, ఉద్యమాలు చేయాలి అప్పుడే మీరు అభివృద్ధి చెందుతారు అని కార్యక్రమాలు యిస్తారు. దీన్ని ప్రజలు చాలా సులభంగా ఇలా అంటారు - వెనకటికి ఒకాయన "నీ అన్నం నాకు పెట్టు, నీకు ఆకలి కాకుండా మందిస్తా అన్నడట" అని హేళన చేస్తారు.

**గతం భవిష్యత్తుకూడా వర్తమానంలోనే ఉంటాయి :**

అభివృద్ధి, అధికారం నిరంతరమైనది. యివాళటి అభివృద్ధిలో, అధికారంలో, కాస్తంత వాటా కావాలి. ఇవాళటి సమాజంలో అసమపంపిణి తొలగాలి. సమాన పంపిణి జరగాలి, సమానత్వంకావాలి అని అడిగితే సుదూర ఆదర్శాలు వల్లించేవారు తెగబాధపడిపోతారు. "నీ అన్నం నాకు పెట్టు, ఆకలి కాకుండా నీకు మందిస్తా" అన్నట్టు త్యాగాలు చేయి అంటారు.

తక్షణ పరిష్కారాన్ని దేవుడికో, రేపటి జన్మకో, రేపటి నూతన సమాజమనే సుదూర ఆదర్శాలకో వాయిదావేస్తూ అది సాధించడానికి యిప్పుడు నేను చెప్పినట్టు చేయి అనేవాళ్ళు "శ్రీకృష్ణ పరమాత్మ"లా నేను చెప్పింది చేయి అనే కర్మసిద్ధాంతాన్ని, ఫలితాన్నిమాత్రం ఆశించకు అనే ప్రబోధాన్ని చేస్తున్నారని అర్థం.

నోమ్ చామ్‌స్కీ అనే అమెరికన్ భాషావేత్త, సామాజిక శాస్త్రవేత్త అన్నట్టు "సులభ గ్రాహ్యమైన విషయాలను కూడా క్లిష్టతరం చేసి చెప్పటం మేధావుల వృత్తి. మరి ఆమాత్రం కష్టపడకపోతే యూనివర్సిటీల వాళ్లు జీతాలెందుకిస్తారను కున్నారు?"

ఆయనే అన్నట్టు "సామాజిక శాస్త్రం ఒక థియరీ-సిద్ధాంతం కాదు. అది ఆచరణతో అర్థం చేసుకునే ప్రయత్నం. అందరం రోజూ ఎదుర్కొంటున్న సమస్యల మూలకారణాల్ని అన్వేషిద్దాం. మిగతా సైన్సుల లాగ ఇవి పరిశోధించడానికి ఖరీదైన



లేబరేటరీలు అవసరంలేదు. కావలసిందొక్కటే కామన్‌సైన్సు. వాస్తవికాంశాల్ని జాగ్రత్తగా పరిశీలించగలగాలి."

**దూపవుతున్నదా! బావితవ్వు :**

అందువల్ల సామాజిక తత్వశాస్త్రం వర్తమాన సమస్యల్ని వర్తమానంలోనే పరిష్కారించాలని కోరుతుంది. దాహమేస్తున్నది అంటే బావితవ్వు అని చెప్పడం ఎంతగొప్ప ఆదర్శమైనా వారి ఆకలి దప్పులను తీర్చదు. ఆధ్యాత్మిక తత్వశాస్త్రాలకు, ఆదర్శాలకు తత్వశాస్త్రాలకు సామాజిక తత్వశాస్త్రానికి యిక్కడే తేడావుంది.

సామాజిక తత్వశాస్త్రం ఈ క్రింది వాటితో కూడుకొని ఉంటుంది.

1. సామాజిక చరిత్రశాస్త్రం - మానవ సంబంధాల పరిణామాలు
2. భావాల పుట్టుక - వ్యాప్తి - ఆచరణ - తత్వశాస్త్రం తర్కశాస్త్రం
3. పరిపాలన, నిర్వహణ, పౌరనీతి, రాజనీతి శాస్త్రాలు
4. సామాజిక అర్థశాస్త్రం
5. సైన్సు, టెక్నాలజీ పరిణామాలు - మానవ సంబంధాలు
6. ప్రకృతి సైన్సు, పర్యావరణం - మానవవనరులు, సామాజికశాస్త్రాలు - సమతుల్యత
7. సాహిత్యం, కళలు, అలంకారశాస్త్రాలు
8. సంస్కృతి - మానవీయ సమాజ నిర్మాణం - జీవిత పరమార్థం.

పై శాస్త్రాలు, వాటి స్వరూప స్వభావాలను పరిణామాలను అన్నిటిని తత్వశాస్త్రం తనలో కలుపుకొని సత్యాలను చేరుకుంటూ అన్ని రంగాల్లో కార్యక్రమాలను, ప్రిడిక్షన్‌ను అందిస్తుంది. సత్యాలను చేరుకోవటంలో కలుపుకోవడంలో తత్వశాస్త్రం తనదైన పని పద్ధతులను రూపొందించుకొంటుంది.

1. వస్తుత్వత్వం వాస్తవాలు - వాటి మధ్య సంబంధాలు పరస్పర ప్రభావాలు, పరిణామాలు.
2. క్రమం, ఇంద్రియసంవేదనలు, ఎరుక
3. పరిశీలన, విశ్లేషణ, సంశ్లేషణ.
4. తీర్పు-పూర్వపక్షం
5. తర్కశాస్త్ర ప్రమాణాలతో చర్చ, నిర్ధారణ, నిరాకరణ, ప్రతిపాదన
6. నూతన ప్రతిపాదనలు - నూతన కార్యక్రమాలు.

**ఎవరు దార్శనికులు :**

కొత్తదేమీ చెప్పని తత్వశాస్త్రాలు తత్వశాస్త్ర చరిత్రను పరిచయం చేయడానికి, వ్యాఖ్యానించడానికి సంబంధించినవి. వాటిని తత్వశాస్త్రాలు అని అనలేము. వాటిని తత్వశాస్త్ర చరిత్ర, పరిణామాలు అంటారు.

నూతన ప్రతిపాదనలు, కార్యక్రమాలు పై ఎనిమిది శాస్త్రాలను ప్రభావితం చేయాలి.

కనీసం పై ఎనిమిది శాస్త్రాలవారీగా నూతన ప్రతిపాదనలు, నూతన కార్యక్రమాలు అందించినపుడే అది సంపూర్ణ సమగ్ర సామాజిక తత్వశాస్త్రం అవుతుంది.

**ఒక శాస్త్రంలో సాధిస్తే - యితర శాస్త్రాలకు అన్వయించాలి :**

ఒక శాస్త్రంలో సాధిస్తే ఇతర శాస్త్రాలకు అన్వయించాలి. ఇంత సంపూర్ణంగా చేయనివాటిని ఆయా శాస్త్రాలవారీగా చేసినవాటిని ఆయా శాస్త్రాల్లో సాధించిన అభివృద్ధి అని పిలువబడుతుంది.

అలా విభిన్న రంగాల్లో శాస్త్రాల్లో విభిన్న కోణాల్లో అభివృద్ధిపరిచిన నిర్దిష్టశాస్త్రాలన్నిటిలోని అభివృద్ధిని, సూత్రాలను, కార్యక్రమాలను నూతన ప్రతిపాదనలను ఇతర శాస్త్రాలకు ఒక క్రమపద్ధతిలో అన్వయించి వాటిలో మార్పులను సాధిస్తూ, తత్వశాస్త్రంలో వాటన్నిటిని కలుపుకొన్నప్పుడు అది సమగ్ర తత్వశాస్త్రం అవుతుంది.

ఉదాహరణకు కంప్యూటర్ సైన్సు ఈ రోజు ఎంతో ఎదిగింది. అది మొదట కొన్ని రంగాలకే ఉపయోగపడింది. ఇపుడు అన్ని రంగాలకు విస్తరించింది. రైళ్ళు, రేడియో, టీ.వి., ఫోన్, ఫొటోగ్రఫీ, వైద్యం విద్య, అచ్చుయంత్రం, దస్తావేజులు, రికార్డులు, కారు, బస్సు, మొదలుకొని కాలిక్యులేటర్‌దాకా అన్ని రంగాల్లోకి విస్తరించింది.

దీనికి ముందు విద్యుత్తుకూడా మొదట కొన్ని రంగాలకే పరిమితమైనా యిపుడు అన్ని రంగాలకు విస్తరించింది. విద్యుత్తులేని సమాజం ఎంతో వెనకబడిన సమాజంగా కన్పిస్తుంది.

విద్యుత్తులా, కంప్యూటర్ సైన్సులా అన్ని రంగాల్లోకి విస్తరించినపుడే అది "సామాజిక దర్శనం" అవుతుంది.

సమీప భవిష్యత్తును చూడగలిగినవారు, చూపగలిగినవారు దార్శనికులు అని పిలువబడతారు.

**సామాజిక దర్శనం ప్రయోజనం :**

సామాజిక దర్శనాన్ని అధ్యయనం చేస్తే అన్ని శాస్త్రాల్ని అధ్యయనం చేసినంత అవగాహన పెరుగుతుంది. అన్ని శాస్త్రాల్లో నైపుణ్యం కలగకపోయినా ఆయా శాస్త్రాల స్వరూప స్వభావాలు ప్రభావ పరిణామాలపట్ల ఒక స్పష్టత వస్తుంది. ప్రతి మనిషికి ఈ స్పష్టత అవసరం. ప్రతి మనిషికి తత్వశాస్త్ర అధ్యయనం అవసరం.

తద్వారా సమాజం, చరిత్ర, మానవసంబంధాలు, పరిణామాలు ఒక సమగ్రతలో అర్ధం అవుతాయి. అలా ఈ ప్రపంచాన్ని తెలుకోవడం ద్వారా ప్రపంచాన్ని జయించినంత ఆత్మవిశ్వాసం కలుగుతుంది. తద్వారా సంకల్పబలంతో జీవిత లక్ష్యాలు నిర్ణయించుకోవడంతోపాటు జీవిత పరమార్థాన్ని ఆ లక్ష్యాల్ని సాధించడానికి మార్గం, ప్రాతిపదిక ఏర్పడుతాయి.

గ్రీకు దార్శనికులలో ఒకడైన ప్రోటాగరస్ "సమస్తానికి మానవుడే కొలమానం" అంటాడు.

"నీవు ఏ పనినైనా తలపెట్టు, ఏ సిద్ధాంతమైనా రూపొందించు; ఏ సంఘ వ్యవస్థనైనా, ఏరాజ్య వ్యవస్థనైనా నిర్మించు; ఏ కొత్తవైజ్ఞానిక సత్యమైనా ఆవిష్కరించు; ఏ



సాంకేతిక పరికరమైనా తయారుచెయ్యి; చంద్రమండలానికి వెళ్లు; దూరనక్షత్రాలకు ప్రయాణం కట్టు... ఏదైనా చెయ్యి.

ప్రతిదానికి మానవుడే కొలమానం. అది మనిషికి ఉపయోగపడుతుందా లేదా? మనిషి వర్తమానానికిగాని, భవిష్యత్తుకుగాని పనికొస్తుందా లేదా? అది మానవ శ్రేయస్సుకు అనుకూలమా, ప్రతికూలమా? ఆలోచించు. అన్నిటికి మానవుడే కొలమానం.

అయితే కొందరు భౌతిక అవసరాలను మరో కోణంలో చూస్తున్నారు. మానవ శ్రేయస్సు భౌతిక అవసరాల్లో కాకుండా భావసమైక్యతలో మానసిక ఆనందంలో ఉంటుంది అంటారు. ఆరెసెస్ నాయకుడు గురూజీ ఇలా అంటారు...

**నిజమైన ఆనందం బాహ్య వస్తువులలో లేదు**
**నీలోనే ఉంటుంది**

"నిజమైన ఆనందం బాహ్యవస్తువులలో గాక, తనలోనే ఉంటుందనే నిజాన్ని గుర్తించినప్పుడు మనిషి దృష్టి అంతర్ముఖమవుతుంది. అప్పుడు బాహ్యవస్తువుల యొక్క ఆకర్షణలు క్రమంగా సమసిపోతాయి. ఆ విధంగా బాహ్యవస్తువుల ఆకర్షణల బంధానాల నుండి విముక్తుడైనప్పుడు పూర్తిగా మోక్షాన్ని పొందుతాడు. అట్టి వ్యక్తి బాహ్యప్రపంచంలో ఆనందాన్వేషణకై అర్రులు చాచి పరుగులు పెట్టడు. తనలో అలజడిని రేపే భౌతిక వాంఛల ఆరాటాలు అతనికి ఉండవు. యథార్థమైన శాశ్వత సుఖసంతోషాల కేంద్రం తనలోనే ఉందని కనుగొంటాడు. అతడు సంపూర్ణమైన సంతృప్తినీ, ప్రశాంతతను, నిశ్చలత్వాన్ని పొందుతాడు. అట్టి ఆనందమే శాశ్వతం. అది అనంతమైనది. దాంతో పోల్చినపుడు, బాహ్యవస్తువులద్వారా పొందే సుఖసంతోషాలు నామమాత్రాలు. దానినే వ్యక్తి ఆశించవలసినది. అదే, తుదకు చేరుకొనవలసిన అత్యున్నత స్థితి. 'మోక్షం' అన్నా 'ముక్తి' అన్నా అదే." (పాంచజన్యం - శ్రీ గురూజీ - పేజీ 21 - 22) బౌద్ధ భిక్షువులు, సాధువులు కూడా దీన్నే సాధిస్తారు. కొందరు దీన్ని నిర్వాణం అంటారు. సమాధి దశ అంటారు.

అన్నిటికి మానవుడే కొలమానం. మనిషి అంటే ప్రతి మనిషి. మనిషి అంటే మందలో ఒకడుకాడు; వర్గంలో ఒకడుకాడు; తనకంటూ ఒక ప్రత్యేకతలేనివాడు కాడు. నడుస్తుంటే మన కాళ్లకిందపడి నలిగిపోయే వేలాది చీమలలో, క్రిమి కీటకాలలో ఒకడిలాంటివాడుకాడు. మనిషి అంటే వ్యక్తి. ఆలోచించే మనస్సు, ప్రేమించే హృదయం, ద్వేషించే బుద్ధి, రక్తమాంసాలతో, పూర్తిగా తనదే అయిన ఒక వ్యక్తిత్వం కల మనిషి. వాడికోసం, వాడి శ్రేయస్సుకోసం, వాడిని దృష్టిలో పెట్టుకుని ఏది జరిగినా జరగాలి. ఒక పనివల్ల లక్షమందిలో ఒకడికి అపకారం జరిగినా ఆ మేరకు ఆ పనిలో లోపం వున్నట్టే. ఆ అపకారం అనివార్యమైనదే కావచ్చు. అది మన దృష్టికి వెంటనే తగలకపోవచ్చు. అయినా అపకారం అపకారమే". (విశ్వదర్శనం - భారతీయ చింతన - నండూరి రామోహనరావు - పేజి 529)

సామాజిక దర్శనం వ్యక్తి, కుటుంబం, కుటుంబ సంబంధాలు, కులం, తెగ, జాతి, సమూహం, సమాజం - సామాజిక సంబంధాలు, మానవ సంబంధాలు, చరిత్రలో వాటి పరిణామాలను పట్టించుకుంటుంది.

## వ్యక్తివాదం - సామాజికవాదం

సామాజిక దర్శనం వ్యక్తివాదాన్ని, సామాజిక వాదాన్ని, భౌతికవాదాన్ని, భావవాదాన్ని, అజ్ఞేయ వాదాన్ని పట్టించుకుంటుంది. మనస్సు - మనస్తత్వవాదం - యోగ, ధ్యానం - పూజ, భక్తి, కుటుంబ పరిధిలోకి కుదించిన దృక్పథం మొ॥ వ్యక్తివాదం స్వేచ్ఛ వ్యక్తి స్వేచ్ఛ - సామాజిక స్వేచ్ఛ, నైతికశాస్త్రం, నైతిక విలువలు మొదలైనవి ఎలా నిర్ణయించబడతాయో చర్చిస్తుంది. నీతి-నిజాయితీ, న్యాయం చట్టం, ప్రేమ, స్నేహం, కరుణలతో పాటు అరిషడ్వర్గాలైన - 1. కోపం, 2. ద్వేషం 3. ఈర్ష్య, అసూయ, 4.కామం, 5.గర్వం, 6.మోహంలను పట్టించుకుంటుంది. అరిషట్వర్గాలు ఎలా నిర్ణయించబడుతాయో చర్చిస్తుంది.

భారతీయ సామాజిక దర్శనం వ్యక్తి - కులం - సమూహం - తెగ - జాతి, భాష, సంస్కృతి, మతం, రాజకీయ వ్యవస్థ - మానవ సంబంధాలు సమాజం - ఉత్పత్తి సంబంధాలు - పరిపాలన సంబంధాలు - పత్రికా స్వేచ్ఛ శాసనవ్యవస్థ - న్యాయవ్యవస్థ - మొదలైన వాటి క్రమంలో చర్చిస్తుంది.

## భావవాదం - భౌతికవాదం

సామాజిక దర్శనంలో భాగంగా ఈ కింది విషయాలను కూడా చర్చిస్తుంది.

1. భావవాదంలో వ్యక్తివాదం
2. భావవాదంలో సామాజికవాదం
3. భౌతికవాదంలో వ్యక్తివాదం
4. భౌతికవాదంలో సామాజికవాదం

భావవాదానికి భౌతికవాదానికి మధ్య సంబంధం - పరస్పర ప్రభావం - పరిణామాలను సామాజిక దర్శనం చర్చిస్తుంది.

ఉదా॥కు. భావవాదంలో, భౌతికవాదంలో సామాజిక వాదాలు ఎలా వుంటాయో వాటిని ఎలా చర్చించవచ్చో అనుబంధంలో చూడవచ్చు. సామాజిక దర్శనం భారతీయ చారిత్రక భౌతికవాదాన్ని ప్రత్యేకంగా రూపొందిస్తుంది. దీన్ని అనుబంధంలోను, తర్వాతి అధ్యాయాల్లోనూ వివరంగా చూడవచ్చు.

## భారతదేశ వ్యవస్థ ప్రత్యేకతలు :

భారతదేశాన్ని సామాజిక దర్శనం నిర్దిష్టంగా అధ్యయనం చేస్తుంది. ఇతర ప్రాంతాల్లోని, దేశాల్లోని సూత్రాలను ఈ దేశ పరిణామాలపై రుద్ది సూత్రీకరణలు చేయకుండా పరిశీలిస్తుంది. కొత్త సూత్రీకరణలు చేస్తుంది. యూరప్ ఆధిపత్యవాదాలను అనుసరించకుండా తనదైన చలనసూత్రాలను వెలికితీస్తుంది. దాన్ని ఎలా చర్చించాలో అనుబంధంలో చూడవచ్చు.

## ఫెమినిజం తెచ్చిన తాత్విక అవగాహనలు :

సామాజిక దర్శనం ఫెమినిజం తెచ్చిన అవగాహనలను తనలో కలుపుకుంటుంది. మానవ సంబంధాలను మానవీకరించడంలో ఫెమినిజం ప్రాధాన్యతను గుర్తిస్తుంది. అదే సమయంలో భారతీయ సంస్కృతి విలువల్లో భాగంగా కుటుంబ వ్యవస్థను విచ్ఛిన్నం



కాకుండా మరింత మానవీయం అయ్యే క్రమాల్ని విశ్లేషిస్తుంది. ఉదా॥కు -

1. సామాజిక వాదాలలో ఫెమినిజం తెచ్చిన పరిణామాలు
2. అదనపు విలువ సిద్ధాంతంలో ఫెమినిజం తెచ్చిన మార్పు
3. సంస్కృతిలో మానవ సంబంధాల్లో ఫెమినిజం తెచ్చిన తాత్వికదృష్టి
4. భారతదేశంలో తొలినుండి ఫెమినిజం - అక్కమాంబ మాతృదేవతలు మొ॥ సామాజిక దర్శనం తన పద్ధతిలో అవసరమైన మేరకు స్వీకరిస్తుంది.

## తత్వశాస్త్రంలో, తర్కశాస్త్రంలో వాస్తవాలు వాటిమధ్య సంబంధాలు :

తత్వశాస్త్రం తన పరిధి కానప్పటికీ సామాజిక దర్శనం ఈ కింది వాటిని అవసరమైన మేరకు తన పరిధిలోకి తీసుకుంటుంది.

1. క్రమం, ఎరుక - వాస్తవాలు, ఇంద్రియాలు
2. విశ్లేషణ, సంశ్లేషణ, తీర్పు
3. పూర్వపక్షం
4. నూతన ప్రతిపాదనలు
5. కార్యక్రమాలు
6. తర్కం - చరిత్రలో తర్కం పుట్టి పెరిగి తీరు
7. తర్కం ప్రాధాన్యత - పరిమితి
8. అన్ని శాస్త్రాల్లో ఆయా శాస్త్రాల తర్కం అభివృద్ధి చెందిన క్రమం
9. తర్కశాస్త్రం ఒక శాస్త్రంగా ప్రాధాన్యత కోల్పోయిన తీరు
10. దీని స్థానంలో హేతువాదం పైకివచ్చిన తీరు
11. హేతువాదం పరిమితులు

## భావాలు-భావజాలాలు :

భావాలు సమాజంలో నిర్వహించే పాత్ర దేనితో పోల్చలేనిది. సామాజిక దర్శనం సామాజిక భావాల కూడలి. అందువల్ల ఈ కింది వాటిని చర్చిస్తుంది.

1. భావాలు నిర్వహించే పాత్ర
2. ప్రచారానికి భావాలకుగల సంబంధం
3. సమాచారం దానికదే ప్రచారం
4. కొందరికి తెలిస్తే జ్ఞానం - అందరికి తెలిస్తే సమాచారం
5. కొందరికి తెలిస్తే జ్ఞానం - అందరికి తెలిస్తే కామన్‌సెన్స్

## సామాజిక సమస్యలు - పరిష్కారాలు

సామాజిక సమస్యల పరిష్కారాలకు సైన్సు ఎంతో ఉపయోగపడుతుంది. అంటరానితనం సమస్యను బస్సులు, రైళ్లు, హోటళ్లు, సినిమా టాకీసులు, జాతరలు, చాలా మేరకు పరిష్కరించాయి. వంద మంది సంఘసంస్కర్తలు చేయలేని పనిని ఇలా సైన్సు టెక్నాలజీ సాధించిపెట్టాయి. అందువల్ల సామాజిక దర్శనం ఈ కిందివాటిని చర్చిస్తుంది.

1. సైన్సుకు సామాజిక దర్శనానికి గల సంబంధం

2. సైన్సు సూత్రాలు - సామాజిక దర్శనానికి వర్తిస్తాయా? ఏ మేరకు?

3. సైన్సు - సమాజ పరిణామాలు - పరిష్కారాలు - సిద్ధాంతాలు

**ప్రపంచదేశాల రాజ్యాంగాలు - ఆచరణ తీరుతెన్నులు :**

సామాజిక దర్శనం ఇతర దేశాల రాజ్యాంగాలను ప్రభుత్వ పరిపాలన తీరుతెన్నులను, ప్రజల జీవన విధానాలను తులనాత్మక అధ్యయనం చేస్తుంది. ఉదా॥కు - రష్యా, చైనా, అమెరికా, యూరప్, రాజరిక, అరబ్ దేశాలు, భారతదేశ సమాజంతో తులనాత్మక అధ్యయనం చేస్తుంది.

**ఐక్యరాజ్యసమితి నిర్మాణం :**

ప్రపంచ చరిత్రలో ఐక్యరాజ్యసమితి నిర్మాణం ఒక ముఖ్య ఘట్టం. సామాజిక దర్శనంలో ఐక్యరాజ్యసమితి ప్రపంచం ఒక దేశంగా మారడానికి భావసమైక్యత ఏర్పరచింది. మనుషులందరూ సమానమే అని అందరిపట్ల మానవీయ దృక్పథంతో స్పందించాలని, సంబంధాలు ఉండాలని ఐక్యరాజ్యసమితి అభిలషిస్తుంది. దీనివెనుక సామాజిక తత్వవేత్తల కృషి ఎంతో వుంది.

1. ఐక్యరాజ్యసమితి నిర్మాణం - సమస్యలు పూర్వపరాలు
2. ఐక్యరాజ్యసమితి ఆవశ్యకత

**సామాజిక దర్శనంలో పరిష్కారాలు :**

సామాజిక దర్శనం కుటుంబం, కులం, వర్గం, రాజకీయ వ్యవస్థ, ఆర్థిక వ్యవస్థ, సంస్కృతి, విలువలు, అందరికీ విద్య, అందరికీ కూడు, గుడ్డ, ఇల్లు, తాగునీరు, సాగునీరు, అందరికీ విద్యుత్తు, ఫోను, రోడ్డు సౌకర్యాల కల్పన, అందరికీ పనికల్పన, సాహిత్యం, కళలు, ఆటలు, స్వేచ్ఛ, సమానత్వం, సమాచార హక్కు, భావప్రకటన హక్కు, మొదలైనవాటి పరిష్కారాన్ని చర్చిస్తుంది. ఇవే సామాజిక దర్శనంలో ముఖ్యమైన విషయాలు. సమాజం వీటన్నిటినీ కూడుకొని కొనసాగుతుంది. అందువల్ల సామాజిక దర్శనం వీటిని తన పరిధిలోకి తీసుకుంటుంది. వీటి పట్టికను అనుబంధంలో చూడవచ్చు.

ఇలా సామాజిక దర్శనం పౌరనీతిశాస్త్రం, పరిపాలనాశాస్త్రం, విలువలశాస్త్రం, అలంకారశాస్త్రం, సామాజికశాస్త్రం, సామాజిక అర్థశాస్త్రం మనస్తత్వశాస్త్రం, సంస్కృతిశాస్త్రం, మానవాతీతశాస్త్రం మొదలైన శాస్త్రాలకు పరిమితమై చర్చిస్తుంది.

సామాజిక దర్శనం భూమి పుట్టినకాన్నించో ఆలోచనపుట్టినకాన్నించో కాకుండా ఆధునిక వర్తమాన సమాజాన్ని, దాన్ని మార్చడాన్ని విశ్లేషించడాన్ని ప్రాథమికం చేస్తుంది. వర్తమానంనుండి గతాన్ని, చరిత్రను, నిర్మాణాలను, ఆలోచనలను పరిశీలిస్తుంది.

**సామాజిక దర్శనం పరిధి - పరిమితి**

సంఘజీవిగా మనుషులమధ్య ఏర్పడే సంబంధాలు, నిర్మాణాలు, సంస్కృతి, ఆలోచనలు, ఆచారాలు సామాజిక శాస్త్రం చర్చిస్తుంది.

విషయాలు పెరిగినకొద్దీ కొన్నింటిని కలిపి సామాజికశాస్త్రంగా రూపొందించారు. పరిపాలనశాస్త్రం, ఆంత్రోపాలజీ, మనస్తత్వశాస్త్రం, పౌరనీతిశాస్త్రం, విలువలశాస్త్రం,



అలంకారశాస్త్రం మొదలగు శాస్త్రాలు అలా రూపొందినవే. కొత్తగా రూపొందిన మరో శాస్త్రంపేరే సామాజిక తత్వశాస్త్రం. దీన్ని సామాజిక దర్శనం అని కూడా అంటారు.

తత్వశాస్త్రం ఎన్నో విషయాల్ని చర్చిస్తుంది.

సామాజిక తత్వశాస్త్రం కొన్నివిషయాలే చర్చిస్తుంది.

ఆలోచన పుట్టుక గురించి మొదలుకొని సమస్త విషయాలను తత్వశాస్త్రం చర్చిస్తుంది.

సంఘజీవిగా మనిషి మహోన్నతంగా ఎదిగే అన్ని అంశాలు, శాస్త్రాలు సామాజిక తత్వశాస్త్రం తన పరిధిలోకి తీసుకుంటుంది.

కొందరు ఆధ్యాత్మికవాదాన్ని, వ్యక్తివాదాన్ని, మనస్తత్వశాస్త్రాన్ని ప్రధానంచేస్తుంటారు. మతం, మతసంస్కృతి, వ్యక్తిగత ఆలోచనావిధానం ప్రచారం చేస్తారు. సంఘటిత శక్తిద్వారా ఈ సమాజాన్ని మౌలికంగా మార్చగలిగే విషయాలను, కార్యక్రమాలను నిరాకరిస్తారు. వ్యతిరేకిస్తారు. ఎవరి సమస్య గురించి వాళ్ళే మాట్లాడాలి అని విభజిస్తారు. స్వార్థ వ్యక్తిగత దృష్టిని అలవర్చుతారు. అందరి గురించి మాట్లాడే చొరవను, శాస్త్రాలను నిరాకరిస్తారు.

భావవాదం, భౌతికవాదంపేరిట, వ్యక్తివాదం, సామాజికవాదం పేరిట, ఆస్తికవాదం, నాస్తిక వాదం పేరిట, మతం, భాషపేరిట, వర్గం, కులంపేరిట, ఎక్కడికక్కడ చీలిపోయి మొత్తం సమాజాన్ని చూడ్డం మానేస్తున్నారు.

వీటిలో వాళ్ళు ఏ శాఖకు చెందినా మొత్తం సమాజాన్ని పట్టించుకునే అవగాహన, కార్యక్రమాలు చేపట్టడంకోసం అంతదాకా వర్గీకరించి విభజింపబడిన వారందర్నీ ఒకచోట చేర్చి చర్చించడం అవసరం.

కొత్త సమీకరణాలు, కొత్త కార్యక్రమాలు రూపొందుతాయి.

ఈ పనిని తత్వశాస్త్రం నిరంతరం చేయవలసివుంది. సామాజిక తత్వశాస్త్రాల్లో భాగంగా ఆరెసెస్ దర్శనాన్ని, మార్క్సిస్టు దర్శనాన్ని, గాంధీ దర్శనాన్ని, అంబేద్కరిస్టు దర్శనాన్ని, జె.కె.ఓషో దర్శనాన్ని సంక్షిప్తంగా ప్రత్యేకంగా పరిశీలిద్దాం.